# మనోరమ

[ ప్రేమచంద్ ]

అనువాదం :

శ్రీ అల్లన్, సాహిత్యరత్న, బి. ఏ.



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

पो० बा० २२ | **सरस्वती प्रेस** | टेलिफोन नं० ६०१

प्रकाशक · मुद्रक · विक्रेता

**बनारस**

दक्षिण भारत में प्रेमचन्द की रचनाओं का काफी प्रचार है, किन्तु अभी तक प्रेमचन्द साहित्य का परिचय केवल वे ही लोग पाते हैं जो हिन्दी सीख चुके हैं। दक्षिण की आम जनता उस लाभ से वंचित रही।

अब तक प्रेमचन्द की कुछ रचनाएँ तेलुगु में अनुवाद होकर निकली हैं। आशा है कि और भी रचनाएँ वहाँ के लोगों को उनकी मातृभाषा में मिलेंगी।

नवयुवक लेखक इस काम में खूब उत्साह से काम करते हैं। सबसे प्रेमचन्द साहित्य को जल्द से जल्द तेलुगु में अनुवाद करने का उनका संकल्प है। अनुवाद कैसा है यह तो वह विद्वान ही बता सकेंगे जिनका हिन्दी और तेलुगु दोनों पर समान अधिकार है। मैं तो कामना करती हूँ कि जनता में यह साहित्य अधिक से अधिक प्रचारित हो।

शिवरानी प्रेमचंद

# మనోరమ

## ఒకటో అధ్యాయం

మున్షీ వజ్రధరసింగ్ కాశీలో ఉంటున్నాడు. తాను అవటానికైతే ఠాకుర్ — క్షత్రియ కులస్థుడు; కాని, తన్ను 'మున్షీ'-(కాయస్థకులస్థులకూ, గుమాస్తాలకూ ఇది బిరుదు) అని వ్రాసుకునేవాడు, అలాగే చెప్పేవాడు కూడాను. 'ఠాకుర్' పదంలో అతనికేదో మోటుతనం కన్పడుతుండేది. చాలా చిన్న ఉద్యోగంలోంచి క్రమేణా పైకివస్తూ చివరకు తహశీల్‌దారు పదవి దాకా దేకాడు. ఆ ఉన్నత పదవిలో ఉన్నది మొత్తం మూడు మాసాలు మాత్రమే. అదీ తాత్కాలికంగానే. ఐనా తనహోదా 'మాజీ - తహశీల్‌దారు' అని వ్రాసుకొంటూ వుండేవాడు. అతనిసంతుష్టికై ఆ పేటలోనివాళ్ళు 'తహశీల్‌దారుగారూ' అనే పిలుస్తూండేవాళ్ళు. ఆపిలుపు చెవినిబడగానే సంతోషంతో రొమ్ము ఇంతఎత్తున ఉబ్బుకొచ్చేది. కాని వచ్చే పెన్షను మొత్తం ఇరవైఐదు రూపాయలు మాత్రమే. అందుచేత స్వయంగానే అంగడికి వెళ్ళవలసివస్తూండేది. ఇంట్లో నలుగురుప్రాణుల ఖర్చు. తనూ, తన భార్యా, ఒకకొడుకూ, ఒక కూతురూనూ. కొడుకుపేరు చక్రధర్. తాండ్రి పెన్షనుపొందేకాలంలో ఇంటిదగ్గరనుంచి ఒక రాగిదమ్మిడీ

కూడా సహాయముందేపరిస్థితి లేదు. ఐనా తన తెలివితేటలు, కుశాగ్రబుద్ధి కారణంగా, ఎం.ఏ.డిగ్రీ సంపాదించాడు,చక్రధర్. పరీక్షాఫలితాలు రాకముందునుంచే సిఫార్సులకోసం వెదకనారంభించాడు. తండ్రి అధికారుల ప్రాపు సంపాదించటంలో మంచి నిపుణుడు. ఎవరైనా కొత్తఉద్యోగస్థుడు వస్తే వెంటనే దర్శనం చేసుకుని స్నేహసంబంధాలు ఏర్పరచుకొనేవాడు. చక్రధరుని విషయంతప్పకదృష్టిలో ఉంచుకుంటామనివాగ్దానంకూడా చేసింది పాలకవర్గం. ఇంతలో పరీక్షాఫలితాలు వచ్చాయి. కమీషనరు గారి నొకసారి దర్శనంచేసుకురమ్మనమని కొడుకుకు చెప్పాడు 'మున్షిజీ'. కాని, చక్రధర్ వెళ్ళ నిరాకరించాడు.

"కారణం? ఐతే ఇంట్లో కాలేసుకుకూర్చుంటే ఉద్యోగ మెలా వస్తుంది!" అన్నాడు మున్షిజీ చురచుర చూస్తూ.

చక్ర:—ఉద్యోగంచేయటం నా కిష్టంలేదు. స్వేచ్ఛగా జీవించాలని ఉంది.

వజ్ర:—అంత స్వేచ్ఛగా ఉండాలనుకున్నప్పుడు మరి ఎం. ఏ. చదవటం దేనికి?

ఆరోజు లగాయతు తండ్రి కొడుకుల మధ్య ఎప్పుడు చూచినా ఏదో ఒకమాయదారిపోరు-ఈగలమోత ఉంటూనే ఉండేది. సణుగుడు గొణుగుడు జరుగుతూనే ఉండేవి. ఎప్పుడూ విసుక్కుంటూ, కోపగించుకుంటూ ఉండేవాడు మున్షీజీ. 'పనికి దొంగ' 'గర్వపోతు' 'బుర్రలేని దద్దమ్మ' మొదలైన పదాలతో తనకోపమంతా వెళ్ళగక్కి శాంతపడుతూండే వాడు.

తండ్రియెడల గౌరవంగానూ, వినయంగానూ ఉండేవాడు చక్రధరుడు. తండ్రిమాటకెప్పుడూ ఎదురు చెప్పేవాడు కాదు. కాని తనజీవితం సార్థకంచేసుకునేందుకై నిర్ణయించుకున్న పంథానుండి వైదొలగటానికి ఇష్టపడేవాడుకాదు. కేవలం పొట్టపోసుకునే ఉద్దేశ్యంతో మానవుడు తన అర్ధాయువును విద్యార్జనకైగడపటం హాస్యాస్పదంగా కనిపిస్తుండేది. విద్యను జీవనోపాధికి సాధనంగా చేసుకోవటం సిగ్గుగా కన్పించేది. క[illegible]కై ఉపవాసాలతో ఉండేవాడు. కాని ఉద్యోగంకోసం అర్జీలు పెట్టుకోవటంగానీ, ఒకరిదగ్గరకు వెళ్ళటంగానీ ఎన్నడూ లేదు. విద్యార్థిదశలో కూడ పరోపకారకార్యాల్లో ముందుపీఠీన ఉండేవాడు. ఇక ఇప్పుడసలు అదితప్ప ఇంకో ఆలోచనే లేదు. దీనజనులకు సేవాశుశ్రూషలు చేయటంలో కలిగే ఆనందం, ఉన్న ఆత్మగౌరవం ఆఫీసుల్లో కూర్చుని రాసేకలం-అరగరాసే-రాతలో ఎక్కడ?

ఈ పరోపకారమనెడి భూతం నెత్తిమీదనుండి దిగిపోయి, పెళ్లి - పేరంటం అన్న ఆలోచన ఎక్కినపుడు వాడంతట వాడే ఉద్యోగంకోసం పరుగులుతీస్తాడులే అని ఆలోచించి మొదలకుండా ఊరుకున్నాడు మున్షీ వజ్రధర్. రెండేళ్ళు గడిచాయి. కాని భూతంవదలిపోయినలక్షణా లేమీ కానరాలా. అప్పుడొక రోజున కొడుకును మళ్ళీ ఒకసారి ఇష్టమొచ్చినట్టుగా చెడామడా తిట్టాడు.

ఇప్పుడిక తండ్రిమాటను తృణీకరించలేకపోయాడు, చక్రధరుడు. కావాలంటే అతను చదువుకున్న కాలేజీలోనే ఏదో ఒక వుద్యోగం దొరకగలదు. కాని కొంచెంసేపు రోజూపనిచేసి

తనతండ్రికి ఆర్థికంగా కొంతతోడ్పడగలిగినటువంటిపనే ఏదన్నా చేయాలనివుంది. దైవికముగా జగదీశపురం దివాను హరిసేవక సింగుగారి కుమార్తెకు ట్యూషను చెప్పేందుకు ఒక సుయోగ్య, సచ్చరిత్ర ఉపాధ్యాయుడు కావలసివచ్చింది. ఈ విషయమై కాలేజీ ప్రిన్సిపాలు కొక జాబు వ్రాశాడు దివాను. దానిమీాదట ఆ పనికిగాను చక్రధరుని సెలెక్టుచేసి పంపాడు, ప్రిన్సిపాల్. ఇది చాలాబాధ్యతగల పని. ఐనా చక్రధరుడెంతో సుశీలుడు, గంభీరస్వభావుడు, మంచి నిగ్రహశక్తికలవాడూ కావటంవల్ల అతను ఈ బాధ్యతను చక్కగా నిర్వహించగల డని అందరికీ నమ్మకంగానే ఉంది.

మనోరమకు పదమూడేళ్ళకంటే ఎక్కువ ఉండవు. ఐనా ఆ బాలికకు చదువు చెప్పేటప్పుడు సిగ్గుపడేవాడు చక్రధరుడు. ఒకరోజున వాల్మీకి రామాయణం చదువుతోంది, మనోరమ. వైదేహీవనవాసం విషయంలో ఆవిడ కొక శంక కలిగింది. దాని సమాధానాభిలాషతో "తమర్ని ఒక ప్రశ్న అడగాలని ఉంది. సెలవైతే అడుగుతా"నంది చక్రధరు నుద్దేశించి.

"ఏమిటది?" అన్నాడు చక్రధరుడు కొంచెం తత్తరపడుతూ.

మనో:—శ్రీరాముడు సీతను ఇంట్లోనుండి వెళ్ళగొట్టాడు. ఐతే ఆవిడ ఎందుకు వెళ్ళిపోయింది? అదీగాక రాముడు సీతను పరీక్షించి త్రికరణశుద్ధిగా ఆవిడ నిష్కళంక యని కూడ నిర్ధారణచేసుకొన్నాడవా. అలాంటప్పుడు

అబద్ధపు అపవాదును భయపడి తన్నివారణార్థమై ఇల్లు వెడల గొట్టడం ఏం న్యాయం? ఎక్కడి న్యాయం ?

చక్ర:—సీతయేగనక భర్త ఆజ్ఞను శిరసావహించ కుండా ఉన్నట్లయితే ఆవిడ భారతసతిఆదర్శంనుండి పతనమై పోయిఉండేది. మనోవిషయం కూడా. రామునకు రాజధర్మం కూడ పాటించవలసిన అవసరం ఉంది గదా !

మనో:—ఇది 'సత్యం'గొంతు నులిమి పాటించిన రాజ ధర్మం; లేదా ఆదర్శం.యథార్థంగా ఇది ఆదర్శంకాదుసరిగదా, పైగా చారిత్రకదౌర్బల్యం. మీరేగనక రాముని స్థానంలో ఉంటే మీరూ అలాగే సీతను ఇంట్లోంచి వెళ్ళగొట్టి ఉండే వారేనా ?

చక్ర:—లేదు, నేనైతే బహుశా అలాంటిపని చేసి ఉండేవాణ్ణి కాదు!

మనో:—ఐతే మీరు అపనిందను అణుమాత్రమైనా లెక్కచేసేవాళ్లు కాదా ?

చక్ర:—ఔను, లెక్కచేసేవాణ్ని కాదు; అబద్ధపు అపనిందను లెక్కచేసేవాణ్ణి కాదు.

హర్షాతిరేకంచే ప్రఫుల్లిత మయ్యాయి, మనోరమ నయనకమలములు. "నా మనస్సులోనూ ఇదే అభిప్రాయ ముంది" అన్నది, మనోరమ ఆనందపారవశ్యంతో.

ఆరోజునుండి మనోరమకు చక్రధరునియందు కొద్దిగా ప్రేమభావం ఏర్పడింది. అతను వచ్చేవేళకు కాస్త ముందు తానే వచ్చి కూర్చుని అతని రాకకై ఎదురుచూస్తూండేది.

ఇప్పు డామెకు తనమనోభావాలు వెల్లడించటంలో లజ్జాసం
చాలు కల్గటంలేదు.

హరిసేవకసింగు కొక చెడ్డఅలవాటు. నౌకర్లకు జీతాల
మొదట్లో మూడు నాలుగుమాసాలు నిశ్చిత తేదీప్రకార
ఇస్తా . కాని, నౌకరు పాతబడినకొద్దీ అసలు వాడి జీత
భత్యాలమాటే మతిలో ఉండదు. చక్రధరునకు నా
నెలలనుండి ఒక్కదమ్మిడీ ముట్టలేదు. అటు హరిసేవక సింగ
స్వయంగా పిలిచి ఇచ్చేవాడు కాదు. ఇటు చక్రధరుడ
సంకోచపడి అడిగేవాడు కాదు. చివర కొకరోజున గత్యంతర
లేక జీతంకోసం చీటీ ఒకటి వ్రాసి పంపాడు, చక్రిధరుడు.
పంపిన చీటీని తిరిగి పంపిస్తూ "అనవసర ఉత్తర ప్రత్యుత్తరా
ఎందుకూ ! చెప్పదలచిన దేదో స్వయంగావచ్చిచె
పొమ్మను" అని చెప్పి పంపించాడు. సిగ్గుపడ్తూ వెళ్ళా
చక్రధరుడు. కుశలప్రశ్నలు, మంచీమర్యాదలఅనంతరం జీ
మాట ఎత్తాడు. వినగానే ఫక్కున నవ్వి "సెబాష్.
బాబూజీ, ఆట్టే చూస్తే మీరు చీకూ చి
స్వచ్ఛందజీవులుగానే కన్పడుతున్నారే. నాలుగే
జీతం పడిఉంటే ఒక్కసారన్నా వచ్చి నన్ను అడి
పోలేదు. ఏనెల కానెల అడిగి తీసుకోవలసింది.
ఒకేసారి తెమ్మంటే ఇవ్వటం నాకెంతకష్టమో మీరే
ఆలోచించండి సరేమంచిది, వెళ్ళండి;పది పదిహేను రో
అలాగే చూస్తాను లెండి" అన్నాడు ఠాకుర్ హ
చక్రధరుడు దాని కేమీ మారుచెప్పలేదు.
శతో వచ్చినదారినే వెళ్లిపోయాడు. తన తం కందనే

రానికి ఆ చీటీని తీసుకెళ్ళే సమయంలో దానిలో తీసి చదివింది మనోరమ. అతను విచారంగా వుండటం చూచి "నాన్నగారు పైకమివ్వలేదా ఏమిటి?" అని అడిగింది.

ఆ బాలికఎదుట జీతం విషయం చెప్పటం చక్రధరున ష్టంలేదు. "ఇవ్వ కెక్కడికి పోతారులే" అన్నాడు, కంది పోయిన మొగంతో.

మనో:—మీకు రు 120లు కావాలికదూ?

చక్ర:—ప్రస్తుతం అలాంటి అవసర మేమీ లేదులే.

మనో:—అవసరం లేకపోతే అసలు అడగనే అడగరు దా! ఇదిగో చూడండి, ఇప్పుడే నేను వెళ్లి ... ... ...

"వద్దొద్దు, వెళ్ళవద్దు. అంత పెద్దఅవసర మేమీ లేదు" న్నాడు, చక్రధరుడు మనోరమను వారిస్తూ.

ఆమాటను చెవి కెక్కించుకోకుండానే గబగబా ఇంటోకి వెళ్లిపోయింది మనోరమ. ఒక్క క్షణంలో తిరిగివచ్చి మొత్తం పైకంతా డ్రాయరుమీద పెట్టింది.

తర్వాత మనోరమ ఏమో తన చదువులో మునిగి ... డబ్బు తీసుకోవాలా వద్దా - అన్న సమస్యలో ... చూడు చక్రధరుడు. తుదకు తీసుకోగూడదనే నిర్ణ ... కొచ్చాడు. పాఠాలు చెప్పి డ్రాయరుమీది పైకం ... రుమీదనే వదలి మెదలకుండా బయటికివెళ్ళిపోయాడు. ... సికొని వరండాదాకా వెనకాల వెళ్ళింది మనోరమ. ... సుకెళ్ళండని ఎన్నోసార్లు అంది. కాని చక్రధరుడసలు ... నేలేదు. గబగబా వీధిలో కెళ్లిపోయాడు.

# రెండో అధ్యాయం

భయకంపిత హృదయంతో ఇంటికెళ్ళాడు చక్రధరు
చూస్తే వాకిట్లో మంచం వేసి దానిమీద తివాసీ పరచి ఉం
దానిమీద సగం వయస్సుమళ్ళిన మహాశయుడొకడు ఆసీను
ఉన్నాడు. ఆగంతుక మహాశయుని కెదురుగా కుర్చీలో
కూర్చుని హుక్కా త్రాగుతున్నాడు మున్షీ వజ్రధరసింగ్. భ
ప్రక్కన నిల్చొని పొడుగాటి విసనకర్రతో విసురుతున్నాడు
ఇంటిమంగలి. ఇదంతా చూచి చక్రధరునిగుండెల్లో రాయిప
పోయింది. ఆ మహాశయుడు తప్పకుండా పెళ్లికొడుకుకొరక
బయలుదేరినబాపతేనని ఊహించాడు. నిశ్చయాత్మకంగ
తెలుసుకునే ఉద్దేశ్యంతో ఇంట్లో కెళ్లి తల్లి నడిగాడు. అత
ఊహ నిజమేనని తేలింది. దానిమీదట "ఐతే మరి నాన్న
రేమన్నా రేమిటి?" అని తల్లిని ప్రశ్నించాడు.

"నీ కేం ప్రాణంమీదికొచ్చిందిరా! బ్రతికినంతకాలమూ
పెళ్లీ - పేరంటం లేకుండా బ్రహ్మచారిగానే ఉంటావా ఏంటి
వెళ్ళు వెళ్ళు. వెళ్ళి అక్కడ వాకిట్లో అఘోరించు. నీకోస
ఎప్పణ్ణుంచో ఎదురుచూస్తున్నారు" అంది తల్లి నిర్మ
ముసిముసినవ్వుతో.

చక్ర:—ఇంతకూ ఈయనగా రెవ్వరేమిటి?

నిర్మ:—ఆగ్రాలో ఎవరో ప్లీడరట! పేరు మ
యశోదానందన్ అట.

చక్ర.— నేను షికార్కు పోతున్నా. యమదూత
వెళ్ళిపోయింతర్వాత తిరిగివస్తా.

నిర్మ.— అంతసిగ్గేమిటిరా నీకు? నీవంటి పిల్లవాణ్ణి నే నింతవరకు చూడనే చూడలేదురా. ఇదిగో, ఇలారా. తల కాస్త నూనెరాస్తా, ఆ జుట్టు చూడు, ఎలా విరబోసు ఉందో. శుభ్రమైన గుడ్డలు కట్టుకుని కాస్సేపు అలా వా కెళ్ళి కూర్చోరా నాయనా.

ఇంతలో మున్షీజీ వచ్చి "బరేక్ అబ్బాయ్ చేస్తున్నావురా ఇంట్లో? కాస్త ఇలా రా' అన్నాడు.

చక్రధరునిలో ఏమన్నా కొద్దిగా స్వప్న స్వప్ర ఉంటే, అది ఈ పిలుపుతో మాయమైపోయింది. ' లేండి! కాని ఈ పెళ్ళికాడిని మెడను వేసుకోనని చెప్తున్నా. పెళ్ళిచేసుకోవటం, బిడ్డలతండ్రి కావటం గంతలు కట్టుకుని గానుగలోని ఎద్దులా సంసార గిరగిరా తిరుగుతూ ఉండటం మాత్రమే మానవుని కాదు" అన్నాడు, చక్రధరుడు.

చక్రధరుడు వాకిట్లోకి రాగానే లేచి స్వా ఆలింగనం చేసుకున్నాడు యశోదానందన్. కుర్చీలో బెడుతూ "ఈసారి 'సరస్వతి' పత్రికలో మీరు వ్రాసి చె చదివినా మనస్సు కెంతో ఆనందం కలిగింది. పోగొట్టేందుకై మీరు సూచించినమార్గం ఎంతో యుక్తంగా ఉంది.

ఈ మృదు స్నేహపూర్ణ ఆలింగనం, సాను విమర్శ చక్రధరుని బాగా ఆకర్షించాయి. అత

న్నాడు. ఇంతలో వజ్రధరుడు కలుగజేసుకుని "ఇన్నాళ
ఆలస్యంగా వచ్చావేఁ? రాజాగారితో ఏమన్నా కబుర్లు
గా కూర్చున్నావా ఏమిటి?" అన్నాడు.
ఈమాట అని లోపలికెళ్ళిపోయాడు మున్షీజీ. అప్పుడు
డు నుద్దేశించి "ఇక మీ కార్యక్రమ మేమిటి?"
డిగాడు, యశోదానందన్.
చక్ర:— కొంతకాలం స్వేచ్ఛగా ఉండి ప్రజాసేవ
న్నదే నేటివర కున్న నిశ్చయం.
యశో:— నీబోటి ఉత్సాహవంతులైన యువకులు
ర్యాలలో సేవాక్షేత్రంలోకి రావటం జాతికి
కరమైన విషయమని వేరుగా చెప్పనవసరం లేదు. మీ
ాలే నన్ను మీ వేపుకు ఆకర్షించాయి.
ని ఇప్పుడప్పుడే సంసారబంధనంలో పడటం నా
సంసారబంధనంలో చిక్కుకుని ఎవ్వడూ మనో
కర్మలతో ఆశించినంతగా ప్రజాసేవచేయజాలడని
యం" అన్నాడు చక్రధరుడు నేలకేసి చూస్తూ.
శో:— స్త్రీ పురుషులిద్దరూ ఒకేరకమైనభావాలూ,
కలిగినవాళ్ళయితే, పురుషుని కార్యకలాపాల్లో
కంటకంగా ఉండకపోవటమేగాక పైగా ఎంతో
తుకాలుగా ఉంటుంది. మా అమ్మాయిభావాలు,
స్వభావం మొదలైనవన్నీ మీవల్లేనే ఉంటాయి.
దంపతులుగా ఉన్నపక్షంలో ఉభయులూ సుఖంగా
ను పూర్తిగా నమ్మకముంది. ప్రజాసేవలో ఆ పిల్ల
డూ ఒకడుగు ముందే ఉంటుంది గాని వెనక

ఉండదు. ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, సంస్కృతభాషల్లో మంచి ప్రవేశ ముండి. గృహకార్యాల్లో చక్కనినేర్పు ఉంది. ఇక రూపలావణ్యాలవిషయ మేమంటావా? అది, ఇదిగో ఈ ఫొటో చూస్తే మీకే స్వయంగా తెలుస్తుంది.

ఫొటోను చక్రధరునిముందు ఉంచుతూ, "స్త్రీలో ఎన్నైనా సుగుణా లుండనీ, కాని నచ్చిన రూపలావణ్యాలు లేకపోతే పురుషునిదృష్టి నాకర్షించలేను. అటువంటి స్త్రీపురుషుల దాంపత్యజీవితం దుఃఖమయమైపోతుంది. కాబోయే భార్యాభర్తలు మధ్యలో నాలుగైదుసార్లు పరస్పరం కలుసుకోవటంకూడా అవసరమనే నాఅభిప్రాయం. అందులో వధువుకిది ముఖ్యంగా అవసరం. ఎందువల్లనంటే పురుషునకే గనక స్త్రీ నచ్చకపోయినపక్షంలో మరికొన్ని వివాహాలు చేసుకోగలడు. కాని స్త్రీ విషయంలో అలాంటిది అసంభవం. పురుషుడు నచ్చకపోతే స్త్రీ తనజీవితమంతా నిరంతరాశ్రుధారలతో గడపవలసిందే.

ఆ ఫోటో నొకసారి జాగ్రత్తగా చూడటానికి వేగిరపడుతున్నాడు చక్రధరుడు. ఎప్పుడెప్పుడని ఆత్రంగా ఉంది. అక్కడ చూడ్డానికైతే నేమో సిగ్గుగా ఉంది. మరి ఎదుటనున్న అతిథినివదలి గదిలో కెళ్ళిపోవటమూ గడ్డుసమస్యగానే ఉంది. కొంచెంసేపు అలాగే బిగపట్టుకు కూర్చున్నాడు. కాని తుదకు ఉండలేక తమలపాకులపళ్ళెంతోపాటు ఫోటోకూడా తీసుకుని ఇంట్లో కెళ్ళిపోయాడు. తనగదిలో కూర్చుని ఎంతో ఔత్సుక్యంతో ఫొటోనుచూడ నారంభించాడు. చూస్తుంటే ఫొటో సిగ్గుతో కనురెప్పలు వాల్చినట్టుగానూ, అతిసతో

ఏదో చెబుతున్నట్టుగానూ కన్పించింది. ఆ ఫోటోను వెనక్కి త్రిప్పి అక్కడ పెట్టాడు. వాకిట్లో కెళ్ళాలని అనుకున్నాడు. కాని మనస్సు ఎదురు తిరిగింది. మళ్ళీ తీసి చేతితో పట్టుకుని జాగ్రత్తగా చూడసాగాడు. ఎంతచూచినా కళ్ళకు తనివితీరటంలేదు. దాన్ని ముందుపెట్టుకుని భావిజీవితాన్ని గురించి మధురస్వప్నాలు చూడసాగాడు. మున్షీ యశోదానందన్ గారు వాకిట్లో ఒక్కరే కూర్చొని ఉన్నారన్నమాట కూడా ధ్యాసలోలేదు. తనదీక్షా-వ్రతాలు మరచిపోయాడు, సేవా- సిద్ధాంతాలు జ్ఞప్తిలోనే లేవు. ఆదర్శాలెక్కడ మాయమయ్యాయో తెలియదు. భూత భవిష్యద్వర్తమానాల్లో లీనమై ఉన్నాడు. ఆ ఫోటో మధుర కల్పన ఒక్కటే యథార్థంగా, సత్యంగా కన్పడుతోంది.

ఆకస్మికముగ తుబుక్కుమని మోగిన తబలాదెబ్బ అతని సమాధికి భంగపాటు కలుగజేసింది. వాకిట్లో వరండాలో భజంత్రీలు, గాయకులూ చేరిఉన్నారు. మున్షీ వజ్రధరుడు సంగీతమంటే చెవులు తెగ్గోసుకొంటాడు. గాత్రమైతే అట్టే మధురంగా ఉండదు గాని లయతాళములపరిజ్ఞానంమాత్రం బాగా వుంది. లోపలనుంచి వాకిట్లోకి వచ్చీరావటంతోనే తరంగ మొకటి ఎత్తాడు మున్షీజీ. అదీ పంచమస్వరంలో. కంఠం జీరపోతోంది. గుక్క పట్టలేకపోతున్నాడు. మాటిమాటికీ గొంతు సవరించుకుంటున్నాడు. నాదంలో మృదుత్వమనేది మృగ్యం. మధ్యమధ్యలో గొంతు గార్దభస్వరంలా బొంగురుపోతోంది. ఐనా వాయిద్యగాళ్లు 'భలేభలే! సెహబాష్, సెహబాష్! ఆహాహా! అని గొంతంతా పడిపోయేటట్టు అరుస్తున్నారు.

అర్ధరాత్రివేళకు పాటకచ్చేరీ ముగిసింది. అంతా భోం చేశారు. మున్షీ యశోదానందన్ నాకిట్లో కెళ్ళి కూర్చున్నాడు. ఇంతలో వజ్రధరు డొచ్చి "ఏమన్నా సంభాషణలుజరిగాయా?" అని అడిగాడు.

యశో:—ఔను, జరిగాయి. కాని ఇదమిత్థమని ఏమీా తేల్చి చెప్పలేదు.

వజ్ర:—పెళ్ళిమాటఎత్తితేనే తలనొప్పి ఎగేసుకొస్తుంది.

యశో:— బహుశా ఇప్పుడు ఒప్పుకోవచ్చు.



"ఏం నాయనా! ఒక్క-రోజంటే ఒక్క-రోజుకోసం, నా వెంట ఆగ్రా వస్తావా?" అని అడిగాడు యశోదానందన్ చక్రధరుని ప్రొద్దుట లేవగానే.

చక్ర:—నన్ను బురదలోకి ఈడ్వకుండాఉంటే నా కెంతో మేలుచేసినవారవుతారు.

యశో:—నిన్నేమీా బురదలోదించటం లేదు. పైపెచ్చు నీ జీవన ఉద్దేశ్య-ఆదర్శాలను తు. చ. తప్పకుండా ఆచరణలోపెట్టి చూపించటమే తన ముఖ్యజీవిత లక్ష్యంగా, కర్తవ్యంగా భావించేటటువంటి యథార్థ మిత్రుని, యథార్థసహాయకుని నీకు ఇస్తున్నా. ఇంకోవిధంగా చెప్పాలనుకుంటే మనః పూర్వకంగా నిన్ను నా అల్లునిగా చేయనే చేసుకున్నానని చెప్పవచ్చు. ఐనా అహల్య నడగటం, ఆవిడఅనుమతినికూడా తీసుకోవటం ఆవశ్యకమని భావిస్తున్నా. ఈ విషయంలో నేను సర్వస్వతంత్రంగా వ్యవహరించటం బహుశా నీవు హర్షించక పోవచ్చునని అనుకుంటా.

కింక ర్తవ్యవిమూఢత్వంలో మునిగిపోయాడు చక్రధరుడు. సిద్ధాంతరీత్యా చెప్పాలంటే వివాహం విషయంలో స్త్రీకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఇవ్వటం అవసరం అన్నవాదననే అంగీకరిస్తాడని చెప్పవచ్చు. కాని ఈసమయంలో యశోదానందనుని వెంట ఆగ్రా వెళ్ళాలంటే చాలా సంకోచపడుతున్నాడు చక్రధరుడు

"నేను నీ మనోభావాలను అర్థంచేసుకుంటున్నా. ఎదుటకు వెళ్ళటంలో నీకు సిగ్గుగాఉండేటటువంటి చంచలకన్యలలో మా అహల్య పరిగణనకురాదని నమ్మకంగా చెబుతున్నా. దాని సరళస్వభావం చూస్తే నీకే ఆశ్చర్యం కలుగుతుంది. ప్రసన్న చిత్తుడవూ అవుతావు. అమ్మాయినే తీసుకురమ్మనమంటె నేనే తీసుకురాగలను, నాలుగైదురోజులు ఉండనూ ఉండగలను. కాని మీవారి కిది నచ్చకపోవచ్చు" అన్నాడు, యశోదానందనుడు చక్రధరు నుద్దేశించి.

"ఇప్పుడిప్పుడే 'రానూ, పోనూ' అని కబుర్లుచెబుతూ కూర్చుంటే, ఈ మహాశయుడెక్కడన్నా నిజంగానే అహల్యను వెంటబెట్టుకొస్తాడేమో" అని ఒక ఆలోచనవచ్చింది. వెంటనే మాటల్లో మాటకల్పుతూ "వద్దండి, అలాచేయటం భావ్యం కాదండీ. సరే, నేనే వస్తాను లెండి" అన్నాడు చక్రధరుడు.

ఇంట్లో తల్లి నిర్మల అయితే సంతోషంగానే 'సరే, అలాగే కానీయండి' అంది. కాని మున్షీ వజ్రధరుడుమాత్రం కాస్త వెనకాముందాడుతున్నాడు. 'ఏనా ఇతను పిల్లవాణ్ని చూచి సంబరాలుపడిపోతున్నాడు, తప్పకుండా ఏదో మంచి కట్నమే ఇవ్వొచ్చు' అని ఆలోచించి అతనూ అభ్యంతరం

చెప్పలేదు. ఇప్పుడిక హరిసేవకసింగ్‌గా రొక్కరే తెలియ చేయటానికి మిగిలిఉన్నారు.

చక్రధరుడు చెప్పిరావటానికి వెళ్ళినప్పుడు హరిసేవక సింగ్ కూర్చుని తనప్రాణేశ్వరి 'లాంగి' తో ఏదో మాట్లాడు తున్నాడు. మనోరమతల్లి చనిపోయి ఇప్పటికేనాడో అయింది. ఆవిడ బ్రతికి ఉన్నప్పుడు 'లాంగి' దాసిగా ఉండేది. ఆవిడ చనిపోయినతర్వాత ఈ 'లాంగి' యే సంసారమంతా దిద్దు కొచ్చింది. దాని నేర్పరితనం చూచి హరిసేవకసింగ్ దానిపట్ల ఎంతో ప్రసన్నుడైనాడు. ఆ రిక్తగృహాణీస్థానంలోకి తీసుకొచ్చి దాని కభిషేకంచేశాడు. లాంగి సరళ హృదయురాలు; జాలి గుండె; నవ్వు ముఖం. ఎంతో ఓర్పుగల స్త్రీ. ఇంట్లోవాళ్ళం దర్నీ వశంచేసుకుంది. జీతాలు ముట్టకపోయినా నౌకర్లను తమ దగ్గరనుండి వెళ్ళనిచ్చేది కాదు. నౌకర్లు అలా వెళ్ళకుండా ఉండిపోవటానికి ఏకమాత్రకారణం లాంగి సజ్జనత్వమే అని చెప్పాలి. లాంగి అంటే మనోరమకు తగనిప్రేమ. అదంటే ప్రాణమిస్తుంది. అసూయా - ద్వేషాలూ, మద - మాత్స ర్యాలూ అసలావిడలో పేరుకూడా కానరావు. అంతఉదారత్వం లేకపోయినా లుబ్ధత్వమూ లేదు. ఠాకుర్ సాహెబ్ (హరి సేవకసింగ్) అప్పుడప్పుడు దానిమీదా ఎగిరిపడుతుండేవాడు. అప్పుడప్పుడు కొట్టబోయేవాడు. రెండు మూడు సార్లు చెయ్యి చేసుకున్నాడు కూడానూ. కాని 'లాంగి' మొహంలో కోప మనే దెక్కడా కన్పించేది కాదు. ఠాకుర్‌సాహెబ్‌కు కాస్తంత తలనొప్పిగా ఉంటే చాలు దానిప్రాణం నిలువునా ఎగిరి

పోయిందన్నమాటే. ఆవిడ ఈ ప్రేమపూర్ణ సేవచేయే ఇన్నాళ్ళు అలాంటి హింసకజీవుని బంధించి ఉంచింది.

ఆ సమయంలో ఇద్దరిమధ్య ఏదో వాగ్వివాదం జరుగుతోంది. కారాలు మిరియాలు నూరుతూ మాట్లాడుతున్నాడు వారి సేవకసింగ్. అపరాధిచందాన నిలబడిఉంది లాంగీ. ఇంతలో మనోరమ వచ్చి "బాబుగారొచ్చారు. మీతో ఏమిటో చెప్పటాని కొచ్చారు" అంది.

ఠాకుర్ సాహెబ్ నొసలు చిట్లించుతూ "చెప్పే దేముంది లే! జీతండబ్బులకోసం వచ్చిఉంటాడు. సరే, వస్తున్నా, కూర్చోమని చెప్పు. వెళ్ళు" అన్నాడు.

లాంగీ:—ఆయనగారి జీతం ఇచ్చేస్తే ఏం పోతుంది? పాపం పేదవాడు. సంకోచంవల్ల అడగలేకపోతున్నాడు. చాలా నెలలయ్యాయి కదా!

ఇలా చెప్పి వెళ్ళిపోయింది లాంగీ. మరుక్షణంలోనే డబ్బుతోసహా వచ్చి ఠాకుర్ సాహెబ్‌తో "ఇదిగో డబ్బు; వెళ్ళి ఇచ్చి రండి. ఏమైనా మాట్లాడదలిస్తే తప్పక విని రండి" అంది, లాంగీ.

ఠాకుర్ సాహెబ్ విసుక్కుంటూ, కోపగించుకుంటూ డబ్బుతీసుకుని బయటికిబయలుదేరాడు. మధ్యలోనే కోపంకాస్తా చల్లబడింది. చక్రధరునివద్ద కెళ్ళేటప్పటికి వినయవిధేయతలకు సాక్షాత్ మూర్తిలా తయారైనాడు.

చక్ర:—తమర్ని కొద్దిగా ఇబ్బంది పెట్ట... ...

ఠాకుర్:—లేదు లేదు; ఇబ్బంది దేమీలేదు. ఇదిగో మీ డబ్బు.

చక్ర:—నే నిప్పు డింకోపనిమీద వచ్చాను. ఏదో ఒక సొంతపనిమీద ఆగ్రాప్రయాణం తగిలింది. బహుశా రెండు మూడు రోజులు పట్టొచ్చు. అందుకుగాను క్షమించప్రార్థన.

ఠాకుర్:—మంచిది మంచిది, అలాగే.అలాగే నిరభ్యంతరంగా వెళ్ళిరండి. ఇందులో నన్నడగవలసిన అగత్యమేముంది?

ఠాకుర్ సాహెబ్ తిరిగి లోపలికి వెళ్ళిపోగానే "ఆగ్రా ఏంపనిమీద వెళ్తున్నారు?" అని ప్రశ్నించింది మనోరమ.

చక్ర:—ఏదో కొద్దిగా అవసరమొచ్చింది.

మనో:—ఎవరైనా జబ్బుగా ఉన్నారా?

చక్ర:—లేదు, అలాంటి దేమీ లేదు.

మనో:—ఐతే మరి ఇం కేం పని? చెప్పగూడనిపనా! ఐతే చెప్పనంతవరకూ వెళ్ళనివ్వను.

చక్ర:—తిరిగివచ్చినతర్వాత చెబుతాలే. నీ పాఠాలేమిటో చూచుకో.

మనో:—కాదుకాదు, అలా నే నేం ఒప్పుకోనులెండి. ఇప్పుడే చెప్పాలి. చెప్పకుండా వెళ్ళారా, నే నసలు పుస్తకం కూడా ముట్టుకోనని గుర్తుంచుకోండి.

చక్ర:—అతి కఠోరశరతే! సరే. అలాగే చెబుతాగాని, విని నవ్వకూడదు రవ్వంతైనా నవ్వావంటే, నేను వెంటనే వెళ్ళిపోయా నన్నమాటే.

మనో:—రెండుచేతుల్తోనూ గట్టిగా నోరు మూసుకుంటున్నాను లెండి.

"నా వివాహం గురించి ఏదో రాయబారంవచ్చింది. నాకైతే ఇష్టంలేదు. కాని ఒక మహాశయుడు బలవంతంగా తీసుకుపోతున్నాడు." అన్నాడు చక్రధరుడు సిగ్గుపడ్తూ.

ఇలాఅని లేచి బయలుదేరాడు చక్రధరుడు:మనోరమా వెనువెంట బయలుదేరింది. అతను వరండాలోంచి క్రిందికి దిగ గానే నమస్కారంచేసి తనగదిలోకి తిరిగివచ్చేసింది. కళ్ళు కన్నీటిమయమై ఉన్నాయి. ఏడుపు పొరదోసుకువస్తోంది—చక్ర ధరుడు ఏదో దూరదేశం వెళ్ళిపోతున్నట్టు.

# మూడో అధ్యాయం

సాయంకాలం బెనారస్‌నుండి బండి బయలుదేరింది. యశోదానందనుడు చక్రధరునితో "బాబూజీ! అహల్య విషయంలో నేను నీకు కొన్ని అబద్ధాలు చెప్పాను. ఆ అమ్మాయి నా కన్నకుమార్తె కాదు. దాన్ని కన్న తలి దండ్రు లెవ్వరో తెలియదు" అన్నాడు.

"మరి మీ ఇంటి కెలా చేరింది?" అని ప్రశ్నించాడు, చక్రధరుడు చారెడంత గుడ్లు చేసుకుని.

యశోద:—అదొక వినదగిన వింత. పదిహేనేళ్ళక్రితం ఒకనాడు సూర్యగ్రహణం వచ్చింది. మా కొక 'సేవా-సమితి' ఉండేది. ఆ గ్రహణస్నానాలసందర్భంలో తీర్థయాత్రికుల సేవకై మేమంతా ప్రయాగ వెళ్ళాం. అక్కడొక మురుగు కాల్వలో ఈ బాలిక దొరికింది. తలిదండ్రుల జాడతీయాలని

ఎంతో ప్రయత్నించాం. కాని ప్రయాసంతా వృథాఅయింది. వివశులమై కడకు బాలికను వెంట తీసుకెళ్ళాం. మొదట్లో నాలుగైదేళ్ళవరకూ అనాథాలయంలో ఉంచాం. తర్వాత కార్య కర్తలలో పెరిగిన వైమనస్యాలకారణంగా అనాథాలయం మూసివేయబడింది. అప్పటినుంచీ ఆ బాలిక నా స్వగృహంలోనే పెరుగుతూ వచ్చింది. జన్మతః కాకపోయినా, సంస్కార దృష్ట్యా అయినా ఆ బాలిక మా బిడ్డే. దాని నాగరికత విషయంలో ఎట్టి సందేహమూ లేదు. ఇప్పుడు విషయమంతా ఉన్నది ఉన్నట్టుగా చెప్పేశాను. ఆ పిల్లను స్వీకరించటమా లేక త్యజించటమా అన్నవిషయం ఇప్పుడిక మీమీద ఉంది. ఒక విషయంమాత్రం గట్టిగా చెప్పగలను. ఇలాంటి రత్నం మీకు మళ్ళీ లభించటం దుర్లభం. మీ నాన్నగారికిది సహ్యంకాదని నాకు తెలుసు. కాని సత్కార్యాల విషయంలో ఏ ఒక్కరివ్యతిరేకతను వీరపురుషులు లెక్కచేయరనీ, అందులో తప్పక విజయం సాధించితీరుతారనీ కూడ నాకు తెలుసు.

గంభీరాలోచనలో పడిపోయాడు చక్రధరుడు. ఒక వైపున అహల్య అనుపమ సౌందర్యం, ఉజ్వలచరిత్రా; రెండో వైపున కన్నతల్లిదండ్రుల వ్యతిరేకతా, లోకాపవాదభీతీ మనోవీధిలో తర్కసంగ్రామం ప్రారంభమయింది. చక్రధరుడీవిధంగా సందిగ్ధావస్థలో పడి కొట్టుకులాడటంచూచి "ఏదో విచారించుతున్నట్టు కన్పడుతున్నారు. ఔను, తప్పక విచారణీయాంశమే. ఏదో వ్యతిరేకతను, లోకాపవాదభీతికి జంకి, భయపడి మీబోటి విద్వాంసుడు, మీవంటి ఉదారహృద

యుడు కర్తవ్య పంథానుండి, న్యాయమార్గంనుండి వైదొలగి పోతే ఇక దేశోద్ధరణ, ప్రజోద్ధరణ జరిగినట్లే. మీ స్వతంత్ర భావాలు, మీ సాంఘిక సంస్కారభావాలు చూచిన అనంతరమే ఈ బాలిక ఉద్ధరణభారం మీపై ఉంచాలన్న నిర్ణయాని కొచ్చాను. ఉంచానుకూడ. మీరుకూడ స్వకర్తవ్యం గ్రహించలేకపోతే ఆ అబల, ఆ అనాథ ఎటి దుర్గతిపాలవుతుందో నేను చెప్పలేను'' అన్నాడు, యశోదానందనుడు.

రూపలావణ్యాలమాటపూర్తిగా మరచిపోగలశక్తి చక్రధరునికుంది. కాని సంఘసంస్కార భావాలనుమాత్రం మరచిపోలేడు. అతను స్వేచ్ఛా - స్వాతంత్ర్యాల ఉపాసకుడు. నిర్భయత్వం స్వాతంత్ర్యానికి మొదటిమెట్టు. "నాకు సంబంధించి ఉన్నంతవరకూ మీరెట్టి సంశయమూ ఉంచుకోవద్దు. ఇలాంటి కార్యకలాపాల విషయంలో లోకాపవాదును భయపడి పారిపోయేటటువంటి పిరికిపందనుకాను. తలిదండ్రులను ప్రసన్నులుగా ఉంచటం నా విధ్యుక్తధర్మమే. కాని కర్తవ్య- న్యాయములను ఖూనీచేసి మాత్రంకాదు. కర్తవ్య నిర్వహాణముందు తలిదండ్రుల అభిలాషల నిర్వహాణకేమీ విలువలేదు." అన్నాడు చక్రధరుడు దృఢభావంతో.

''బాబూజీ, మీనుండి ఇదే ఆశించాను." అన్నాడు యశోదానందనుడు చక్రధరుని కౌగిలించుకుంటూ.

రైలు ఆగ్రా చేరుకునేటప్పటికి పొద్దు పొడిచింది. సామాను తీసుకుపోవుటకై రైల్వేకూలీలను పిలుస్తూఉండగానే యశోదానందనునిదృష్టి పోలీసులపై పడింది. చూస్తే నలు వేపులా నిలబడిఉన్నారు పోలీసులు. ''ఏమిటి! ఇవ్వాళ ఇంత

బందోబస్తుకు కారణమేమిటయ్యా ?" అని అడిగాడు, ససంభ్రమంగా.

సబ్ఇన్స్పెక్టరు:— ఇదంతా మీరు నాటిన కంట కాల ఫలితమే ననుకోండి. పట్నంలో గలాటాలు జరిగాయి.

ఇంతలో సేవాసమితి సభ్యు డొకడు రొప్పుకుంటూ రోజుకుంటూ పరుగునవచ్చిపడ్డాడు. యశోదానందనుడు కాస్త ముందుకుపోయి 'రాధామోహన్! ఏమిటి? ఏం జరిగిందేమిటి?' అని ప్రశ్నించాడు సేవాసమితి సభ్యుని.

రాధామో:—మీరిక్కడనుంచి వెళ్ళిననాడే పంజాబు నుండి మౌల్వీ దీన ముహమ్మద్ గారు పదార్పణంచేశారు. ఆయన వచ్చిన మరుక్షణంనుండే 'కుర్బానీ' (గోబలి) ఇవ్వాలన్న పిచ్చి ఇచ్చటి మహమ్మదీయుల నెత్తి నెక్కి కూర్చుంది. రక్తపుటేరులు ప్రవహించినా ఇష్టమేగాని 'కుర్బానీ' మాత్రం జరగటానికివీల్లేదని హిందువులకూ పట్టుదలగా ఉంది. ఉభయ పక్షాలూ దెబ్బలాటకు సన్నాహాలు చేస్తున్నారు. మేమంతా చెప్పిచెప్పి విసుగెత్తిపోయాం.

"ఏతే ఈ విషయంలో ఖ్వాజా మహమూద్ గారేమీ కలుగచేసుకోలేదా ?" అని ప్రశ్నించాడు యశోదానందనుడు.

రాధామో:—ఇప్పు డసలు ఆయనగారివాకిట్లోనేగా 'కుర్బానీ' జరగబోతోంది.

యశో:—ఏమిటీ! ఖ్వాజా మహమూద్ గారి యింటి ముందా! 'కుర్బానీ' జరగబోతోందా! సరే, అలాగైతే ఆ కుర్బానీకి ముందు మా ఉభయులలో ఎవరో ఒకరి 'కుర్బానీ'

తప్పక జరిగితీరాలి. మంచిది. ఆలసించకు. జట్కాబండి మాట్లాడు.

రాధామో:—ప్రస్తుతం మీారు ఇక్కడినుంచి కదల కుండా ఉండటమే శ్రేయస్కరం.

యశో:—భలే. చాలా బాగా చెప్తున్నావు. అక్కడ పట్నమంతా నిప్పంటుకుని తగలబడిపోతుంటే ఇక్కడే ఉండమని నాకు సలహా చెబుతున్నావా? అందరూ చచ్చే వాళ్ళున్నూ, మరి నే నొక్కణ్ణే బ్రతికేవాడినా? అందరితో పాటే నేనూను. మరి ప్రమాదం వస్తుందని భయపడి పారి పోవటం దేనికి? వెంటనే నాకు తెలియజేయక గొప్ప పొర పాటు చేశారు.

ముగ్గురూ జట్కాబండిలో కూర్చుని బయలుదేరారు. రోడ్లమీాద పోలీసులు గస్తీ తిరుగుతున్నారు. బజారున వచ్చే పోయేవాళ్ళదగ్గర ఏ కర్రఉన్నా, ఏ పుల్లఉన్నా లాక్కుం టున్నారు. ఇద్దరు ముగ్గురుకూడ మనుష్యులు ఒకచోట నిల్చో టానికి వీల్లేదు. షాపులన్నీ మూసిఉన్నాయి. కూరగాయల వాళ్ళూ కూరగాయలమ్ముతున్న క్కడా కన్పించటంలేదు. ఔను, సందుగొందుల్లో మాత్రం జనం పోగయి ఏమేమో సంభాషించుకుంటున్నారు.

కొంచెం దూరంవరకూ ముగ్గురూ మౌనంగానే వున్నారు. శంకితహృదయంతో నలువేపులా తేరిపార జూస్తున్నాడు చక్రధరుడు. కాని యశోదానందనునిముఖ మండలం మాత్రం గ్లానితో పొగచూరిపోయినట్టుగా ఉంది.

జట్కాబండి ఖ్వాజా మహమ్మూద్‌గారి ఇంటిముందు కెళ్ళి ఆగింది. చూస్తే వాకిట్లో వేలాదిజనం క్రిక్కిరిసి ఉంది. కర్రలుగానీ, బడితెలుగానీ ఎవ్వరిదగ్గిరా లేవు. కాని వాళ్ళ ముఖాలు మాత్రం 'మతయుద్ధ' ఆవేశంతో ఎర్రగా నిప్పుకణాల్లా మెరుస్తున్నాయి. యశోదానందనుడు కంటి కగపడగానే ఆ గుంపులోనుంచి అనేకమంది పడత్రోసుకుని ముందు కొచ్చారు. వాళ్ళను చూచి "మీతో దెబ్బలాడటాని కేమీ రాలేదు. ఖ్వాజాగా రెక్కడ? పిలువనీలుంటే కాస్త ఆయన్ని పిలవండి" అని బిగ్గరగా అనేటప్పటికి ముందుకొచ్చినవాళ్ళంతా ఎక్కడివాళ్ళక్కడ తొలగిపోయారు.

కొంచెంసేపట్లో ఒక ఆజానుబాహుడైన వ్యక్తి ముతకగుడ్డల'షేర్వాణీ'తో ముందుకొచ్చి ప్రత్యక్షమయ్యాడు. ఇతడే ఖ్వాజా మహమ్మూద్ మహాశయుడు.

"ఏమయ్యా! ఖ్వాజాగారూ! ఈ పేటలో ఇంతవర కేనాడైనా 'కుర్బానీ' జరిగినట్లు గుర్తుఉందా?" అన్నాడు యశోదానందనుడు కొంచెం కోపంగా.

మహ:—లేదు. నాకు తెలిసినంతవరకూఅలాంటిదేమీ జరిగిఉండలేదు.

యశో:—ఐతే మరి మీరు ఇవ్వాళ ఇక్కడ'కుర్బానీ' చేయాలన్న సరికొత్త ఆచార మెందుకు తలపెట్టారు?

మహ:—ఎందుకంటారా? అది మా హక్కుగనక. ఇంతవరకూ మీ మనస్సుకు కష్టం కలుగకుండా మీ భావనలను గౌరవిస్తూవచ్చాం. మా స్వాధికారాన్ని కూడ మరచిపోయాం. కాని మీరుమాత్రం మా మతాచారాలను, మా

మానసిక భావనలను గుర్తించ నిరాకరించారు. అలాంటప్పుడు మా స్వాహక్కులను వదలుకుని మీ భావనలను మే మెందుకు గుర్తించాలో తెలియటంలేదు.

యశో:—అంటే దీని అర్థం. రేపు మీరు మావాకిళ్ళ ముందు, మా దేవాలయాలముందు 'గోబలి' చేస్తుంటే గుడ్లప్పగించి చూస్తూ కూర్చోవాలన్నమాట. సరే, కాని కుర్బానీ మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ జరగటానికి వీల్లేదు. అథవా జరిగితే వచ్చే కష్టనష్టాల బాధ్యతఅంతా మీదేనని చెప్తున్నా.

ఈవిధంగా చెప్పి మళ్ళీ జట్కాలో కెక్కి కూర్చుని బయలుదేరబోతున్నాడు యశోదానందనుడు. పది పన్నెండు మంది బండి నటకాయించాలనుకున్నారు. కాని జట్కావాడు అందకుండా బండిని తోలుకెళ్ళాడు, వాయువేగంతో వెళ్ళి గుర్రం యశోదానందనుని వాకిట్లో వాలింది. చూస్తే అక్కడా వేలకువేలు చేరిఉన్నారు. యశోదానందనుడు కంటికగపడ గానే నలుమూలలనుండీ కాకిగోల బయలుదేరింది. గబగబా వచ్చి చుట్టూచేరింది జనం.

జట్కాలోంచి దిగుతూనే "సోదరులారా! ఈ పేటలో ఈ ఘడియవరకు ఎన్నడూ 'కుర్బానీ' జరగలేదని మీ కందరకూ తెలిసిన విషయమే. ఇవ్వాళేగనక మనం 'కుర్బానీ' జరగనిస్తే రేపు మన పవిత్రదేవాలయములముందు గోహత్య జరగదని ఎవడు హామీగా చెప్పగలడు?" అన్నాడు, యశోదానందనుడు ధీకారంగా.

వేలాది గొంతులు ఒకేసారి ధ్వనించాయి— "బలి అన్నా అయిపోతాం, కాని 'కుర్బానీ'మాత్రం జరగనివ్వం."

ప్రజల నీ విధంగా ఉద్రేకపరచి ముందుకు నడిచాడు యశోదానందనుడు. ఇటు 'భగవాన్ రామచంద్రకీ జై' 'హనుమాన్ కీ జై' అనే జయజయ ధ్వానాలతో వాయుమండలాన్ని దద్దరిల్ల చేస్తూ వెనకబయలుదేరింది జనం. అటు మహమ్మదీయులూ కత్తులూ, కటార్లూ చేబూని నడుములు బిగించి నిల్చున్నారు. ఉభయపక్షాలూ తారసిల్లటానికిక ఆలస్యమేమీ లేదు. ఇంతలో చప్పున ముందుకొచ్చి యశోదానందనుని కెదురుగా నిలబడి వినయంగా, కాని దృఢంగా "ముందుకెళ్ళదలిస్తే నా రొమ్ముల మీదుగా వెళ్ళండి. చూస్తుండగా మాత్రం ఇలాంటి ఘోరం జరగజాలదు" అన్నాడు, చక్రధరుడు.

"మీ రిక్కడినుంచి వెళ్ళిపోండి. ఒక నిమిషం జాగు జరిగితే తర్వాత ఎంత గుండెలు బాదుకున్నా ప్రయోజనమేమీ ఉండదు." అన్నాడు, యశోదానందనుడు కోపగించుకుంటూ.

చక్ర:—మిత్రులారా! బాగా ఆలోచించి మరీ ఒక నిర్ణయానికి రండి.

"ఆలోచన పిరికిపందలపని" అన్నాయి అనేక కంఠాలు.

చక్ర:—సరే, అలాగైతే వెళ్ళండి. కాని ఆ గోవును రక్షించబోయేముందు తమ సోదరు లొకర్ని ఖూనీ చేయవలసి ఉంటుందన్నమాట మరచిపోకండి.

అకస్మాత్తుగా ఏమూలనుంచోగాని, రైమంటూ ఒక రాయివచ్చి చక్రధరునితలకు తగిలింది. నెత్తురు ఏకధారగా ప్రవహించసాగింది. ఐనా తనచోటునుండి ఒకనూలుపోగంత కూడ ఇటూఅటూ చలించలేదు. ఒకచేత్తో తల అదిమిపట్టి

కుని "నా రక్తధారలవల్లే గనక మీ కోపాగ్ని చల్లారుతున్నట్లయితే, ఇది నా అదృష్టంగా భావిస్తా" అన్నాడు.

"ఎవ్వడురా ? ఆ రాళ్ళు రువ్వుతున్న దెవ్వడురా! అంత గొప్ప మొనగాడే అయితే ఇలా ఎదుటికొచ్చి తన ప్రతాపం చూపమను. చాటుగామాటుగా రాళ్లు రువ్వి ఏడ్వటం దేనికి?" అన్నాడు, యశోదానందనుడు గర్జిస్తూ.

"ధర్మ-ద్రోహులను మరమ్మతుచేయటం అధర్మమేమీ కాదు" అంది, ఒకగొంతు.

యశో:— నువ్వు ధర్మ- ద్రోహివిగా తలంచుతున్న వ్యక్తి నీకంటే ఎన్నోరెట్లు నిజమైన హిందువుడు.

"ఔనౌను; సమయానికి సందుగొందులు చూచుకుని మొహంతప్పించుకుపోయే మహానుభావులే, ఉన్న ఊరువదలి నాలుగైదురోజులు చల్లగా జారుకునే బాపతే పదహారణాల హిందువులు" అని ఒకధ్వని.

యశో:— సోదరులారా! మీరంతా వింటున్నారు కదూ! నే నట నిజమైన హిందువుణ్ణి కాదట; సమయానికి సందుగొందులు వెతుక్కుంటానట. ప్రాణంమీది ప్రీతితో పట్నంవదలి పారిపోయానట. సరే,మంచిది. మరి ఇలాంటివ్యక్తి మీ సమితికి సెక్రటరీగా ఉండతగ్గవాడు కాదు. మీరు నిజమైన హిందువునిగా భావించినవ్యక్తినే సెక్రటరీగా చేసుకోనండి.

ఈ విధంగాఅని ఇంటిదారిన బయలుదేరాడు యశోదానందనుడు. దారికడ్డంగా వెళ్ళి బతిమాలాలని ఆలోచించారు కొందరు. కాని అతనేమీ వినిపించుకోలేదు. అతను వెళ్ళిపోవ

టంతోనే తమలోతాము పరస్పరం నిందించుకుంటూ కీచులాడ సాగారు.

ఇటునుంచి ఇక ప్రమాద మేమీ లేదని అనుకున్నాడు చక్రధరుడు. వెంటనే రెండోపక్షం - మహమ్మదీయులపక్షం ఎదుటికొచ్చి నిల్చున్నాడు. "అయ్యలారా! నా దొక విన్నపం విన్నవించటానికి శెలవు ఇప్పించమని ప్రార్థన" అన్నాడు, చక్రధరుడు బిగ్గరగా.

ఒకరు:— వినండి వినండి, ఇలా వినండి. ఇంతకుముందు హిందువుల కెదురుగా నిల్చొనిఉన్నవాడు వీడేకదూ?

చక్ర:— ఈ గోవును బలిఇవ్వటం తమ విధ్యుక్త ధర్మంగా భావించుతున్నట్లయితే నిరభ్యంతరంగా, సానందంగా ఇవ్వండి. కాని ఈ ప్రదేశంలోనే 'బలి' ఇవ్వటం తప్పని సరియా? ఇస్లాం సర్వదా అన్యమతస్థుల అభిప్రాయాలను ఖాతరుచేస్తూవచ్చింది. అందుచేత ఇప్పుడు హిందువుల అభిప్రాయాలను గౌరవించి మరొకచోట'బలి' ఇవ్వటం మంచిది. అది 'ఇస్లాం'కు వ్యతిరేకం ఏమీ కాబోదు.''

''ఇలాంటి తేనెలాంటిమాటలు చాలా విన్నాంలే గానీ, 'కుర్బానీ'మాత్రం ఇక్కడ జరిగితీరవలసిందే" అన్నాడు ఒకమౌల్వీ రాయిగుద్దినట్టుగా.

చక్రధరునిమాటలు చెవులునిగిడ్చి ఆలకించుతున్నాడు, ఖ్వాజా మహమూద్. అటు మౌల్వీగారి ఉద్దండత చూచి కోపంతో ''కుర్బానీ, ఇక్కడే చేయాలని 'ఖురాన్‌షరీఫ్' ఆదేశమా? మరోచోట చేయవీల్లేదా?" అన్నాడు.

మహమూద్ కేసి అవిశ్వాస పూర్ణదృష్టితో చూస్తూ "మతవిషయాల్లో ధర్మశాస్త్రవేత్తలకు మినహా మరెవ్వరికీ మాట్లాడేహక్కు లేదు" అన్నాడు మౌల్వీ.

ఖ్వాజా:— చెడుగా భావించకండి మౌల్వీగారూ! నిజంగా పదిమంది సిపాయిలుగనక వచ్చి ఇక్కడ నిల్చుంటే ధర్మశాస్త్రిలు మరచిపోయి సందుగొందులు వెదక ప్రారంభించుతారు.

మౌల్వీ:— సోదరులారా! ఖ్వాజాగారి అనధికార చేష్టలూ, అన్యాయప్రవర్తనా మీరంతా చూస్తున్నారు గదూ! మతవిషయాల్లో ధర్మశాస్త్రవిశారదులనిర్ణయం శిరోధార్యమో లేక శ్రీమంతులనిర్ణయం శిరోధార్యమో మీరే చెప్పండి.

"అదంతా దేనికి? మీమాటకు మీరు 'బిస్మిల్లా' చేయండి. మతంతో శ్రీమంతులకేం సంబంధం లెండి!" అన్నాడు ఒకగడ్డంపోతు.

ఈ మాటలు వినగానే ఒకమనిషి ఒకపెద్ద కటారుతీసుకుని ముందుకొచ్చాడు అంగలార్చుకుంటూ. కొందరు ఆవు కొమ్ములు గట్టిగాపట్టుకున్నారు. ఇంతవరకుఆవు చలనంలేకుండా నిల్చొనివుంది. కాని తళతళమెరిసే కటారును చూడగానే గింజుకొని, తన్నుకోసాగింది. చక్రధరుడు ఈ కరుణాజనకదృశ్యం చూచి వ్యాకులపడిపోయాడు. చప్పున ముందుకురికి ఆవు మెడను వాటేసుకున్నాడు. "ఇవ్వాళ ఒకనోరులేని జంతువుతోపాటు ఒకమానవునికూడా 'కుర్బానీ' చేయవలసిఉంటుంది" అన్నాడు గంభీరంగా.

అంతా ఆశ్చర్యంగా చక్రధరునికేసి చూడసాగారు. ఖురాన్ ఒట్టు; తొలగిపో, లేకపోతే కనివినిఎరుగనిది జరిగి పోతుంది" అన్నాడు మౌల్వీ క్రోధోన్మత్తతతో.

చక్ర:— జరగనీయండి. ఇవ్వాళటిరోజున ఈగోవుతో పాటు నా'కుర్బానీ' జరగటం 'ఖుదా'కు మంజూరుకాబోలు!

ఖ్వాజా:— "ఖుదా కసమ్ (దేవుడిఒట్టు) నీబోటి గుండెగల మనిషిని నేనింతవరకు చూచిఎరుగ.నువ్వు'ఖురాన్' చదవకపోయావా? చదివితే బాగుండేది.

చక్ర:— దేవుడొక్కడే యని నానమ్మకం. వాడే సమస్తజీవులకు కర్తా - ధర్తాయని నాఅభిప్రాయం. అలాంటప్పుడు ఇంకెవ్వరియెడల భక్తిప్రపత్తులు కల్గిఉండమని మీ సలహా?

ఖ్వాజా:— అల్లా! అలాగా! ఐతే నువ్వు నిజమైన మహమ్మదీయుడవన్నమాటే. మరి మాతో కలిసి భోంచేయ టానికి అభ్యంతరముండ దనుకోవచ్చా?

చక్ర:— లేకేం? తప్పకఉంది. శుద్ధి, శుభ్రతలుగనక లేకపోతే ఒక బ్రాహ్మణునితో కలిసి భోంచేయటానికి ఉండే అభ్యంతరమే మీసరసను భోంచేసేవిషయంలోనూ ఉంటుంది.

ఖ్వాజా:— అయ్యా! నీతోటిసోదరులకూడా నీ కున్నటువంటి వివేకబుద్ధులు ఉంటేనా? సరేగాని, ఇక్కడ చూస్తే హిందువులంతా మమ్మల్ని మ్లేచ్ఛులని అంటున్నారు. ఇంత దేనికి? కుక్కలకంటెకూడా నీచంగా చూస్తున్నారు. అల్లా! మిమ్మల్నిచూచి నాకెంతో ఆనందంకల్గింది. ఉభయ జాతులమధ్య బహుశ ఐక్యత ఏర్పడవచ్చునని కొద్దిగా ఆశ కల్గ

సాగింది. సరే మంచిది, మీరు వెళ్ళండి. 'ఖుర్బానీ' జరగదని మీకు గట్టిగా హామీఇస్తున్నా.

చక్రధరుని కౌగిలించుకుని వీడ్కోలిచ్చాడు ఖ్వాజా మహమ్మూద్. ఇటు తక్షణం ఆవుమెడలోని పలుపు విప్పి వేశారు. అది బ్రతుకుజీవుడా అని నాలుగుకాళ్ళెత్తి పారకా చూపింది. అక్కడచేరినవాళ్ళంతా ఆ యువకుని ధైర్యసాహసాలు మెచ్చుకుంటూ ఇళ్ళకు పోయారు.

చక్రధరుడు వచ్చాడని తెలియగానే గబగబా ఇంట్లోంచి బయటికొచ్చాడు,యశోదానందనుడు. చక్రధరుని కౌగిటచేర్చుకుని "బాబూజీ! ఇవ్వాళ నువ్వు ప్రదర్శించిన ధైర్యసాహసాలుచూచి ముక్కుమీద వ్రేలువేసుకున్నాను. నీతోపోల్చి చూచుకుంటూంటే నన్ను చూచుకుని నాకే సిగ్గుగాఉంది. ఇవ్వాళ మాపరువు-ప్రతిష్టలు మంటగలియకుండా కాపాడావు" అన్నాడు.

చక్రధరుని తీసుకెళ్ళి గదిలో కూర్చోబెట్టాడు,యశోదానందనుడు. అంగలార్చుకుంటూ లోపలి కెళ్ళాడు. తనభార్య భాగీశ్వరిని పిలిచి "ఇదిగో! ఇవ్వాళ నాస్నేహితు నొకని విందుకు పిలిచాను. సువారం ఎంతో చక్కగాఉండాలి సుమా. కాస్త ఒళ్ళువంచి జాగ్రత్తగా చెయ్యి" అంటూ, అహల్యను సంబోధించి "ఇదిగో అమ్మాయీ! ఇవ్వాళ నీ పాకశాస్త్ర పరిజ్ఞానానికి పరీక్షసుమా!" అన్నాడు.

అహల్య:— ముసల్మానులబారి నుండి గోవును సంరక్షించిన మహాశయు డెవ్వరు నాన్నా?

యశో:— అతడే నామిత్రుడు. అతనికేగా విందు చేయాలని చెబుతూంది. ఇక్కడికి కేదో తీర్థయాత్ర పనిమీద వచ్చాడు.

అహల్య:—(భాగీశ్వరితో) అమ్మా! ఆయన్ని కాస్త లోపలికి పిలిపించరాదూ. ఒక్కసారి దర్శనం చేసుకుందాం.

ప్రక్కనే డాక్టరు ఉంటున్నాడు. అతన్ని పిలిపించి చక్రధరుని గాయాలకు కట్టు కట్టించాడు, యశోదానందనుడు. ఒకొక్కరే కాస్సేపటిలో పేటంతా అక్కడికి చేరింది. కొందరు శ్రద్ధాళువులు చక్రధరుని పాదాలను కళ్ళకద్దుకున్నారు.

భోంచేసి అందరూ బైటికెళ్లిపోగానే అహల్యవెళ్ళి గదిఅంతా చక్కగా ఊడ్చి శుభ్రపరచింది. గృహకార్యాల నుండి తీరుబడికాగానే ఒక్కతే కూర్చుని పూలదండలుగుచ్చ సాగింది. మనసులో అనేకఆలోచనలు వస్తున్నాయి, పోతున్నాయి - 'ఈయ నెవ్వరోగాని, ఎంతో సరళస్వభావుడులా కన్పడుతున్నాడు. ఇక సిగ్గువిషయంలో చూస్తే ఆడవాళ్ళను కూడ తలదన్నిఉన్నట్లు కన్పడుతున్నాడు. భోజనానికి కూర్చున్నవాడు లేచేవరకూ మళ్ళీతలెత్తిన పాపానపోలేదు. వాలకం చూస్తే బ్రాహ్మణుడులా కన్పడుతున్నాడు. మొహం చూచి మాత్రం ఎప్పుడూ ఇత నింత సాహసం గల వ్యక్తియని అనుకోలేదు!'

ఆకస్మికముగా భాగీశ్వరి వచ్చి ''అమ్మాయీ! వారిద్దరూ వస్తున్నారు. ఈ చీర విడిచి కొత్తచీర కట్టుకోవే'' అంది.

''ఉఁహూ'' అని ఊరుకుంది అహల్య. నిజంగా ఆమె గుండెల్లో దడ ప్రారంభమయింది. ఒక నిమిషంతర్వాత చక్ర

ధరునితోసహా గదిలోకొచ్చాడు, యశోదానందనుడు. భాగీశ్వరీ అహల్య లిద్దరూ లేచి నిల్చున్నారు. చక్రధరుని తివాసీమీద కూర్చోబెట్టి తాను స్వయంగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. భాగీశ్వరి విసనకర్ర పుచ్చుకుని విసురుతోంటే అహల్య ఏమో పాషాణమూర్తిలా నిలబడివుంది.

అసిరదృష్టితో ఒకసారి అహల్య ముఖంలోకి చూచాడు చక్రధరుడు. కోమల, స్నిగ్ధ, సుగంధమయ జ్యోతి తరంగంవలె తళుక్కుమని కళ్ళలో అంతర్లీనమైనట్టుగా కన్పడింది.

భాగీశ్వరి మిఠాయిపళ్ళెం చక్రధరునిముందు పెడ్తూ "కాస్త ఫలాహారంతీసుకోండి. అన్నమూ సరిగా తిన్నట్టులేదు. మీబోటివీరులు తప్పకుండా మానెడుబియ్యపుఅన్నం తినాలి. మీవంటి బిడ్డనుగన్న తల్లి ఎంత పుణ్యం చేసుకుని పుట్టిందో! అహల్యా! వెళ్ళ గ్లాసుతో కాస్త మంచితీర్థం తీసుకురా, అమ్మా. బాబూ! నువు ఆ సాయిబులముందు కెళ్ళి నిల్చొన్నపుడు ఈపిల్ల దేవుణ్ణి ఎంత వేడుకుందని చెప్పను. ఎన్నిరకాల మొక్కులు మొక్కుకుందని విన్నవించను. ఇదిగో! అమ్మాయీ! ఇప్పుడుదాకా నువు గుచ్చిపెట్టిన ఆదండ ఏదీ? తెచ్చివేయవేం మరి!" అంది.

కంపితహస్తాలతో దండ చక్రధరునిమెడలో వేసింది, అహల్య సిగ్గుతో. "తలకు ప్రమాదమైన దెబ్బ తగిలిందా?" అంది వినీవినపడని కంఠంతో.

చక్ర:—అలాంటి దేమీ లేదే! మున్షీగారు అనవసరం గానే కట్లు కట్టించారు.

చక్రధరుడు ఫలహారం తీసుకొంటున్నాడు. ఇంతలో పనిమనిషి వచ్చి 'ఏమమ్మో పెద్ద కోడలుగారూ! మాఅబ్బాయికి రాత్రినుంచి దగ్గువస్తోందమ్మా. ఏమైనామందుంటే కాస్త ఇస్తారా!'' అంది.

భాగీశ్వరి మందు ఇవ్వటానికి వెళ్ళింది. ఇక్కడ అహల్య ఒక్కతే ఉండిపోయింది. ఆ సమయంలో అహల్య నుద్దేశించి ''నామూలంగా అనవసరశ్రమ కలిగింది. నిజం చెప్పాలంటే ఈ బహూకరణను నే నెంతమాత్రం అర్హుణ్ణి కాను'' అన్నాడు, చక్రధరుడు.

అహల్య:—ఇది బహూకరణ కాదు; భక్తి కానుక.

భాగీశ్వరి తిరిగివచ్చి ముసిముసినవ్వు నవ్వుకుంటూ "బాబూ! అదేమిటీ? పెట్టిన మిఠాయిలో సగమన్నా తినలేదే:? ఈ పిల్లను చూచి ఆకలిదప్పులు కూడ చల్లారిపోయాయా ఏమిటి ఖర్మ! ఔను, ఇది మోహిని అంటోయ్. కాస్త జాగ్రత్తగానే ఉండాలి సుమా" అంది.

అహల్య:—అమ్మా! నీ కొక చిన్నా లేదు పెద్దా లేదు. అందరితోనూ ఒకే రకంగా మాట్లాడుతుంటావు.

చక్రధరుడిక్కడ షుమారొకగంటసేపు కూర్చున్నాడు. ఈలోపల అతని పుట్టుపూర్వోత్తరాలన్నీ అడిగి తెలుసుకుంది భాగీశ్వరి. 'అన్నదమ్ము లెందరు? తోబుట్టువులెందరు! నాన్నగారి కేంపని? తోబుట్టువులకు పెళ్ళి-పేరంటాలు అయ్యాయా, లేదా? వగైరాలు. ఆవిడ ప్రవర్తన ఎంతో మాతృ-వాత్సల్య పూర్ణంగా కన్పడింది, చక్రధరునికి ఏదో పాతపరిచయ మున్నట్టుగా. నాలుగు గంటలు టంగుటంగుమని మ్రోగాయి.

ఖ్వాజా మహమూద్‌గారొచ్చారని తెలిసింది వెంటనే గది లోంచి లేచి బైటికి వెళ్లిపోయాడు, చక్రధరుడు. ఖ్వాజాయే గాక ఇంకెందరో వచ్చారు. చీకటిపడేవరకూ వారందరితో ఏవో సంభాషణలు జరుగుతూనే ఉన్నాయి. చివరకు పంచాయతీ ఒకటి యేర్పాటుచేయాలని నిర్ణయించబడింది. పరస్పరం వచ్చే వివాదాలూ, తగాయిదాలూ అన్నీ దానిద్వారానే పరిష్కారంచేసుకోవాలనికూడా తీర్మానించారు. చక్రధరుడు కూడా అందులో ఒక మెంబరుగా ఎన్నుకోబడ్డాడు. రాత్రి అహల్యా, భాగీశ్వరీ డాబామీద పడుకొనిఉన్నసమయంలో "అహల్యా! నిద్రపోయూవా ఏమిటే?" అని అడిగింది భాగీశ్వరి.

అహల్య:—లేదమ్మా! మేలుకునే ఉన్నా.

భాగీ:—ఔనులే, ఇవ్వాళ మరి నీకు నిద్రెందుకు పడుతుందిలే? సరే గానీ, ఈ అబ్బాయిని పెళ్లిచేసుకుంటావా? చూపించటానికే మీనాన్నగారు ఈయన్ని కాశీనుండి ఇంత దూరం తోడుకొచ్చారు. ఈయనదగ్గర ఇంకొకటి ఉన్నా లేక పోయినా హృదయంమాత్రం తప్పకుండా ఉంది. అదికూడా అందరిలాంటి హృదయం కాదు. అలాంటిది బహు తక్కువ మందిలో ఉంటుంది. ఇలాంటిభర్తను పొంది నీ జీవితం సార్థక మవుతుంది.

అశ్రుపూర్ణనేత్రాలతో భాగీశ్వరి కేసి చూచిందే గాని నోరుతెరచిన పాపానపోలేదు, అహల్య. కృతజ్ఞత శబ్దాలద్వారా శిష్టాచారరూపం ధరిస్తూంటుంది. కాని నేత్రాల్లోంచి బైటికి వస్తూ, కంపిస్తూ, సిగ్గుపడుతూ ఉండేరూపమే దాని (కృతజ్ఞత) మూలరూపం.

# నాలుగో అధ్యాయం

రైలు ప్రయాణీకులు కొందరు మొదటేమో నిలబడటానికి కాస్త చోటివ్వమంటారు. తర్వాత కూర్చోటానికి ఆలోచించుతారు. కడకు కాళ్ళు చాపి చక్కగా పడుకోనేందుకు సన్నాహాలు చేస్తారు. అలాంటి రైలు ప్రయాణీకుల స్వభావంవంటి స్వభావంగలవాడే మున్షీ వజ్రధరుడుకూడా. ఒక పెద్ద ఎస్టేటుదివానుగారికూతురికి కొడుకు చదువు చెప్పటమూ, తాను ఈ బంగారంలాంటి అవకాశంవల్ల లాభం పొందకుండా ఉండటం కూడానా! అది పూర్తిగా అసంభవం. దివానుగారి దర్శనార్థం రాకపోకలు ప్రారంభించాడు మున్షీ వజ్రధరుడు. కబుర్లు చెప్పటంలో తనకు తానే సాటమ్యో. రెండు మూడుసార్లు రాకపోకల్లోనే మంచి ప్రభావం కలుగచేశాడు. ఈ పరిచయం క్రమేణా స్నేహరూపం దాల్చసాగింది. ఒకరోజున దివానుగారితో కలిసి జగదీశపురం రాణిగారికొలువుకు వెళ్ళాడు. ఎంతో చక్కటి, కమ్మని కబుర్లు చెప్పాడు. తను తహశీలుదారుగా ఉన్నప్పుడు చేసిన ఘనకార్యాలను గురించి ఎంతోఘనంగా వర్ణించిచెప్పాడు. అవన్నీ విని రాణీగారెంతో ముగ్ధురాలయింది.

"ఈ మనిషిని పెట్టుకుంటే ఎస్టేటు ఆదాయం పెరగవచ్చు" అని ఒక ఆలోచన కలిగింది. వెంటనే దివానుగారితో కూడ సంప్రదించింది. ఇక్కడేమో అసలు సమస్తం మొదటే పథకంవేసుకొచ్చి కూర్చున్న బాపతయ్యే. ఇంక అభ్యంతర

మేముంటుంది? అతనూ ఒకటికి రెండు కల్పించి చక్కగా మనస్సుకు హత్తుకునేలా చెప్పాడు. మరుసటిరాకలోనే మున్షీకి నెలకు రు 25 ల జీతంతో తహశీల్దారుఉద్యోగం శాంక్షనై కూర్చుంది. మనోరథం ఫలించింది. స్వారీకై గుర్రంకూడ ఒకటి ఇచ్చారు. దాంతో పువ్వుకు తావి అబ్బినట్లయింది.

ఇప్పుడు మున్షీగారిపని రొట్టెముక్క నేతిలో పడిన చందంగా ఉంది. నెలరోజుల్లో ఒక్కరోజుకూడా డిన్నర్లు, పాట కచ్చేరీలూ, సభలూ, సమావేశాలు జరగనిచోట ఇప్పుడు ముఖ్యరోజులూ జరుగసాగాయి. ఇంత పెద్దఉద్యోగికి బ్రాందీ బుడ్లకూ, సారాజాడీలకూ ఏం కొదువ? ఒకప్పుడు ఎస్టేటులో ఎవ్వరికీ తెలియకుండా పదిపన్నెండు సీసాల సారా కాయించి తయారుచేయించితే,ఇంకొకప్పుడు పట్నంలోని ఏ గమళ్ళవాని మీదనో ఆములు-ధూములు చేసి నాలుగైదుసీసాలు ఊరికే కాజేసేవాడు. ఈరకంగా ఏగాణీ ఖర్చులేకుండా కావలసినంత మజా. ఒక గొల్లమనిషిని నౌకరుగా పెట్టుకున్నాడు. దివాను గారింటిదగ్గరనుంచి నాలుగైదు కుర్చీలు తెప్పించుకున్నాడు. పెద్దపెద్ద గొంతెమ్మకోర్కెలేమీ లేవు. ఏదో సామాన్యునిలా జీవితం వెళ్ళమారితే చాలునని ఉంది. ఈ ఉద్యోగం అతని కోర్కెలను చాలవరకు పూర్తిచేసింది. ఐనా ఈ ఉద్యోగం మీద అంతగా నమ్మకంలేదు. ఎందుకంటే ఈ శ్రీమంతుల గుణస్వభావాలెన్నడూ స్థిరంగా ఉండిచావవు. సరే,రాణీగారి తోటి పేచీలులేకుండా బండి చక్కగానే సాగిపోతోందనే అనుకుందాం. ఐతే ఎన్నాళ్ళుముచ్చట! తర్వాత రాజా గారు గద్దెక్కి కూర్చుంటాడు. వెంటనే పాతనౌకర్లందరికీ

చెల్లుచీటీ లివ్వబడతాయి. అంతటి దివానుగారి కేదిక్కు లేనప్పుడు ఇక నాబోటి బోడిదొర లెక్క పత్రమా? ఈరకంగా ఆలోచించి దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకో సాగాడు. కొత్తగా కాబోయే రాజాగారి దగ్గరకు ఇప్పట్నుంచే రాకపోకలు ప్రారంభించాడు. అతనిపేరు విశాలసింగ్. రాణిగారికి మరది, పినమామగారికుమారుడు. అతని తాతలు ఇద్దరన్నదమ్ములు. పెద్దాయన ఎస్టేటుకు యజమాని. అతని కొడుకులూ, మనమళ్ళు రెండుతరాలనుంచీ రాజ్యం అనుభవిస్తూ వస్తున్నారు. ఇప్పుడు రాణిగారికి సంతానం లేనందువల్ల విశాలసింగు పంట పండింది. అతనితాతకు భరణంగా రెండుమూడు గ్రామాలు ఇచ్చారు. వాటినే తాకట్టుపెట్టి యాభై ఏళ్ళనుంచి జీవిస్తూ వచ్చారు. ఆనాటి కానాటికి స్థితి దిగజారుతూవచ్చింది. ఇప్పుడిక పొట్టకు సరిపడ ఆస్తికూడా లేకుండాపోయింది. ఈ స్థితిలో కూడ వంశగౌరవమూ, కులాచారాలూ పాటించటం తప్పనిసరే. విశాలసింగ్ మహారాణిగారి వాటాదారుడు. ఈ హోదాను నిర్వహించాలి. అందుగ్గాను నౌకరూ చాకరూ, బండీ గుర్రం మొదలైనవన్నీ ఉంచుకోవలసివచ్చేది. ఈ రోజువరకూ పరంపరలు పాటించబడుతూ వచ్చాయి. దసరాపండుగవస్తే ఉత్సవాలు ఆర్భాటంగా చేసేవాళ్లు. జన్మాష్టమివస్తే తప్పకుండా ఏదో ఒక అట్టహాసం జరిగితీరవలసిందే.

ప్రాతః సమయం. మాఘమాసం; కీళ్లు పీక్కుతినే చలి. వేడినీళ్ళతో స్నానంచేసి దుస్తులు వేసుకున్నాడు మున్షీజీ. బైట గుర్రం సిద్ధంగా ఉంది. ఎక్కి శివపురం ప్రయాణమై వెళ్ళాడు.

రాజాగారి ఇంటికి చేరుకున్నాడు. ఆ సమయంలో ఆయనగారు ఎండకాగుతూ ఉత్తర మేదో చదువుకొంటూ కూర్చున్నాడు.

"క్షేమమా!" అన్నాడు మున్షీజీ మేజామీద కూర్చుంటూ.

రాజా:—ఆ, భగవంతునిదయవల్ల. దర్బారువిశేషా లేమిటి?

"ఏ మున్నాయి! అన్నీ పాతవిశేషాలే. ఇంతకూ డాక్టర్లు బాగుపడేరోజులొచ్చాయి. రోజుకు ముగ్గురు ముగ్గురూ రావటం. రోజూ మీనా మోసుకెళ్ళేందుకుగాను జగదీశ పురంనుండి బోయీలు దమ్మిడీలేకుండా పట్టుకు రాబడుతు న్నారు. వైద్యుల్ని తీసుకురావటం, మళ్ళీ తిరిగి తీసుకెళ్ళటం వాళ్ళపని" అన్నాడు మున్షీజీ ముసిముసినవ్వుతో.

రాజా:—అన్యాయం, ఘోరఅన్యాయం. అయ్యయ్యో పాపం! చీమల్లా నలిగిపోతున్నారు. ఈ విధానాన్ని ఏ విధంగా కూకటివ్రేళ్ళతోసహా పీకివేయించుతానో మీరే చూస్తారుగా.

మున్షీ:—మీమీద గంపెడంత ఆశతో ఉన్నారు ప్రజలు. మాలమాదిగల నెత్తినా ఈ ఆపదే వచ్చికూర్చుంది. పది పన్నెండుమంది రోజూ వచ్చి గుర్రానికి మాలిష్ చేసి పోవాలి. దీనిమీదట ఎస్టేటులో ఉన్న మాదిగలంతా పంచా యతీ చేసుకున్నారు. అందులో గుర్రపుపని చేసినవాణ్ణి కులంలోంచి వెలివేయాలని నిర్ణయించారని విన్నాను. ఇప్పు డిక రెండే రెండు మార్గాలు — మాదిగలంతా ఎస్టేటు

న్నా వదలి వెళ్ళిపోవాలి, లేదా దివానుగారు జీతమిచ్చి సుక్రపు సౌకర్యసన్నా పెట్టుకోవాలి.

రాజా:—మాదిగలందర్నీ ఎస్టేటులోంచి వెళ్ళగొట్టట మంటే అదేమంత తేలికైనపని కాదు. ఇప్పుడూ వీళ్ళు ఇంకా తాతలనాటియుగమేనని అనుకుంటున్నారు పాపం! ఈదేశం నుండి ఈ పాడు పద్ధతి కేనాడు అంత్యక్రియలు జరుగుతాయో కదా! నేను ఎస్టేటుపద్ధతులన్నీ పూర్తిగా మార్పుచేయిస్తాను. ప్రస్తుతం ఎస్టేటంతా పోలీసుల దుండగాలతో సతమతమై పోతున్నట్టు విన్నాను. నే నసలు పోలీసుల్ని ఎస్టేటులోకి అడుగుపెట్టనీయ ననుకో.

మున్షీ:—ఇక రోడ్లసంగతి వేరుగా చెప్పనవసరమే లేదు. దానిని జట్కాబళ్ళూ, ఎడ్లబళ్ళూ ఒకటేమిటి-ఏబండీ నడిచే సౌకర్యమే లేదనుకోండి.

రాజా:—రోడ్లను మరమ్మతు చేయించటం నా మొదటిపనిగా ఉంటుందనుకోండి. బస్సుసర్వీసు పెట్టిస్తాను. స్టేషనునుండి జగదీశపురం దాకా వెళ్ళటానికెంతో సౌకర్యంగా ఉంటుంది. ఎస్టేటులో లక్షలయకరాల్లో చెరకు పండుతున్నది. ఒక పంచదారమిల్లు పెట్టించాలనిఉంది. ఏవో కోతలుకోస్తున్నా నని అనుకోకండి. ఎస్టేటులో రామరాజ్యం స్థాపించుతాను. సరే, మంచిది; కాని మరి ఏ మార్వాడీతోనన్నా మాట్లాడారా ?

మున్షీ:—ఒక్కడితో ఏమిటి? అనేకమందితో మాట్లాడాను. వాళ్ళంతా ఎంతో సంతోషంగా డబ్బివ్వటానికి

సిద్ధంగా ఉన్నారు. పెద్దగా కోర్కెలూ ఏమీలేవు. ఏదో ఒక గ్రామం కాస్త తాకట్టుపెడితే చాలు నంటున్నారు.

రాజా:—అయితే వద్దులెండి. ఎవ్వడికైనాసరే నా మీద నమ్మకముంటే డబ్బుఇవ్వమనండి. అంతేగాని ఎస్టేటులో చివరకు ఒక అంగుళంమేర భూమి కూడ తాకట్టుగా ఉంచ జాలను. ఈషరతుమీద ఏమూర్ఖ్వాడీ డబ్బివ్వటానికి ముందుకు రాడని నాకు మొదటే తెలుసు. వీళ్ళదంతా అతితెలివి. వీళ్ళపేరెత్తితేనే నా ఒళ్ళు భగభగమండుతూంటుంది. నా చేతిలో పనైతేనా వీళ్ళను ఫిరంగి గుళ్ళతో ఎగరగొట్టించనూ వీళ్ళమూలంగానే నేడు నాకీ దుస్థితి కల్గింది. ఈ నర - పిశాచాలు మూలిగలు పీల్చివేశాయి. నాన్నగారు తెచ్చింది మొత్తం ఏడువేలు. దానికి యాభై వేలయి కూర్చున్నాయి. ఇప్పుడు రెండులక్షలకూడా రానటువంటి గ్రామాలు మూడు వేలంవేయబడ్డాయి. నాన్నగారు చనిపోతూ పోతూ 'రుణంజోలికి పోకురా' అని అంతిమసందేశ మిచ్చిపోయారు. నిజంగా ఈమనోవ్యాధితోనే ఆయన భౌతికదేహంచాలించారు.

ఇక్కడింకా ఈ విధమైన సంభాషణలు సాగిపోతూనే ఉన్నాయి. ఇంతలో రాణివాసంలోనుండి ఏదో గల్లంతు విన పడింది. ఎవరో కొందరు స్త్రీలు సంకులసమరంచేస్తున్నట్టుగా కన్పడింది. వాళ్ళకర్ణకఠోరవాక్యాలు విని వ్యాకులపడిపోయాడు రాజా. క్రోధమూర్తిలా కన్పడ్డాడు. ముఖం నల్లబడిపోయింది. అతని జీవితాన్ని అతిమిక్కుటంగా పీల్చిపిప్పిచేస్తున్న సంసార బాధ ఇదొక్కటే. అతనిగుండెల్లో నిత్యం గుచ్చుకొని వేధించు తున్న ముల్లు ఇదొక్కటే. పెద్దభార్య వసుమతి, గర్వానికి

పుట్టినిల్లు. వీసమెత్తుమాట కూడా సహించలేదు. కోడళ్ళమీద అత్తచేసినట్టుగానే తన సవతులమీద పెత్తనంచేస్తుంది.

రెండో ఆవిడ రామప్రియ. జగదీశపురం రాణిగారి సొంత చెల్లెలు. కరుణామూర్తి. వినయవిధేయతలకు పుట్టినిల్లు. మంచి ఆలోచనాపరురాలు; మధుభాషిణి; కోమలాంగి. కోమల హృదయినికూడా. ఇంట్లో అసలు ఉండటమే లేదన్నంత శాంతంగా ఉంటుంది. పుస్తకప్రేమ మెండు. ఎప్పుడూ ఏదో ఒకటి చదువుతూ వ్రాస్తూ కూర్చుంటుంది. ఎవ్వరిజోలికీపోదు. ఒకరితోపొత్తు ఆట్టే ఉంచుకోదు. ఒకరి దగ్గర ఏమన్నా తేవటం గానీ, ఒకరికి ఏమన్నా ఇవ్వటంగానీ ఏమీఉండదు. ఒకరిపట్ల వైరమూ లేదు, ఇంకొకరిపట్ల ప్రేమా లేదు.

మూడో మహాతల్లి పేరు రోహిణి. ఈవిడయెడల రాజాగారికి ప్రత్యేక ప్రేమాభిమానాలు. ఆవిడా అతనికి ప్రాణము కవత్తుగా పరిచర్యలు చేస్తూంటుంది. ఈవిడలో ప్రేమఎక్కువో లేక మాయ ఎక్కువో నిర్ణయించట మంత తేలికగాదు. రాజాగారు సవతులతో మాట్లాడటంకూడాచూచి ఓర్వలేని ముద్దుల రాణి. వసుమతి కఠోరహృదయురాలైనప్పటికీ మలిన హృదయురాలుమాత్రం కాదు. మనస్సులోఉన్నదే నోట్లోనూ ఉంటుంది. కాని రోహిణి ద్వేషాన్ని చక్కగా పోషిస్తూంటుంది పక్షి గుడ్డును పొదిగినట్టుగా.

రాజాగారు చరచరా లోనికెళ్ళి వసుమతి నుద్దేశించి "నువ్వసలు కొంపలో ఉండనియదలచావా లేక వెళ్ళగొట్ట దలచావా! సిగ్గూ - ఎగ్గూ అనే దేమీ లేకపోయింతర్వాత ఈ జన్మ దేనికి? అబ్బబ్బ! ఎప్పుడుచూచినా ఒకటే రామ-

రావణ యుద్ధమయ్యో. విని విని గుండెలకు తూట్లుపడిపో తుంటేనూ !" అన్నాడు.

వసు:—కర్మ కర్తవు నీవైనపుడు కర్మఫలం అనుభ వించే దింకెవ్వ రేమిటి?

రాజా:—అందుకని విషంపెట్టి చంపు. ఈ రకంగా కాల్చి, మాడ్చి చంపటం దేనికి? వచ్చేలాభంమాత్రమేముంది!

వసు:—ఆ మహారాణిగారు అంత చేతులు చచ్చి కూర్చొని ఉందనా ఏమిటి ఇలా వత్తాసుగా బయలుదేరారు!

రోహి:—నీఅడుగులకు మడుగులొత్తుతూ కూర్చొ మంటే కూర్చుంటూ, లేవమంటే లేస్తూ ఉండాలని నీకు మనసులో కోరికగామాలు. ఐతే నే నొచ్చి నీ వ్యూళ్ళో, నీ జాగాలో కొంపకట్టు కేమీ ఉండటంలేదులే.

రాజా:—ఇంతకూ అస లెందుకొచ్చిందో, ఏంగొడవో, ఏం బూడిదో కాస్త తెలిస్తేనా?

రోహి:—ఏం గొడవ ఉందేమిటి? రోజూఉండేగొడవే ఇవ్వాళానూ. తలకు కాస్త నూనె రాయమని 'హిరియా' దాసీతో అన్నాను. అది వచ్చేమో నూనెరాస్తోంది. అది చూచింది ఇంటి యజమానురాలుగారు. ఇంకేముంది?అబ్బో! కొలిమిలో కాలిన ఇనుపముక్కలా ఎఱ్ఱబడిపోయింది. కత్తి తీసుకుని బయలుదేరింది. గబగబా వచ్చి ఆనూనెరాసేదాన్ని చెయ్యిపట్టుకుని లాక్కుపోయింది. ఆ హిరియా ఆవిడకొక్కర్తె కే దాసీయో లేక నాకూడ దాసీయో ఏమిటో తేల్చి చెప్పాలి ఇవ్వాళ మీరు.

వసు:—ఆయ నేమిటి తేల్చేదీ? ఇదిగో నేనే తేల్చి చెబుతా వినవే. 'హీరియా' నా పుట్టింటిదగ్గరనుంచి నావెంట వచ్చింది. అందువల్ల అది నా సొంతదాసీ. దానిమీంద ఇంకె వ్వరికీ పెత్తనం లేదు.

రోహి:—ఇదిగో వింటున్నారుగా మీరు. 'హీరియా' మీద ఇంకెవ్వరికీ పెత్తనంలేదట. అది ఈబిడగారి సొంత ముల్లెట.

రాజా:—ఈ ఇంట్లో ఉన్నంతకాలం 'హీరియా' అందరికీ దాసియే. అందరిపనులూ చేయవలసిందే.

ఈ మాటలు వినేటప్పటికి వసుమతికి ఒంట్లోనుంచి అగ్గిమంటలు గుబగుబమని ఎగేసుకొచ్చాయ్. నాగుబాములా బుసలుకొట్టుకుంటూ "ఇక్కడ ఆవిడదే రాజ్యమన్నట్టుగా ఇప్పుడు మీ ప్రియురాలుగారిపక్షాన డిక్రీ ఇచ్చారు. ఇంత న్యాయమూర్తులు కాబట్టే సంతానంమొఖం చూడ్డానికి మొహంవాచిపోతున్నారు" అంది.

రాజాకు ఈ మాటలు వాడిబాణాల్లా వెళ్ళి తాలాయి. మారు చెప్పకుండా బైటికి వెళ్ళిపోయాడు. కొంచెంసేపు విశ్శేష్టుడై, మర్మాహతుని పగిది కూర్చొనిపోయాడు. వసుమతి ఇంత పెళసరి మనిషి అని ఇవ్వాళనే తెలిసింది. ఏదో ఎత్తిపొడుపుమాట అనటమే ముఖ్యోద్దేశ్యమైతే బాధాకరమైన ఇంకేమాటన్నా అని ఉండేది. ఆవిడ కొట్టగలిగిన దెబ్బల్లో ఇది అతికఠోరప్రహారం. ఛీ, ఇలాంటి ఆడదాని ముఖం చూడటం కూడ తప్పే."

అకస్మాత్తుగా అతని కేదో స్ఫురించి మున్షీజీతో "ఏ జ్యోతిష్కుడైనా తెలిసిఉంటే దయఉంచి నాదగ్గర కొకసారి పంపండి. ఆయనతో కొద్దిగా సంప్రదించవలసిఉంది" అన్నాడు.

మున్షీ:—ఇవ్వాళనే పంపిస్తాను. జ్యోతిష్కుల కేం కొదవ! ఒకరికంటె ఒకరు మించినవాళ్లున్నారు. నన్ను పరాయివాణ్ణిగా భావించకండి. ఎప్పుడేం అవసరమైతే అప్పుడు నాకు తక్షణం కబురుచేయండి. కాళ్ళు నెత్తినపెట్టుకుని పరుగెత్తుకొస్తాను. మహారాణిగారిని చూచినట్టుగానే మిమ్మల్నీ చూస్తాను!

రాజా:—మీయందు నా కెప్పుడూ ఇలాంటినమ్మకమేఉంది. రాణిగారి విషయాలూ, క్షేమ-సమాచారాలూ కూడ త్వరత్వరగా పంపిస్తూఉండండి. అక్కడ నాకు మీరు తప్ప ఇంకొకరెవ్వరూ లేరు. మీమీద నాకు పూర్తిగా నమ్మకముంది ఏ వస్తువూ బెసక్కుండా ఒకకంటితో కనిపెట్టుకు ఉండండి. స్నేహబృందం నెమ్మది నెమ్మదిగా గుటకాయస్వాహా అంటారేమో కాస్త జాగ్రత్తగా చూస్తూఉండండి.

మున్షీ:—ఈ విషయంలో నిశ్చింతగా ఉండండి. అన్నీ ఒకకంట చూస్తూనే ఉంటానుగా.

రాజా:—రాణిగా రెక్కడెక్కడ ఎంతెంత సొమ్ము తెచ్చిందో కూడా కాస్త ఆరాతీయండి.

మున్షీ:—అర్థమయిందిలెండి. ఇదెంతపని? అతితేలిగ్గా తెలుసుకోవచ్చు.

రాజా:—ఇప్పుడావిడకు వంటచేసేదెవ్వరోకూడ కాస్త తెలుసుకోండి.

రాజాగారి మనోభిప్రాయం పసికట్టి దృఢంగా "మహా రాజా ! క్షమించండి. మీ దాసుణ్ణి; రాణిగారికీ దాసుడనేగాని శత్రువునుమాత్రం కాను. మీ రిద్దరూ ఆడ - మగ సింహా ములవలె పోట్లాడుకోవచ్చు. గుంటనక్కలా మధ్యలో స్వార్థం కొరకు వచ్చి దూరటం నాకు భావ్యంకాదు. పైగా అవమాన కరంగా భావిస్తున్నా. అటు రాణిగారి కేమీ అనిష్టం వాటిల్ల కుండా ఉన్నంతవరకే మీకూ సేవకునిగా ఉండగలను. నాదే ముంది ! మీ ఉభయగుమ్మాల్లో బిచ్చగాణ్ణి.

రాజా లోలోపల సిగ్గుపడ్డాడు. దాంతోపాటు మున్షిజీ యెడ విశ్వాసమూ ఇనుమడించింది. మాట మార్చి, ఏదో సర్దుబాటుగా "కాదు కాదు; నా అభిప్రాయాన్ని మీరు సరిగా గ్రహించలేదు; మరొకవిధంగా అర్థంచేసుకొన్న ట్లు న్నారు. ఛీ! ఛీ!! ఇంత నీచుడ ననుకొన్నారా?" అన్నాడు.

రాజా కల్లబొల్లి కబుర్లు చెప్పటానికైతే చెప్పాడు. కాని ఆ మాటలు సరిగ్గా అతకలేదని స్వయంగా గ్రహించాడు కూడా. తన సిగ్గును మరుగుపరచగలందులకై వార్తాపత్రిక తిరగవేయసాగాడు. ఇంతలో హీరియా వచ్చి "తాతగారూ ! వెళ్ళేటప్పు డొకసారి వచ్చి వెళ్ళమని యజమానురాలుగారు చెప్పిరమ్మన్నారు" అంది మున్షిజీతో.

"ఇంత శీఘ్రంగా చెప్పటానికి పాచిపోయిన సంగతు లేమి టేమిటి? ఇప్పటికే ఆలస్యమైపోయింది. పనిపాటలులేకుండా కూర్చుని ఆడవాళ్ళమొర లాలకించటానికిక్కడే సోమరి పోతులు కూర్చున్నారు? పో, వెళ్ళు" అన్నాడు, రాజా గర్జిస్తూ.

ఇలా అని లేచి నిలబడ్డాడు రాజాగారు మున్షీగారిని సాగనంపుతున్నట్టు. వసుమతికి అతనితో మాట్లాడే అవకాశం కల్గనీయటం ఇష్టంలేదు. మున్షీజీకూడ వివశుడై "ఇక సెలవిప్పించండి" అన్నాడు.

మున్షీజీ అక్కడనుంచి బయలుదేరాడు. రాజాగారు తనమీద కోపంగా లేరుగదా యని ఒకసందేహం మనస్సులో పట్టుకు వేధించసాగింది. తా నేమీ చెడు చేయలేదుగదాయని మరొకప్రక్కన సంతృప్తిగానూ ఉంది. ఈరకంగా ఆలోచించి మరింత ఒయ్యారంగా వెళ్లి గుర్రమెక్కి కూర్చున్నాడు. గాలిలో ఎగిరిపోతున్నట్టుగా ఆనందపరవశుడై ఉన్నాడు. అతని అంత రాత్మ ఇంత ఆత్మగౌరవోన్మాదంలో ఎన్నడూ మునిగితేల లేదు; మానసిక చింతలను ఇంతతృణప్రాయంగా అత డెన్నడూ భావించలేదు.

## ఐదో అధ్యాయం

చక్రధరుని కీర్తి అతనికన్న ముందే బెనారస్ చేరింది. అతని మిత్రులూ, తదితర ప్రజానీకం అంతా అతని దర్శనార్థం కుతూహలంతో ఉన్నారు. ఐదోరోజున అతను ఇంటికిచేరు కోగానే పలకరించిపోవటానికీ, ధన్యవాదాలర్పించటానికీ వచ్చే పోయే జనాని కంతు లేదు. పట్నంలోని శిష్టసమాజమంతా అతన్ని ముక్తకంఠంతో ప్రశంసించుతోంది. చక్రధరుడు గంభీర స్వభావుడే అయినా, స్వయశోగానం అతని కెంతో ఆనందాన్ని కలుగచేస్తోంది. లోకమంతా చక్రధరుని వేనోళ్ళకొనియాడు

తూంటే, ఇటు వజ్రధరునికి తనకొడుకు తెలివితక్కువతనంపట్ల కోపం పడదోసుకొస్తోంది. అసలు వాడిముఖంచూడటమే పాప మన్నంతకోపంతో ముఖానికి ముసుగదీసుకొని కూర్చున్నది తల్లి.

సాయంకాలం చక్రధరుడు యథాప్రకారం మనోరమ ఇంటికి వెళ్ళాడు. పరుగులు తీస్తూ బొక్కెనతో నీళ్ళు తెచ్చి తోటంలో మొక్కలకు పోస్తోంది మనోరమ. నీళ్ళుచింది బట్ట లన్నీ ముద్దముద్దగా తడిసిపున్నాయి. చక్రధరుడు కంటికగపడ గానే నీళ్ళబొక్కెన అవతలపారేసి ఒక్కగంతులో అతనిదగ్గర కొచ్చిపడింది. "ఎప్పుడొచ్చారండీ? పత్రికల్లో రోజూ స్థానిక వార్తలు జాగ్రత్తగా చూస్తూఉండేదాన్ని. 'ఇక్కడి కెప్పు డొస్తారా; ఎప్పుడు సన్మానం చేద్దామా?' అని ఓ ఆరాటపడి పోతుండేదాన్ని. నిజంగా మీరేగనక ఆసమయానికి అక్కడ లేకుండాఉంటే తప్పక దెబ్బలాట జరిగిఉండేది. క్రోధోన్మత్తులైఉన్న ఆ మహమ్మదీయులముందు కెళ్ళటానికి మీ కసలు కవ్వంతకూడ జంకుగానీ, శంకగానీ ఎలా లేకపోయిం దండీ?" అంది మనోరమ.

చక్రధరుడు కుర్చీలో కూర్చుంటూ "శంకాలేదు, జంకూ లేదు. ఆ సమయంలో 'కుర్బానీ' జరగకుండా ఆపాలన్న పిచ్చి ఒక్కటీతప్ప మనస్సులో ఇంకో ఆలోచనే లేదు. మహమ్మదీయులను అనవసరంగా దూషించుతుంటారు. కాని దెబ్బ లాటలంటే హిందువుల కెంత భీతిగా ఉంటుందో వాళ్ళకూ అంతే భీతిగా ఉంటుందని నొక్కి చెప్పగలను. శాంతినికోరే విషయంలో వాళ్ళూ హిందువులకేమీ తీసిపోరు" అన్నాడు.

మనో:—మతావేశంతో పిచ్చెక్కి-ఉన్న ఆ మనుష్యుల ముందు జంకూ గొంకూ లేకుండా నిశ్చలంగా నిలబడ్డా రన్న వార చదివినపుడు నా రోమాలు గగుర్పొడిచాయంటే నమ్మండి. నేనే గనక ఆ సమయంలో అక్కడ ఉండిఉంటే మిమ్మల్ని బలవంతంగా చెయ్యిపట్టుకుని తప్పక లాక్కొచ్చే దాన్నే ననుకోండి. సరే, ఆ విషయా లలా ఉంచి, ముందు పెళ్లి కుమార్తెగా రేం మాట్లాడిందో కాస్త సెలవీయండి. (ముసి ముసినవ్వుతో) మీరుమాత్రం పెదవి విప్పినపాపానపోయి ఉండ రనుకుంటా. సిగ్గుతో మెదలకుండా తలవంచుకుకూర్చొని ఉండిఉంటారు.

"ఔను, మనోరమా! యధార్థంగా అలాగే జరిగింది. ఏం మాట్లాడాలో ఏమిటో నా కసలుఅర్థమే కాలేదు. ఆవిడన్నా ఒకటి రెండుసార్లు ఏదో ము కసరిగా మాట్లాడసాహసించింది గాని, నాకుమాత్రం దమ్ములే కపోయాయి" అన్నాడు, చక్ర ధరుడు సిగ్గుతో తలవాల్చి.

మనో:— మిమ్మల్ని చూచి చాలా ఆనందపడి ఉండొచ్చు ననుకుంటా.

చక్ర:— (సిగ్గుపడి) ఒకరిఅంతఃకరణంలోని అంత రార్థం నాకేం తెలుసు?

"ఎందుకులెండి? అంతా దానంత టదే తెలుస్తుంది లెండి. మీరు నాదగ్గర చెప్పటానికి సంకోచిస్తున్నారు. మరుగుపరు స్తున్నారు లెండి. ఎంత అంతరార్థంసంగతి తెలియకపోయినా కనీసం కోర్కెసంగతన్నా తెలిసేఉంటుంది. పిల్లకోర్కెకు వ్యతిరేకంగా చేయబడే వివాహం నిజంగా వివాహమే కాదని

నా దృఢాభిప్రాయం. మరి, మీ అభిప్రాయమో?" అంది మనోరమ ఎంతో అమాయకంగా.

గొప్ప సందిగ్ధంలోపడిపోయాడు చక్రధరుడు. మనోరమతో ఈరకమైన సంభాషణకు సంకోచంగావుంది. ఖర్మం చాలక ఎక్కడన్నా దివానుగారికి తెలియటమో లేక ఈ అమాయక మనోరమయే స్వయంగా వెళ్ళి, చెప్పటమో జరిగితే కొంపమునిగిపోతుంది. తనకుమార్తెకు సాంఘిక విప్లవ భావాలు బోధిస్తున్నానని అభిప్రాయపడ్తాడేమోనని భయంగా ఉంది. దివానుగారు ఎలాంటిభావాలుగల వ్యక్తియో అతని కేమీ తెలియదు. ఔను, ఆయనగారి గ్రంథాలు చూచి అతడు పౌరాణికమతభక్తుడనిమాత్రం కొంత తెలుసుకోవచ్చు. తలవాల్చి మనోరమతో "మనోరమా! మనసంఘంలో ప్రేమాభిలాషలు వివాహానికి పునాదులు గావు. మతకర్తవ్యాలే దానికి పునాదులు ఇచ్ఛ స్థిరముయినవస్తువు కాదు; చంచలమైనది. క్షణక్షణం మారుతూవుంటుంది. కర్తవ్యం స్థిరమైంది. అందులో మార్పులకు తావులేదు" అన్నాడు చక్రధరుడు.

హఠాత్తుగా లోపలినుంచి ఎవరివోగాని, పురుష వాక్యాలు వచ్చి చెవినిపడ్డాయి. ఆతర్వాత 'లొంగీ' ఏడ్పు వినవచ్చింది. "అరే! ఇది లొంగీఏడ్పు లాగుందే. ఏడుస్తోం దెందుకు?" అన్నాడు చక్రధరుడు.

మనో:— ఔనండీ మా అన్నగారి నెప్పుడూ చూడలేదనుకుంటా. అతనిపేరు గురుసేవకసింగ్. కొన్ని నెలలయింది—ఎస్టేటుపనిమీద గ్రామాల్లో తిరగటం మొదలుపెట్టి. అవటానికి నాకు సొంతఅన్నే అవుతాడు. చదువుసంధ్యలు బాగా

నేర్చినవాడే. కాని, పెద్దమనిషితరహా అనేది పగలుగోసమూ వినా ఎక్కడా కన్పించదు. ఇంటి కొచ్చినప్పుడల్లా అకారణంగానే లాంగీఅమ్మతో ఏదో ఒక లడాయి వేసుకొంటూంటాడు. వీడి కసలు ఆమెజో లెందుకో తెలియదు.

ఇంతలో గురుసేవకసింగ్ చింతనిప్పుల్లా కళ్లుచేసుకుని వాకిట్లోకొచ్చాడు. మనోరమ నుద్దేశించి నాన్నగా రెక్కడికెళ్ళారు? ఎంతసేపటి కొస్తారో చెప్పగలవా? ఇవ్వాళే సమస్తం తేల్చుకోదలిచాను" అన్నాడు గురుసేవకసింగ్.

చక్రధరుడు ఎదురుగా కూర్చొనిఉండటం చూచి, కొద్దిగా సంకోచపడ్డాడు గురుసేవకసింగ్. నెమ్మదిగా మళ్ళీ లోపలికి దూసుకుపోవా లనుకుంటున్నాడు. ఇంతలో ఏడుస్తూ వచ్చి, చక్రధరునిదగ్గర నిలబడింది లాంగీ. "బాబుగారూ, ఈ ముసలితనంలో ఎక్కడికి పోవాలో మీరే కాస్త ఈయనగారికి చెప్పండి. ఈ ఇంట్లో ఇన్నేళ్ళు గడిపాను. ఇప్పుడు పోయి ఎవరి గడపత్రొక్కను? ఈయనగారికి నా రొమ్ముపాలు త్రాగించి, పెంచి పెద్దవాణ్ణి చేశాను. అమ్మగారికి పాలుండేవి కావు. ఇప్పుడు నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టాలని నడుంబిగించి కూర్చున్నాడు," అన్నది చక్రధరునితో.

ఈ గృహకల్లోలాన్ని గురించి చక్రధరుని ఎదుట చెప్పటం గురుసేవకసింగుకు తలకాయనొప్పిగా ఉంది. కాని, లాంగీ అతన్ని పెద్దమనిషిగా ఎన్నుకోటానికి సంకోచించక పోవటం చూచి, తానూ ధైర్యపడ్డాడు. చక్రధరు నుద్దేశించి "ఏమండీ! మీరు దీ న్నొకమాట అడగండి. ఇది ఇప్పుడు మూడుకాళ్ళముసలమ్మయి కూర్చుంది. రేపో మాపో చావటా

నికి సిద్ధంగా ఉంది. ఇప్పుడిక సంసారంగొడవలు వొదిలి, ఏ పుణ్యక్షేత్రానికో పోయి, మిగిలిన పాపపుజీవితం 'కృష్ణా, రామా' అంటూ గడిపితే తప్పేముంది? ఔను, ఎందు కెళ్తుంది? కాటిమీద పెట్టేదాకా ఇంకా ఇంట్లో పెత్తనం వెలిగించాలనిఉంటే. సాన్నగారి ఏళ్లేమో అరవై దాటిపోయాయి. ముసలితనం వచ్చేటప్పటికి ఉన్న మతికాస్తా చంకనాకిపోయింది. ఇది మంచీ, ఇది చెడ్డ, ఇది మర్యాద, ఇది అమర్యాద అన్నమాటే లేకుండాపోయింది ఆయనగారిమీద ఇది ఏం మోహినీమంత్రం ఊదిందో ఏమో నాకు తెలియదు. దీన్ని వెంటేసుకుని నా మీదికి యుద్ధానికి కాలుదువ్వుతూంటారు. ఇవ్వాళ దీన్ని ఇంట్లోంచి బైటికి గెంటించి తీరాలని గట్టిగా నిశ్చయించుకునే వచ్చాను. ఇంకో ఇంటికన్నా పోయిఉండాలి, లేదా ఏ తీర్థక్షేత్రానికన్నా వెళ్లిపోవాలి. అంతేగాని, మా ఇంట్లో మాత్రం ఉండటానికి వీల్లేదు" అన్నాడు గురుసేవకసింగ్.

లౌంగీ:—అలాగా! ఐతే చెప్తా విను. యజమానిగారు జీవించిఉన్నంతకాలమూ లౌంగీకూడ ఈ ఇంట్లోనే తప్పకుండా ఉంటుంది; ఇప్పు డున్నవిధంగానే ఉంటుంది. ఆయనగారు పోయింతర్వాత అంటావా, అప్పుడే కొండ వచ్చి విరిగిపడ్డా అనుభవిస్తాను. ఇల్లొదిలి బైటఉండటానికి నేను దాసీదా న్నేమీ కాదని గుర్తుంచుకో. వెళ్లిపోయి బైటఉండమని అనటానికి నీకు నోరెలావచ్చింది! సిగ్గెందుకు లేకపోయింది? అగ్గిచుట్టూ నాలుగుసార్లు ప్రదక్షిణం చేసినంతమాత్రంచేతనే పెళ్ళయిపోయినట్టు కాదు. యజమాని కెంత సేవ చేశానో, ఇప్పుడూ చేయటానికి సిద్ధంగా ఉన్నానో, ఆ సేవ ఏతాడుగట్టిన

ఆడది చేస్తుందో చెప్పు? తెచ్చావుగా నువ్వూ ఒక అమ్మ గార్ని! లేచి చెంబుడునీళ్లు తెచ్చిఇచ్చినపాపాన పోయిందా? పెళ్ళిపేరిటనే ఏ ఆడది ఇల్లాలు కాజాలదు. నిజమైన ప్రేమ, సేవలద్వారానే ఎవరైనా ఇల్లాలని సార్థకం చేసుకోగలదు."

ఇలాఅని లోపలికివెళ్ళిపోయింది లాంగీ.తలవాల్చి ఇద్దరి మాటలూ మెదలకుండా వింటోంది మనోరమ. లాంగీఅంటే పడిచస్తుంది. దానియెడల నిజంగానే ప్రేమ ఆమెకి. మాతృ వాత్సల్య సుఖమనేది ఏమన్నా ఉంటే, నిజంగా అది లాంగీ ద్వారానే లభించింది మనోరమకు. పసిపాపగానే వొదిలి, సుర పురికి కేగింది మనోరమ తల్లి. అప్పటినుంచీ లాంగీయే సాకుతూ వచ్చింది. ఆ మేలును మనోరమ ఎన్నడూ మరువజాలదు. ఇప్పుడూ మనోరమ అంటే లాంగీ ప్రాణాలిస్తుంది. ఈ కార ణంవల్ల గురుసేవకసింగు నిర్దయతా స్వభావం మనోరమ కెంతో నీచంగా కన్పడింది.

హఠాత్తుగా జోడుగుర్రాలబండిచప్పు డయింది. ఠాకుర్ సాహెబ్ (దివాను)లోపలికొచ్చాడు. గురుసేవక సింగు ఆయన్ను వెంబడించాడు. ఏ కాస్త అవకాశం దొరికితే వెంటనే నాన్నగారిచెవుల్లో లాంగీ ఏమన్నా ఊదుతుం దేమో నని అతనిభయం.

అతను వెళ్ళిన అనంతరం "ఈ నాలుగైదు రోజుల్లో నువ్వుచేసిన పనేమిటో ఇలా చూపించు" అన్నాడు చక్ర ధరుడు మనోరమతో.

మనో:—నే నసలు పుస్తకం ఎలా ఉంటుందోకూడా చూడలేదు. మీరు లేనప్పుడు నా కసలు ఏంచేయటానికీ మన స్కరించదు. ఇం కెప్పుడూ ఎక్కడికీ వెళ్ళకండి.

చక్రధరుడు మనోరమ ముఖంలోకి చూచాడు. ఆవిడ కళ్లు కన్నీటిమయమై ఉన్నాయి: 'ఆహా, ఈ బాలికహృదయం ఎంత సరళం, కోమలం! ఎంత ఉదారహృదయమోకదా !''

# ఆరో అధ్యాయం

మున్షీ వజ్రధరుడు విశాలసింగ్ దగ్గరనుంచి తిరిగి వచ్చి, అతన్నిగురించి కొండంతలుగా వర్ణించి చెప్పాడు. ఈ పొగడ్తలు విని, చక్రధరుని మనస్సులో విశాలసింగ్‌పట్ల ఒక రకమైన పూజ్యభావం ఏర్పడింది. ఆయన్ని దర్శించటానికి వెళ్ళాడు. సేవాసమితి రాజపోషకులలో ఆయనగారిపేరు వ్రాసుకున్నాడు. తదాదిగా రాజా విశాలసింగు ప్రతి సమా వేశంలోనూ, ప్రతిసభలోనూ పాల్గొనసాగాడు. ఈసారి ఆయన గారి ఇంటిదగ్గర జరిగిన కృష్ణాష్టమి ఉత్సవాల్లో తన అనుచర బృందంతో సహా వెళ్ళి పాల్గొన్నాడు చక్రధరుడు.

రాజాగారు పరమ కృష్ణభక్తుడు. కృష్ణాష్టమిపండుగ ఎంతో వైభవోపేతంగా జరుపుతూంటాడు. పండుగల విష యంలోకూడా అతని భార్యలకు విభేదాలుండేవి. రోహిణి కృష్ణోపాసకురాలైతే వసుమతి రామభక్తురాలు; ఆమె శ్రీరామనవమి చేయించుతూంటుంది. ఇంక రామప్రియకు

రాముడూ లేడు, కృష్ణుడూ లేడు. వ్రతాలు పండుగలజోలికే పోదు ఆమె.

ఇటు పొద్దుపోకింది. అటు వాకిట్లో మండపం, తోరణాలు వగైరాల యేర్పాట్లు ప్రారంభమయ్యాయి. చక్రధరుడు తన మిత్రబృందంతో సహా ఈ అలంకరణ కార్యాల్లో నిమగ్నుడై ఉన్నాడు. గాయకబృందం వచ్చి ఆసీనులయ్యారు. గాన - వాయిద్యాలు ప్రారంభం కానున్నాయి. ఇంతలో రోహిణీ - వసుమతుల మధ్య కీచులాటకు విఘ్నేశ్వరపూజ జరిగింది. ఈ సన్నాహాలన్నీ చూస్తుంటే వసుమతికి ఒళ్ళంతా చీమలు ప్రాకినట్టుగా ఉంది. రోహిణిమాత్రం తక్కువ తిన్నదా యేమిటి? వసుమతి రామనవమి చేసుకొంటూంటే, అసలు తనకేమీ సంబంధం లేనట్టుగానే ఉండేది. విశాలసింగూ పట్టీపట్టనట్టుగా వ్యవహరించేవాడు. వసుమతికి అతని ఈ ప్రవర్తన పక్షపాతయుక్తంగా కన్పడేది. అందువల్ల ఇప్పుడిదంతా చూచి, వసుమతి లోలోపల మండిపోతున్నది. అటు రోహిణికూడా షోడశ శృంగారాలు చేసుకుని కూర్చుని, పిండివంటలు తయారు చేయించుతోంది. రోహిణీదేవి ఈ చేష్టలు చూచి, వసుమతికి పాములూ, జెర్రులూ ప్రాకినట్టుగాఉంది. దీనిలో యేదో ఒక విఘ్నం కలుగచేయాలని దుర్బుద్ధిపుట్టింది. ఆలోచించగా ఆలోచించగా చివరి కొకఉపాయంతోచింది. దాసీని పిలిచింది. రోహిణిదగ్గరకెళ్లి ఇలాచెప్పిరమ్మనమంది - "వంటపాత్రలన్నీ వెంటనే ఖాళీచేసి ఇవ్వమను. రెండుపళ్ళేలూ, రెండుతపేలాలూ, బూరెలమూకుళ్లూ, పెద్దగిన్నెలూ సమస్తం ఇవ్వమను. తెల్లవార్లూ ఉత్సవాలు జరిగితే అప్పటిదాకా శక్క

డెవరు గుడ్లు తెరచుకొని కనిపెట్టుకుకూర్చుంటా రేమిటి ? కూడూ నీళ్ళూ లేకుండా తెల్లవార్లూ ఎవరుచస్తారు ?" ఆవిడ చెప్పినవిధంగానే వెళ్ళి చెప్పింది దాసీది. కోడలితాచులా బుస్సు మంటూ "అలాగా, ఇవ్వాళ ఇంత పెండలకడనే ఆకలిచంపుకు తింటూంచా ? రోజూ రాత్రి సగం పొద్దుపోయేదాకా కూర్చున్నమనిషి కూర్చున్నట్టే ఉండేదిగా. ఇవ్వాళమాత్రం ఎనిమిదయ్యేటప్పటికే ఆకలి దహించుకుపోతున్నదే! సరే! అంత తొందరగా ఉంటే, అంత ఆకలికిఆగలేకుండాఉంటేకుమ్మరింటి నుంచి కుండలూ, చట్లూ తెప్పించుకోమని చెప్పు. విస్తళ్ళు కావాల్సివస్తే నేను పంపుతాలే" అంది రోహిణి.

ఈ ఎదురు సందేశం వినగానే వసుమతికి అరకాలిమంట నెత్తికెక్కింది. "నే నంటే ఓర్వలేని నా పగవాళ్ళనే పోయి కుండలు తెచ్చుకుని నెత్తిన కొట్టుకోమను. అంతేగాని కుమ్మరింటి కుండలు తెచ్చుకుని వండుకోవాల్సిన గతి నాకేంపట్టింది? పండగలు చేసుకోవాలని అంత మోజుగా ఉంటే, బజారుకెళ్ళి కొత్తపాత్రలు తెచ్చుకోమను. లేదా 'ఓరి! నా ముద్దులకృష్ణా! నా కొక బండెడు పాత్రలు తోలిపెట్టవయ్యా'అని మొరపెట్టుకోమను. అంతేగాని, బలవంతంగా లోకుల్ని కూడూ – నీళ్ళూ లేకుండా తెల్లవార్లూ ఉంచటానికి దెవ్వరు?"

పొయ్యి దగ్గర్నుంచి కాస్త ఇవతలికొచ్చి "ఇదిగో చెల్లీ! కాస్త నోరు అదుపులో ఉంచుకుని మరీ మాట్లాడు. దేవతల్ని దూషించటం యేమంత మంచిది" కాదు అంది రోహిణి.

వసు:- దూషించుతోంది నువ్వేగా. ప్రతంపట్టి ఇంత చక్కగా సింగారించుకుని, ఒయ్యారంగా తిరుగుతున్నది నువ్వా నేనా! దేవుళ్ళు రూప - లావణ్యాలు చూచేమీ మురిసి పోరు. వారికి కావలసిందల్లా భక్తి ఒక్కటే.

రోహి:—ఇవ్వాళ కయ్యానికి సిద్ధమై, కూర్చున్నావా ఏం? దేవుడు ఎన్ని కష్టాలకన్నా గురి చేయుగాక! కాని, దుష్ట సాంగత్యం మాత్రం ప్రదానం చేయకుండుగాక. ఈ సొమ్ము లూ, ఈ కోకలూ - రెవికలూ ముస్లిం సి కళ్ళల్లో గుచ్చు కొంటున్నాయి గామాలు. సరే, అలాగే పెట్టుకోనులే, కాని బయట కెళ్ళి ఏ మిఠాయివండేవాడినో పిలిపించుకుని వండించుకోమని ఆయనతో చెప్పు. నా దేం పోయింది! నా మనస్సు ఎలాందో ఏమిటిటో ఆ కృష్ణపరమాత్మకే తెలుసు. ఆ వచ్చే కీడులూ - మేళ్ళూ అన్నీ ఈ పానకపుపుడకలు భరించాల్సిందే.

ఇలా అని తనగదిలోకి వెళ్ళిపోయింది రోహిణి. సమస్త నగలూ, దుస్తులూ తీసి దూరంగా పారేసింది. తలనిండా ముసుగు పెట్టి, మంచంమీద నిగడదన్ని పడుకుంది. రాజాగారికీ సంగతి తెలిసింది. నెత్తి బాదుకుంటూ "ఈ ఛాండాలినులు ఇలాంటి పర్వదినంనాడు కూడా కాస్త శాంతంగా కూర్చో లేకుండా ఉన్నారుగదా దేముడా! ఈ బ్రతుక్కంటే చావే మేలు" అనుకుని, గబగబా లోపలి కెళ్ళి "ముసుగుపెట్టి పడు కున్నావా లేక పిండివంటలు తయారు చేయిస్తున్నావా?" అన్నాడు రోహిణితో

"ముట్టుకుంటేనే ఒళ్ళంతా ముక్కచెక్కలుచేసే బం గారం ఉన్నా ఒకటే పోయినా ఒకటే ఇలాంటి పండుగల కొక దణ్ణం బాబు! అదిచూస్తేనే కొంపలోవాళ్ళకు గుండెలు బ్రద్దలైపోతుంటే పండగలెందుకూ, పబ్బాలెందుకూ?" అంది రోహిణి మంచంమీదనుంచి లేవకుండానే.

విశాల:—దానిజోలికి పోవద్దని నీకు నే నెన్నోసార్లు చెప్పాను. ఒకరిమౌనం వందమందివక్తలను నోరు మూయిం చుతుంది. ఇంకోవిషయంకూడాను. వయస్సులో నీకంటే పెద్ద దిగదా. ఆ దృష్టితోనైనా గౌరవించవలసిన అవసరముందికదా!

రోహిణిమాత్రం తక్కువతిని కూర్చుందాఏమిటి? ఈ ఉపదేశవాక్యాలు విని చించుకుంటూ "చాల్లెండి, ఇక అంత టితో ఆగండి; పుండుకు కారంరాయటంతప్ప ఇంకేమీ కాదు. పెద్దదైతేకావచ్చు. కాని చీటికీమాటికీ నోరు పారేసు కుంటూఉంటే, ఏదిచేసినా చూచి ఓర్వలేకుండా ఉంటూ ఉంటే ఎవరైనా పెద్దరికం ఎందాకా ఉంచుతారేమిటి? దీని కంతకూ మీరే మూలం. నెత్తికెక్కించుకుని ఇందాకా తెచ్చింది మీరే. ప్రతిదానిలోనూ నాకే శ్రీరంగనీతులు బోధించటానికి తైమంటూ బయల్దేరవస్తారు. అభమూ - శుభమూ తెలియని ముండను నే నొకదాన్ని దొరికానూ? ఆ రాణీగారితో మాట్లాడటాని కేమో గుండెల్లో రైళ్ళు పరు గెత్తుతాయా? మీరేగనక అలుసు ఇవ్వకుండాఉంటే నిజంగా నాకేసి కన్నెత్తి చూడటానికి గుండా చెరువా?" అంది.

విశాల:—ఐతే నిన్ను ఆడిపోయమని దానికి నేర్పుతు న్నాననంటావా?

"మహారాణిగారింకా లేవలేదాయేమిటి? చాటుమాటున నిలబడి యేమన్నా చెప్పుకుంటున్నారేమోనని చెవులు నిక్కపొడుచుకుని వినేపాడుఅలవాటు దానికి బాగాఉందిలెండి. ప్రేమఅనే దసలు దీనిలో కంచుకాగడావేసి వెదకినా కానరాదు. ఎన్నాళ్ళసంగతో ఎందుకు? మొన్నిమధ్యనేగా మీరు రోగమొచ్చి బైటపడిఉండి మూలుగుతుంటే, దాని మనస్సులో విచారమనే దెక్కడన్నా కన్పిస్తే ఒట్టు. ఇలాంటి ఆడవాళ్ళను ఏకోశానా నమ్మకూడదు బాబూ!" అంది వసుమతి.

విశాల:—అన్నీ గమనిస్తూనే ఉన్నాను. అర్థమూ చేసుకుంటున్నాను. వట్టి పరమ మూర్ఖుణ్ణేమీ కానులే.

వసు:—చూస్తూకూడ చూడటంలేదు. తెలిసివుండికూడా తెలుసుకోవడంలేదు. అందుకే ఈ ఏడ్పంతా. పురుషునిలో ఎన్నిదుర్గుణాలైనాసరే ఉంటే ఉండనీయండి, కాని ఆడదానికి వశమైమాత్రం ఉండకూడదు.

విశాల:—అంటే నేను ఆడదానికి లోనైఉన్నానన్నమాటా! నీకేం తెలుసు? దాన్నసలు ఎలాంటి మాటలంటూంటానో దానికే తెలుసు.

రామప్రియ:—కర్ణకఠోరమైన మాటలైనాసరే నవ్వుతూ ప్రేలుతూ అంటే మధురంగానే ఉంటాయి.

విశాల:—నవ్వుతూ ప్రేలుతూ అనటమనే దెప్పుడూ లేదే? ఎప్పుడన్నా కస్సు - బుస్సులతోనే అంటూంటాను. మొహం ఎత్తుకోకుండా చీవాట్లుపెడుతుంటాను.

వసు:—అంటే అనొచ్చు. కాని అదీ ప్రేమతోనే. మళ్ళుతున్న వయస్సులో పురుషులంతా మీ మాదిరిగానే

తయారవుతూంటారులెండి. మీ స్త్రీలోలత్వం చూచి అప్పు డప్పుడు నాకే నవ్వొస్తూంటుంది. మానవుడు మంచి గుండె బలంగలవాడై ఉండాలి. చూడండి, గుర్రం పాదచారి ఎవరో రౌతు ఎవరో చక్కగా గుర్తిస్తుంది. అదేవిధంగా ఆడదికూడా దద్దమ్మ ఎవడో మగవాడెవడో గుర్తిస్తుంది. జమాయించి కూర్చుని కళ్ళెం గట్టిగా బిగపట్టినవాడిదే విజయమనుకోండి. కళ్ళెం గట్టిగా పట్టుకోనివాడికి క్షేమం శూన్యమనుకోండి.

విశాల:—నాకు గుర్తున్నంతవరకూ ఎన్నడూ కళ్ళెం సడలించి పట్టుకోలేదు. ఇవ్వాలిమాటే చూడు. మొహంవాచే టట్టు 'ఛీ ఛీ' అని చివాట్లుపెట్టాను.

వసు:—అబ్బో! ఏం ప్రతాపం! ఏదీ, కాస్త ఆమీసాలు దువ్వుకోండి. ఎందుకులే, ఆ దువ్వెన ఇలా ఇవ్వండి, నేనే దువ్వుతాను. ఏం కబుర్లంటేనూ? ఆవిడగారి ధాటికి తట్టుకో లేక చల్లగా సందుదారి పట్టానని మాత్రం చెప్పరు!

ఆకస్మికంగా ఎవ్వరో వస్తున్నట్లు చప్పుడవటం చూచి గుమ్మంవేపుకు చూచింది వసుమతి. వంటింట్లోంచి చడీ చప్పుడూ కాకుండా వస్తోంది రోహిణి. మొహం నల్లగా మసి బొగ్గులా ఉంది. పళ్ళు నూరుతూ, పెదవులు కొరుక్కుంటూ "అదిగో, నే చెప్పలా? చాటుననిల్చొని అంతా వింటూంటుం దని. స్వయంగా నా కళ్ళతో చూచా. ఇక కొంపలో ఉండటమే దుస్తరమైపోయింది. ఏం జరుగుతుందో, ఎలా పరిణమిస్తుందో ఏమిటో చూద్దాంగా" అంది వసుమతి.

సశంకితనేత్రాలతో వెనక్కుతిరిగి చూచాడు విశాల సింగ్. "అయ్యయ్యో! కొంప నట్టేట ముసిగినట్టే. దెయ్యం

ముండ. ఈ మాటలన్నీ వింది గామాలు. నా కసలు చీమచిటు
క్కుమన్నట్టుగాకూడ తెలియందే!"అన్నాడు కా సకంగారుగా.

వసు:—ఊఁహూ, రాణిగారికి కోపంవస్తే తలగొట్టి
మొలవేస్తుంది! ఎవరైనా ఎంతకాలం జడుస్తారేఁ! సరేగానీ,
వెంటనే మనుషుల్ని పిలిపించండి. ఈ పదార్థాలన్నీ తీసుకు
పోతారు.

భాద్రపదమాసం. కటికి చీకటి. ముందున్న మనిషి
కన్పించటంలేదు. భూదేవి పాతాళలోకానికి వెళ్ళి కూర్చున్న
ట్టుగా, లేక ఏ మహాజంతువునోటిలోనో పడిపోయినట్టుగా
కన్పడుతోంది. అతిమిరసాగరంలో పాదంపెట్టటానికూడ గజ
గజవణికిపోతోంది కొవ్వొత్తులకాంతి. నైవేద్యపదార్థాలన్నీ
పళ్ళాల్లో పెట్టించి, బైటికిచేర్పించటంలో నిమగ్నుడైఉన్నాడు
విశాలసింగ్. హఠాత్తుగా రోహిణి దుప్పటికప్పుకుని ఇంట్లోంచి
బయలుదేరి బయటికి వస్తోంది. మండిగం దగ్గర నిల్చొని
వున్నాడు విశాలసింగ్. ఈ నిండుసభలోకి ఈవిధంగా సిగ్గూ
ఎగ్గూ లేకుండా, నిశ్శంకగా గడపదాటిరావటంచూచి, విశాల
సింగ్ రక్తం అట్టుడికినట్టు ఉడికిపోయింది. "ఎక్కడికి? ఏం పని?"
అన్నమాటకూడ పెదవులుదాటిరాలేదు. ఉత్సవ విగ్రహంలా
నిలబడిపోయాడు. తతిమ్మావాళ్ళంతా తమ తమ పనుల్లో
మునిగి ఉన్నారు. రోహిణిమీాది కెవ్వరిదృష్టీ పోలేదు.

ఇంతలో రాజాగారి నేదో అడగటానికొచ్చాడు చక్ర
ధరుడు. దాసీఒకతె ఎదుట నిలబడి ఉంది. కోపంతో రాజాగారి
కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. దాసీతో "అదే గనక నాకు
దాసురాలుకానిచో నేనూ దానికి దాసుణ్ణికాదు. ఇష్టమొచ్చిన

చోటికి పొమ్మను. ఇక ఈ గడపదాటి లోనికి రానివ్వను॥ అంటున్నాడు.

రాణుల అంతఃకలహం, రోహిణీ ఇల్లు వదలి బయలు దేరిపోవటం తెలియగానే చప్పున లాంతరొకటి తీసుకొని బయల్దేరాడు చక్రధరుడు. బైటికొచ్చి నలువేపులా తేరిపార జూచాడు. పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు వెళ్ళాడు. షుమారు నాలుగైదు అడుగులదూరం సాగాడో లేదో ఇంతలో ఒకచెట్టు క్రీనీడలో రోహిణి నిలబడిఉండటం చూచాడు చక్రధరుడు. దాగటానికి ప్రయత్నిస్తున్నట్టుగా కన్పడింది. గబగబా అటుకేసి ఉరికాడు. దగ్గరకుపోయి, ఇంటికి తిరిగిరమ్మనమని బ్రతిమాలి చెప్పసాగాడు. మొదట ఎంత చెప్పినా వినలేదు గాని, చివరకు చక్రధరుని బోధనలు చెవి కెక్కి గృహాభిముఖియై బయలుదేరింది రోహిణి.

ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు. ఇంతవరకూ పాషాణ మూర్తిలా అక్కడే నిలబడిఉన్నాడు విశాలసింగ్. దాసీకూడా అలాగే నిలబడిఉంది. భక్తులంతా తమ తమ పనులన్నీ వదలి లాంతరుకేసి చూస్తున్నారు. సర్వత్రా నిశ్శబ్దత వ్యాపించి ఉంది.

రోహిణి గడపలో అడుగుపెట్టింది. కాని విశాలసింగ్ ఆవిడకేసి కన్నెత్తికూడా చూడలేదు. ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది. అప్పుడు చక్రధరుని చెయ్యిపట్టుకుని "ఇంక అసలు వెనక్కి తిరిగి రానేరాదని నే నభిప్రాయపడ్డాను. కాని మీరు తిప్పి తీసుకొచ్చారు. చాలా కోపంగాఉందంటారా?" అన్నాడు.

"రామ రామ! మిమ్మల్నిపల్లెత్తిఒక్క మాటకూడ అనలేదంటే నమ్మండి. చూస్తే గొప్ప తెలివితేటలుగల మనిషిలాగే కన్పడుతోంది. ఔను, కొంచెం గడుసు స్వభావమే. మాటంటే బొత్తిగా సహించలేదల్లే ఉంది" అన్నాడు చక్రధరుడు.

విశాల:—నే నిక్కణ్ణుంచి కదలనుకూడా కదల్లేదు చూడండి. నిజం చెప్పాలంటే నాదే పొరపాటు లెండి. వెధవ కోపమూ నేనూనూ. మీరే గనుక వెంటనే వెళ్ళివు డకపోతే కొంప ఆరిపోయేది. ప్రాణాలతో చెరలాటలాడే ఆడదనుకోండి. మీరు చేసిన ఈ మేలు ఎన్నడూ మరువలేను... అదిగో, అటుచూడండి; ఏదో వెల్తురుగా ఉంది. అదిగో, బ్యాండుధ్వని వినపడుతోంది. కారణ మేమిటో?

వందలాది జనం చేతుల్లో దివ్వటీలూ, లాంతర్లూ పుచ్చుకుని, బారులుదీరి నడుస్తున్నారు. ముందు పీఠీన ఇద్దరు గుర్రాలపై ఉన్నారు. హాయిగా వినవస్తోంది బ్యాండుధ్వని.

## ఏడో అధ్యాయం

ఆవిధంగా బారులు తీరి మేళతాళాలతో వస్తున్న వాళ్ళకేసి కుతూహలంగా చూస్తున్నారు జన్మాష్టమిపండుగ చేస్తున్న జనమంతా. పదిపన్నెండు నిమిషాల్లో విశాలసింగ్ ఇంటిముందు కొచ్చేశారు. ముందు పీఠీన రెండు గుర్రాలపై మున్షీ వజ్రధరసింగూ, ఠాకుర్ హరిసేవకసింగూ కూర్చొని ఉన్నారు. వెనక పాతికముప్ఫైమంది తెల్లటిదుస్తులు ధరించి నడుస్తున్నారు. ఇంటిముందుకురాగానే ఆ ఇద్దరూ గుర్రాల

మీదనుండి దిగారు. చేతులుకట్టుకుని వినయంగా విశాలసింగ్ ముందుకొచ్చి నిలబడ్డారు. మున్షీజీ వేష - భాషలు వింతగా ఉన్నాయి. నెత్తిమీద ఒక విచిత్ర టోపీ, ఒంటిమీద క్రింది దాకా ఒక అంగరఖా వేశాడు. హరిసేవకసింగ్ భారతీయ వేష భాషల్లో ఉన్నాడు. సంతోషంతో ముసిముసినవ్వు నవ్వుతున్నాడు మున్షీజీ. కాని హరిసేవకసింగ్ మోము నల్లబడిఉంది.

''దీనబంధో! మీ పాదసేవకులమై మేము మీ కొక శుభవార్త తెలియజేయగలందులకై వచ్చాము. మహారాణిగారు విరక్తిపుట్టి పుణ్యతీర్థాలకు వెళ్ళిపోయారు. ఇప్పుడు శ్రీవారి ఛత్ర - ఛాయను ఆశ్రయంపొందే సదవకాశం లభించింది. ఈ అవకాశంకోసమే భగవంతుని వేడుకుంటూవచ్చాం. చివరకు మాకోర్కె ఫలించింది. ఇదిగో, మహారాణిగారు వెళ్ళిపోతూ మీపేరవ్రాసిన ఉత్తరం'' అన్నాడు వినయంగా ఠాకుర్ హరిసేవకసింగ్.

ఎత్తిన రెప్పవాల్చకుండా ఆఉత్తరాన్ని పైనుంచి క్రింది దాకా ఒకేసారి చదివేశాడు రాజా విశాలసింగ్. ముఖమండలంపై మందస్మితరేఖ నిగనిగలాడసాగింది. ఆ జాబును జేబులో ఉంచుకుంటూ అన్నాడు "మహారాణిగారి పుణ్యతీర్థయాత్రావార్త విని నా కెంతో విచారంగా ఉంది. కాని నివృత్తి మార్గం అవలంబించినందుకు మరోవేపున యథార్థ ఆనందమూ కలుగుతూంది. ఆవిడ నా భుజాలమీద ఈ కర్తవ్యభారం ఉంచిపోయింది. దాన్ని నిర్వహించగల శక్తి-సామర్థ్యాలు ఒసంగవలసిందని భగవంతుని ప్రార్థించుతున్నాను. అంతేగాదు, ప్రజలపట్ల నా విధ్యుక్తధర్మం సక్రమంగా నిర్వ

హించే శక్తికూడ ప్రదానంచేయుమని ప్రార్థన. నా కర్తవ్య పాలన విషయంలో ఏలోటూ రానీయకుండా మహోత్కృష్ట ఆదర్శాలతో వ్యవహరిస్తానని మీకు నమ్మకంగా చెబుతున్నాను. ఐనా నా సాఫల్యం మీ అందరి సహాయ సానుభూతులపై ఆధారపడిఉంది. మీరు యావన్మందీ నా కన్నివిధాలా తోడ్పడేవిషయంలో ఏ విధమైన లోటూ చేయరని ఆశించుతున్నాను. అత్యాచారం, అన్యాయాలంటే నాకు బొత్తిగా గిట్టవు. వాటికి నేను పరమ శత్రువును. ప్రజల్ని పీడించుకు తినటానికి అలవాటుపడినమహాశయులు నే నేదో మృదువుగా వ్యవహరిస్తానని మాత్రం ఆశించవద్దని ముందుగానే చెప్పగోరుతున్నాను.''

ఈ ప్రసంగంలో శిష్టత ఎక్కువగానూ, విధానం తక్కువగానూ ఉంది. ఐనా రాజకర్మచారులకు ఈ మాట లెంతో అప్రియంగా కన్పడ్డాయి. ప్రతివాడూ చెవులు నిక్కపొడుచుకుని విన్నాడు. హరిసేవకసింగుకు ఈ ప్రహారం తనమీదనే అన్నట్టు తోచింది. అతని ప్రాణం చివుక్కుమన్నది.

రాజాగారు ఆగంతుకుల నందర్నీ తీసుకెళ్ళి అరుగుల మీద తివాసీలపై కూర్చోబెట్టాడు. తాను స్వయంగా అనుదు ఢిండొకటి వేసుకుని ఆసీను డయ్యాడు. నజరానాల నిరర్థక ఆచారం ప్రారంభమయింది. బ్యాండు అభినందనగీతం వాయిస్తోంది. తాంబూల మిచ్చి కూర్చున్నవారినందరినీ సన్మానించాడు. లోపలి కెప్పుడు వెళ్దామా, వెళ్ళి ఎప్పుడు ఈ శుభవార్తను రాణులకు వినిపిద్దామా అని రాజాగారి మనస్సు ఓ ఆరాటపడిపోతూ ఉంది. కాని అవకాశం లభించక అలా

బిగపట్టుకూర్చున్నాడు. ఇంతవరకు నిశ్శబ్దంగా కూర్చొని ఉన్న వజ్రధరుడు నెమ్మదిగా "అయ్యా! ప్రొద్దుటనుంచి పరుగులుతీస్తూ, కాళ్ళన్నీ బొబ్బలెక్కిపోయాయి. ఇవ్వాళ మహానందమైన రోజు. నా దుస్సాహసాన్ని క్షమించండి. మిఠాయి పంచిపెట్టించండి. గానసభలూ – సమావేశాలూ ఏర్పాటుచేయండి. తీయకుండా ఒక వారంరోజులు పాటకచ్చేరీ జరగాలి. హుజూర్! ఈ సనుయంలో ఇచ్చిందీ, పెట్టింది మాత్రమే ఎల్లప్పుడూ జ్ఞాపకముంటుందండీ" అన్నాడు.

విశా:—ప్రస్తుతం ఇక్కడ పాటకచ్చేరీ జరిపించండి. దర్బారు రేపు అక్కడే జరపవచ్చు.

వజ్ర:—అయ్యా! సంగీతసభ ఏర్పాట్లన్నీ మొదటే చేసిఉంచాను. గాయకబృందం వస్తూఉండొచ్చు. పట్నంలో ఉన్న ప్రఖ్యాత సంగీత విద్వాంసు లందరికీ కబురుచేశాను. హుజూర్! ఏమని చెప్పను! ఒకరికి మించిన దురంధరుడు ఇంకొకరనుకోండి. అందరిపాటలూ ఆలకించుతారుగా... !

తహశీల్‌దారుగా రింకా తన ప్రసంగం పూర్తిచేయక ముందే 'జనునూ' లోనికొచ్చి నమస్కరించి "అయ్యా! గాయకశిఖామణులంతా వేంచేసి ఉన్నారు. సెలవైతే లోపలికి తీసుకొస్తాను" అన్నాడు.

మున్షీజీ వెంటనే బయటికి వెళ్ళాడు. చూస్తూ చూస్తూ ఉండగానే అందర్నీ వెంటబెట్టుకుని తిరిగివచ్చాడు.

అందరూ వరుసగా పరిచయంచేయబడ్డారు. తరువాత సంగీతం ప్రారంభమయింది. 'ఘజలూ' మహోదయుడు 'మలారు' రాగం ఎత్తాడు. మున్షీజీ క్రిందికీ మీదికీ తెగఊగిపోతున్నాడు.

"సెభాష్, సెభాష్ ! వహ్వా ! వహ్వా !!" అని ఎడతెగకుండా అంటున్నారు గాయక శిఖామణులంతా. కళ్లు మూసుకుని తల ఎగరేస్తున్నాడు మున్షీజీ. జనం నెమ్మదిగా లేచిపోసాగారు.

'మలారు' అనంతరం 'నిర్గుణ – గీతం' ప్రారంభించాడు 'ఘజలూ' మహాశయుడు. రాగమేమిటో సంగీత విశారదులకే తెలియాలి. కాని మున్షీజీకి ఈ రాగం విని పిచ్చెక్కిపోయింది. మొదట్లో అయితే కూర్చునే ఊగుతూఉన్నాడు. కాని తర్వాత నిలబడి ఊగసాగాడు. ఊగుతూఊగుతూ అప్రయత్నంగానే పాదాలతో ఒక రకమైన 'గతి' ప్రారంభమయింది. చివరకు నాట్యంలోకి దిగింది వ్యవహారం. ఆనంద పారవశ్యంలో పాటల్లోకి దిగింది నాట్యం. అతని వదనమండలమంతా భక్తి – అనురాగములతో తాండవిస్తోంది. ఎన్నాళ్ళకో ఈనాడు అదృష్టం పండి ఇలాంటి స్వర్గీయానందం పొందే అవకాశం లభించింది. ఈ పాట లిలా జరుగుతూండగానే కృష్ణ జన్మఘడియ ఆసన్నమయింది. అందరూ లేచి నిలబడ్డారు. గాయకులందరూ కలిసి స్వరయుక్తంగా మంగళగానం ప్రారంభించారు. వాయిద్యాలన్నీ మేళవించి అందర్నీ తన్మయుల్ని చేశాయి. ఇలాంటి ఆనందమయసమయంలోకూడ 'ఊరందరిదీ ఒకదారి, ఉలిపికట్టెదొకదారి' అన్నట్టుగా ఉన్నారు ఇద్దరు జీవులు. ఒకడు హరిసేవకసింగ్ – రెండోవాడు విశాలసింగ్. ఒకరికి రేపు ఎక్కడ మిన్నొచ్చి విరిగిపడుతుందో నని గుండెలు దడదడలాడుతూంటే, రెండోవారికి 'ఈ దుర్మార్గుని పై పాతకక్ష సాధించే మార్గమేమిటా యని ఆలోచన. ఇంతవరకు సిగ్గుచే మొఖంతప్పించి బయటే నిలబడిఉన్నాడు చక్ర

ధరుడు. మంగళగానం పూర్తికావటంతోనే లోపలికొచ్చి దేవుడి ఫలహారం పంచిపెట్ట నారంభించాడు. ఒకరు 'మోహాన్ భోగ్,' ఇంకొకరు పళ్ళు, మరొకరు తీర్థం పుచ్చుకుని పంచి పెట్టసాగారు. అంతా గోలగోలగా ఉంది. అవకాశం చూచుకుని వెంటనే లేచాడు రాజాగారు. కనుసైగతో వజ్రధరుని పిలిచి వరండాలో కెళ్ళాడు. అక్కడ మున్షీజీతో "దివాను గారికి సందుదొరికిందిగదా. ఇప్పటి కంతా మూటగట్టుకునే ఉండొచ్చు ననుకుంటా" అన్నాడు.

వజ్ర:—అలాంటిదేమీ నేను చూడలేదు. ప్రొద్దస్తమానం సామాన్ల తనిఖీలోనే మునిగిఉన్నాడు. ఇంటికన్నా వెళ్ళలేదు.

విశాల:—అదంతా మిమ్మల్ని చూచి చేసిఉంటాడు. నిజంగా మీ రేగనక అక్కడ లేకుండా ఉన్నట్లయితే ఎంత చిత్రం చేసేవాడో! అతని పాతచరిత్ర మీకు తెలియదనుకుంటా. నామీద ఎన్నెన్ని ఘోరాలు చేశాడో! నేను జగదీశపురం వదలిపెట్టి పోవటానికి వీడే మూలకారణం. వీడికి చేతిలోపనైతే ప్రాణాలుకూడ తీయించిఉండేవా డనుకోండి.

వజ్ర:—నా ఈ దుస్సాహసం క్షమించండి. తప్పుగా భావించకండి. ఒకమాట. మీ చేతిలో పనైతే రాణిగారి ప్రాణంమాత్రం పోకుండా మిగిలిఉండేదా? దివానుప్రాణాలతో బ్రతికిఉండేవాడా! కాబట్టి ఆ పాతపురాణమంతా మరచి పోండి. దేవుడు ఇవ్వాళ మీ కొక గొప్ప పదవిని ప్రదానం చేశాడు. ఇక ఇప్పుడు మీ రెంతో ఉదారంగా ప్రవర్తించాలి

మీపై పగను వెలిబుచ్చేమాట మచ్చుకూడ దివానుగారి నోటినుండి రాగా నేను వినలేను.

విశాలసింగ్ కొద్దిగా లజ్జావదనుడై "నేనైతే నా మొదటిదాడికి ఇతన్నే గురిచేయాలని నిశ్చయించుకు కూర్చున్నాను. కాని మీరిప్పుడు చెప్పినమాటలు నా ఆ నిర్ణయాన్ని తలక్రిందులు చేసివేశాయి. నావల్ల ప్రమాదం కల్గుతుందనే శంక ఏమీ పెట్టుకోవద్దని మీరుకూడా అతనికి చెప్పండి" అన్నాడు.

ఈ విధంగా చెప్పి ఆయన ఇంట్లోకెళ్ళాడు. ముందు రోహిణిగదిలో ప్రవేశించాడు. భర్తనిర్దయత మదంతో మూసుకుపోయిన ఆవిడకళ్ళను ఇవ్వాళ బాహాటంగా తెరచింది.

రాజాగారు గదిలోకి అడుగుపెడ్తూనే "రోహిణి! దేవుడు నేటికి మన మనోరథం నెరవేర్చాడు" అన్నాడు.

రోహి:—ఐతే ఇక కొంపలో ఉండటం మరింత దుర్భరమైపోతుంది గామాలు! రాగిదమ్మిడీ లేనప్పుడే కలిసిచచ్చేది కాదయ్యె. మరీ ఇప్పుడింత ఐశ్వర్యం వచ్చి ఒళ్ళోపడ్డప్పుడు కాలు నేలమీద ఆనుతుందా? ఆకాశాని కెక్కదూ! ఇక ఇతరులు బ్రతకేం?

"ప్రేయసీ! ఇలాంటిమాటల కిదేనా సమయం! భగవంతుడు మన మొర ఆలకించాడు. అందుకు మనం ధన్యవాదాలర్పించాలి" అన్నాడు విశాలసింగ్ దుఃఖాక్రాంతవదనంతో.

రోహి:—'తన' అనే దిక్కే లేనప్పుడు రాజ్యాలేం చేసుకుంటాం? నెత్తినపెట్టుకు ఊరేగుతామా?

విశాలసింగుకు పట్టరాని కోపమైతే వచ్చిందిగాని, శ్రుతి మించి రాగాన పడుతుందేమో నన్న భయంతో నోరుమూసు కూర్చున్నాడు. నెమ్మదిగా లేచి వసుమతిగది కెళ్ళాడు నిండా ముసుగుపెట్టి పడుకొనిఉంది వసుమతి. "ఏమిటే, నిద్రా! కాస్త లేచి కూర్చో! నీ కో మంచివార్త వినిపిస్తా" అన్నాడు, విశాలసింగ్ వసుమతిని నిద్రలేపుతూ.

వసు:—పట్టపురాణీగారికి వినిపించి వచ్చారుగా! అది చాలదేమిటి? ఇంక నే నేం చేస్తానూ వినీ! ఇంతవరకూ మన స్సులో దాచిఉంచినదంతా ఇవ్వాళ వెళ్ళగ్రక్కి వచ్చారు. సరే, ఐతే ఇక్కడ ఎంగిలిఆకులు నాకటాని కెవరూ కూర్చో లేదులెండి.

"అలాంటిదేమీ లేదు వసూ! నువ్వు బుద్ధిపూర్వకం గానే అప్పుడప్పుడు తెలివితక్కువతనం చూపించుతుంటావు. అసలు నీ దగ్గరకే బయలుదేరాను. నిజం. దేవుడితోడు. దాని గది ఏమిటో చీకటిగా ఉన్నట్టు కనపడింది. ఏమిటా చీకటిగా ఉందని సందేహపడి అటుకేసి వెళ్ళాను. అంతే.

వసు:—ఎందుకీ మాయమాటలూ? నా దగ్గర చెప్ప కండి. సర్వం నాకు తెలుసు. ఒక ఆడదాన్ని వశంలో ఉంచు కోలేని వ్యక్తి ఒకఎస్టేటుభారమేం మోస్తాడూ?

ఇలా అని లేచి చురచురలాడుతూ మేడమీదికి పోయింది వసుమతి. ఖిన్నహృదయంతో కొంచెంసేపు అలాగే నిల్చున్నాడు విశాలసింగ్. తర్వాత రామప్రియగదికి పో యాడు. అక్కడావిడ దీపందగ్గర కూర్చుని ఏదో రాసు కుంటూ ఉంది. భర్తరాక గమనించి తల పైకెత్తింది. కన్నీటి

మయమై ఉన్నాయి కళ్ళు. అదిచూచి కంగారుపడి "ఏమిటి సంగతి ? ఏడుస్తున్నా వెందుకు ? నీ కొక శుభవార్త వినిపించాలని వచ్చాను" అన్నాడు విశాలసింగ్.

"విన్నాను లెండి. ఇదివరకే విన్నాను. కాని దా న్నొక శుభవార్తగా మీ రెలా భావిస్తున్నారో నా కర్థం కావటంలేదు. నా ప్రియసోదరి శాశ్వతంగా ఈ ప్రపంచంనుండి శెలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది. ఇది శుభవార్తా? పాపం! బ్రతికినన్నాళ్ళూ కష్టాలే అనుభవించింది. ప్రపంచ సుఖమేమీ అనుభవించనే లేదు. దాని జన్మే వ్యర్థమైపోయింది. జీవితమంతా ఏడ్పులు మొత్తుకోవటాలలోనే వెళ్ళమారిపోయింది.

ఇలా అంటూఅంటూ ఒక్కసారిగాఆవురుమందిరామ ప్రియ. ఆవిడఏడ్పులు విశాలసింగుకు అసహ్యంగావున్నాయి. బయటకెళ్ళి సభలో కూర్చొబడ్డాడు. 'మేడూఖాన్' సితారు వాయించుతున్నాడు. పేరోలగమంతా తన్మయమైఉంది. 'ఘజలూ' పాటలు విన వెనకబడినవాళ్ళు ఇప్పుడీ వాయిద్యం విని క్రిందికీ మీదికీ గణాచారుల్లా ఊగుతున్నారు. కాని ఈ బ్రహ్మానంద సుధారస అనంత ప్రవాహసమయంలో కూడా ఒకే ఒక ప్రాణి హృదయావేదనతో వ్యాకులపడిపోతూంది. అతను రాజా విశాలసింగే. పెళ్ళిపెద్దలంతా కిలకిలలాడుతుంటే పెళ్ళికొడుకు మొహం ఏడ్పులతో వెలవెలపోతూఉంది.

# ఎనిమిదో అధ్యాయం

రెండో వర్షఋతువూ సగానికిపైగా గడిచిపోయింది. కాని ఇంతవరకు చక్రధరుడు అహల్యవిషయం తల్లిదండ్రులతో ఏమీ ముచ్చటించలేదు. "అక్కడేం మాట్లాడివచ్చావు? ఇంతకూ యశోదానందనుని కసలు వివాహం చేయాలని ఉందా లేదా? ఒకవేళ ఇష్టంలేకపోతే స్పష్టంగా చెప్పకూడదూ! కాకపోతే, చేయటమే ఖాయమంటాడా, అందుకు తగిన సన్నాహాలన్నా చేయాలి" అని మున్షీజీ అడిగినప్పుడల్లా ఏవో కుంటిసాకులు చెప్పి, దాటవేస్తూ ఉండేవాడు. "నువ్వు నాన్నగారితో సంప్రదించావా లేదా? ఆయనతో స్వయంగా చెప్పటానికి నీ కంత సిగ్గుగా ఉంటే, స్పష్టంగా నాతో చెప్పు. నేనే వచ్చి, అంతా మాట్లాడుతాను. ఎంతకాలమని ఈ విధంగా గడుపుతావు? అహల్య నిన్నుతప్ప ఇంకెవర్నీ భర్తగా స్వీకరించదనిమాత్రం మరచిపోకు" అని అటునుంచి యశోదానందనుడు పదేపదే రాస్తుండేవాడు. "నేనూ అదే ఆలోచించుతున్నాను. అవకాశం లభించగానే మాట్లాడుతాను. నాన్నగారు తప్పక అంగీకరిస్తారనే నా దృఢవిశ్వాసం" అని చక్రధరుడు జవాబులు రాస్తూండేవాడు.

జన్మాష్టమి పండుగ కాస్తా వెళ్ళమారిపోయింది. మున్షీజీ ఇంటికి చేరుకున్నాడు. అతనికోర్కెలు చిటారుకొమ్మలపైకెక్కి తిష్టవేశాయి. రాజాగారితోపాటు అతని అదృష్టభానుడూ ఉదయించుతున్నట్టు తోచసాగింది. కావాలంటే

ఇప్పుడు తమపట్టణంలోనే ఎవరో ఒక శ్రీమంతుని ఇంట చక్రధరుని వివాహం చేయగలస్థితిలో ఉన్నాడు. కాని అటు యశోదానందనునికి మాటఇచ్చిఉన్నాడు అందువల్ల ఆయన్నొక సారి అడిగితేల్చుకోవటం భావ్యం. మరికొన్నాళ్లు ఆగాలని ఏమాత్రం ఆయన నోరుజారినా వెంటనే 'మీతో వియ్యం కుదర'దని చెప్పాలన్న ఆలోచనతో ఉన్నాడు. ఈ రకంగా తనలోతాను నిశ్చయించుకుని ఒకరోజున భోజనసమయంలో కొడుకుతో "ఆ శేమూ స్తే యశోదానందనుడూ ఏదో అవక తవక మనిషిలా ఉన్నాడే! ఇంతవర కెక్కడా పెళ్ళి ప్రసక్తే ఎత్తినట్టు కన్పించటంలేదే?" అన్నాడు.

చక్ర:— వారితరఫున అయితే, అసలు ఆలస్యం లేనే లేదు. మనకోసమే ఎదురుచూస్తున్నారు.

వజ్ర:—నేనూ అంతకంటే సిద్ధంగానే ఉన్నాను. కాని ఒకవిషయం. వారి కేమన్నా అభ్యంతరంగనకఉంటే నే నేమీ బలవంతపెట్టగోరడంలేదు. ఇక్కడ లెక్కలేనంతమంది చేతులు చాచుకూర్చున్నారు. 'ఈ శీతాకాలంలోనే జరిగితీరాలి. లేదా మరొకచోట చూసుకోవలసిం'దని ఇవ్వాళే ఉత్తరం ముక్కొకటి రాసేయి.

ఇదే తగినసమయమని గ్రహించాడు చక్రధరుడు. ఏదో ఒకటి ఇప్పుడే తేల్చుకోవాలని ఆలోచించి తండ్రితో "అభ్యం తరమేమన్నా ఉంటే మీకే ఉండాలి. యథార్థమేమంటే, ఆ అమ్మాయి యశోదానందన్‌గారి గర్భవాసాన పుట్టిన పిల్ల కాదు." అని చల్లగా అన్నాడు.

వజ్ర:— ఏమిటీ! స్వంతకూతురు కాదా! మరి అత గాడు 'మాఅమ్మాయే'నని చెప్పిపోయాడే? సరే, సొంత కుమార్తె కాకపోతే అన్నకూతురో, చెల్లెలికూతురో, మనుమ రాలో, చెల్లెలో, వల్లకాడో వశనకాడో ఏదో ఒకటికావచ్చు. అదంతా నాకనవసరం.మామిడిపండు తినటమే నాకు ప్రధానం గాని, చెట్లు ఎన్నిఉన్నాయో, మొక్కలెన్ని ఉన్నాయో అన్న దానితో నా కేం సంబంధం లేదు.

చక్ర:—ఆ కన్య ఒక తిరుణాల్లో దొరికిందట. అప్పు డా అమ్మాయి నాలుగైదేళ్ళ పిల్ల. ఆపిల్లనుచూచి వారికి జాలేసి ఇంటికి తీసుకొచ్చారు. తమఇంట్లోనే పెంచి పెద్దదాన్నిచేసి, చదువుసంధ్యలు నేర్పించారు.

వజ్ర:—(భార్యతో) ఎంత పచ్చి మోసగాడో చూశావా? ఇంతవరకు ఆ పిల్ల అమ్మా, బాబూ ఎవరోకూడ అంతుతెలియలేదట. ఎంత చోద్యమంటేనూ!

చక్ర:— లేదండీ. ఆఅమ్మాయి కన్నతలిదండ్రులెవరో తెలుసుకోవాలని శాయశక్తులా ప్రయత్నించాడు కాని, ఏమీ లాభం లేకపోయింది.

వజ్ర:— బలే, అలాచెప్పవేం! ఇదాసంగతి! ఒట్టి అబ ద్ధాలరాయుడు; బాగా నేర్చిన మోసగాడు.

నిర్మల:— ఎందు కిదంతా? మీతోవియ్యం మా కిష్టం లేదూ అని ఒకముక్క రాసేస్తే సరిపోతుందిగా.

వజ్ర:— నీసలహా లేమీ వద్దులే. ఇలాంటి పచ్చిమోస గాళ్ళతో ఎలా వ్యవహరించాలో నాకూ కాస్త తెలుసులే.

ఇద్దరూ భోంచేసి లేచింతర్వాత కొడుకుతో "కలం, సిరాబుడ్డి ఇలా తీసుకురా. ఇప్పుడే యశోదానందనుని కొక ఉత్తరంముక్క రాసేస్తాను. ఉభయులం ఒకే కులస్థులం కాకపోతే ఈపాటికి పరువునష్టం దావా దాఖలుచేసి ఉండేవాణ్ని" అన్నాడు తండ్రి వజ్రధరుడు.

"మరి నేను మాట ఇచ్చి వచ్చానుగా" అన్నాడు చక్రధరుడు ముఖం ఎరుపెక్కగా, సంకోచావరుద్ధకంఠంతో.

వజ్ర:— అంటే అంతా నీఇష్టమేనా? నీఅంతట నీవే అన్నీ నిర్ణయించుకునే పెద్దవయ్యావన్నమాట. అలాచెప్పవేం? పిల్ల కాస్త ఎర్రఎర్రగా పుల్లపుల్లగాఉంటే చాలు. నీ కింకేం కావాలి? మోజుపుట్టుకొచ్చిందీ. కాని ఒరేయ్అబ్బాయ్! ఆడదానికి అందమొక్కటే సర్వోత్తమగుణం కాదు.

చక్ర:— స్త్రీకానీయండి, పురుషుడు కానీయండి, ఉభయుల్లోను గుణస్వభావాలే ప్రధానమైనవి. ఆరెండూమినహా తతిమ్మావన్నీ గణింపతగ్గవికాదని నా అభిప్రాయం.

వజ్ర:— నీ నెత్తిన నవనాగరికతాదెయ్యం ఎక్కి తాండవంచేయటంలేదు గదా! లేకపోతే ఒక్కసారిగా ఇంత పరివర్తనకు కారణ మేమిటి?

చక్ర:—అందరికీ సేవచేయటమే నా ప్రధానాభిలాష. మీఅభీష్టానికి విరుద్ధంగా ప్రవర్తించజాలను. కాని సిద్ధాంత, ఆదర్శాల విషయంలోమాత్రం గత్యంతరం లేదు.

వజ్ర:- సేవసంగతిదేవుడెరుగు.నన్నపకీర్తిపాలుమాత్రం తప్పకుండా చేయగోరుతున్నావు. సరే, బాగా ఆలోచించుకో. ఈ వివాహమే గనుక చేసుకున్నావంటే మాత్రం మంచిగా

ఉండదని బాగా గుర్తుంచుకో. నాకులానికి కళంకం కల్గటం చూచే దుర్దినాలు భగవంతుడు నాకు కలుగజేయకుండుగాక.

చక్ర:— సరే, మంచిది. ఐతే, ఇంకోచోట వివాహం చేసుకోనని నేనూ నిశ్చయాత్మకంగానే చెబుతున్నాను.

ఇలా అంటూ చక్రధరుడు బైటికొచ్చేశాడు. వెంటనే యశోదానందనుని పేర ఒకలేఖ వ్రాశాడు. అందులో జరిగిన భాగోతమంతా అక్షరాలా వర్ణించి రాశాడు. ఆ జాబులోని తుదివాక్యాలు ఇవి: "నాన్నగారు అంగీకరించటం లేదు. ఇటు సిద్ధాంతాలను బలిచేయనూ లేను. అటు వారితో వేరుబడి, ఈ వార్ధక్యంలో వారిమనస్సుకు కష్టం కల్గించటాన్నీ ఊహించ లేను.ఎంతో లజ్జపడుతూ క్షమార్పణ కోరుకొంటున్నాను. ఒక వేళ ఇదే భగవదభీష్టమైతే, ఇలాగే బ్రతికినంతకాలం అవివాహితునిగానే ఉంటాను. కాని మరొకచోటమాత్రం వివాహం చేసుకోవటం కలలోని వార్త."

తర్వాత మరోజాబు అహల్యపేర వ్రాశాడు. దానిలోని చివరివాక్యాలు ఇవి: "ఒకడు తన తల్లిదండ్రుల కెలాంటి భక్తుడో, నేనూ నా తలిదండ్రులకు అలాంటి భక్తుడనే. కాని పితృభక్తి; ఆత్మస్వాతంత్ర్యం- ఈ రెంటిమధ్య వైరుధ్యంఏర్పడితే ఆత్మస్వాతంత్ర్యసంరక్షణార్థం నడుంబిగించటంలో అణుమాత్రం కూడా వెనుకంజవేయను. దీనివల్ల అమ్మగారు కన్నీరుమున్నీరుగా ఏడ్చిఏడ్చి తుదకు ప్రాణం తీసుకుంటుందేమోనని గానీ, నాన్న గారు మనోవ్యాధిచే దేశాలుపట్టుకుపోతారేమోనని గానీ భయంలేకపోతే ఈ అసహనీయ వేదన సహించేవాణ్ని కాదు.

కాని సర్వం నీనిర్ణయానికే వదలివేస్తున్నాను. నామీద దయా దృష్టి ఉంచవలసిందన్నదొక్కటే ని స్మరిస్తున్నాను.''

రెండుజాబులూ పోష్టుచేసి మనోరమకు చదువుచెప్ప టానికి వెళ్ళిపోయాడు.

# తొమ్మిదో అధ్యాయం

చిరకాలానంతరం జగదీశపురం భాగ్య భాస్కరుడు ఉదయించాడు. ఇటు కార్తీకమాసమూ, అటు రాజభవన మరమ్మతూ రెండూ ఒకేసారి ప్రారంభమైనాయి. వీటితో పట్టాభిషేక మహోత్సవ సన్నాహాలూ ఆరంభమైనాయి.

ప్రజలమీద ఈగకూడా వాలటానికి వీల్లేదనీ, ఏ విష యంలోనూ బలాత్కారం పనికిరాదనీ రాజాగారి తాఖీదులు. కూలి డబ్బులు పూర్తిగా ఇవ్వకుండా ఎవ్వరితోనూ పని చేయించవద్దని దివానుగారితో గట్టిగా చెప్పాడు. కాని ఇరవై నాల్గుగంటలూ ఊరికే కూర్చోవటం మాత్రం సంభవమా? అతనివద్దకేదైనా ఫిర్యాదువస్తే బహుశా ఎస్టేటునౌకర్లనుచించి చెండాడేవాడేమో. కాని ప్రజలు మహా ఓర్పుగలవాళ్ళు. పాపపుభాండం అంచులకల్లా నిండేవరకూ నోరెత్తిన పాపాన పోరు. అదీగాక ఇంత పెద్ద ఉత్సవం - పట్టాభిషేకం - తల పెట్టినపుడు ఏవో కొద్దిగొప్ప కష్టాలు కల్గటం స్వాభావికమే నన్నభావంతోకూడా ఎవ్వడూ నోరెత్తటంలేదు.

ఎస్టేటుమొత్తంలో ఉన్న యావన్మంది వడ్రంగులూ, దర్జీలూ, మాదిగలూ, గొల్లలూ మొదలైన పనివాళ్ళ శక్తి

అంతా ధారపోసి మూడుమాసాలవరకూ పనిచేశారు. ప్రజల మీద చాలా అత్యాచారాలూ, అన్యాయాలు జరుగుతున్నాయని రోజూ చక్రధరునికి వార్తలు చేరుతుండేవి. కాని వాటిని రాజాగారి దృష్టికి తెచ్చి ఆయన్ని చిక్కులకులోను చేయటం చక్రధరుని కిష్టంలేదు. తరుచు స్వయంగా కూలిలనూ పనివాళ్ళను కలుసుకుని ఏవేవో బోధించివస్తూ ఉండేవాడు. ఈ రకంగా మూడు నెలలు గడిచాయి. రాజభవన స్వరూపం పూర్తిగా మారిపోయింది. చూపులకు కొత్తగా నిర్మించినట్లే ఉంది. ఆ చిన్న పట్టణమంతటా గుమ్మాలు విద్యుద్దీపాలతో అలంకరించబడ్డాయి. రాజ పట్టాభిషేక మహోత్సవం నిమిత్తం బ్రహ్మాండమైన పందిరి వేయబడింది.

ఇంతవరకు పనులన్నీ చాలవరకు ఒక్క రాగి దమ్మిడీ ఖర్చులేకుండానే జరిగిపోయాయి. కూలీలకు రెండుపూటలూ అన్నంమాత్రం పెట్టేవాళ్ళు. ఇప్పుడిక నగదు వెచ్చించవలసిన అవసరం కలిగింది. రాజాలకు ఆదర సన్మానాలూ, ఇంగ్లీషు అధికారులకు టీపార్టీలూ - డిన్నర్లూ డబ్బుఖర్చులేకుండా ఊరికే ఎలా జరగగలవు? ఖర్చులకు ఐదులక్షలకుపైగాఅంచనా వేయబడింది. బొక్కసంలో చూడబోతే గుడ్డిగవ్వకూడా లేదు. ఆసాములనుండి ఆరుమాసాలశిస్తు ముందుగానే వసూలుచేసుకూర్చున్నారు. పట్టాభిషేక లగ్నం పడదోసుకొస్తూఉంది. కాని ఏంచేయటానికీ పాలుపోవటం లేదు.

సంధ్యాసమయం. ఉస్తాద్ మేడూఖాన్ దగ్గర కూర్చుని సితారువాయించటం ప్రాక్టీసు చేస్తున్నాడు, రాజాగారు. ఇంతలో దివానూ, మున్షీజీ వచ్చి పక్కన నిల్చున్నారు.

"ఏమైనా అతి జరూరుపనా?" అని ప్రశ్నించాడు విశాలసింగ్.

దివాన్:—అయ్యా! రాజ్యాభిషేకమహోత్సవం ఇంకో వారంరోజులు మాత్రమే ఉంది. ఇంతవరకు డబ్బు ఏర్పాట్లేమీ జరగలేదు. కలిపిస్తే ఏబ్యాంకులోనో ఒక ఐదు లక్షలు తీసుకు రావాలని ఉంది.

రాజా:—వీల్లేదు, అలాంటిమాట అసలు తలచనే తలచ రాదు.

దివా:—అయితే ఆసాములదగ్గర అరకకు పదిరూపా యల చొప్పున అదనపు పన్ను వసూలుచేస్తే బాగుంటుంది.

రాజా:—నా పట్టాభిషేకంకోసమని రైతులను పీడించ జాలను. ఇంతకన్న అసలు ఉత్సవం మానుకోవటమే ఉత్తమం.

దివా:—మహాప్రభూ! ఎస్టేట్లలో ఇది పాత సాంప్ర దాయమే. ఇందులో కొత్త ఏమీలేదు. రైతులంతా సంతోష పూర్వకంగా ఇస్తారు. ఇందులో ఎవ్వరూ అడ్డు చెప్పరు.

మున్షీ:—ఆ ఇవ్వటంలోకూడా ఆడుతూ - పాడుతూ ఇస్తారనుకోండి.

రాజా:—దీనివల్ల ఏఒక్క-డికీకష్టంగాఉండదనీ,సంతోష పూర్వకంగా తమంతట తామే తెచ్చిఇస్తారనీ మీకుగనక గట్టినమ్మకముంటే, మీ స్వంతబాధ్యతమీద అలాగే చేయ వచ్చు. అంతేగాని ఫిర్యాదనేది నా చెవుల్లో వినరాదు.

దివా.—హుజూర్! ఫిర్యాదనేది కొద్దోగొప్పో ఎలాంటిపరిస్థితిలోనైనా రాకతప్పదు. బొత్తిగా రాకుండా చూడటం అసంభవం. పాలకులు,ప్రజలమధ్యనున్న సంబంధమే

అటువంటి దనుకోండి. ప్రజల శ్రేయస్సుకొరకు ఏదైనాస రే చేయండి, కాని అదీ సందేహదృష్టితోనే మాస్తారు ప్రజలు. పదిరూపాయలచొప్పున వసూలుచేస్తే మొత్తం ఐదు లక్షల రొక్కం చేతి కొస్తుంది. ఇక వంటసామగ్రివిషయమంటారా? అదంతా ఇట్టే వచ్చిపడుతుంది. ఇక ఇప్పుడు మీరు అనుమతి ఇవ్వటమొక్కటే తరువాయి.

మున్షీ:—'మీరు మీ బాధ్యతమీద వసూలు చేస్తే నా కేమీ అభ్యంతరం లేదూ'అని ఏలినవారు చెప్పనే చెప్పారు గదటయ్యా! ఇంక అనుమతి సమస్య ఏముంది? వెళ్లాంపదండి. ఇంక ఆట్టే దొరగాన్ని శ్రమపెట్టకండి.

రాజా:—ఏఒక్కరికీ కష్టం కలుగకుండాఉండేవిధంగా చూడండి. రైతులు సంతోషపూర్వకంకా స్వయంగావచ్చి పల్గొనేటట్లు చూడండి.

ఇటు హుకుం రావటమే తడవాయె. ఎస్టేటు నౌకర్ల చేతులసలు దురదెక్కి, జిలజిలగానే ఉండె. ఇంకేం? వసూలు చేయమని రవ్వంత చెవినిబడగానే, సిబ్బందిఅంతా ఆనందంతో ఒక్కసారిగా ఎగిరిగంతేశారు. ఇక చెప్పేదేం! వారిఇష్టారాజ్యం. ఘోరాలకు అంతులేదు. అత్యాచారాలు హద్దుమీరిపోతున్నాయి. ఎస్టేటంతటా కాకిగోల ప్రారంభమైంది. ఏమూల చూచినా దోపిడీలే. ఎక్కడచూచినా దౌర్జన్యాలే. నోటి కొచ్చినట్టు బూతులుకూయటమనేది అతిసామాన్య విషయం. ఒకడి దుక్కి టెడ్లను విప్పుకుపోతుంటే, ఇంకొకడి పాడి పశువుల్ని ఊడతీసుకుపోతున్నాడు. ఎందరిపంటలు వెన్నుమీదనే కోయించుకుపోయారో లెక్కబెట్టి చెప్పటం కష్టం. బేదఖలీలు

చేస్తామనీ, అదనపు శిస్తులు వసూలుచేస్తామనీ బెదరింపులమీద బెదరింపులు వస్తున్నాయి. సంతోషపూర్వకంగా ఇచ్చినవాడు ఒక పదిరూపాయలతోనే గట్టెక్కాడు. కాస్త వెనకా ముందూ ఆలోచించినవాడూ, రూలూ - గీలూ అని కాస్త తెలివి తేటలు చూపెట్టినవాడూ పదికిబదులు రెండు, మూడు, నాలుగు పదులు సమర్పించుకోవలసివచ్చింది. తుదకు గత్యంతరం లేక ఒకరోజున వెళ్ళి రాజాగారితో ఫిర్యాదు చేశాడు చక్రధరుడు.

"ఐతే ఇంతవరకే రైతూ ఫిర్యాదుచేయటానికి నా దగ్గరకే రాలేదే. మరి వాళ్ళతరఫున మీ ఈ వకాల్తా దేనికి?" అన్నాడు రాజాగారు మొహం చిట్లిస్తూ.

చక్ర:—మీఎదుట కొచ్చి ఫిర్యాదుచేసే సాహసం వాళ్ళకు ఎక్కడనుంచి వస్తుంది?

రాజా:—నేనిది అంగీకరించజాలను. కష్టంగా ఉన్నవాడెన్నడూ నోరుమూసుకుకూర్చోలేడన్నసంగతి మరువవద్దు.

చక్ర:—ఐతే మీమీదేమీ ఆశపెట్టుకోవద్దంటారా?

రాజా:—నాకర్మచారులకూ, నాసిబ్బందికీ నేనేమీ భిన్నం కాదు.

చక్రధరుడు ఈ మాటలకిక మారుచెప్పలేదు. చక్రధరుడు రాజభవనానికి రావటంచూచి "నువ్విక్కడికేంపనిమీద వచ్చావు? స్వవిషయం ఏమీమాట్లాడలేదా?"అన్నాడు మున్షీ వజ్రధరుడు.

చక్ర:—స్వవిషయం ఏముందీ చెప్పటానికి? ఎస్టేటంతా మహా దారుణంగా ఉందని వార్తలు వచ్చాయి.

వజ్ర:—ఇదంతా నీ అనుచరులు చేస్తున్న కొంటె తనం తప్ప ఇంకేమీలేదు. సమితిసభ్యులు గ్రామాలకు పోయి రైతుల్ని రెచ్చకొడుతున్నారు.

చక్ర:—రైతులమీద జబర్దస్తీ జరుగకూడదు. మేం కోరేదల్లా ఇదొక్కటే. ఈ విషయంలో మీరంతా హామీగా లూ ఇచ్చారు; వాగ్దానాలూ చేశారు. మరి ఇప్పుడిదంతా ఎందుకు జరుగుతోంది? ఈకొట్లాటలేమిటి?

వజ్ర:—ఎందుకా? బలవంత మేమీ లేదు. 'ఇష్టమైతే ఇవ్వండి, కష్టంగా ఉంటే ఊరుకోండి' అని రాజాగారి తరఫున మొత్తగానే చెప్పబడింది. గనుక, నీ సంఘంవాళ్ళను వెనక్కి పిలిపించుకో. తర్వాత చూడు, ఎంత సుళువుగా పని జరుగుతుందో. ఇవ్వాళనే మీవాళ్ళందర్నీ పిలిపించేయి. లేకపోతే క్షేమంలేదు. ఎస్టేటు సిబ్బంది అంతా వాళ్ళంటే మండిపోతున్నది. కొట్లాటలు జరుగుతాయేమోనని సందేహంగా ఉంది.

తన సమితిసభ్యు లందర్నీ వెంటనే వెనక్కి పిలిపిస్తానని అక్కడనుంచి వెళ్ళేప్పుడు . వాగ్దానమైతే చేసి వెళ్ళాడు చక్రధరుడు. కాని లోన పీకులాటగానే ఉంది. ఏంచేయాలో తోచటంలేదు. ఎడతెగని ఆలోచనల్లో మునిగి తేలుతూనే మనోరమవద్ద కెళ్ళాడు.

అతను విచారంగా ఉండటంచూచి "మీ రేమిటోగాని చాలా విచారంగా ఉన్నట్టు కన్పడుతున్నారు. ఇంటిదగ్గర అంతా క్షేమమేగదా!" అంది మనోరమ.

చక్ర:—ఏ ముంది మనోరమా! అప్పుడప్పుడు నా పరిస్థితి చూచుకుని ఏడుపు వస్తూఉంటుంది. ఒకపక్కన సమస్త

దేశం దాస్యశృంఖలాలతో బంధించబడిఉంది. ఐనా రెండో ప్రక్కన మనం మనతోటిసోదరులగొంతులు కోయటాని కేమాత్రం వెనకాడటంలేదు. రాజాగారు పుట్టినప్పటినుండీ ఆయనమీద ఏమేమో ఆశలు పెట్టుకు కూర్చున్నారు ప్రజలు. కాని గద్దెక్కి ఇంకా పట్టుమని ఆరు నెలలన్నా కాలేదు. అప్పుడే ఈయనా ఆ పాతపద్ధతులే అవలంబించసాగాడు. ల్యాండ్లు చూపించి ప్రజలదగ్గర డబ్బు వసూలుచేస్తున్నారు. చెప్పుకుం దామంటే నాథుడు లేడు. అన్నిటికన్న అధిక విచారకరవిషయ మేమంటే దివానుగారూ, మా తండ్రిగారూ, వీరిద్దరే రాజాగారికి సలహాదారులూ, మంత్రులూను. వీరే ఈ దారు ణాలకూ, అత్యాచారాలకూ ముఖ్యకారకులు.

సరళస్వభావులు అన్యాయం సంగతి విని ఉద్రేకపడు తుంటారు. "ఎవరికీ ఒక గుడ్డిగవ్వకూడా ఇవ్వొద్దని రైతుల కెందుకు బోధించరూ! ఇచ్చేవాడే లేకపోతే వీళ్ళింక చేసే దేమిటి?" అంది మనోరమ ఆవేశంతో.

చక్రధరునికి నవ్వొచ్చింది. "నువ్వేగనక నా స్థానంలో ఉంటే రైతులను ఇవ్వకుండా ఆపుచేసేదానివేనా?"

మనో:—తప్పకుండా! నగారా మీద దెబ్బకొట్టి మరీ చెప్పేదాన్ని - 'జాగ్రత్త! రాజాగారి మనుష్యుల కొక్క దమ్మిడీకూడ ఇచ్చేరు సుమా' అని. అంతేగాదు, ఇలాకా లోకి మళ్ళీ అడుగుపెట్టే పేరుకూడా ఎత్తకుండా ఉండేవిధంగా మర్దనచేయించేదాన్ని.

ఈ మాటలు వినేటప్పటికి చక్రధరునికి రోమాలు నిక్క పొడుచుకున్నాయి. చిరునగవుతో ''దివానుగారికి కోపం వస్తేనో?'' అన్నాడు

మనో:—వస్తే వచ్చుగాక. ఒక ఎల్లయ్యకు కోపం వస్తుందన్న భయంతో యథార్థం చెప్పకుండా దాచిపెడ్తారా!

ఈ విషయంలో ఇంకేమీ చర్చ జరగలేదు. కాని పాఠాలు చెప్పి బయలుదేరినపుడు మాత్రం చక్రధరుని మనస్సులో ఇకమీదట ఇక్కడికి రావటం మంచిదేనా? అని ఒక ప్రశ్న ఉదయించింది. ఇవ్వాళ వివేకమనే వెల్తురులో తన అంతరంగాన్ని తడిమిచూచుకున్నాడు చక్రధరుడు. ''ఇక్కడ ఉండటం తప్పు'' అనే భావాలెన్నో అందులో మరుగుపడి ఉన్నాయి.

## పదో అధ్యాయం

ఒకరకంగా పట్టాభిషేకానికి చాల రోజులు ముందుగానే అతిథులూ, అభ్యాగతులూ రానారంభించారు. కాని, ఇక మూడురోజులున్నదనగా వేసినగుడారాలన్నీ పూర్తిగా నిండిపోయాయి. దివానుగారు క్యాంపులమధ్యనే అంగళ్ళుఏర్పాట్లు చేయించాడు. తిండి వస్తువులూ, నీళ్ళూ, పాలూ మొదలైనవి సమస్తం అక్కడే ఏర్పాటు చేయబడ్డాయి. రాజాగారు స్వయంగానే అతిథులకు మర్యాదలు జరుపుతున్నాడు. కాని జనానికి అంతులేదు. అహర్నిశం ఒకటే రొదగా ఉండేది.

ఇటు అతిథుల, చుట్టపక్కాల మంచి-చెడ్డలు చూచే హడావుడి జోరుగా ఉంది. కాని అటు రొమ్ములు పడిపోయేటట్లు పనిచేస్తున్న కూలీలగతి ఆలకించినవాడే లేడు. పని చేయించుకోటానికైతే అంతా పెత్తందారులే. కాని తిండీ తిప్పల సంగతి చూచే దిక్కు మాత్రం లేదు. మాదిగలు జాముప్రొద్దుండగానే లేచి పచ్చగడ్డికోసం పోయేవాళ్ళు. పాకీవాళ్ళూ అలాగే లేచి ఊడ్వటం ప్రారంభించేవాళ్లు. గొల్లలూ అంత ప్రొద్దుకడనే లేచి నీళ్ళకావిళ్ళు భుజాన వేసుకొనేవాళ్లు. కాని వాళ్ళ సంగతి పట్టించుకునే మహానుభావులెవరూ లేరు. బంట్రోతుల్ని చూడబోతే వాళ్లు చీటికీమాటికీ బూతులపంచాంగం ఇంత వెడల్పున విప్పుతుండేవాళ్లు. ఔను, ప్రతి చిన్నవిషయానికీ బూతులుతింటూ, సిగ్గువిడిచి పెరిగిన మహాశయులే గదా! కానిఒక్క తేడా ఉంది. ఈ బంట్రోతు దొరలకు సహనం కాస్త మెండు. ఎందుకంటే ఆ పంచాంగం కట్టంతా మోసుకెళ్లి ఇంకొకరి మీద విసిరికొట్టే అవకాశముందిగనక. మొదటిరకం. మనుష్యుల సంగతి వేరు. వాళ్ళంతా జీత - భత్యాలు లేకుండా ఊరికేనే ఊడిగం చేయటానికి బలవంతంగా పట్టుకురాబడ్డ రకం. మాటంటే మంటగా ఉండేది. తిండీ, నీళ్ళూ లేకుండా అసలే పేగులు మాడిపోతున్నాయి. పొద్దుగూకులూ మండుటెండల్లో మాడిపోవటం, ఆపైన రాత్రంతా ఆకలిమంటలతో అల్లాడిపోవటమూనూ. ఇక వీటికితోడు మాటలమంటకూడా అయితే, ఎవడు సహిస్తాడు? అసంతోషం పెరిగిపోతూంది. ఎప్పుడు సమ్మెకు దిగుతారో, ఏ నిమిషాన ప్రాణాలకు తెగించి దెబ్బలాటకు సిద్ధమవుతారో ఏమిటో అర్థంకావటం లేదు!

సంధ్యాసమయం. అటు అభిషేక ముహూర్తం సమీపించింది. యజ్ఞ సన్నాహం జరుగుతోంది. సంస్థాన సిపాయిలందరికీ యూనిఫారం వేసుకుని సిద్ధంగా ఉండమని హుకుం ఇవ్వబడింది. ఇంతలో ఆకస్మికంగా దొడ్డిలోనుంచి కూలీల లబోదిబోలు వినవచ్చాయి. ఏదో ఒక క్యాంపులో పచ్చగడ్డి తక్కువయిందట. ఇంకేం! హరిసేవకసింగ్ కొరడా పుచ్చుకుని మాదిగల్ని చెండాడుతున్నాడు. మున్షీ వజ్రధర మహాశయుని కళ్లు చింతనిప్పులు గ్రక్కుతున్నాయి.

మాదిగల పెద్ద చేతులు జోడించి "అయ్యా నిన్నటి గడ్డి రాత్రే తీసుకొచ్చి పడేశాం. ఈపూట ఇంకా తీసుకు రానిమాట వాస్తవమే. సగంమంది శోషవచ్చి పడిఉన్నారు. ఏం చేయం ?" అన్నాడు.

మున్షీ:—బద్మాష్! అబద్ధాలు కూస్తున్నావా! ఇప్పుడువెంటనే 'పోలో' ఆట ప్రారంభం కాబోతూంది గదా! మరి గుర్రాలు కడుపునిండా మేయకపోతే ఎట్లా పరుగెత్తుతాయనుకొన్నావురా గాడిదా!

"మేం కూడా - నీళ్ళు లేకుండా ఎనిమిది రోజుల నుంచీ పచ్చిగడ్డి డొక్కని తెస్తుంటే లేదుగానీ, ఒక్కరోజు మేత లేకపోతే ఈ గుర్రాలు పరుగెత్తలేవా ఏమిటీ!" అంది ఒక యువకగొంతు.

కర్రతీసుకుని ఆ యువకుణ్ణి కొట్టబోయాడు వాళ్ళ పెద్ద. అంతకంటే ముందే చెంగునపోయి ఛెళ్లు ఛెళ్లుమని నాలుదు జబురుకున్నాడు దివాను మహోదయుడు. దిగంబర

దేహం; చర్మం బద్దలై ఊగుకుంది. రక్తధారలు ఎడతెగకుండా ప్రవహించసాగాయి.

వాళ్ళిద్దరిమధ్య కెళ్ళి అడ్డంగా నిలబడి "హుజూర్! ప్రాణం తీయదలచుకున్నారా ఏమిటి? పిల్లకుంక, ఏమన్నా కాస్త పొరపాటున నోరుజారితే ఏలినవారు క్షమించాలి. పాలించేప్రభువులు ఆ మాత్రం దయగలిగి ఉండాలి'' అన్నాడు మాదిగపెద్ద - చౌదరి.

ఇంక దివానుగారికి మరింత ఛర్రుమంది. ఒళ్ళు తెలియకుండాపోయింది. 'ఒకమాదిగవెధవ కింత పొగరుబోతనమా తన ఎదుట నోరెత్తి మాట్లాడటమా! ఆ కొరడాతోనే చెళ్ళు చెళ్ళుమని చౌదరి పెద్దకూ వడ్డించాడు. ముసలితనం, ఆపైన ఎన్నో రోజుల్నుంచి తిండిలేదు; నేలమీద తిన్నగా నిల్చోవటమే గండంగా ఉంది. ఇంకేం, కొరడా ఒంటిమీద పడటమే ఆలస్యం, వెంటనే నేల కొరిగిపోయాడు. పకుపుల దొడ్డంతా గొల్లుమంది. ఆ గల్లంతు విని క్షణంలో వందలాదిజనం పోగయ్యారు భయస్థులైన కొందరు మాదిగలు తప్పుగోలలూ, త్రాళ్లూ తీసుకుని గడ్డికి బయలుదేరబోతున్నారు. ఇంతలో చౌదరిని కొట్టడం జరిగింది. తమ కులపెద్దపైన కొరడాపడటం చూశారు. వాళ్ళూ ఆ తాళ్లు అక్కడే నేలకేసి విసరికొట్టారు. గబగబా పోయి చౌదరిని లేపసాగారు.

"పోండి, ఇక్కడున్నట్టుగా పోయి ఒక గంటలో గడ్డి కోక్కురండి. లేకపోతే పక్కటెముకలన్నీ నజ్జునజ్జవుతాయని గుర్తుంచుకోండి" అన్నాడు దివాను గర్జిస్తూ.

"పని చేయటాని కొచ్చాం గానీ, ప్రాణాలేమీ ఇవ్వ టానికి రాలేదు. కూడూ - నీళ్ళూ లేకుండా చావటమా? ఆ పైనేమో తన్నులా? ఇందుకేనా ఏమిటి మేం పుట్టింది? సరే. ఎందుకొచ్చిన గొడవ! మీ ఇష్టమొచ్చినవాళ్ళచేత పనిచేయించుకోండి. మా కొంపలకు మేం పోతున్నాం" అన్నాడొక మాదిగ.

మున్షీ:—దొడ్డిదాటి అవతలికి అడుగుపెట్టిన ట్టుండాలి చెపుతా! ప్రాణంతీశానన్నమాటే. ఫిరంగుల్తో కాల్పిస్తా.

కాని మాదిగల నెత్తిపై ఆవేశభూతం ఎక్కి కూర్చొని ఉంది. వృద్ధచౌదరిని ఎత్తుకున్నారు. యావన్మందీ ఒక్కదండుగా దొడ్డి గేటువేపుకు సాగారారు. కవాతు చేస్తున్న సిపాయిలకు దివాను కబురుచేశాడు. కన్నుమూసి కన్ను తెరచునంతలో అంతావచ్చి దొడ్డిగేటుకు ఎదురుగా నిలబడ్డారు. అన్ని క్యాంపుల్లోనూ గలంతు పుట్టింది, రకారకాల పుకార్లు పుట్టాయి. పట్టాభిషేకపు దుస్తులు - కళ్ళు చెదరిపోయే దుస్తులు-వేసుకుంటున్నాడు రాజాగారు తన గుడారంలో. ఈ కబురు వినే టప్పటికి ఎక్కడలేనికోపం వచ్చింది. కోపంతో పిచ్చెక్కిపోయి తుపాకి తీసుకుని గుడారంలోంచి బైటి కొచ్చాడు. కొందరిని వెంటబెట్టుకుని దొడ్డిగేటువద్ద కెళ్ళాడు.

ఈ లోపల ఒళ్ళు దులుపుకుని లేచి కూర్చున్నాడు చౌదరి. రాజాగారిని చూచీ చూడగానే ఏడుస్తూ "మహా ప్రభో! రక్షించాలి, రక్షించాలి. మీ కొక దణ్ణం. అయ్యగారూ! మహా అన్యాయంగా ఉంది. బీదవాళ్ళు చచ్చిపోతున్నారు" అన్నాడు.

రాజా:—ముందు మీరంతా గేటు వదిలి అవతలకు పొండి. తర్వాత చెప్పవలసిం దేమన్నా ఉంటే చెప్పండి. ఎవ్వడైనా దొడ్డిగుమ్మం దాటి ఇవతలికి పాదంపెట్టాడో ప్రాణం తీశానన్నమాటే.

చౌద:- ప్రభువులు మమ్మల్ని పనికోసమని పిలిపించారా లేక చావగొట్టి అవతలపారేయటానికి పిలిపించారా!

రాజా:- పనిచేయకపోతే ప్రాణం తీయబడుతుంది.

చౌదరి:- పనేమో మీది చెయ్యాలీ! మరి తిండి కోసం ఎవరింటి కెళ్ళాలండీ!

రాజా:- ఏమిట్రా ఆ వెధవమాటలూ? నోరుముయ్. మీరు యావన్మందీ నాకు నగుబాటు తీసుకురావాలని చూస్తున్నారు. మీరంతా నీచులు. మరి నీచులు తన్నుల్లేకపోతే చెప్పినమాట వినరు.

చౌద:- మా వెనకాల ఇప్పుడెవ్వరూ లేరనుకున్నారా, తన్నులుతింటూ నోరెత్తకుండా పడిఉండటానికి? సేవాసమితి దొరలు మా వెనకాల ఉండనే ఉన్నారు. వారన్నా కాస్త న్యాయాన్యాయాలు చూడరా!

రాజా:— అల్లాగా! ఐతే వాళ్ళమీద మీకు అభిమానం ఉండా!

చౌదరి:— తప్పకుండా. మాకు అండదండగా ఉంటూన్నప్పుడు అభిమాన మెందు కుండదూ?

రాజా విశాలసింగ్ పెదవులు కొరుకోసాగాడు-“ఐతే ఇదంతా 'సమితి' వాళ్ళ నాటకమన్నమాట. చక్రధరుడు నా దగ్గర కపటనాటకాలాడుతున్నా డన్నమాట. కాయ

బిడ్డ చక్రధరుడా! నా పాదాలవద్ద బ్రతికేవాడిబిడ్డా! చూస్తాను, వీడు నన్నేం చేయగల్గిందేమిటో. ఈ మూర్ఖులబుర్ర ల్లోంచి ఈ అభిమానాన్ని తొలగించిపారవేయాల్సిందే. ఈ విషప్పురుగులు వ్యాపించాయంటే బ్రతకటమే కష్టమవుతుంది."

చౌదరి ఏమో ఈరకంగా మాట్లాడుతున్నాడు. అక్కడ దొడ్లోనేమో గల్లంతుగల్లంతుగా ఉంది. ప్రభుత్వ మనుష్యుల్ని చూస్తేనే ప్రాణాలెగిరిపోయేవాళ్ళంతా ఇప్పుడు నిశ్శంకతో, నిర్భయంగా ప్రాణాలర్పించటానికి నడుములు బిగించి నిల్చొన్నారు. గేటుగుండా పోయేమార్గం కనపడక దొడ్డిగుంజలూ-వాసాలూపీకి, తాళ్ళన్నీ తెంపి అవతలపారేశారు. అటునుండి వేలకువేలు ఒక్కసారి ఫెళఫెళమని ముందుకు పడదోసుకొచ్చారు పొంగుతూవచ్చే నది ఆనకట్టను బద్దలుకొట్టుకుని పోయినట్టుగా. అదేసమయంలో ఒకవేపునుండి సాయుధపోలీసులూ, రెండోవేపునుండి కొంతమంది 'సమితి' యువక సభ్యుల్ని వెంటబెట్టుకుని చక్రధరుడూ వస్తున్నట్టు కన్పించారు.

వాళ్ళను చూచేటప్పటికి సమ్మెదారులకు ప్రాణాలులేచి వచ్చాయి- అబోధ బాలకుడు తనతల్లిని చూచి సింహాప్పిల్ల అయినట్టుగా. వేనకువేలు వచ్చి చుట్టూ మూగారు. 'వచ్చారు వచ్చారు; అన్నయ్యగారొచ్చారు, బాబయ్యగారొచ్చారు' అన్న ధ్వనితో గగనమండలం మారోర్మోగింది.

"ఏం సోదరులారా! మీకు నేను మిత్రుడ నంటారా లేక శత్రువు నంటారా? ఏ మనుకుంటున్నారో చెప్పండి" అన్నాడు చక్రధరుడు బిగ్గరగా అందరికీ వినపడేటట్లు.

చౌద:— అయ్యో బాబుగారూ! ఇదికూడ ఇంకా అడగాలా ? మీరే మాకు యజమాన్లు, ప్రభువులు; సహాయకులు.

చక్రధరుడు ఆ గుంపులోనుండి వచ్చి తిన్నగా రాజాగారిదగ్గరకెళ్ళి "మహారాజా! మీకొక చిన్నవిన్నపం చేయగోరుతున్నాను" అన్నాడు.

"నే నిప్పు డేమీ వినదలచుకోలేదు" అన్నాడు మొహం ఇంతచేసుకుని రాజాగారు.

చక్ర:— వినదలచకపోతే తర్వాత పశ్చాత్తాపపడ్తారు సుమా.

రాజా:— వీళ్ళందర్నీ వరుసబెట్టి తుపాకులతో పేల్పించిపారేస్తా.

చక్ర:— దీనప్రజల రక్తబిందువులతో రాజ - తిలకం అలంకరించుకోవటం ఏ ప్రజాపాలకునికీ శుభంకాదు సుమండీ. ప్రజల ఆశీర్వాదమే ప్రభుత్వానికి అన్నిటికీ మించినబలం; అండా, దండానూ. నేను మీశ్రేయోభిలాషిని. అంచేతనే మీపాదసన్నిధి కొచ్చాను. ఈ ఉప్పెనకంతటికీ మూలకారణం మీ అయోగ్యులైన సంస్థానతాబేదారులే. మీసిబ్బందిఅంతా వేడెక్కిపరవళ్లు తొక్కుతున్నారు. తుపాకిగుండ్లతో ఈ ప్రజలందర్నీ నల్లుల్లా మాడ్చివేయగలరు. కాని వాళ్ళ రక్తబిందువులు ఈ దొడ్డిలోనే ఇంకి ఊరుకోవు. ప్రవాహంగా ప్రవహిస్తుంది. ఈ క్యాంపులన్నికూడా బురద బురదగా తడుస్తాయి. దానితరంగాల ఊపులతో ఈ విశాలమంటపం ఫెళ్ళుమని విరిగి ఊరుకుంటుంది. ఆకాశాన రెపరెపలాడుతూ ఎగురుతున్న ఆ

ధ్వజం నేల కరుచుకుంటుంది. సంస్థానమంతా హాహాకారాలతో ప్రతిధ్వనిస్తుంది."

తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళున్న మాటవిూద నిల బడి ఉండటంలో రాజా గట్టివాడే. కాని ఇప్పుడుమాత్రం గుండెల్లో గుండెలులేకుండా ఉన్నాడు. చక్రధరునికేసి చూస్తూ "వీళ్ళ కేమన్నా ఫిర్యాదు లుంటే తిన్నగా నాదగ్గర కొచ్చి నాతో చెప్పితే సరిపోయేది. కాని అలాచేయక తలపొగరుగా వ్యవహరించారు. రాత్రేమో గుర్రాలకు మేతకోసుకురాలేదు. మరి ఇప్పు డేమో వెళ్ళిపోవటానికి సిద్ధంగా కూర్చున్నారు. ఇది మాకు మహావమానం. నే నిది సహించలేను." అన్నాడు.

చక్ర:— మీావద్ద కొచ్చి చెప్పుకునేటంతటి అవకాశ మెప్పు డిచ్చారు? వారం రోజులనుండి పిడికెడు మెతుకుల క్కూడా నోచుకోలేదన్నసంగతి మీాకు తెలుసా?

రాజా:— మీా రనేమాటలు నా కర్థంకాలేదు. ప్రతి ఒక్కడికీ కపుడునిండా అన్నంపెట్టమని గట్టిగానే చెప్పానే. ఏమయ్యా! దివానుగారూ! ఏమి టీగొడవ?

దివాను:— ధర్మావతారా! ఈ మహాశయుని మాటల కేంలెండి. నమ్మకండి. ఈ నిప్పుపెట్టింది ఈయనగారుకాదూ!

మున్షీ:— దీనబంధో! ఈ బొట్టికాయ కేం తెలుసు లెండి! వీడు ఒట్టి అమాయకుడు. ఎవ డేంచెప్పితే అదే నమ్ము తాడు.

రాజా:— సరే, ఈవిషయం కనుక్కుంటానులే.

దివాను:— హుజూర్! రెచ్చగొట్టి ప్రజల్ని ఉద్దండు లుగా తిరుగుబాటుదారులుగా తయారుచేసింది వీళ్ళే. ఎవ్వరికీ

ప్రజలమీద రాజ్యంచేసే హక్కు లేదట. వాళ్ళచేత ఊడిగం చేయించుకునే అధికారం అసలే లేదట. ఇదీ వీళ్ళప్రచారం. ఇంతేకాదు- ప్రజలే భూమికి ఖామందులు,దున్నేవాడికే భూమిమీద హక్కు, సంస్థానాధీశుడు ప్రజలసేవకుడు అని కూడా వీళ్లు ప్రచారంచేస్తున్నారు.

రాజా:— ఇందులో అబద్ధమేముందీ? నేను యథార్థంగానే ప్రజలదాసుడను. కాదు, కాదు, వాళ్ళదాసానుదాసుడను.

దివా:— హుజూర్! వీళ్ళప్రచారాన్ని గురించి ఎంతని చెప్పను? రాజాగారికి ఇంత పెద్దమేడలో ఉండడానికి హక్కు లేదట. ఈభూమిమీద అసలు రాజుల అవసరమే లేదట.

రాజా:— ఇందులో అక్షరంకూడా పొరపాటేమీ లేదే! తుదకు పొట్టనిండా మెక్కిపడిఉండటంమినహా నాకింకో పనిమాత్రం ఏముందీ!

చక్ర:— ప్రజలకు తమహక్కుల్ని గురించి చెప్పిన మాట వాస్తవమే. కాని రాజుల కసలు భూమిమీద ఉండే హక్కేలేదనిమాత్రం చెప్పలా. అలాచెప్పకపోవటానికి కారణం రాజులఅవసరంలేకుండాపోయినరోజున వారి అంతమూ తప్పక జరిగితీరుతుందని నాకు తెలుసు.

రాజా:— నే నేమీ చెడుగా భావించటం లేదనుకోండి. అంతా చెప్పేమాటలే మీరూ చెబుతున్నారేగాని కొత్తదేమీ చెప్పటంలేదే.

రాజాగారు తన్నేదో ఎగతాళిక్రిందకట్టి మాట్లాడుతున్నట్టుగా తోచింది చక్రధరునికి. కోప మొచ్చింది. రాజానుద్దేశించి "మీరు చెబుతున్నమాటలు కత్తిలేనివే అయితే

ప్రజల కీ ఇక్కట్లు వచ్చిఉండేవే కాదు. ప్రజల మనస్సులను తియ్యటికబుర్లతో ఉబ్బగొట్టటం, అటు తమ తాబేదార్లను ఇష్టమొచ్చినట్లుగా జులుంచేయటానికివదలిపెట్టటం—ఇది పాల కుల పాతవిధానమే. ప్రజలమొర చెవుల్లో దూరనివారికి ఆదర్శ పాలకుడని అనిపించుకునే అర్హతలేదు'' అన్నాడు.

రాజా:— నిజం, ఎన్నడూ లేదు. అలాంటివాణ్ని తుపాలతో పేల్చి పారేయాల్సిందే నిండు ప్రాణాలతో గోరీ కట్టవలసిందే. ప్రజల దాసానుదాసు డనుకున్నారా ఇంకే మన్నానా?

చక్రధరుడు ఈ వ్యంగ్యం సహించలేకపోయాడు. అతని నైజగుణం అతన్ని విడిచిపెట్టింది. ముఖం జేవురించింది. ''ఏ ఆదర్శంముందు పాహిమాం అని తలలొగ్గవలసి ఉందో. దాన్నే పరిహాసించటం మీకు రాణింపు కాదు. మీచేతలకూ మీమాటలకూ ఇంతలో ఇంతగొప్పవైరుధ్యం వచ్చి కూర్చుం టుందని నే నెన్నడూ ఊహించనైనా ఊహించలేదు'' అన్నాడు.

క్రోధం ఇప్పుడు తన నిజరంగులతో బైటపడింది ఇంత వరకూ వ్యంగ్యోక్తులతో చక్రధరుని వంచాలని చూచాడు రాజా విశాలసింగ్. కాని చక్రధరునిప్రహారం నసాళాని కెళ్ళి తగలసాగేటప్పటికి తానూ తన అస్త్రశస్త్రాలు బైటికి తీయ వలసివచ్చింది. ''మంచిది, బాబుగారూ! ఇక అంతటితో ఆగండి నాలుకను కాస్త అదుపులో ఉంచుకోండి. ప్రజలకు నే నేమీ దాసుణ్నికాను సరిగదా, పైపెచ్చు ప్రజలే నా పాదధూళి. ఉచిత మని భావించినవిధంగా వాళ్ళయెడల వ్యవహరించటానికి

నాకు పూర్తిగా హక్కూ, స్వేచ్ఛా రెండూ వున్నాయి. మా ఉభయుల మధ్య మాట్లాడటానికి ఇంకొకడికి హక్కు లేదు. తెలిసిందా ? కరుణించి మీరా రిక్కడనుండి తక్షణం దయ చేయండి. మళ్ళీ ఎన్నడూ నా సంస్థానంలోకి అడుగుపెట్టకండి. లేనిచో పశ్చాత్తాపపడవలసిఉంటుంది. అంతే. వెళ్ళండి వెంటనే వెళ్ళిపోండి" అన్నాడు గద్దిస్తూ.

మున్షీ వజ్రధరునిగుండెలు దడదడ కొట్టుకోసాగాయి. చక్రధరుని తనచేతుల్తో వెనక్కి నెట్టి రాజాగారితో "అయ్యా వారి కృపాదృష్టే వీడి కింత కళ్ళు తెచ్చింది. ఇంతవరకు పెద్దల సాంగత్య మెటువంటిదో తెలియని వెధవ. అటువంటి అవకాశమూ కల్గలేదు. అలాంటప్పుడు పెద్దలముందు ఎలా మాట్లాడాలో, ఎలా వ్యవహరించాలో ఏం తెలిసేడుస్తుంది? అలాంటి తెలివి ఎక్కడనుంచి వస్తుంది?" అన్నాడు మున్షీ.

చక్రధరుడు మూడుకాళ్ళముసలి కాదు; మంచి యౌవనదశలో ఉన్నాడు. ఆ పైన సిద్ధాంతవాది. తు. చ. తప్పకుండా పాటించే మనిషి. ఆదర్శపాలనలో ప్రాణంపోయినా లెక్కచేయని వ్యక్తి. ప్రభుత్వాదురధికారాలకు పరమశత్రువు. రాజాగారి పొగరుతోకూడిన దర్పోక్తులు విని అణుమాత్రం కూడా చలించలేదు. భయభీతుడూ కాలేదు. రొమ్ము విరుచుకుని, మాంచి బిగువుగా ముందుకొచ్చి "ఊరకంగా మాట్లాడుతున్నందుకు సిగ్గుపడాలి. ప్రజలయోగక్షేమాలకై ఆత్మార్పణం చేయాలనుకున్నారు. ప్రజలు తమదగ్గరకు రావటానికెట్టి అభ్యంతరమూ ఉండదని చెప్పేవారు. వాళ్ళకొరకు ఇరవైనాల్గు గంటలూ గేటు తెరచే ఉంటుందని గొప్పలు

చెప్పారు. తమకర్మచాలులెన్నడైనా ప్రజకేసి కాస్త వక్రంగా చూచినా, కన్నెర్రచేసిచూచినా సహించవని చెప్పారు. ఐతే ఆ మాటలన్నీ మరచిపోయూరా? అప్పుడే! ఇంత త్వర గానే! అరే! చెప్పిఎన్నాళ్లో, కాలేదే? కాని ఇప్పుడు 'ప్రజలు నా కాలిదుమ్మూ, నాగోటి దుమ్మూ' అని చెబుతున్నారు గదూ!" అన్నాడు.

రాజాగారికి కోపంతో పిచ్చెక్కిపోతోంది. శూలంలా గుచ్చుకునే ఈ మాటలు విని బాధతో ఒక్కసారి ఆవురు మన్నాడు. ఎదురు జవాబులేనపుడు కోపం నీరై పోతూం టుంది. రాజా మళ్ళీ ఒక్కక్షణంలోనే స్వస్థలో కొచ్చాడు. రాచరికతత్వం అశ్రుకణాలను అణగదొక్కి పైన కూర్చుంది. "ఇక్కణ్ణుంచి వెళ్ళిపొమ్మని చెప్పాను" అన్నాడు రొమ్ము చాచి, మిడిసిపాటుగా.

చక్ర:—ఈ మనుష్యు లందరినీ వెళ్ళనిచ్చేవరకూ నేనూ వెళ్ళదలచుకోలేదు.

రాజా:—నా మనుష్యులతో నీ కేం సంబంధం లేదు. వీళ్ళలోంచి కదలినవాడిశవం నేలకూలిందన్నమాటే.

చక్ర:—ఐతే వాళ్ళందరినీ తీసుకుపోవటం మినహా గత్యంతరం లేదు.

ఇలా అని కూలీలవేపుకు మళ్ళాడు చక్రధరుడు. ఇతను రవ్వంత సైగచేస్తే చాలు, ఎక్కడకూలీలు అక్కడే తుగ్రు మంటారనీ, ఆ తర్వాత వాళ్ళను ఆపటం సైన్యాంతరంకూడా కాదనీ రాజాకు తెలుసు. గుడ్లుపెద్దవిచేసుకుని తుపాకితో చక్రధరుని వెనకాల పరుగెత్తాడు. దగ్గర కెళ్ళి సత్తువకొద్దీ

తుపాకీతిప్పి మడమతో కొట్టాడు. నెత్తిమీదనే గనక తగిలి ఉంటే అప్పటి కప్పుడే కుప్పగా కూల్చివేసే దెబ్బ. కాని దేవుడి దయవల్ల, అది వీపుమీద తగిలింది. ఆ విసురుకు తూలిపోయి కొన్ని అడుగులు ముందుకెళ్లి పడ్డాడు. అతను నేల కరచుకోవటమే తడవుగా వేలాదిజనం ఫెళఫెళా దొడ్డిదమలన్నీ విరగ ద్రోక్కుకుని, సాయుధసిపాయిలను పడద్రోసుకుంటూ బైటికొచ్చేశారు. నరేసుల బసలవేపుకు బయలుదేరారు. దారిమధ్యలో అందిన జవానునల్లా పడతోసుకుంటూ పోయారు. క్యాంపులన్నీ లూటీచేయబడుతున్నట్లు కన్పడింది. ఎక్కడి దుకాణా లక్కడే బంద్దైపోయాయి. ప్రేక్షకబృందం చెంగులు ఎగదోపుకుని పిక్కబలంకొద్దీ ఉరాయించుకుపోయింది.ఏమూల చూడబోయినా ఉరుకులూ - పరుగులమయంగా ఉంది. చీకూ చింతా లేనిగూండాలూ, రౌడీలూతమాషాగాళ్లూ(వింత చూడొచ్చినరకం) కూడ తిరుగుబాటుదారుల్లో కొచ్చి కలిసి పోయారు. ఇంత దేనికి? చివరకు క్యాంపులదగ్గరకు చేరుకునే టప్పటికి తిరుగుబాటుదార్లసంఖ్య రెట్టింపైపోయింది.

రాజులూ, శ్రీమంతులూ తమ దుర్వ్యసనాలకుతప్ప ఇంకెవ్వరికీ బానిసలుగా ఉండరు. కాలదాస్యమూ గిట్టదు. తమస్వేచ్ఛను భగ్నపరచే నియమా లేవీ పాటించరు. ప్రొద్దు పొడిస్తే నేం, ప్రొద్దుగూకితే నేం! దాంతో వాళ్ళ కేమిటిసంబాధం! ఒకడు కమ్మని నిద్రలో బ్రహ్మానందంపొందుతుంటే, ఇంకొకడు హాయిగా గాన మాలకిస్తున్నాడు. మరొకడు స్నాన - సంధ్యా పూజల్లో మునిగి ఉన్నాడు. యావన్మందీ అభిషేకం దగ్గరకు వెళ్ళటానికి సిద్ధమవుతున్నారు. ఒక చోట 'భంగు' నూరు

తున్నారు. ఇంకోచోట కవితాగోష్ఠి జరుగుతున్నది. మరొక చోట డ్యాన్సు జోరుగా ఉంది. ఒకడు 'నాస్తా' తీసుకుంటూంటే, ఇంకొకడు పడుకుని ఒళ్ళుపట్టించుకుంటున్నాడు. బాధ్యతారహిత స్వాతంత్ర్యం తన రకరకాల, రంగురంగుల లీలలన్నీ ప్రదర్శించుతూంది. తిరుగుబాటుదారులే గనక ఇక్కడికొచ్చిఉంటే గొప్ప అనర్థం జరిగిఉండేది ఎన్ని రాజవంశాలు రాళ్ళపాలైఉండేవో రాతిదేవుళ్ళకే ఎరుక. కాని పాలకుల ఐశ్వర్యప్రతాపాలే వాళ్ళను కాపాడుతుంటాయి. ఇంగ్లీషు వాళ్ళ క్యాంపులో పదిపదిహేనుమంది అప్పుడే వేటనుండి తిరిగివచ్చినదొర లున్నారు. ఈ గల్లంతు విని వాళ్ళంతా బయటికొచ్చారు. కళ్ళుమూసుకుని ప్రజలపై తుపాకులు ప్రేల్చసాగారు. మొదట్లో ఉద్రిక్తజనం తుపాకుల్ని లెక్క చేయలేదు. దానికి సంఖ్యాబలం ఉంది.

ప్రజానీకం ఉద్రేకదశలో ఆదర్శవాదిగా తయారౌవుతూంటుంది. మొదటిసారి గుండ్లవర్షం కురిసింది. అనేకమంది నేలకొరిగాడు.

చౌదరి:— ఇదిగో సోదరులారా! గాభరాపడేరు సుమా! పడిపోయేవాణ్ని పడిపోనివ్వండి. మనస్సుల్లోఉన్న కోర్కెలు బైటికొచ్చింది ఇవ్వాళ నేగదా! ఇంతకన్న మంచి సమయ మేముంది? జై హనుమాన్‌కీ జై.

ఒకకూలీ:— పదండిముందుకి, పదండిముందుకి. విజయం మనదేనోయ్, పదండి ముందుకి. ఇవ్వాళనేగా... ...

ఆ కూలీ నోట్లోనుండి మాట పూర్తిగా బయటకు రానన్నా రాలేదు. ఇంతలో రెండోసారి గుళ్ళు వర్షించాయి

అనేకమంది మనుష్యులతోసహా ఇద్దరు నాయకుల పనీ పూర్తయిపోయింది. ఒక క్షణకాలం ఎక్కడికాళ్ళు అక్కడే స్తంభించిపోయాయి. పురోగమించాలా లేక తిరోగమించాలా అన్నదే ప్రధానసమస్య. ఇంతలో హఠాత్తుగా "కొట్టండి, చంపండి, హతమార్చండి. ఆగిపోయా రెందుకూ? ఎదుటబడి రంగంలోకి దిగి గుండెలు జారవిడుస్తారా? పదండి ముందుకు. జై కాళికా జై" అంది ఒక యువకకంఠం ఉద్రేకపూరితంగా.

తెల్లదొరల క్యాంపునుండి మళ్ళీ గుళ్ళు వర్షించాయి. అనేకమందితోసహా ఈయువకసింహమూ నేల కొరిగింది. ఇంకే ముంది? క్యాంపంతా గగ్గోలుగగ్గోలైపోయింది. గుళ్లు ఎటు నుంచి వస్తున్నాయో ఇంతవరకు వీళ్ళకు తెలియదు. బహుశా ఈ క్యాంపునుండే వస్తూవుండవచ్చునని ఊహామాత్రమే. ఇప్పుడు వేటగాండ్రు బైటికి రావటంతో గుళ్ళవర్షంఎటునుంచి వస్తూందో స్పష్టంగా తెలుస్తోంది.

"తెల్లోళ్ళదే ఈ పనంతా. ఇంకా చూస్తా రేమిటి? పదండి. అందరిపనీ పట్టించుదాం పదండి. కోడిగుడ్లుమెక్కి ఊర పందుల్లా బలిసిఉన్నారు. పదండి" అన్నా డొక మాదిగ.

అందరూ తెల్లవాళ్ళ క్యాంపువేపుకు మళ్ళారు. ఒక్క జయధ్వానంతోనే వాళ్ళ క్యాంపుగుమ్మంలో కెళ్ళి వాలారు. తెల్లయోధు లింతవరకు రక్షణశ్రేణివద్దనే ఉండి తుపాకులు కాల్చుతున్నారు. కాని ఈ భయంకరజనసమూహం ఎదురుగా రావటం చూచేసరికి మరణ మాసన్నమైనట్టుగా, ప్రాణాలు పోయినట్టుగా అనుభవమయింది. ఇద్దరు ముగ్గురు యోధాగ్రేసరులు కాళ్ళకు బుద్ధిచెప్పారు. ఇంకో ముగ్గురు

నల్గురు వీరపుంగవులు మూర్ఛిల్లి పడ్డారు. ఇక ఐదుగురు మిలిటరీ ఆఫీసర్లుమాత్రమే తమతమ స్థాలాల్లో కాస్త ధైర్యంగా నిల్చొని ఉన్నారు. అసలు వాళ్ళకు బ్రతికి బైటపడే ఆశయే కన్పించలా. ఈ నిరాశయే వాళ్ళను ప్రాణాలకు తెగించి నిల బడేటట్లు చేసింది. ముందుకెళ్ళి జనం రాళ్ళవర్షం కురిపించ సాగింది. చివరకు ఇంగ్లీషు దొరలూ గాయపడి క్రిందపడ్డారు. ఒకడినెత్తి పగిలింది; ఇంకొకడి చెయ్యి తుండాలు తుండా లయింది. ఇంక ముగ్గురు మాత్రమే మిగిలిఉన్నారు. ఆ ముగ్గురే ఈ జనప్రవాహాన్నంతటినీ అడ్డగలరు. కాని వాళ్ళదగ్గరా ఇప్పుడిక గుళ్లు లేవు. ఇటు సమ్మెదారుల ఉత్సాహమూ పెరిగిపోతూంది. వేట జంతు విప్పాను సామ్మసిలి నేల కూలటానికి సిద్ధంగా ఉంది. హింసకు నోరూరుతూఉంది.

హఠాత్తుగా ఎవరో ఒకరు వెనుకప్రక్కనుంచి జనసమూహాన్ని చీల్చుకుంటూ చావుపరుగులమీద ముందుకొచ్చి పడ్డాడు- "చాలు చాలు. ఇక ఆగండి. ఏమి టీపని? దేవుని పేరిట చేతులు దించండి. ఏంచోద్యం, ఏం ఘోరం!" అన్నాడు. జనం అంతా ఆశ్చర్యసంభ్రమాలతో చూస్తోంది. తీరాచూస్తే చక్రధరుడు. వందలమంది పిచ్చెక్కినవాళ్ళమాదిరిగా అతని వైపుకు ఉరికారు. దగ్గరకెళ్లి చుట్టూ మూగి నిల్చున్నారు. జైజై ధ్వానాలతో నభోమండలం దద్దరిల్లి పోసాగింది.

"మా వందమంది సోదరుల .బలికి ప్రతిబలి చేయాల్సిందే. అంతవరకు ఊరుకునేదిలేదు" అని అరచింది ఒక కూలి గొంతు.

చక్రధరుడు రెండుచేతులూ పైకెత్తి "ఒక్కడుకూడా ముందు కడుగువేయరాదు సుమా! ఖబడ్దార్" అన్నాడు.

కూలి:- మిత్రులారా! ఇంకొక్క జయధ్వానం చాలు. ఇంకొక్క ముక్కు ముక్కితే చాలు.

చక్ర:- ఒక్క అడుగుక్కూడ ముందుకెయ్యరాదని మళ్లీ ఒకసారి చెబుతున్నాను.

"బాబుగారూ! దేవునికొరకు మమ్మల్ని కాపాడండి" అన్నాడు మిస్టర్ జిమ్ ప్రాణం లేనట్లుగా.

"బ్రతికినన్నాళ్ళూ మీ పేరు చెప్పుకుంటూ, మిమ్మల్ని దీవిస్తూ ఉంటాం. గవర్నమెంటువారికి మిమ్మల్నిగురించి బాగా సిఫార్సు చేస్తాం" అన్నాడు మిలిటరీ కెప్టెన్ మిస్టర్ 'సిమ్'

ఒకకూలి:- మాతోటిసోదరులు ఒకవందమంది పేలాపు గింజాల్లామాడ్చివేయబడ్డారుగదా! అప్పుడు మీరెక్కడికి పోయారేమిటి! సోదరులారా! చూస్తా రెందుకూ... ఆగిపోవటం దేనికి? ఈయనగారి దేం పోతుందేమిటి! చంపితే మనల్నే చంపుతారు. కాన పదండి. చంపండి. హతమార్చండి.

చక్రధరుడు తిరుగుబాటుదార్లకు అడ్డంపోయి "రక్తం త్రాగాలని మీ కంత దప్పికగాఉంటే త్రాగండి. నేను వద్దనను. కాని ఒక సంగతి. నా శవాన్ని ముందు మీ కాళ్ళతో త్రొక్కినతర్వాతనే అడుగు ముందుకు వేయగల్గితే. అంతకు ముందుమాత్రం కాదు.

కూలి:- అన్నయ్యగారూ! అడ్డం రాకండి! వెళ్ళిపోండి. ఎంతో కాలంనుండి దెబ్బలుతింటూ వచ్చాం; ఎంత

గానో పీడింపబడుతూవచ్చాం. ఇప్పుడైనా కాస్త హృదయాగ్నిని చల్లార్చుకోనియ్యండి.

చక్ర:- ఈ అగ్నిని నా రక్తం చల్లార్చలేదా?

కూలి:- అన్నా! నువ్వెప్పుడు చూచినా శాంతం శాంతం అని వాగుతుంటావు. కాని దానివల్ల వచ్చేలాభ మేమిటి? మమ్మల్ని కొట్టనివాడు, చంపుకు తిననివాడు పాపాత్ముడు. ప్రతివాడూ రక్తం పిండి, పీల్చి, పిప్పిచేస్తున్నాడు. మరి మమ్మల్ని శాంతంగా కూర్చోమనే అంటావా? శాంతం గా ఉంటే మరింత దుర్గతికి లోనవుతాం. కాన దయఉంచి మాకు శాంతాలు నేర్పకండి. చావటం నేర్పండి. ఆ రోజునే మమ్మల్ని నిజంగా ఉద్ధరించగల్గుతారు.

చక్ర:- ఆత్మహననంద్వారా మనకు మేలు జరిగినప్పటికీ మనం ఆత్మను హత్యచేయబూనుకోము. ప్రపంచాన్ని సృష్టించినవాడు మానవుడు కాదు; దేవుడు. ఉద్ధరింపులకై అతడు చూపెట్టిన మార్గాన్నే నడవండి. అతనిమీద నమ్మకం కలిగి ఉండండి.

కూలి:- ఉరిశిక్ష రాసిపెట్టే ఉంది మాకు. నువ్వేమీ తప్పించలేవుగదా!

జిమ్:- మేం ఎవ్వడికీ శిక్షవేయం.

చక్ర:- బహుమతి లభించనీలేక ఉరిత్రాడు లభించనీ. దాన్ని గురించిన ఆలోచనే అనవసరం. ఇంతవరకూ మీచేతులు నెత్తురు చుక్కలతో కళంకితం కాలేదు. వాటిని అలాగే నిష్కళంకంగానే ఉంచండి. ఈశ్వరుని ఎదుట మీరు నిరపరాధులు. ఇప్పుడిక మిమ్ము కళంకపరనుకోకండి. వెళ్ళండి.

కూలి:- మా సోదరుల హత్యారక్తం మేం మరచి పోలేం.

కాని మీ కిదే అభీష్టమైతే అలాగే వెళ్ళిపోతున్నాం. చివర కెలాగూ ఉరికంబాల కెక్కే-రాత రాసిపెట్టే ఉంది.

ఒక నిమేషకాలంలో క్యాంపుఅంతా ఖాళీ అయిపో యింది. ఒక్క-డుకూడా దిగబడకుండా వెళ్ళిపోయారు.

సందు దొరికితే లూటీలు సాగిద్దామన్న దురాశతో వచ్చిన రౌడీమూక కూడా కూలీలంతా వెళ్ళిపోవటంతో చల్లగా జారుకున్నది. డబడబమని వాన వచ్చి పడుతుంది. తిరు ణాలంతా చట్టుబండలైపోతుంది, దుకాణాలూ, దుకాణ దార్లూ, కొనుగోలుదారులూ అంతా క్షణంలో సర్దుకుంటారు. ఈ క్యాంపు బండారమూ అలాగే ఉంది కన్ను. మూసి కన్ను తెరచునంతలో క్యాంపు అంతా మరుభూమిలా మారి పోయింది. ఒక్క- పట్టాభిషేక మంటపంనుండి మాత్రమే ఇప్ప టికీ ఒక మంట దృగ్గోచర మవుతోంది. కొంతమందితో కలిసి దాని ఎదుట నిలబడి ఉన్నాడు. రాజా విశాలసింగ్ - ఎవరో మృతజీవికి అంత్యక్రియలు జరుపుతున్నట్టుగా.

చీకటిపడింది. క్షతగాత్రుల మూల్గులు బయలుదేరాయి. చక్రధరుడూ మరి కొంతమంది యువకులూ కలిసి ఆ మూల్గే వాళ్ళను జాగ్రత్తగా చేతులమీద తీసుకెళ్ళి ఒక చెట్టుక్రింద చేరుస్తున్నారు. అందులో ఎందరో చేతుల్లో కెత్తగానే ఇంద్ర లోకానికి ప్రయాణంకట్టారు. వాళ్ళను ఎత్తి తీసుకు వెళ్ళాలని ఆలోచిస్తున్నారు కొందరుస్వయం సేవకులు.

ఇంతలో అకస్మాత్తుగా కొందరు సిపాయిలువచ్చి చక్రధరుని పట్టుకుని దొరలక్యాంపుకు తీసుకుపోతున్నారు. కారణమేమిటని అడిగితే ఇది జిమ్‌దొరగారిహుకుం అని చెప్పబడింది.

అక్కడ కొలువుతీరి ఉంది. ఇప్పటిదాకా లూటీలు చేసి చేసి తీరికచెందిన సాయుధపోలీసులు గుమ్మాని కెదురుగా బాయ్‌నెట్లతో నిలబడిఉన్నారు. లోపల మిస్టర్స్ జిమ్, సిమ్‌లు రౌద్రమూర్తులై కూర్చుని చుట్టలు కాల్చుకుంటున్నారు. క్రోధాగ్ని నోట్లోనుండి పొగలుగక్కుతూ బైటికి వస్తున్నదా అన్నట్టుంది. మిస్టర్ జిమ్‌ప్రక్క నేఆసీనుడైఉన్నాడు రాజావిశాలసింగ్. కోపంతో కళ్ళు చింతనిప్పల్లాచేసుకుని డ్రాయరుమీద చేతులుఆనించి ఏదో చెబుతున్నాడు, దివానుమహాశయుడు. చేతులు కట్టుకుని ఒకపంచను నిల్చొనిఉన్నాడు మున్షీ వజ్రధరుడు.

చక్రధరుని చూచీ చూడటంతోనే 'ఇదంతా నువ్వు చేసిన కొంటెపనేనని అంటున్నారు రాజాగారు" అన్నాడు.

"రాజాగారూ! నిజంగా మీరావిధంగానే అభిప్రాయపడుతున్నట్లయితే తప్పక విచారపడుతున్నాను. ప్రజల్లో జాగృతిని తప్పక కలుగచేస్తుంటాం. ఆత్మగౌరవరక్షణచేసుకోమని ఉపదేశిస్తుంటాం. ప్రపంచంలో వాళ్ళు మానవులుగా ఉండాలనీ, మానవులుగానే జీవించాలనీ మాకోర్కె. స్వార్థానికి దాసులై ఉద్యోగస్థులకు, తాబేదార్లకుదాసోహం అనకుండాఉండాలనీ, భయపడి అవమాన-అత్యాచారాలు సహించకుండా ఉండాలనీ మా అభిలాష. దీన్నేగనక రెచ్చగొట్టటంగా, కొంటెతనంగా భావించదలచినట్లయితే భావించండి. కాని మేం

మాత్రం దీన్ని మాకర్తవ్యంగా, పవిత్రధర్మంగా భావించు తూంటాం'' అన్నాడు చక్రధరుడు ఆవేశంగా.

జిమ్:- నీ ఉపదేశాల ఫలితం కళ్ళారా చూచాం. మరి నువ్వు రెచ్చగొట్టటంలేదంటే ఎవడు నమ్ముతాడు?

చక్రి:- ఆ మనుష్యులయెడ అన్యాయంగా వ్యవహరించ బడుతూంది. వాళ్ళమీాద అత్యాచారాలు జరుగుతున్నాయి. ఇక్కడనుంచి వెళ్లేందుకూ లేదా ఉండి పనిచేసేందుకూ వాళ్ళకా హక్కువుంది. వాళ్ళనేగనక ప్రశాంతంగా వెళ్ళనిచ్చిఉంటే ఇటువంటిదానికి అవకాశమే ఉండేది కాదు.

రాజా:- ఊడిగం చేయించుకునే హక్కు మా తాత ముత్తాతలనాటినుంచీ ఉంది. అది వదలుకోవటం అసంభవం. వెట్టిచాకిరి చేయవద్దని నువ్వు రైతులకు నేర్పుతున్నావు నేటి హత్యాకాండబాధ్యతంతా నీదే.

చక్ర:- పారంపర్యంగా ప్రజలుఅంగీకరిస్తూ వచ్చారన్న కారణంచేతనే ఒకఅన్యాయం శిరోధార్యం కాజాలదు.

జిమ్:- నీమీాద తిరుగుబాటు కేసు పెడ్తాం. నువ్వు Dangerous మనిషివి.

రాజా:- హుజార్! ఇతనియెడ కఠోరంగా వ్యవహరించాలని నాకేమాత్రంలేదు. ఇతనూ, ఇతని సహచరులూ ఇక ముందెన్నడూ మా ఎస్టేటులోకి అడుగుపెట్టమని ప్రతిజ్ఞాపత్రం వ్రాసిఇస్తే చాలు.

చక్ర:- నే నా విధంగా ప్రతిజ్ఞచేయజాలను. దీనజనులపై ఘోరాలు జరుగుతుంటే దూరంగా నిల్చొని చూస్తూ ఉండటమనేదెన్నడూ సహించరాని విషయం.

"వీణ్ణి సబ్ జైలుకు తీసుకుపోండి. రేపు కోర్టుకు హాజరు పర్చండి '' అన్నాడు జిమ్ సబ్ ఇన్‌స్పెక్టరుతో.

వజ్రధరుడు ముందుకొచ్చి తలపాగ 'జిమ్'దొర పాదాలపై ఉంచుతూ ''హుజూర్! వీడు మా బానిసబిడ. అయ్యా! ప్రాణభిక్షపెట్టండి.'' అన్నాడు.

జిమ్:- ఓ! తహశీల్దార్, వీడు నీకొడుకా! ఇంట్లోంచి ఎందుకు వెళ్ళగొట్టలేదూ? విద్రోహులను పెంచి పోషించటానికి కాదు ప్రభుత్వం నీకు పెన్షను ఇచ్చేది? నీపెన్షను ఆపుచేస్తాం.

రాజా:-బాబూ చక్రధరా! ఇప్పుడప్పుడే చెయ్యిజారిపోలేదు. నే చెప్పినపత్రం వ్రాసి స్వేచ్ఛగా ఇంటికి పోవచ్చు. మిమ్మల్ని బాధించదలచటం లేదు. ఔను, మళ్ళీ ఇలాంటి గలాటాలు జరగకుండా ఉండగలందులకే అది కోర్తున్నాను.

చక్ర:- రాజాగారూ! క్షమించండి. అసంతృప్తికిగల కారణాలు దూరంకానంతవరకూ ఇలాంటి దుస్సంఘటనలు జరుగుతూనే ఉంటాయి. మళ్ళీ జరుగవచ్చు. మీరు నన్ను అరెస్టు చేయగలరు; జైలు కంపగలరు. దానివల్ల మీకు శాంతికలిగితే కల్గవచ్చు. కాని ప్రజలజీవితం దుర్భరమయింది. ఆ అసంతోషం మాత్రం అణుమాత్రంకూడా తగ్గనుఃఖంపట్టదు. అసంతోషాన్ని పెంపొందించి మీరు ప్రజల్ని శాంతపర్చలేరు. ఔను, పిరికిపందలుగామాత్రం చేయగలరు. కర్మహీనులుగా, బుద్ధిహీనులుగా, పురుషార్థహీనులుగా, ఇంత ఏల, మానుషదేహధారులైన కుక్కలూ పందులుగా చేయదలిస్తే చేయండి. కాని దీనివల్ల మీకొచ్చేకీర్తి శూన్యం. ఈశ్వరుడూ ప్రసన్నుడు కాడు. మీఆత్మ ఒక్కటిమాత్రమే సంతుష్టిచెందుతుంది.

# పదకొండో అధ్యాయం

సూర్యుడు అస్తమించాడు. అబ్బబ్బ! ఏం ఉడక పోత! ఏం ఉడకపోత!! ప్రాణం ఉక్కిరిబిక్కిరై పోయే ఉడక పోత. అందులో జైలుగదులు అందువల్ల భరించటం మరింత కష్టంగా ఉంది. కిటికీ అనేది చూద్దామన్నా లేదు. ఇనపచువ్వల తలుపులైనా లేవు. ఆపైన చెవులు దిబ్బళ్ళువేసే బుయ్‌మని ఎడతెగని దోమలమోత.

ఇక్కడే ఒకగదిలో చక్రధరుడు ఉంచబడ్డాడు. స్వాతంత్ర్యదేవత తన నిస్వార్థసేవకులకు ఈ స్థానమే తరచు ప్రదానంచేస్తూ ఉంటుంది.

ఆలోచనాసాగరంలో మునగానాం తేలానాం అంటు న్నాడు చక్రధరుడు- ఈ భీషణఉపద్రవానికి కారణమేమిటి? మే మెన్నడూ పొరపాటునకూడా ఎవరినీ ఈవిధంగా ప్రేరే పించలేదే. ఐతే, మరి ప్రజలహృదయాలలో ఈ ప్రేరణ ఎక్కడనుంచి వచ్చి దూరింది? ఎంత ఆలోచించినా ఈప్రశ్నకు ప్రతిసారీ ఒకేఒకసమాధానం వస్తున్నది- 'ఇదంతా మీచిత్త శుద్ధి- దోషఫలితం. మీశాంతి- ఉపదేశంఅడుగున ద్వేషాగ్ని దాగిఉంది. సంఘటనాశక్తి ఎప్పుడూ ఆవేశపూరితంగా ఉంటుం దన్న విషయం మీరు మరచిపోయారు. ఆ శక్తి అత్యా చారాలుచూచి ఉద్రేకపడుతూ ఉంటుందని గ్రహించకో లేదు. మీ చిత్తం నిర్మలంగా ఉంటే పాలకులమీద కళ్ళిదాడిచేయా లన్న ఆవేశం ప్రజలమనోవీథులలో ఎన్నడూ ప్రవేశించ

జాలను.' సరే. ప్రజలు నరేశుల క్యాంపులమీదికి వెళ్ళలేదను కుందాం. ఐతే వాళ్ళను పోలీసులు నిరాటంకంగా ఇళ్ళకు పోనిచ్చిఉండేవారేనా? కాదు. ఎన్నడూకాదు. రాతుకుగుర్రం కదలకుండా మొండికేయటంగానీ లేదా ఎదురుతిరగటంగానీ వేరేసంగతి. కాని కవ్వించి, రెట్టించి దెబ్బలాటకు నడుం బిగించి కూర్చున్నవాడిసంగతేమిటి? వాడిబారినుండి తప్పిం చుకు బైటపడే మార్గమేమిటి? ఇంకోసంగతికూడాను. ప్రజలు దురన్యాయాలను ఎదిరించటానికి సంసిద్ధంకాకపోతే వాళ్ళ సంఘటితశక్తివల్ల కలిగే లాభమేముంటుంది? కనుకనే ప్రజా నీకానికి అన్నివిషయాలూ, సమస్యనీతులూ తేటతెల్లంగా బోధించబడుతూంటాయి. గొప్ప గడ్డుసమస్య! ఎన్నిదారు ణాలు, ఎన్ని అన్యాయాలు జరిగినా సరే, ప్రజలదగ్గరకు పోకుండా వాళ్ళను తమ ఇష్టానుసారంగా వ్యవహరించుకోమని వదలిపెట్టనన్నా వదలిపెట్టాలి, లేదా ఇలాంటి ఉపద్రవాలకు సంసిద్ధమై అయినా ఉండాలి. ప్రభుత్వం పశుబలానికి ప్రత్యక్ష రూపం. అది ధర్మబలం గల సన్యాసి కాదు. తర్కబలం గల విద్వాంసుడూ కాదు. బలప్రయోగంద్వారా తనస్వార్థం సాధిం చుకునే సిపాయి అది. ఇదితప్ప దానిదగ్గర మరోసాధనమేమీ లేదు.

ఈవిధంగా ఆలోచిస్తున్నాడు చక్రధరుడు. మధ్యలో తన్నుగురించిన ఆలోచన ఒకటి వచ్చింది. "నేను ఏఉద్య మమూ ప్రారంభించలేదే! ఎవర్నీ రెచ్చగొట్టలేదే! ఎవరి ప్రాణాలు రక్షించే నిమిత్తం నా ప్రాణాన్ని ప్రమాదానికి గురిచేశానో వాళ్ళేగదా నాపట్ల ఈవిధంగా వ్యవహరి

స్తోంది! ఔను. ప్రజానీకంలో ఒకరికి పలుకుబడి ఉండటం చూచి ఓర్వలేకపోతున్నారు. ప్రజలంతా కళ్లుమూసుకొని అంధప్రాయులుగా ఉండాలని కోరుతున్నారు. వెనకా ముందులు ఆలోచించటానికి గానీ, మంచి - చెడ్డలు చూడ్డానికిగానీ వాళ్ళ కేమాత్రం హక్కు ఉండకూడదు. ఇదే వాళ్లు కోరుతూ ఉంది. సరే, మంచిది. సేవచేయటమే గనక ఘోరపాపమైతే బొందిలో ప్రాణమున్నంత వరకూ ఈ పాపమే - ఈ ఘోర పాపమే చేయదలచాను. జైలుచింత అనవసరం. సేవ ఎక్కడైనా చేయవచ్చు. దానికి అవకాశంలేనిచోటంటూ లేదు. జైల్లో మరింత అవకాశం లభిస్తుంది. నాన్నగారికి కష్టంగా ఉండొచ్చు. అమ్మ శోకాలు పెట్టవచ్చు. కాని వినశుణ్ణి; గత్యంతరంలేదు. బయటా నోరు కట్టివేస్తున్నారు; చేతులు బంధిస్తున్నారు. అటువంటప్పుడు జైల్లో ఉన్నా ఒకటే బయట ఉన్నా ఒకటే. బయటి ప్రపంచమూ ఒకరకంగా జైలే. అందులోనూ విశాలమైన జైలు అది. కనుక ముం దెన్నడూ ప్రజాసేనకు పూనుకోనని రాసి ఇవ్వజాలను. అలాంటి హామీకూడ ఇవ్వజాలను."

ఈరకమైన ఆలోచనాంబుధిలోపడి తన్నుకులాడుకుంటున్నాడు చక్రధరుడు. ఇంతలో ఆకస్మికంగా మున్షీ వజ్రధరుడు అతని గదిలో ప్రత్యక్షమయ్యాడు. ఒంటిమీద పాత చొక్కా వేసుకున్నాడు. అదీ నట్టి మురికిపాత. ఆ చొక్కా రంగంతా ఆ మురికి అడుగున అదృశ్యమైఉంది. చొక్కాకింద నిక్కరొకటి తొడిగాడు. నడుముకు పట్టాలేదు. అందువల్ల అది క్రిందికిజారి మోకాళ్ళక్రింద ఒక గోతాంలా వ్రేలాడుతోంది

ప్రపంచంలో బట్టకునించిన నమ్మకద్రోహాకరవస్తువు ఇంకొకటి లేదు. తహశీల్దారు మహాశయుడు చక్రధరుని సమీపించి "ఏం చేస్తున్నావురా నాయనా? ఇక్కడ కటికి చీకటిగా ఉందే. పద. బయట గేటుముందు జట్కా సిద్ధంగాఉంది. వెళ్ళి దాంట్లో కూర్చో. ఇక్కడినుంచి తిన్నగా దొరగారి బంగళాకు పోదాం. ఆయనగారు చెప్పిన విధంగానే రాసిచ్చేయి. ఇందులో పెద్దగా మునిగిపోయే దేముంది? మనకు ఒకరితో దెబ్బలాట ఎందుకు? నిన్నటినుంచీ కాళ్ళరిగేట్టు తిరుగుతున్నాను ఎట్టకేలకు ఇవ్వాళ మధ్యాహ్నానికి 'సరే' అనిపించగలిగాను. మొదట్లో ససేమిరా అన్నారు. కాని నేను మాత్రం వదలిపెట్టలా. ఇదిగో అంతగా అక్కడికి వెళ్ళటానికి మనస్కరించక పోతే ఇక్కడే ఒక 'ప్రమాణపత్రం' రాసివ్వు. 'ఆలస్యం అమృతం విష' మన్నారు. మీ అమ్మ ఏడుపుతోనే చచ్చిపోయేటట్టుగాఉంది" అన్నాడు.

"ఇంతవరకసలు నే నే నిర్ణయానికీ రాలేదు. ఆలోచించి సమాధానం చెప్తాను. అనవసరంగా ఇంత ప్రయాసపడ్డారు" అన్నాడు చక్రధరుడు తలవంచుకుని.

వజ్ర:- ఏం మాటలురా బాబూ ఇవి? అక్కడేమో పట్టుకొస్తా బుగ్గయిపోతూంటే, బైటకొచ్చి తలెత్తుకు తిరగటమే కష్టంగాఉంటే నువ్వేమో ఆలోచించిచెబుతాలే అని సమాధానం చెప్తున్నావా? ఇందులో అంతదీర్ఘంగా ఆలోచించవలసిన దేముందిరా? చాల్ చాలు గాని, ఇక నడువు. చప్పున వచ్చి ఆ పత్రం కాస్తా రాసివ్వు. కొంపలో నిన్నటినుంచి ఇంతవరకసలు పొయ్యిమీద కుండే ఎక్కలేదు.

చక్ర:- నా కాళ్ళకు నేనే స్వయంగా సంకెళ్ళు వేసు కోటానికి నా అంతరాత్మ అంగీకరించలేదు.

చక్రధరుడు ప్రమాణపత్రంపై సంతకంపెట్టడానికి అంగీకరించకపోవటం చూచి, నిరాశాహతుడై "సరే, నీ ఇష్టం. ఇంక నోరెత్తితే ఒట్టు. నువు పుట్టుకతోనే మొండిఘటమనీ, నామాటేమీ లక్ష్యపెట్టవనీ ముందే తెలుసు. అందుకనే ఇక్కడికి రావటానికి ఒప్పుకోలేదు. కాని, మీ అమ్మ బయలుదేరే దాకా బ్రతకనిచ్చిందిగాదు. సరే. వెళ్ళి,రా నన్నాడనీ, ఇక నీ ఇష్టమొచ్చినంత ఏడ్చుకోమనీ చెప్తా" నన్నాడు వజ్రధరుడు.

ఎంత కఠోర పాషాణహృదయమైనా సరే, అందులో మాతృప్రేమ కోమలస్మృతులు కూడుకొని ఉంటూంటాయి. "అమ్మకు కాస్త ధైర్యం చెపుతూ ఉండండి. నా కేమీ కష్టంగా లేదని నచ్చచెప్పండి" అన్నాడు చక్రధరుడు అధైర్య పడుతూ.

వజ్రధరుడు ఇన్నాళ్ళూ తహశీల్ దారుపని చేశాడంటే ఊరికే ఉందా ఏం? ఈసారి కొట్టినదెబ్బ సరిగ్గా గురి కెళ్ళి తగిలిందని వెంటనే గ్రహించేశాడు. "నా కేమంత ప్రాణం మీదికొచ్చిం దేమిటి ఒకరికోసం అబద్ధాలుకూయాలని? స్వయంగా కళ్ళారా చూచిందే వెళ్ళి చెప్తాను. ఏడిస్తే ఏడ్వనీ. దానినొసట ఏడ్పే రాసిపెట్టిఉన్నప్పుడు ఎవరు చేసే దేముంది? నువ్వు వచ్చేశావ్. అంతే మళ్ళీ గుక్కెడు పచ్చిమంచినీళ్లు నోటో పోసుకుని ఎరుగదు. ప్రాణంపోవటానికి ఇంకేం అవసరంలేదు. ఊరకంగా ఇంకో నాలుగైదు రోజులుంటే చాలు

దానంతటదే ఎగిరిపోతుంది" అన్నాడు తన కెందుకొచ్చినమేళాం అన్నట్టుగా.

కరుణావిహ్వలుడై మెదలకుండా మున్షీవెంట ఆఫీసుకు నడిచాడు చక్రధరుడు. మున్షీ జీ మొగంమీద ఆవరించిన ముడుతలు ఒక్కనిమిషంపాటు కనపడకుండాపోయాయి. కొడుకును ఆలింగనం చేసుకొని "నాయనా! చిరంజీవిగా ఉండు. చివరకు నామాట విన్నావు. ఇంతకన్న ఎక్కువ సంతోషదాయకమైన విషయం ఇంకేముంటుంది?" అన్నాడు వజ్రధరుడు.

ఉభయులూ జైలుఆఫీసుకు వచ్చారు. "ప్రమాణపత్రం క్షమాణ పత్రం - రాస్తున్నారా ఏమిటి? ఐతే, హాజంకాస్తా దిగిపోయిందన్నమాట! ఓస్! ఈభాగ్యానికేనా ఇంత బడాయి కొడ్తూ ఉండేవాడివి!" అన్నాడు జైలరు చక్రధరు నుద్దేశించి.

సిగ్గుచే చక్రధరుని తల దించుకుపోయింది. తనకు మనో నిబ్బరం లేనందుకు లజ్జితుడైనాడు. దేశసేవకులనుండి గొప్పమనో నిగ్రహం ఆశిస్తుందిలోకం.తమఆదర్శాలకొరకు బలైపోతుండగా చూడగోరుతుంది. జాతీయరంగంలోకి అడుగిడగానే వాళ్ళగుణ గణాలఅగ్నిపరీక్ష-అత్యంతకఠోరనియమాల ద్వారా-ప్రారంభ మవుతుంది. మరి అవగుణాలుమాత్రం స్థూలదృష్టితో పరిశీ లింపబడుతున్నాయి. మొదటిరకం దుశ్చరిత్రుడు సైతం సాధువేషధారులు మహోన్నతాదర్శప్రాయులుగా ఉండాలనే అపేక్షిస్తాడు. వాళ్లు తమఆదర్శంనుండి పతనమవుతూండగా చూచి ఇట్టే మాటివిరిచి తృణీకరించిపారవేయటానికి సంకోచిం చడు. జైలరు మహాశయుని దెప్పిపొడుపులు చక్రధరుని

కునుకుచెందిన కళ్ళను తెరిచాయి. తక్షణం జవాబుగా "నా కొకసారి ఆ క్షమాపణపత్రం చూడాలని ఉంది" అన్నాడు.

చక్రధరుడు ఆ క్షమాపణపత్రంతీసుకొనిపైనుంచి క్రింది వరకు పైపైన చూసేశాడు. తర్వాత "ఇందులో నేను రాసి ఇచ్చేవిధంగా ఏమీ లేదే? దీనిప్రకారమయితే నేను ఇంట్లోనే ఖైదీగా పడివుండాలి. సరే, అంత ఖైదీగానే ఉండవలసివచ్చి నప్పుడు ఎక్కడఉంటేనేం? జైలేనా ఏమిటి, అంత పాపంచేసు కున్నది? ఇప్పుడిక ఇంటికిరావటానికి రెండేరెండు మార్గాలు- కోర్టువారు విడుదల చేయనన్నా చేయాలి; లేదా శిక్ష పూర్తిగా అనుభవించనైనా అనుభవించాలి'' అన్నాడు చక్రధరుడు.

ఇలా అని తిరిగి తనగదికి వెళ్ళిపోయాడు.

ఒకవారంరోజుల అనంతరం మిష్టర్ 'జిమ్' కోర్టులో కేసు విచారణ ప్రారంభమయింది.

ప్రతిరోజూ కోర్టంతా జనంతో క్రిక్కిరిసి ఉండేది. ఆ సమ్మెచేసిన కూలీలంతా చక్రధరుని చూచిపోవటానికి ఒకసా రన్నా వచ్చిపోతూండేవాళ్ళు. పట్నవాసులు వేనవేలు వస్తూపోతూ ఉండేవాళ్లు. అప్పుడప్పుడు రాజా విశాలసింగ్ వచ్చి ప్రేక్షకులస్థానంలో ఆసీనుడౌతూండేవాడు. సరే, ఎవ రొచ్చినా రాకపోయినా మనోరమ మాత్రం నాగా లేకుండా సరిగ్గా పదిగంటలకు కోర్టుకు వస్తూండేది. కోర్టులేచేవరకూ కూర్చున్నచోటునుండి కదిలేది కాదు. ప్రస్తుతం ఆవిడ మొహం దృఢసంకల్పంతో అమితకరుణ, అలౌకికధైర్యములతో నిండి ఉంటూంది. వీటితోపాటు గంభీర ఆలోచనాఛాయ వ్యాపించి ఉంటూంది.

విచారణ ప్రారంభమై పదిహేనురోజు లయింది. ఇవ్వాళ - పదిహేనవరోజున సాయంకాలం రెండేళ్ళు కఠినశిక్ష విధించాడు మిషర్ 'జిమ్.' ఇది ఆ సెక్షను ప్రకారం విధించ దగిన కనీసశిక్షే నని చెప్పాలి.

చక్రధరుడు నవ్వుతూ - ప్రేలుతూ మిత్రులందరిదగ్గరా సెలవుపుచ్చుకుంటున్నాడు. అందరికళ్లూ చెమ్మగిలిఉన్నాయి. కోర్టుగేటుదగ్గర నిలబడి జయజయధ్వానాలు చేస్తూఉంది కార్మికవర్గం. నిల్చొని కంటతడిపెట్టి ఏడుస్తున్నారు, కొందరు మహిళామణులు. మనోరమ నాటకీయంగా వచ్చి చక్రధరుని ఎదుట ప్రత్యక్షమైంది. చేతిలో పూలమాలఉంది. వచ్చీగావటం తోనే ఆ దండను చక్రధరునిమెడలో వేస్తూ "సరే, కోర్టు మీకు శిక్ష విధించినమాట వాస్తవమే. కాని మీ యెడల పూర్వంకన్న వందరెట్లు ప్రేమలేనివ్యక్తి ఒక్కడూ లేడు. మీరు మా అందరికీ యథార్థమైన ఆత్మబలమూ, నిజమైన సాహసమూ, వాస్తవికకర్తవ్యమార్గమూ చూపెట్టారు. వెళ్ళండి జైలుకు వెళ్ళండి. తలపెట్టిన కార్యం సాధించండి. మా శుభా కాంక్షలు మీతోనే ఉన్నాయి" అంది.

చక్రధరుడు కేవలం అర్ధనిమీలితనేత్రాలతో చూశాడే కాని, నోరెత్తిమాత్రం ఏమీ చెప్పలేకపోయాడు. చూచే వాళ్ళంతా ఏమనుకుంటారో అని సంకోచంగా ఉంది. అటు ఎదురుగా రాజా విశాలసింగూ, దివానూ, గురుసేవకసింగూ, మున్సీ వజ్రధరుడూ నిలబడిఉన్నారు. వరండాలో వేలాదిజనం గుమిగూడి ఉన్నారు. 'ధన్యవాదాలు' అన్నశబ్దాలు పెదవుల దాకావచ్చి ఆగిపోయాయి. మనోరమయొక్క ఈరకమైన వీర-

పూజ ఆవిడ బాలచేష్ట తప్ప ఇంకేం కాదులే అని ప్రదర్శించ గోరుతున్నాడు.

మరుక్షణంలో పోలీసులు వచ్చారు. చక్రధరుని మూసినకారులో కూర్చోబెట్టుకొని శ్రీకృష్ణజన్మస్థానాభి ముఖంగా వెళ్ళిపోయారు.

# పన్నెండవ అధ్యాయం

చక్రధరుడు జైలుకెళ్ళిన మర్నాడు నాల్గు ఝాడించి రావాలన్న ఉద్దేశ్యంతో రాజా విశాలసింగ్ దగ్గరకు వెళ్ళింది మనోరమ. నేత్రాలు రెండూ వీరరక్తంతో ఎర్రగా ధగధగ మెరిసిపోతున్నాయి. కనుబొమ్మలు పైకెగసిఉన్నాయి. ఆమె వెళ్ళిన సమయంలో కోప - భవనంలో కూర్చుని మీసాలు దువ్వుకొంటున్నాడు రాజా విశాలసింగ్. రాజభవనమంతా నిశ్శబ్దంగాఉంది. మనోరమ ఏకాయెకీని, అతనిదగ్గరకే వెళ్ళింది. రోషపూరిత నేత్రాలతో చూస్తూ "మహా ప్రభూ! ప్రభుత్వానికీ పశుత్వానికీ మధ్య ఏమైనా తేడాఉందా? లేక రెండూ ఒకటేనా? అని మిమ్మల్ని అడిగి తెలుసుకునే నిమిత్తమే వచ్చాను. నేను దైవసమానునిగా భావించే వ్యక్తిపై మీరు ఎలా చెయ్యెత్తారా అని నాకు ఆశ్చర్యంగాఉంది." అన్నది ఆవేశంతో కంపిస్తున్న కంఠస్వరంతో.

అభిమానంకూడా అందమిచ్చిన మనోరమాదేవి సౌంద ర్యంముందుకాలుమోపి నిలువలేకపోయాడు రాజా విశాలసింగ్. సౌందర్యంసమక్షంలో రాచరికం మోకరించి, కుక్కిన పేనులా

అయింది. తన కృత్యాలకు పశ్చాత్తాపపడుతూ "మనోరమా! చక్రధరబాబు పేరుడు. అతని పట్ల నేనుచేసిన అన్యాయం బొందిలో ప్రాణమున్నంతవరకూ నాకు కష్టదాయకంగానే ఉంటుంది" అన్నాడు రాజా విశాలసింగ్.

మనోరమ అనుపమసౌందర్యం గారడీ మంత్రంలా రాజా నేవిధంగా ఆకర్షించిందో, అదేవిధంగా ఆయన లజ్జా వినయాలు మనోరమనూ ఆకర్షించాయి. ఆమె గదిలోనుంచి వెళ్ళిపోయింది. విశాలసింగ్ గుమ్మంలో నిల్చున్నాడు. ఆవిడ కేసి అత్యంత పిపాసాదృష్టితో చూస్తున్నాడు. అమాంతంగా త్రాగుదామా అన్నట్టు అతనిహృదయక్షేత్రంలో విచిత్రమైన ఆకాంక్ష ఒకటి మొలకెత్తింది.

దివాను అంటే మొదటినుంచీ కొంచెం పెడపెడగానే ఉంటూవచ్చాడు విశాలసింగ్. కాని ఇప్పు డేం మోజుపుట్టు కొచ్చిందో గాని, అతనికి ప్రత్యేక ఆదర - సత్కారాలు చేయనారంభించాడు. రెండుమూడుసార్లు అతని ఇంటికూ్కడా వెళ్ళివచ్చాడు. అనేకసార్లు తన ఇంటికి పిలిచి విందుచేశాడు. అన్యోన్యత దృఢంకాసాగింది. దివానుగారు ఇంతవరకు మనోరమ వివాహం తలపెట్టకుండా ఉండటమే విశాలసింగు కెంతో ఆనందదాయకంగాఉంది. మైదానంపూర్తిగాఖాళీగాఉందిగదూ! ఈ విందుల సమయాల్లో అప్పుడప్పుడు మనోరమ కాస్త చనువుగా మాట్లాడింది. అదిచూచి రాజాగారి ఆశాజ్యోతి మరి కాస్త ధగధగలాడింది. ఇక ఎవరివిషయంలోనయినా సందేహమనే దేమైనా ఉంటే, అది కేవలం 'లౌంగీ'నిగూర్చిమాత్రమే. రాజాగారి ఈ రాకపోకలు ఆమెకు మనస్కరించలేదు. అతని

మనోవాంఛలు పసికట్టింది. అందువల్ల అతన్ని కాస్త దూరంగానే ఉంచగోరుతూంది. లాంగీ ఒక్కతే అతని మార్గంలో ఒక పెద్ద రాతిబండలా వుంది. దీన్ని తొలగించ కుండా తన గమ్యస్థానాన్ని చేరుకోజాలడు. అహర్నిశలు అత నికి ఇదే ఆలోచన. తుదకు మున్షీ వజ్రధరుని గూఢచారిగా ఉపయోగించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

మర్నాడు ఉదయమే మున్షీజీ దివానుగారి వాకిట్లో సిద్ధం! ఆ సమయంలో దివానుగారు ఇంటిదగ్గర లేరు. మనో రమతో కలిసి గంగకు స్నానాని కెళ్ళారు. ఇంట్లో 'లాంగీ' ఒక్కతే ఉంది. మున్షీ గారి సంబరానికి మితిలేదు. అటువంటి సదవకాశంకోసమే తహతహగా ఉంది. వెళ్ళి వెళ్ళటంతోనే పెళ్ళి విషయం ఎత్తాడు.

లాంగీకి ఈ సంబంధం ఏమాత్రం ఇష్టంలేదు. సంభా షణలు సాగుతూనే ఉన్నాయి. ఇంతలో దివానుగారు గంగ నుంచి తిరిగివచ్చాడు. సైగచేసి అతన్ని దూరంగా తీసుకు పోయి, ఏదో సంప్రదించింది లాంగీ. కొద్ది నిమిషాల అనంతరం తిరిగివచ్చి మున్షీజీతో "మాకు ఈ సంబంధం ఇష్టంలేదని రాజాగారితో చెప్పండి" అన్నాడు.

మున్షీజీ ఆలోచనలో పడ్డాడు— "రాజాగారిదగ్గర కెళ్ళి 'ఏజ్బే! దివానుగారేమాత్రం అంగీకరించలేదు' అని చెపితే ఏమవుతుంది! నా పని బొత్తిగా శూన్యమవుతుంది" ఇలా ఆలో చించుకొని రాజాగారిదగ్గర కెళ్ళి, బడాయి కొట్టసాగాడు. ఉన్నవీ లేనివీ కల్పించి ఏవో దంచేస్తున్నాడు—"హుజూర్! ఏమని విన్నవించను! అక్కడ ముసలిదెయ్యంముండొకతె తద్దినమై

కూర్చుంది; ఎంత ప్రయత్నించినా- తన్నాదియ్యా-చేతికి చిక్కట నేదిక్కటంలేదు. కాస్సేపు ఇటు మొగ్గితే మరి కాస్సేపు అటు మొగ్గుతోంది. దివానుగారిదేమీ లేదండీ. అతను అచ్చంగా మట్టివిగ్రహం మనుకోండి."

"ఐతే ఇంతకూ మీరు నిశ్చయించుకొచ్చినదేమిటి?" అన్నాడు రాజా అధైర్యంతో.

మున్షీ:- ప్రభువుల ప్రతాపానికి అడ్డేముంది? మనదే విజయం. కాని ఒక చిన్న అడ్డంకి. అదేమంటే మీతో వివాహవిషయం స్వయంగా మాట్లాడటానికి దివానుగారికి కొంచెం వెరపుగా ఉంది. మీరేగనుక స్వయంగా ఆ ప్రతిపాదన తెస్తే బహుశా అప్పుడతని కేమీ అభ్యంతరం ఉండదను కుంటాను.

రాజా:- సరే, మంచిది. అలాగైతే నేనే ఆ విషయం ప్రస్తావిస్తాను. మళ్ళీ ఎప్పుడో ఎందుకూ! ఇవ్వాళే ఆ పని పూర్తిచేస్తా. మనోరమతో సహా దివానుగారిని విందుకు ఆహ్వానిస్తాను. ఏదో, కష్టమనుకోక మీరూ కాస్త దయఉంచి దయచేయండి.

విందుసమయంలో అదను కనిపెట్టి మనోరమదగ్గర తన అభిలాషను వెల్లడించాడు రాజా విశాలసింగ్. మొదట్లో ఆమె కొత్తగా కలవరనట్లు నిలబడింది. కాని తర్వాత-"నాన్నగారితో మాట్లాడారా?" అన్నది.

రాజా:- ఇంకా లేదు మనోరమా! అవకాశం లభించ గానే మాట్లాడుతాను. కాని ఒకవేళ ఆయన అంగీకరించక పోతేనో!"

మనో:- నా అదృష్ట నిర్ణయాధికారం వారిదే. వారి ఈ అధికారాన్ని నేను లాగివేసుకోలేను.

ఉభయులూ వరండాలోకి వెళ్లారు. అక్కడ మున్షీజీ దివానూ నిలబడిఉన్నారు. రాజాగారి నుద్దేశించి "హుజూరు వారికి ధన్యవాదాలు" అన్నాడు మున్షీజీ.

దివా:- మున్షీజీ.........

మున్షీ:- హుజూర్! ఇవ్వాళ ఉత్సవం - సంబరం - జరిగి తీరాల్సిందే. (మనోరమతో) మహారాణిగారూ! మీ పసుపుకుంకుమ కలకాలం మనాలి.

దివా:- ఇదిగో, నన్నుకూడా కొంచెం ఆలోచించ...

మున్షీ:- అదేమిటయ్యా! శుభకార్యాల్లో ఆలోచన లేమిటి! దేవుడు ఈ జంటను శుభంగా ఉంచుగాక!

అప్పుడే ఉద్యానవనంలో బ్యాండు మ్రోగసాగింది. ఎస్టేటు ఉద్యోగులు, నౌకర్లు యావన్మందీ నలువేపులనుండీ వచ్చి, రాజాగారికి అభివందనాలు తెలియజేయసాగారు. మరి దివాను మహాశయు డేమో నిశ్చేష్టుడే తలవాల్చి, నిల్చొని ఉన్నాడు. ఏమనటానికీ నోరు రావటంలేదు. వినటానికీ చెవులు అంగీకరించటంలేదు. లోలోపల మున్షీజీని ఎన్ని తిట్టుకుంటు న్నాడో అంతులేదు. "వీడు ఎంత ఎత్తువేశాడంటేనూ! పట్ట పగలే కళ్ళకు గంతలుకట్టాడే! వెళ్లి లాంగీకి జరిగినవృత్తాంత మంతా పూసగుచ్చినట్టు చెప్తాను. మనోరమనొసట ఇదే రాసిఉంది గాబోలు! ఏతే, ఇందులో నే నింక చేయగల్గిన దేముంది? సరే, మనోరమా సుముఖంగానే ఉన్నట్టు కన్పి స్తోందిలే." అనుకొని తుదకు కాస్త ఊరటచెందాడు.

ఠాకుర్ హరిసేవకసింగ్ ఇంటికి తిరిగివచ్చాడు. వెంటనే 'లౌంగీ' వచ్చి ''ఏం మాట్లాడావూ?'' అని అడిగింది.

దివా:- ఏముందీ ? పెళ్ళి ఖాయమయింది.

ఈ మాట వినగానే లబోదిబోమని నెత్తిబాదుకుంది లౌంగీ. దివానుగారిమీద పట్టరానికోపంవచ్చింది. మొహం వాచేటట్లు చివాట్లుపెట్టింది. మున్షీ వజ్రధరుని ఏడుతరాల వాళ్ళను దుమ్మెత్తిపోసింది. కాని ఏంచేస్తుంది! అటు పెళ్ళేమో ఖాయమైపోయె. మాటతప్పటం మాత్రం ఎలా సాధ్యం ? అందుకని సర్వం దిగమ్రింగి ఆనాటినుండే పెళ్ళిపనులు ప్రారంభించింది లౌంగీ.

పెళ్ళి సన్నాహాలు మూడుమాసాలు జరిగాయి. అనుకొంటూండగానే పెళ్ళిముహూర్తం సమీపించింది.

ఇంతలో హఠాత్తుగా ఒకరోజున సాయంకాలం జైల్లో ఏదో గలాటా జరిగిందనీ, ఆ సందర్భంలో చక్రధరుని ఒక భుజము బాగా దెబ్బతినిపోయిందనీ, బ్రతకటం కష్టమనీ వార్త వచ్చింది.

మనోరమ వివాహసన్నాహాలు జరుగుతున్నాయి. మరి ఆమెకూడా పైకి చూడ్డానికి ప్రసన్నంగానే ఉన్నట్టు కన్పడుతూంది. కాని హృదయస్థితి మాత్రం తద్విరుద్ధంగా ఉంది. ఏదో అజ్ఞాతభయం, అనూహ్య ఆవేదనా, తీరనికోరికా, గుప్తచింతా హృదయాన్ని కలవరపెడుతున్నాయి. గుడ్డివాళ్లు తడుముకున్నట్టుగా నలుదిశలూ తడుముకుంటోంది మనోరమ. కాని దారీ - తెన్నూ తగలటంలేదు. విశ్రాంతికి ఆధారమూ కానరావటం లేదు. చివరి కొక నిర్ణయాని కొచ్చింది. ప్రాప్త

వస్తువుతోనే సంతృప్తిచెంది ఊరుకోవా లనుకోవటమే ఆ నిర్ణయం. కాని అప్పుడప్పుడు జీవితం ఎంత శూన్యంగా, ఎంత అంధకారబంధురంగా, ఎంత నీరసంగా అనుభవమవుంతూండే దంటే గంటలపర్యంతం మూర్ఛిల్లిన దానిలా కూర్చొని ఉండేది, అనంతాకాశంలో కేవలం తాను మినహా ఇంకెవ్వరూ లేనట్టుగా.

ఈభయంకరవార్త వినగానే మనోరమ గుండెజబ్బుగల దానిలాఅయిపోయింది. వెంటనే లాంగీదగ్గరకు పోయి"అమ్మా! ఏం చేయనే? ఇప్పుడిక బాబుగారిని చూడకపోతే ఉండలేనే. ఏమే అమ్మా! గాయం మానిపోతుందిగదూ ?" అంది.

"ఎందుకు మానదే తల్లీ! దేవునిదయఉంటే త్వరలోనే మానిపోతుందిలే" అంది లాంగీ జాలిగా చూస్తూ.

లాంగీకి మనోరమమనోభావాలు బాగా తెలుసు. "పాపం! ఈ అబలకు ఎంతవిచారంగా ఉందో కదా!" అనుకుని లోలోపల కోపంతో మండిపోయింది. లాంగీ మళ్ళీ ఆలోచిసోంది - "అయ్యో! ధాన్యపుగింజలకోసం తహతహలాడే పక్షికి ముత్యాలు వేయజూస్తున్నారు. ఇంక పక్షి చేయగల్గినదేముందీ? విలవిలతన్నుకుని తానున్న పంజరంలోనే ప్రాణం వదుల్తుంది. ముత్యంలో తళుకు బెళుకులు ఉన్నమాట వాస్తవమే. అదొక గొప్ప అమూల్యవస్తువుకూడాను. కాని దాన్ని భుజించేవారెవ్వరూ లేరుగదా! దాన్ని మెడకు కట్టుకున్నంత మాత్రాన కాలేకడుపు చల్లారదుగదా!"

# పదమూడవ అధ్యాయం

జైలులో చక్రధరునికి తానొక నూతన ప్రపంచంలోకి వచ్చినట్టుగా ఉంది. ఈశ్వరు డిచ్చిన గాలీ, వెలుతురూ దుర్లభమై పోయాయి. కుక్కలు సైతం మూచూచి వదలిపెట్టిపోయేటటు వంటిభోజనం లభించేది. బట్టలవిషయమంటారా_ బిచ్చగాళ్లు కూడా వాటిని తొడుక్కోటానికి ఇష్టపడరు. ఇక శ్రమసంగతి అడుగనక్కరయే లేదు. ఎడ్లకూడ సాధ్యంకానంత పని. జైలనేది శాసనంలోని విభాగం కాదు. అదొక పాశవిక వృత్తి. అదొక వ్యాపారం. దానికార్యకలాపమంతా ఆదినుండి అంతంవరకూ నికృష్టము, పైశాచికము, నింద్యము, అసహ్యమైనటిది. అవినీతికూడా ఇక్కడ నిర్ఘాంతపోతుంది. దౌష్ట్యంకూడా ఇక్కడ ముక్కుమీద వేలువేసుకుంటుంది.

కాని, కొంతమంది అదృష్టవంతులకు ఈ జైలు కల్పతరువులకంటే తక్కువేమీ కాదు. ఎద్దు పొలందున్ని ధాన్యం పండిస్తుంది. కాని, దానినోసట గడ్డీ, పొట్టే తినాలని రాసిపెట్టి ఉంది. జైలులోని ఖైదీ ఎద్దుకంటేకూడా హీనమని చెప్పవచ్చు. రకరకాల కూరగాయలూ, పళ్ళూ-ఫలాలూ ఉత్పత్తిచేసాడు. కాని అతనికి దక్కేది పెద్ద గుండుసున్నాయే. అవన్నీ చక్కని బుట్టలలో కూర్చుని, పైన ముసుగేసుకుని వయ్యారంగా అధికారుల బంగళాలకు పోయి చేరుతుంటాయి. చెమటోడ్చిన ఖైదీ అంతా చూస్తూనే ఉంటాడు. ఏం చేస్తాడు? అదృష్టాన్ని నాల్గు తిట్టుకుని కుక్కినపేనులా పడిఉండటమే అతను చేయగలిగింది.

చక్రధరునికి పిండివిసిరేపని ఇవ్వబడింది. ప్రొద్దున్నే గోధుమలు తూచి ఇచ్చేవాళ్లు. సాయంకాలానికి విసిరి, పిండి అప్పగించటం తప్పనిసరి. ఎట్టి వంకలూ, సాకులూ చెల్లవు. మధ్యలో ఒక్కసారిమాత్రమే కాస్సేపు విశ్రాంతి.అదీ అన్నం తినటంకోసమే.తదనంతరం మళ్ళీ తనూ తనతిరుగలీ సిద్ధంకావల సిందే. ఏ జైలుఅధికారివల్లా మాటరాకుండాఉండే విధంగానే జాగ్రత్తగా వ్యవహరించేవాడు చక్రధరుడు. కాని బూతు కూతలతోనే మాట్లాడటానికి అలవాటుపడిపోయినవారినోళ్లు ఎవరైనా ఎలా కట్టివేయగలడు!

ఈ ఆపద ఇంతటితోనే ఆగలా. జైల్లోని ఖైదీలు ఎలాంటి అశ్లీలములు, అవమానకరములు నైన మాటలు పదులుతూండే వాళ్ళంటే విని కోపంతోను, అసహ్యంతోను రక్తం ఉడికి పోయేది. కాని కోపమంతా దిగమ్రింగి ఊరుకునేవాడు చక్రి ధరుడు. అతనిగదిలో ఇంకో ఐదుగురు ఖైదీ లుండేవాళ్ళు. వాళ్ళల్లో ధన్నాసింగ్ అనే సర్దారు డొక డున్నాడు. మంచి కండపుష్టిగల మనిషి. పక్కా సైతానుకూడాను. వాడే తతిమ్మావాళ్ళకు నాయకుడు. వాళ్ళంతా ఎంత అశ్లీలంగా మాట్లాడేవాళ్ళు! ఎంతో పెద్దగా గోలచేసేవాళ్లు. ఆమాటలు వినలేక చక్రధరుడు చెవులుమూసుకునేవాడు. 'ఖైదీలు పొగ త్రాగరాదు' అని జైలునియమం. కాని ఇక్కడ గంజాయి, భంగూ, సారా, సల్లమందూ చివరకు కోకీనుకూడ విరి విగా—ఎలాగోగాని వచ్చిపడుతుండేవి. నిషాల్లో చెప్పరానం తగా ఉద్దండులై పోయేవాళ్లు- మానవదేహధారులైన రాక్షసులా అన్నట్టు.

క్రమేణా చక్రధరునకు ఈ ఖైదీలపట్ల సానుభూతిఏర్పడ సాగింది. ఆలోచించేవాడు—"ఇటువంటి వాతావరణంలో ఉంటూ పతనమైపోనివా డెవ్వడా?" అని. అతను ఎన్నోరకాల మనుష్యుల్ని చూచాడు. వాళ్ళతో వ్యవహరించాడు. కాని ఇలాంటి సిగ్గూఎగ్గూలేనివారిని, బూతులు తిని కిలకిలనవ్వే వాళ్ళను, దుర్వ్యసనాల్లో మునిగి తేలుతుండేవాళ్ళను, నోరు పారేసుకుని పెళసరిగా మాట్లాడేవాళ్ళను ఇదివర కెన్నడూ చూచినపాపానపోలేదు. వాళ్ళకు తిట్లంటే వెరపులేదు; దెబ్బలంటే భయంలేదు. అప్పుడప్పుడు వాళ్లు అస్వాభావిక కఠోర శిక్షలకూ యమయాతనలకూ గురిచేయబడుచుండేవాళ్ళు .అవి చూస్తే చక్రధరునికే ఒళ్ళు గగుర్పొడిచేది. గుండెలు గుభేలుమనేవి. కాని వాళ్ళలో కంటతడిపెట్టినవాడుంటే పాపాత్ముడనుకోండి. ఈఘటనలు పదేపదేచూస్తుంటే చక్రధరున కసలు తనకష్టాలధ్యాసే ఉండేదికాదు. ఏఖైదీఅయినా తిడితే శాంతంగా విని ఊరుకునేవాడు. పైగా ఆ ఖైదీపట్ల సానుభూతీ, మంచితనం ప్రదర్శించేఅవకాశం ఎప్పుడు లభిస్తుందాయని ఎదురు చూస్తూండేవాడు.

చక్రధరుని జీవితం ఎన్నడూ ఇంత ఆదర్శప్రాయంగా ఉండి ఉండలేదు. అవకాశం దొరికినప్పుడల్లా ఖైదీలకు పౌరాణికగాథలు చెప్పి వినిపించేవాడు. ఈ కథలు వాళ్లు ఎంతో ఇష్టంగా, శ్రద్ధగా వినేవాళ్ళు. వాటిలోని ప్రతిపదమూ వారి హృదయఫలకములమీద అంకితమైపోతుండేది. కాని ఆ ప్రభావం మళ్లీ అంతలోనే తుస్సుమని ఎగిరిపోయేది. ఎంత తొందరగా నంటే: ఇటు కథ వినిపిస్తూ

ఉంటే, అటేమో తన్నులూ, గుద్దులూ, గిచ్చుళ్ళూ జరుగు తూనే ఉండేవి. అప్పుడప్పుడు ఆ కథలమీద అవిశ్వాస పూర్ణమైన విమర్శలుచేస్తూండేవాళ్లు. చెప్పినదంతా పరిహాసంతో ఎగరగొట్టేస్తూండేవాళ్ళు. కాని వాళ్ళ ఆ భక్తిశూన్య విమర్శలూ, వ్యాఖ్యలూ వినికూడా హతాశుడయ్యేవాడుకాదు చక్రధరుడు. క్రమక్రమంగా వాళ్ళ భక్తి - చైతన్యం దానంత టదే దృఢపడసాగింది.

ఈరకంగా కొన్ని నెలలు గడిచాయి. పగలంతా కఠిన పరిశ్రమచేసి సాయంకాలమప్పుడు ఒకనాడు సంధ్యవార్చు కుంటున్నాడు చక్రధరుడు. కొందరు ఖైదీలు వాళ్ళలో వాళ్లు ఏదో మాట్లాడుకుంటూ వస్తున్నారు- "ఇన్వాళ ఈ జైలరు గాడిపని పట్టాలిరా. ఎప్పుడుచూచినా, ఒకటే తిట్లాయె. కొట్టటంకూడా ఎలా కొట్టాలో తెలుసా? బ్రతికినంతకాలం మచ్చ మాసిపోకుండా ఉండాలనుకో. ఏం చేస్తార్రా! మహా చేస్తే శిక్ష ఇంకో రెండుమూడేళ్లు పొడిగిస్తారు. ఇంతేగా! కాని, అటు బుల్లాడిబూతులుకాసినీ మళ్ళీ సోదిలోకూడా విన్పడకుండా పోతాయి." ఇలాంటిమాటలు తరచు వింటూ ఉండేవాడు చక్రధరుడు. అంచేత వాటినంతగా పట్టించుకోలేదు. భోజనాలసమయం. జైలరు వచ్చి అక్కడ నిల్చున్నాడు. ఎవడో ఒకఖైదీ కాస్త ఆలస్యంగా వచ్చాడు. అందుగ్గాను వాణ్ని కొట్టబోయాడు జైలరు. ఇంక చూచేపనేముంది! ఎక్కడున్నవాళ్ళు అక్కణ్నుంచే పరుగెత్తుకొచ్చారు ఖైదీలు. 'కొట్టండి, పొడవండి, తన్నండి' అన్న కేకలతో జైలంతా మార్మోగింది. జైలరుగారు కంగారుపడ్డాడు. నివ్వెర

పోయి చూస్తున్నాడు. ఇంతలో గబగబా ముందుకొచ్చి జైలరుమెడ లంకించుకున్నాడు ధన్నాసింగ్. గుడ్లు వెళ్ళుకొచ్చే ట్టుగా సత్తువకొద్దీ పీకనొక్కాడు. ఇక ఘోరవిపత్తేదో వచ్చి పడబోతున్నదని గ్రహించాడు చక్రధరుడు. బాణంలా ముందుకు దూసుకెళ్ళాడు. ఖైదీలమధ్యలో కెళ్లి ధన్నాసింగు చెయ్యి పట్టుకుని 'ఏమి టీ పని?' అని గదమాయించాడు.

ధన్నా:—పో పోవోయ్! ముందు ఇక్కడనుంచి తప్పుకొని మాట్లాడు. లేకపోతే 'బాబు' గారి తనమంతా వెళ్ళగక్కిస్తా. సరే, ముందు వీడిసంగతి తేల్చు. ఇంకెప్పుడూ ఎవ్వరిజోలికీ రాకుండా, కొట్టకుండా, తిట్టకుండా ఉంటాడో లేదో అడుగు.

జైలరు:—'ఖురాన్'తోడు. ఎప్పుడైనా సరే, ఒక్క తిట్టు నోరుదాటివస్తే అప్పు డనండి.

ధన్నా:—బుద్ధివచ్చిందని చెవులుపట్టుకో.

జైలరు:—ఇదిగో, చెవులు పట్టుకుంటున్నా.

ధన్నా:—పో! ఇవ్వాల్టికి బ్రతికిపోయావు పో. ఏ పుణ్యాత్ముడి మొహమో చూస్తూ లేచావులే. లేకపోతే ప్రాణాలతో తిరిగి వెళ్ళేవాడివి కాదు. ఇక్కడ ఏడ్చేవా డెవడన్నా ఉన్నాడనుకున్నావా?

చక్ర:—జైలరుగారూ! ఇక్కడినుంచి వెళ్ళి, మళ్ళీ పోలీసులతోవచ్చి ఈ నిర్భాగ్యులపై దండెత్తి తుపాకులతో మలమల మాడ్పించివేయరుగదా?

జైలరు:—అయ్యయ్యో! రామ రామ!! అంత నీచుణ్ని కాను.

జైలరు ఎలాగైతేనేం ప్రాణాలు దక్కించుకుని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. కాని ఎకాయెకీని ఆఫీసుకుపోయి, జిల్లా మేజస్ట్రీటుకు 'ఫోన్' చేశాడు. తానూ తుపాకి తీసుకుని యుద్ధానికి తయారయ్యాడు. రెప్పపాటులో మిలిటరీ దండు తుపాకులతో వచ్చిపడింది! గబగబా గేటు తెరచి జెయిలు లోపలికి ప్రవేశించింది.

చక్రధరునిమీద నాలుగు వేపులనుండీ వాక్బాణాలు వచ్చి పడసాగాయి. అతను ముందుకుపోయి జైలరు నుద్దేశించి "ఏమయ్యా! ఇంతకూ మీరుకోరేదేమిటి? దౌర్భాగ్యుల్ని ముట్టడించటానికి కారణ మేమిటి?" అని అడిగాడు.

"ఇడుగిడుగో వీడే, ఆ బద్మాష్‌లందరికీ నాయకుడు వీడే. వీణ్ని ముందు అరెస్టుచేయండి. తర్వాత మిగిలినవాళ్ళందర్నీ చితుగ్గాతన్నండి. చచ్చేటట్టుపొడవండి. పిసరువెళ్ళుగొచ్చే దాకా మర్దించండి పందిముండాకొడుకుల్ని" అన్నాడు జైలరు సిపాయిలచాటున నిలబడి.

చక్ర:- ఖైదీలను కొట్టేందుకు మీ కేమీ హక్కు లేదు.

సిఫాయిలు ఖైదీలమీద విరుచుకుపడ్డారు. సన్నీలతో పొడవనారంభించారు.

ఖైదీల్లో గంద్రగోళం బయలుదేరింది. ఇక్కడా అక్కడా వెదకి పలుగులూ-పారలూ, రాళ్ళూ - రప్పలూ, ఒక టేమిటి? ఏది అందితే అది తీసుకుని ఎదుర్కోటానికి సిద్ధమయ్యారు. విషమపరిస్థితిగా ఉంది. "మీకు ఇంకోసారి మనవి చేస్తున్నాను" అన్నాడు చక్రధరుడు ఎంతో దీనంగా!

జైలరు:— ఇక కోసుకుమ్మన్రా పుదివెధవా!

ఈ మాట జైలరు నోటినుంచి రావటమే ఆలస్యం, గరుడపక్షిలా చటుక్కునపోయి జైలరుమీద పడ్డాడు చక్రధరుడు. ఖైదీలను సుత్తిలతో పొడవటం అంతకు ముందే ప్రారంభమైంది. చక్రధరుడు ముందుకు రావడంచూచి వాళ్లూ రాళ్ళు విసరసాగారు. సంకులసమరం ప్రారంభమయింది

తటాలున ఆగిపోయాడు చక్రధరుడు. పరిస్థితి విష మించి భయంకరరూపం దాల్చుతోంది. వెంటనే తుపాకులు గురిపెడతారు సిపాయిలు. పీనుగలు తిప్పతిప్పలుగా పడి దొర్లుతాయి. హింసాభావాలను అనాగ్రహోకటానికి అవ కాశమంటే ఇప్పుడే. గొంతు చించుకుంటూ అరిచాడు చక్ర ధరుడు— "రాళ్ళు రువ్వకండి. రాళ్ళు రువ్వకండి. రాళ్ళు ఆపు చేసి, వెళ్ళి సిపాయిలచేతుల్లోని తుపాకులు లాక్కోండి."

సిపాయిలు తుపాకులు ఎక్కుపెట్టాలనుకున్నారు. కాని అందుకు అవకాశం చిక్కనేలేదు. ఎందుచేతనంటే ఒకొక్కక్క సిపాయిమీద పదేసిమంది పడ్డారు. వాళ్ళచేతుల్లోని తుపాకు లన్నీ లాక్కున్నారు. ఇదంతా జరగటానికి ఐదు నిమిషాలు మాత్రమే పట్టింది. కొద్ది నిమిషాలకు పూర్వం ఎగిరెగిరిపడ్డ వాళ్ళే ఇప్పుడు దయాభిక్షకోసం నిల్చొని, ఎదురు చూస్తు న్నారు. బ్రతిమాలుతున్నారు. కళ్ళకు క్రిందిచూపేగాని పైచూపేమీ లేదు. బొటబొటమని కన్నీళ్లు కారుతున్నాయి. పందెం ఈ రకంగా తలక్రిందులైంది. జైలరుగారి అవతారం ఎంత సొగసుగాఉందని! ఫొటోతీయించవచ్చు. తేభ్యం ముఖం,

పీనుగకళా అదీను. గజగజా వణికిపోతున్నాడు గణంపూనిన వాడిలా. ప్రాణం నిలుస్తుందా పోతుందా అన్నట్టున్నాడు.

ఇప్పుడు అంతా తమదే రాజ్యంగా ఉండటం చూచి పాతకక్ష తీర్చుకోటానికి సిద్ధమయ్యారు ఖైదీలు ఒక్క గంతులో జైలరుముందుకెళ్ళి గట్టిగా ఒక్కతోపుత్రోసి "ఏరా ఖాన్ ! గడ్డంలోని వెంట్రుకలన్నీ ఒక్కొక్కటే ఊడబెరికించమంటావట్రా ?" అన్నాడు ధన్నాసింగ్.

చక్ర:- ఇదిగో ధన్నాసింగ్ ! ఇక్కడనుంచి వెళ్ళిపో.

ధన్నా:- చావురాత రాసేఉంది. మరి, వీణ్ని మాత్రం వదలిపెట్టటం దేనికి ?

చక్ర:- నా కళ్ళఎదుట ఇలాంటిఘోరం జరగటానికి వీల్లేదు. నిజం చెబుతున్నా. నా తల ఒరిగిన తర్వాతనే మీ శేది చేసుకున్నా. అంతకుముందు మాత్రం జరగనివ్వను.

ధన్నా:—ఇంత గొప్ప ధర్మాత్ములవారివైతే, మరి వీడి కెందుకు నేర్పవూ నీతులు? ఎన్నిబాధలుపడుతున్నామో కంటికగపడటం లేదూ?

ఇంతలో సింహద్వారంవద్ద ఏదో కాస్త గలభాగాఉంది. కొందరు ఆఫీసర్లతో కలిసి సాయుధపోలీసుదళంతో వచ్చి చేరాడు, జిల్లామేజస్ట్రేటు మిష్టర్ 'జిమ్.' జైలరు లోనికి వచ్చేటప్పుడు గేటు తలుపులు గట్టిగా మూయించి మరీ వచ్చాడు ఖైదీ లెక్కడ పారిపోతారో నన్న భయంతో. ఈ గల్లంతు విని పోలీసులే వచ్చి ఉంటారని అర్థంచేసుకున్నాడుచక్రధరుడు. ఖైదీల నుద్దేశించి "సోదరులారా! ప్రాణాల మీద ఇంత పగెందుకూ? నా మాట విని తుపాకులు అక్కడ పెట్టే

యండి. వెంటనే వెళ్ళి తలుపులు తీయండి. పోలీసులు వచ్చారు.

ధన్నా:—మరేం ఫర్వాలేదు. మేమూ ఇవ్వాళ వీళ్ళ అంతేమిటో తేల్చుకోదలచాం. ఇంకెలాగైనా చావు తప్పదు గదా. మరి ఊరికే చావటం దేనికి? మాతోపాటు ఇద్దరు ముగ్గుర్ని హతమార్చి మరీ చస్తాం.

ఖైదీలు బాయ్‌నెట్లు బారుచేశారు. అందరికన్న ముందు ధన్నాసింగ్ పోయి జైలరుమీద పడ్డాడు. కత్తిమొన వెళ్ళి జైలరురొమ్ముల్లో దూరటానికి సిద్ధంగా ఉంది. ఇంతలో చక్రధరుడు 'ఇదిగో ధన్నాసింగ్! దేవునికోసమైనా..." అంటూ జైలరుముందు అడ్డుగా నిలబడ్డాడు. ధన్నాసింగు అంతకుముందే బాయ్‌నెట్ విసిరాడు. అది చక్రధరుని భుజ స్కంధానికి గట్టిగా పొడుచుకుంది. సున్నీసగం వెళ్ళిదూరింది. ఎడమచేత్తో భుజంపట్టుకుని నేలమీద చతికిలపడ్డాడు. చక్రధరుడు పడిపోవటం చూచి ఖైదీలు స్తంభించిపోయారు. గబగబా పోయి చక్రధరునిచుట్టూ చేరారు. ఏదో మహానర్థం రానున్నదని శంకకలిగి ఖైదీల కసలు మతులే తప్పి పోయాయి. "అరరె! భక్తుడికి దెబ్బతగిలిందిరా'' అన్న పదాలు వాళ్ళపశుప్రవృత్తుల్ని అణగద్రొక్కి పైకెక్కి కూర్చున్నాయి. తుపాకిని విసిరి అవతలపారేశాడు ధన్నాసింగు. వెక్కి వెక్కి ఏడ్పు సాగించాడు. దుఃఖం భరింపశక్యంగాకుండా ఉంది. ఆ సున్నీతోనే తనరొమ్ముల్లో పొడుచుకోవాలని ఎన్నోసార్లు ప్రయత్నించాడు. కాని ఖైదీలు కదలకుండా, మెసలకుండా

చేతులు గట్టిగా పట్టుకున్నందువల్ల ఆ ప్రయత్నం వృధా అయింది.

ఈ సందు కనిపెట్టి గేటుతలుపులు తెరవాలని గేటు వేపుకు పరుగెత్తుతున్నాడు జైలరు. ఇదిచూచాడు ధన్నాసింగు. సత్తువకొద్దీ ఒక్కవిదలింపు విదలించి ఖైదీలచేతు ల్లోంచి బైటబడ్డాడు. ఛెంగున తుపాకి తీసుకుని ఆ పరుగెత్తే జైలరువెంటపడ్డాడు. జైలరుమీద మళ్లా దెబ్బపడటానికి సిద్ధంగాఉంది. ఇంతలో చక్రధరుడు కాస్త సంబాళించుకుని లేచి నిలబడ్డాడు. ఒక చేత్తో భుజంపట్టుకుని కుంటుకుంటూ బయలుదేరాడు. అతను రావటం చూచాడు ధన్నాసింగ్. ఇక అడుగు ముందుకుపడితే ఒట్టు. ఆహా! భర్తుడు ఇంకా బ్రతికే ఉన్నాడుగదా యని పరమానందభరితుడై పోయాడు. చేతిలోని తుపాకి నక్కడే పారేసి చక్రధరునివేపుకు బయలుదేరాడు. చక్రధరునిపాదాలపై శిరముంచి భోరుభోరున ఏడ్వసాగాడు.

"సిపాయిలను వదిలెయ్యి" అన్నాడు చక్రధరుడు.

ధన్నా:- సరే, అలాగే, మీ ఇష్టప్రకారమే జరగ నిస్తాం.

అకస్మాత్తుగా మిస్టర్ జిమ్ సాయుధ పోలీసులతో లోపలి కడుగుపెట్టాడు. వాళ్ళు కంటబడటమే తడవు, ఖైదీ లంతా ఎక్కడివాళ్ళక్కడే మాయమైపోయారు. ఒకరిద్దరు మాత్రమే చక్రధరునిదగ్గర నిల్చుని ఉన్నారు. ఆ ఇద్దరిలో ఒకడు ధన్నాసింగ్. లోపలికి అడుగుపెట్టీపెట్టటంతోనే తుపాకులు మళ్ళీ చేతబట్టి బారుతీరి నిలబడ్డారు జైలు సిపాయిలు కూడా.

జిమ్:- భేష్! జైలర్! పరిస్థితి ఎలా ఉంది?

జైలరు:- దొరగారి చలనవల్ల అంతా బాగానే ఉంది. ఖైదీలంతా పలాయనం చిత్తగించారు.

జిమ్:- ఈ పడిపోయిన మనిషి ఎవరు?

జైలరు:- ఇతనేనండీ మాకు తోడ్పడినవాడు! పేరు చక్రధరుడు.

జిమ్:- వీడే ఖైదీలను రెచ్చగొట్టిఉండొచ్చునేమో.

జైలరు:- లేదు, లేదు సార్! ఇతనే ఖైదీలందరికీ నచ్చ చెప్పి శాంతపర్చాడు.

జిమ్:- నీ కసలు మెదడేమీ లేనట్టుగా ఉందే! ఇటువంటివాళ్ళే ఖైదీలను ముందు స్వయంగా రెచ్చగొడ్తారు. ఆ తర్వాత వాళ్ళతరపున ఏకాల్గా పుచ్చుకుని బయలుదేరుతారు ఉద్యోగులతో దెబ్బలాడటానికి.

జైలరు:- అయ్యా! చూపులకు మాత్రం చాలా అమాయకునిలాగా కన్పడుతుంటాడు. అయితే, మనస్సులో ఏముందో ఏమిటో ఆ దేవుడికే తెలియాలి.

జిమ్:- దేవునికి తెలిస్తే లాభ మేమిటోయ్! నువ్వు తెలుసుకోవాలోయ్. ఇతను ఖైదీలతో మతవిషయా లేమీ చర్చించడుగదా!

జైలరు:- మతాన్ని గురించి చాలా చెబుతుంటాడుసార్!

జిమ్:- మరి చెప్పవేం! ఐతే, ఇతను చాలా ప్రమాదకారి. చదువుకున్నటువంటి మనిషి ఎవ్వడైనా మతసంబంధమైన విషయాలు మాట్లాడుతుంటే వాడేదో కుట్ర పన్నుతున్నాడని వెంటనే అర్థంచేసుకో. మత సంబంధ రాజకీయాలు

చాలా ప్రమాదకరంగా ఉంటాయి. ఈ మనిషి ఖైదీలపట్ల ఎంతో సానుభూతి కలిగి ఉంటాడుగదూ? ప్రభుత్వాజ్ఞలు తు. చ. తప్పకుండా పాటిస్తాడుగదూ? ఎన్నడూ ఎట్టి ఫిర్యాదూ చేయడుగదూ? ఎంత కఠినమైన పనైనా సంతోషంగా చేస్తాడు గదూ?

జైలరు:- చిత్తం, చిత్తం.

జిమ్:- ఓ, ఇలాంటివాడు తప్పకుండా ప్రమాదకర వ్యక్తి అయిఉంటాడనుకో. ఇలాంటివాణ్ణి పొరపాటున కూడా నమ్మగూడదు. మేము వీడిమీద కేసు పెడతాం. పెద్ద కఠోర మైన శిక్ష వేస్తాం. జైలు సిఫాయిలందర్నీ ఆఫీసుకు పిలిపించు. వాళ్ళందరి దగ్గరా వాఙ్మూలం తీసుకుంటాం.

జైలరు:—అయ్యా! ముందు వీణ్ని డాక్టరుకుచూపించ నివ్వండి. చస్తాడేమో మరి. మీ దాసుడికి మచ్చ అంటు కుంటుంది.

జిమ్:—వాడా? చావటమా! లేదు లేదు. ఇలాంటి ప్రమాదమైన మనిషి ఎప్పుడూ చావడనుకో. కాదు, చస్తాడే అనుకుందాం, ఐతే మనకేంనష్టం?

ఇలాఅని ఆఫీసువేపుకు నడిచాడు జిమ్‌దొర. డాక్టరు వస్తాడేమోనని ఇంతవరకూ నిరీక్షిస్తూ కూర్చున్నాడు ధన్నా సింగ్. జిమ్‌దొర అటు కేసి తొంగి చూడకుండానే పోతూండ టంచూచి చక్రధరుని భుజంమీద ఎత్తుకుని ఆస్పత్రికి బయలు దేరాడు ధన్నాసింగ్.

రెండుమాసాలు ఆస్పత్రిలో పడిఉన్నాడు చక్రధరుడు. ఏం మందులిచ్చారో, ఎలాచూచారో అదంతా అతనికే అను

భవం. కాని ప్రజలదీవెనలలో మాత్రం తప్పకుండా శక్తి ఉంది. అతని ఆయురారోగ్యములను కాంక్షిస్తూ వేలమంది ప్రజలు రోజూ దైవప్రార్థనలు చేసేవాళ్లు. మనోరమకు నిత్యం దాన - వ్రతములు మినహా మరో పనేలేదు. పూర్వం బూటకంగా భావించిన విషయాల్లోనే ఇప్పుడామెకు ఆత్మశాంతి లభిస్తోంది. బలహీనస్థితిలోనే కదూ కన్రనూతగా అపేక్షిస్తూంటాం!

చక్రధరుడేమో అక్కడ ఆస్పత్రిలో పడిఉన్నాడు. ఇక్కడ కొత్తకేసు బనాయించే ఆలోచనలూ, ప్రయత్నాలూ జరుగుతున్నాయి. కానకోలుకుని తప్పటడుగులతో నడవసాగాడో లేదో అప్పుడే కేసూ నడవసాగింది. జైలులోపలే విచారణ. ఇప్పుడు మేజస్ట్రేటు గురుసేవక సింగే. అతనిదగ్గరే దీని విచారణ.

గవర్నమెంటుకు సంబంధించిన విషయాలలో సిఫార్సులు గాని, మొగమోటాలుగాని బొత్తిగా పనికిరావు గురుసేవకునికి. కాని ఈ కేసురాగానే ధర్మసంకటంలో పడిపోయాడు. చక్రధరునికి శిక్షవేస్తాడా ప్రజలలో తలెత్తుకుతిరిగే ఆస్కారం లేకుండాపోతుంది. మనోరమ ఇక అతనిముఖం కూడ చూడ నిష్టపడకపోవచ్చు. కొట్టివేస్తాడా - అధికారవర్గంలో గౌరవం కోల్పోతాడు. అంతా 'ఛీఛీ' అంటారు. చక్రధరుడంటే ఉద్యోగ వర్గమంతా మండిపోతోంది. త్రాచుపాములా పగబట్టి కూర్చుంది.

కేసు విచారణ ప్రారంభమై నేటికి మూన్నాళ్ళు. వరండాలో కూర్చుని శ్రావణమాసపు తెరపిలేని తుంపరవర్షం యొక్క ఆనందం అనుభవిస్తున్నాడు గురుసేవకసింగ్. హఠా

తుగా మనోరమ కారు-గ్గొంచి దిగివచ్చి అతనిప్రక్కనే ఉన్న కుర్చీలో ఆసీనురాలయింది.

"ఎక్కణ్నుంచి?" అన్నాడు గురుసేవకసింగ్.

మనో:—ఇంటిదగ్గర్నుంచే. ఆ జైలుదెబ్బలాట కేసులో ఏం జరుగుతోందేమిటి?

గురు:- ఇంతవరకేమీ లేదు. ప్రస్తుతం సాక్షులవిచారణ జరుగుతోంది.

మనో:- 'బాబు' గారిమీద నేరం రుజువయిందా?

గురు:- నేరం రుజువైనా ఒకటే, కాకపోయినా ఒకటే. కారణం ముద్దాయిని నేను తప్పకుండా శిక్షించవలసిఉంటుంది. ఒకవేళ వదలిపెడ్తానన్కో, ప్రభుత్వం అంతటిదో పోనివ్వదు. అప్పీలుచేసి పునర్విచారణ పెట్టించి తప్పక శిక్ష వేయిస్తుంది. నాకు చెడ్డపేరువస్తుంది. నా కిదొక ఆత్మత్యాగ సమస్యగా వుంది. సమస్త దేవతా - మండలి (ఉద్యోగులు)కి ఆగ్రహం వస్తుంది.

మనో:—బాబుగారికి ఒకటి రెండేళ్ళు శిక్ష పొడిగించబడితే పడవచ్చు. అదొక పెద్ద సమస్యకాదు. తాను నిరపరాధున్నన్న ఆత్మవిశ్వాసమొక్కటే ఆయన ఆత్మ - తృప్తికి సరిపోతుంది కూడా. కాని మీరు మాత్రం రెంటికీ చెడతారు. మీ దేవతలు మీ యెడల ప్రసన్నులైతే కావచ్చు, కాని మీ ఆత్మకుమాత్రం పుట్టగతులుండవు.

గురు:—చక్రధరుడు పూర్తిగా నిరపరాధుడనిమాత్రం చెప్పడానికి వీల్లేదు. మొట్టమొదట అతనే జైలరుమీద మండి

పడి ముందుకురికాదు. కాస్త నిగ్రహించుకోగలిగినట్లయితే ఆ తిరుగుబాటు జరిగిఉండేదేకాదు.

మనో:—ఆయన తన ధర్మాన్నే నిర్వహించాడు గాని ఇంకేమీ చేయలేదు. బాబుగారు నిర్దోషి యని వ్రాయటమే భావ్యం. అంతేగాదు. ఒక మహాప్రమాదంలో చిక్కుకొన్నప్పుడు తన ప్రాణాలనుసైతం లెక్కచేయక జైలు సిబ్బంది ప్రాణాలు రక్షించారు. అందుకుగాను వెనుకటిశిక్ష తగ్గించటం అవసరం అని సిఫార్సు చేయటం ఉచితం.

"అగ్నిగుండంలో దూకమంటావా?" అన్నాడు గురుసేవకసింగు తన నీచత్వాన్ని చిరునవ్వుచాటున మరుగుపరుస్తూ.

మనో:—ధర్మ-సంరక్షణార్థం అగ్నిగుండంలో దూకటం నూతన విశేషమేమీకాదు. ఐతే, ఇంతకూ భయానికి కారణమేమిటి? మీ పై ఉద్యోగస్థులకు మీమీద కోపం వస్తుందనేకదూ? ఉద్యోగంలోనుండి బరతరఫ్ చేస్తారేమోననీ భయంగా ఉంటే ఉండొచ్చు. కాని దీన్నేమాత్రం లెక్కచేయవలసిన పనిలేదు.

తనస్వార్థపరత్వంపట్లసిగ్గుపడుతూ"ఉద్యోగం ఉంటుందా ఊడుతుందా అని నేను భయపడటంలేదు. వీళ్ళ నీచత్వాన్ని చూచి మాత్రమే భయపడుతున్నాను. వీళ్ళ ధర్మం, రాజనీతి, న్యాయం, సభ్యత అన్నింటినీ కలిపి ఒకే ఒక పదంలో చెప్పవచ్చు—'స్వార్థం, స్వార్థం.'' ఈ బలహీనత నాలోనూ ఉందని తెలుసు. కాని లాభమేముంది? అంత సాహసం చేయలేను" అన్నాడు.

మనో:—అన్నయ్యా! ఇవన్నీ వట్టి ఆధారంలేని సందేహాలే. కాని, ఇంతకూ సాక్షుల్ని విచారించటం అయిపోయిందా ఇంకా ఉందా?

గురు:—ఔను, అయిపోయింది. ఇక తీర్పు ఒక్కటే మిగిలిఉంది.

మనో:—ఐతే మరి వ్రాయండి. వ్రాయించకుండా కదిలేది లేదు. ఈ మనోనిశ్చయంతోనే వచ్చాను.

హఠాత్తుగా ఇంకోకారు వచ్చి వాకిట్లో ఆగింది. అందులో రాజా విశాలసింగ్‌గారు వచ్చారు. ఎంతో ఉత్సాహంగా అతనికి ఎదురెళ్ళాడు గురుసేవకసింగ్. కాని రాజాగారి ధ్యాస అతనిమీాదలేదు. కారు దిగి ఏకాయెకీని మనోరమ వద్దకు వెళ్ళాడు. 'మీా ఇంటికెళ్ళివచ్చాను. అక్కడ అడిగితే ఎక్కడికో వెళ్ళిందని చెప్పారు. ఫలానా అని మాత్రం చెప్పలేదు. సరే, ఇక అక్కణ్ణుంచి పార్కుకెళ్ళాను. పార్కునుంచి కూడలికి పోయాను. ఎక్కడా అంతులేదు. ఈ రకంగా ప్రపంచమంతా వెదుక్కుంటూ చివరికి ఇక్కడికి చేరాను. బైటికిపోయే టప్పుడు కాస్త ఇంటిదగ్గరచెప్పి వెళ్తూ ఉండమని ఎన్నోసార్లు చెప్పాను'' అన్నాడు రాజా.

ఇలా అని చెయ్యిపట్టుకుని కారువేపుకు లాగాడు. ఒక్క విదలింపు విదలించి చెయ్యిలాక్కుని "నేను రాను" అంది మనోరమ .

రాజా:—ఏం? ఇంతకూ కారణం?

మనో:—అదంతా నాఇష్టం.

గురు:—అయ్యా ఆ జైలుదెబ్బలాట కేసులో జబర్ద స్తీగా నాచేత తీర్పు వ్రాయించటాని కొచ్చి కూర్చుంది. 'వ్రాయించకుండా కదిలేదిలే'దంటోంది.

గురుసేవకసింగ్ మటుకు ఈ మాట ఏదో పరిహాసం కోసమే అన్నాడు. అతను సమయోచితంగా మాట్లాడటమే చాలా అరుదు. ఇది వినగానే మనోరమ వదనమండలం ఎర్రగా కందగడ్డలా కందిపోయింది. రాజాగారి దృష్టిలో తన్ను హేయంగా చిత్రింపజూస్తున్నాడని గ్రహించింది. రొమ్మువిరిచి "ఔను! అందుకే వచ్చాను. ఏం వస్తే? ఈమాట అంటూఉంటే నీకు సిగ్గు కలుగవలసింది. నీవు నిష్పక్షపాతంగా తీర్పు వ్రాస్తావని నేను భావించిఉంటే నే నిక్కడికొచ్చి కూర్చోవలసిన అవసరమెందుకుండేది? నువ్వూ నేనూ ఒక తల్లిగర్భాన జన్మించాం. ఆ కారణంవల్లనే నీమీద సత్యాగ్రహం చేస్తున్నాను. నీవుగాక ఇంకెవ్వరైనా బుద్ధిపూర్వకంగా బాబుగారిపట్ల ఇలాంటి అన్యాయం చేయటానికి ఒడిగట్టిఉంటే, నాచేతిలోపనైతే, వాడికాళ్లూచేతులూ తప్పకుండా ముక్కలు ముక్కలుగా నరికించేదాన్ని. చక్రధరునిపట్ల నాఅంతరంగంలో ఎంతఅభిమానం, గౌరవం, శ్రద్ధా ఉన్నవో అది నీబోటివాడికి ఊహాతీతం" అంది.

ఒక నిమిషం నిశ్శబ్దం తాండవించింది. గురు సేవకుని మొహం ముడుచుకుపోయింది. రాజాగారి మొహం ఇప్పుడే ఏడ్చి కళ్ళనీళ్లు తుడుచుకొన్నట్టుగాఉంది. ఇక నోరెత్తకుండా తన కారువేపుకు వెళ్ళిపోయాడు.

# పద్నాలుగో అధ్యాయం

పాలకవర్గం కనుసన్నల మెలగే గురుసేవకసింగ్ జైలు కొట్లాట కేసులో చక్రధరుని విడుదలచేశాడు. అతని ఈ చర్య అధికారులందరిలో ఒక పెద్ద అలజడిని కలుగజేసింది. గురు సేవకసింగ్ ఇలాంటితీర్పు ఇస్తాడని ఎవ్వరూ అనుకోలేదు. పైగా ఆ తీర్పేం తీర్పు! ఏదో పేరుకు తీర్పని మాత్రమే చెప్పవచ్చు. అందులోని ప్రతిపదం వాత్సల్యసుధారసంలో మునిగి తేలి నట్టుగా ఉంది. ప్రజలంతా అతన్నిగురించి తెగ చెప్పుకో సాగారు. "ఇలాంటి న్యాయవీరుడు, ఇలాంటి అపర హరిశ్చంద్రుడు ఎక్కడో నూటికి కోటికి ఒకరుంటారేమో!" అని ప్రతి నోటినుండీ రాసాగింది. అనేకమంది పట్నవాసులు అతని దర్శనంకోసం వచ్చారు. 'ఈయన ఉద్యోగస్థుడంట్రా! కాదు కాదు, సాక్షాత్ దేవతాస్వరూపం' అని వేనోళ్ళ పొగడు కుంటూ వెనక్కి తిరిగిపోయేవాళ్ళు. చక్రధరునను ఈ కేసులో శిక్ష చెప్పించి ఇంకో నాలుగైదేళ్ళు జైలుగదుల్లో మురగ బెట్టాలని పాలకవర్గం కలలుగన్నది. కాని, ప్రౌద్దెదురయింది; నమ్మిన కంచెయే చేను మేసిపోయింది. చక్రధరునిమీద కేసు కొట్టివేయటమేగాక, పైగా అతను అనుభవిస్తున్న శిక్షకూడా ఏడాదికి తగ్గించబడింది. తనకు అడ్డేలేకపోతే గురుసేవకసింగును నిలువునా కాల్చివేయాలన్నంత కోపంగాఉన్నాడు మిస్టర్ జిమ్ వొర. ఇంకేమి చేయటానికీ చేతగాక, మూడోరోజునే ఆగ్రా జైలుకు ట్రాన్సఫరు చేయించివేశాడు చక్రధరుణ్ణి. జైల్లో

ఖైదీలెవ్వరూ అతనితో మాట్లాడరాదనీ, చివరకు, అసలు అతని గదిముందుకూ్కడా వెళ్ళటానికి వీల్లేదనీ జైలు అధికార్లు హెచ్చరింపబడ్డారు. అంతేగాదు. జైలు సిబ్బంది సైతం మాట్లాడటం నిషేధించబడింది. ఒక ఏడాది శిక్షలోనే పదేళ్ళశిక్ష రుచి చూచేటట్లుగా చేయాలని ఆలోచన. వింత ఏమంటే ఈ ఆలోచనా పిచ్చిలో చక్రధరునకసలు పనే ఇవ్వలేదు. ఎనిమిది జాములూ నాల్గుమూరల పొడుగూ, మూడు మూరల వెడల్పాగల గదిలో పడివుండటమే పెద్దపనిగా ఇవ్వబడింది.

చీకటి కొట్టులో చక్రధరుని భావాలూ, ఆలోచనలూ వాయువేగంతో గిర్రుగిర్రున తిరుగుతున్నాయి; తలక్రిందు లవుతున్నాయి. వాటి ఈత్వరితగతినిచూచి, 'తన క్షేమన్నా పిచ్చెక్కటంలేదుగదా' అని భ్రమకల్గుతూండేది. సరే, ఎలాగైతేనేం చివరకు ఈ అంతర్ద్వంద్వంనుంచి అతని ఆత్మ విజేతగా బైటపడింది. మనోప్రపంచంమీద అంతరాత్మ ప్రభుత్వం నెలకొన్నది. మనస్సు పోయి అంతర్జగత్తులో విహరించసాగింది. ఒక సమాధిలోవున్న యోగీశ్వరుని వలె ఆ అంతర్లోకంలో గంటలకొద్దీ విహరించేవాడు చక్రధరుడు. శారీరక క్లేశాలపట్ల ఇప్పుడతనికి కొంత వుపేక్షాభావం ఏర్పడసాగింది. అసలువాటిని గురించి ఆలోచించటమే, అటుకేసి చూడటమే హేయమని తలచసాగాడు. అప్పుడప్పుడు ఏవో పాటలు పాడేవాడు వినోదార్థం ఎన్నో కొత్త కొత్త ఆటలు కనిపెట్టాడు. ఆ కటిక చీకటిలో తన బుడ్డిచెంబును దొర్లించేవాడు. మళ్ళీ దాన్ని వెదకి ఒక్కసారిగా పట్టుకోటానికి ప్రయత్నించేవాడు. అతను ఇప్పుడు ముఖ్యానసరంగా భావిస్తూన్న వస్తువల్లా ఒక్కటే. అది

వెల్తురు. అదీ చీకటంటే ప్రాణం విసిగిపోయి మాత్రం కాదు ఆ కోరటం. తన మనస్సులో పుష్పించినచ్చే భావాలకు ఒక లిఖితరూపం ఇవ్వాలన్నదే ప్రధానకారణం. వ్రాతసామగ్రి కోసం అతని మనస్సు తెగ తహతహలాడిపోతోంది. నెమ్మది నెమ్మదిగా అతనికి వెల్తురు ఆవశ్యకతా లేకుండాపోయింది. 'చీకట్లోనూ వ్రాయగలను' అని ఒక ఆత్మవిశ్వాసం ఏర్పడ సాగింది. కాని వ్రాతపరికరా లేవీ! ఇదే పెద్దసమస్యగావుంది. దీనిమూలంగానే అప్పుడప్పుడు వ్యాకులపడిపోతూండేవాడు.

చక్రధరునికి అప్పుడప్పుడు ఒక ముసలివార్డరు అన్నం తీసుకొస్తూండేవాడు. అతడు నవ్వుతూఉండే మనిషి. ప్రసన్న ముఖునిగాచూచి చక్రధరునితో అప్పుడప్పుడు ఏవో రెండు కబుర్లు చెప్పిపోతూండేవాడు. చక్రధరునికి అతనితో ఒకరక మైన బంధుత్వ సంబంధంలా ఏర్పడింది.'చుట్ట, బీడీ, గంజాయి జిగురువగైరాలమీాదికేమైనామనసుపోతూంటె తనతోచెప్పమని అనేకసార్లు ఆముసలివాడు అడిగాడుకూడాను. ఐతే, ఒక చిన్న పెన్సిలూ, కొద్దిగా కాగితాలూ అవసరమని చెప్పితే ఏం పోతుంది? అని ఒక ఆలోచనకల్గింది. తుదకు ఒకరోజున ఆమాటే అతనిముందు వెల్లడించాడు చక్రధరుడు. 'ఏంవార్డర్! ఇక్కడేమైనా కాస్తకాగితం, పెన్సిలు దొరుకుతాయా?"

"దొరకక్కేం? దొరుకుతుంది. కాని ఎవడికంటనన్నా పడితేనో?" అన్నాడు వృద్ధవార్డరు హెచ్చరికభావంతో.

ఈ మాటతో చక్రధరుడు కాస్త సంబాళించుకు న్నాడు. ఒక నిమేషమాత్రం మోహపాశాబద్ధమైన వివేకబుద్ధి

మరల మేలొన్నది. ''లేదు, లేదు తాతా! ఏదో ఆషామాషీగా అడిగానులే" అన్నాడు చక్రధరుడు.

తెమ్మంటే కాగితం- పెన్సిలు తీసుకొస్తానని ఆతర్వాత మళ్ళీ ఎన్నోసార్లు అడిగాడు వార్డరు. కాని అడిగినప్పుడల్లా 'అవసరంలేదులే' అన్నాడు చక్రధరుడు.

చక్రధరుడు ఆగ్రా జైలుకు బదిలీచేయబడ్డాడని యశోదానందునికి తెలిసింది. అతన్ని కలుసుకోవాలని విశ్వ ప్రయత్నంచేశాడు. కాని జైలుఅధికారులు అనుమతి ఇవ్వలేదు. సామాన్యంగా ఆరుమాసాలకొకసారి స్వకుటుంబీకులకు ఇంటర్వ్యూకు అనుమతి ఇస్తారు. కాని చక్రధరునకు ఆ సౌకర్యమూ సున్నాచుట్టారు. ఐనా యశోదానందనుడు అంతటితో చేతులు ముడుచుకు కూర్చునేమనిషి కాదు. అవసరమైతే లేదా అందకపోతే కాళ్ళుకూడా పట్టుకుని కార్యం సాధించితీరే వ్యక్తి. తన శక్తినంతా ధారపోసి ఎట్టకేలకు అనుమతి సంపాదించాడు. తనకుకాదు, తన బిడ్డ అహల్యకోసం. ఆ విరహిణి కృష్ణపక్ష చంద్రునిలా క్షీణించిపోతోంది. చక్రధరుడు జైల్లో అడుగు పెట్టాడు, అదే మొదలు, ఇక ఆవిడా ఖైదీలాంటి జీవితమే గడుపసాగింది. మొదట్లో ఆవిడకు ఈశ్వరభక్తి బాగానే ఉండేది. ఇప్పు డది మూడు పువ్వులు పూసి ఆరుకాయలు కాయసాగింది. కళ్ళు మూసుకొని చేతులుజోడించి దైవధ్యానంలో నిమగ్నురాలై ఉన్నప్పుడు సాక్షాత్తు చక్రధరుడువచ్చి ఎదుట ప్రత్యక్షమైనట్టు అనుభవమవుతుండేది. శిశువుపైకప్పిన జననివాత్సల్యపూరితమైన కొంగు చందాన తన ప్రార్థనలు చక్రధరుని కాపాడుతాయన్నట్టు కన్పడుతూండేవి.

చక్రధరుని చూడ్డానికి అనుజ్ఞ లభించిందని తెలిసింది. అప్పుడామెకు ఆనందానికి బదులు భయమే ఎక్కువగా కలుగ సాగింది.

ఉదయమే లేచింది. స్నానంచేసింది. చాలాసేపుకూర్చుని పూజచేసి భగవత్ప్రార్ధనచేసింది. ఆపిమ్మట యశోదానందనుడు తోడురాగా బండిలో కూర్చుని కారాగారమునకు బయలు దేరింది.

జైలుగేటు దాటటంతోనే ఒక ఆడవార్డరువచ్చి ఆమెను సోదాచేసింది. తర్వాత ఆ గేటుప్రక్కనే ఉన్నగదిలోకి తీసు కెళ్ళి కూర్చోబెట్టింది. అహల్య గుండెల్లో రైళ్ళమోతగా ఉంది. ఆ ఆడవార్డరు పక్కనఉండటంచూచి, కాస్త ధైర్యంగా ఉందిగాని, లేకపోతేనా చక్రధరుడు కంటి కగపడగానే అమాంతంగా వెళ్ళి అతని పాదాలకు కరుచుపోయేది. తలవంచు కొని కూర్చొనిఉంది ఇంతలో ఇద్దరు వార్డరులతో గదిలోకి ప్రవేశించాడు చక్రధరుడు. నెత్తిమీద కుళ్ళాయిటోపీ, ఒంటి మీద మొండిచేతుల చొక్కా ఉన్నాయి. కాని మొహం మాత్రం ఆత్మశక్తి - దీప్తితో ధగధగ మెరిసిపోతోంది. పాలి పోయినదేహం, మాసిపోయినగడ్డం, ఇంతలోతుకు తోడుకు పోయిన కళ్ళూ. కాని, మొహంలో మందహాసరేఖ తొణిక సలాడుతూనేవుంది. అతన్ని చూచి కాస్త తొట్రుపాటు చెం దింది అహల్య. అప్రయత్నంగానే దొర్లుకొచ్చాయి కన్నీటి బిందువులు. మరొకచోట చూడటమే సంభవిస్తే, బహుశా గురుకూడా పట్టగలిగేది కాదేమో! కంగారుపడ్డ మనిషిలా గభాలున లేచి నిలబడింది. ఇప్పుడు ఉభయులూ ఎదురు

బదులుగా నిల్చొనిఉన్నారు. ఇద్దరి మనస్సులూ ఎనలేని విష యాలతో అంచులదాకా నిండిఉన్నాయి. ఒకదానిమీద మరో భావతరంగం లేస్తోంది. ఇద్దరు ఒకరినొకరు క్రీగంట చూచుకొంటున్నారు. కాని, ఇద్దరూ మౌనమూర్తులుగానే నిల్చొని ఉన్నారు. 'అడిగేదేముంది ? వీరిస్థితి ఏమిటో వీరి ప్రతి అవయవమూ, రోమరోమమూ తేటతెల్లంచేస్తూనే ఉన్నాయిగదా!' అని ఆలోచిస్తోంది అహల్య. చక్రధరుడూ ఇదే ఆలోచిస్తున్నాడు-" అడిగి తెలుసుకునే దేముంది? ఈమె కఠోర తపోగాథనూ, ఈమె మనోవేదనావృత్తాంతాన్నీ ఈబిడ అంగప్రత్యంగమూ అడక్కుండానే చెబుతోందిగదా!"

పది నిమిషాలసేపు సందిగ్ధ, కంఠావరోధస్థితిలో అలాగే నిల్చొనిపోయారు. కడకు ఆ స్త్రీవార్డరుకే వాళ్ళ స్థితిచూచి జాలివేసింది. గడియారం చూచి "మీరీవిధంగా ఎంతసేపని మౌనంగా ఉంటారు! అప్పుడే పదినిమిషాలయి పోయింది. ఇంకో పదినిమిషాలు మాత్రమేఉన్నాయి" అంది.

"అహల్యా! ఇంత చిక్కిపోయావేమిటీ? ఏమైనా జబ్బుచేసిందా?" అన్నాడు. చక్రధరుడు సమాధినుండి మేల్కొన్నట్టుగా,

"లేదు. లేదు. అలాంటిదేమీ లేదు. నేను చాలా ఆరోగ్యంగానే ఉన్నాను. ఔను, మీరే బాగా చిక్కిపో యారు. గుర్తించటమే కష్టంగా ఉంది." అంది అహల్య వెక్కివెక్కి వచ్చే ఏడ్పును బలవంతాన ఆపుకుంటూ.

చక్ర:—సరే, నేను చిక్కిపోయానంటే ఏవో కారణా లున్నాయి. మరి నీ ఈ శల్యావస్థకు కారణమేమిటి? విడు

దల అనంతరం నా కాస్త చేదోడు వాదోడుగా ఉండగలే విధంగానైనా నీ ఆరోగ్యం కాపాడుకో. నీ కోసంగాకపోతే, కనీసం నా కోసమైనా బ్రతికిఉండాలి. నాన్నగారు క్షేమంగా ఉన్నారా ?

అహల్య:- ఆ, క్షేమమే. మిమ్మల్ని ఎప్పుడూ తలచుకుంటూ ఉంటారు. నాతో ఆయనగారూ వచ్చారు. కాని లోపలికి రావటానికి అనుమతి లేకపోయింది. ఇప్పుడు అంత ఆరోగ్యంగానూ ఉండటంలేదు. ఐనా విశ్రాంతి అన్నమాటే తలచేపని లేదు, ఏదో ఒట్టు పెట్టుకున్నట్టుగా. ఆ ముసలి ఖ్వాజామహమూద్ గారితో—మరి ఏ మాటమీదనో ఏమో తెలియదు గాని - ఇప్పుడు సరిపడటంలేదు. మీరు వెళ్లిపోయినతర్వాత చాలాకాలంవరకు బాగా అన్యోన్యంగానేఉన్నారు కాని, ఇప్పుడు మళ్లీ వెనకటి స్థితే.

ఇదంతా ఏదో ముఖ్యవిషయమన్న ఉద్దేశ్యంతో మాత్రం అహల్య చెప్పలేదు. చక్రధరుని ధ్యాసను తనపై నుండి మరల్చాలన్న భావంతోనే చెప్పింది. "ఇద్దరూ మళ్ళీ మతపిచ్చలోపడి కొట్టుకుపోయి వుంటారు. నిజమైన మతమేమిటో సరిగ్గా అర్థంచేసుకొనంతవరకూ మన స్థితి ఇలాగే ఉంటుంది. మా ఇంటిసంగతులేమీ తెలిసిఉండవనుకుంటాను?" అన్నాడు చక్రధరుడు విరక్తిగా.

అహల్య:- తెలియకేం! మా నాన్నగారు మొన్నీ మధ్యనే కాశీవెళ్లి వచ్చారు. జగదీశపురం రాజాగారు మీ నాన్నగారికి నెలకు యాభై రూపాయలు చొప్పున ఏర్పాటు చేశారట. మీ అమ్మగారి పరిస్థితి సీతమ్మవారిగోడులా ఉందట.

మరి చిన్నరాణిగారికేమో మీ కుటుంబం అంటే ప్రత్యేకాభిమానమట.

"చిన్నరాణి ఎవ్వరు ?" అన్నాడు విస్మయంగా.

అహల్య:- రాణీ మనోరమ. కొద్దిరోజుల క్రితమే రాజాగారితో వివాహం జరిగింది.

చక్ర:- భలే ! చాలా బాగుంది !! మనోరమ వివాహమా ? విశాలసింగుతోనా ! ఇంకా నమ్మలేకపోతున్నాను. మీ నాన్నగా రేమన్నా పేరు చెప్పటంలో పొరబడి ఉండొచ్చు.

అహల్య:- స్వయంగా నాన్నగారికీఆశ్చర్యంగానేఉంది. కాశీలోవాళ్ళందరికీకూడ ఆశ్చర్యంగానే ఉంది. మనోరమ తన ఇష్టంతోనే చేసుకున్నదట. ఎవరి బలవంతమూ లేదట. రాజాగారు ఆవిడ గుప్పిట్లో ఉన్నారనీ, ఆవిడ చేతలకూ, మాటలకూ అడ్డేమీ లేదనీ విన్నాను. నాన్నగారు చందాకోసం వెళ్తే అయిదువేలు ఇచ్చింది. ఎప్పుడూ కళకళలాడుతూఉండే మనిషి.

"సమయం అయిపోయింది. వార్డర్ ! ఈయ న్నిక లోపలికి తీసుకుపోండి" అన్నది ఆడవార్డరు హఠాత్తుగా.

చక్రధరు డిక క్షణమాత్రంకూడా ఉండలేదు. అహల్యకేసి తృష్ణాపూర్ణ దృక్కులు బరపుతూ వెంటనే వెళ్ళిపోయాడు. అహల్య అశ్రుపూర్ణ నేత్రాలతో నమస్కారంచేసి, అతను వెళ్ళగానే వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

# పదిహేనో అధ్యాయం

ఫాల్గుణమాసం దొరబడింది; మద్దెళ్ళూ తాళాలూ మ్రోగసాగాయి. మున్సీ వజ్రధరుని సంగీత - సమాజమూ మేల్కొన్నది. సామాన్యంగా చెప్పాలంటే అడపాతడపా పన్నెండు నెలలూ భజనలూ, సంగీత - సమావేశాలూ ఉంటూనేఉంటాయి. కాని ఫాల్గుణమాసం రావటంతో మద్దెల మోతకు నాగాఉండదు. ఉదారస్వభావుడు. చింతాచీకు అనే వసలు ఆచాయలకురావటానికేవీలేదు. ఒళ్ళు అలవనీయడు.కన్న బిడ్డ ఖైదులోపడివున్నాడు. ఇంట్లో పెళ్ళాం రేయనక పగలనక కళ్ళు పూడిపోయేటట్టుగా ఏడుస్తోంది. ఈడొచ్చిన పిల్ల పెళ్ళి పేరంటంలేకుండా ఇంట్లో కూర్చునిఉంది. ఏనా మున్సీజీకి చీమ కుట్టినట్టులేదు. మొదట్లో పాతికరూపాయలతోనే జీవితం హాయిగా గడుపుతూండేవాడు. ఇప్పుడు అంతకుమూడింతలు వచ్చినా సరిపోవటం కనాకష్టంగాఉంది. ఎవ్వరితో మాట్లాడినా నవ్వుతూ మాట్లాడుతాడు. ప్రతివాడికీ సహాయంచేయటానికి సిద్ధమవుతుంటాడు. అందరికి వాగ్దానాలూ,అభయహస్తాలిచ్చేస్తాడు. ఎవ్వడన్నా కాస్త వంగి దణ్ణంపెడ్తేచాలు -సంతోషంతో మొహం ఇంతలావున ఉబ్బిపోతుంది. రెండుచేతులతోనూ వాగ్దానాలు (వరాలు) పంచిపెట్టుకుంటూ తిరుగుతూంటాడు- అందులో ఒక్కటైనా పూర్తి చేయలేకపోయినా సరే.ఒకదమ్మిడీ జీతానికూడా పెట్టుకోటానికి ఎవరూఇష్టపడని నిర్విచారిసోమరులెందరికో ఎస్టేటులోఉద్యోగాలిప్పించాడు. ఒక

డికి బంట్రోతుపనీ, ఇంకొకడికి గుమాస్తాగిరీ, మరొకడికి మరో ఉద్యోగమూ. ఉపకారంచేసి గంగపాలుచేసే అలవాటు అతనికి లేదు. కలిసిన ప్రతివ్యక్తిదగ్గరా తన యశోగానమే ప్రారంభిస్తాడు. అందులో స్వేచ్ఛగా అతిశయోక్తులు మేళవింపచేస్తుంటాడు. మున్షీజీ ఎవర్నీ నిరాశతో పోనివ్వడు. అంతగా ఏమీ చేయలేకపోతే చివరకు మాటలతోనైనా సరే కడుపునింపి పంపుతాడు. తనకు సాధ్యంకాని విషయంలోకూడా 'సరే, మంచిది. అలాగే' అని అనటమూ, కళ్ళు తిప్పటమూ, తల కాయ ఎగరవేయటమూ, ఏవో గాలికబుర్లు చెప్పటం మొదలైన ఎత్తుగడల్లో అందెవేసినచెయ్యి. మనోరమవివాహం రాజా విశాలసింగుతో జరగటమే తడవు, మున్షీజీ అదృష్టభానుడు ధగధగ మెరిసిపోసాగాడు. ఒక కంట్రాక్టరుకు ఎస్టేటులో అనేక భవంతుల కాంట్రాక్టులిప్పించాడేమొ, ఇటు తనఇల్లూ రాతిగోడలతో తయారైపోయింది. ధాన్యం సంచులకు సంచులు ఊరికేనే పంపేవాడు షాహుకారు. చాకలి ఉతుకుజీతం అడగటం అసలేలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే, తహశీల్దారుగారి పని మూడుపువ్వులూ ఆరుకాయలుగా ఉంది. తన తహశీల్దారీ హయాంలో అనుభవించని భోగభాగ్యాలెన్నో ఇప్పుడనుభవిస్తున్నాడు.

రాత్రి ఎనిమిది గంటలవేళ "జినకూ" తన సంగీత మండలితోవచ్చి కూర్చొనిఉన్నాడు. అనుడుదిండు వేసుకుని ఇంత పొడుగుగొట్టంతో హుక్కా వెలిగించి హాయిగా పీలుస్తున్నాడు మున్షీజీ. పాటలు ప్రారంభమైనంతలో, హఠాత్తుగా రాణీ మనోరమకారు వచ్చి వాకిట్లోఆగింది. బోడితలా, పట్టి

కాళ్ళతోనే పరుగులు తీస్తూ ఎదురెళ్ళాడు. ఏమాత్రం ఎదురుదెబ్బ తగిలినా, మళ్ళీ లేచేపని ఉండేదికాదు. మనోరమ చెయ్యెత్తి "పరుగెత్తకండి, పరుగెత్తకండి. నే నిప్పుడు మీ సన్నిధి కేవచ్చాను. ఒక మంచి శుభవార్త, ఆనందకరవార్త వినిపించటానికి వచ్చాను. బాబుగారు రేపు ఇక్కడికి వస్తున్నారు." అంది.

మున్షీ:—ఆఁ; ఎవరూ? అబ్బాయా?

మనో:—ఔను, ప్రభుత్వం ఆయనగారి శిక్ష తగ్గించి వేసింది.

ఈమాత్రం సరిగ్గా చెవినిపడిందోలేదో చప్పున ఇంట్లోకి పరుగెత్తుకుంటూ పోయి "ఇదిగో! విన్నావటే, రేపట అబ్బాయివస్తున్నాడట. మనోరమ రాణిగారు అదిగో అక్కడ వాకిట్లో నిల్చొనిఉన్నారు." అన్నాడు నిర్మలతో.

ఇలా చెప్పి మళ్లి చప్పున వచ్చి వాకిట్లో వాలాడు.

మనో:—అమ్మగా రేంచేస్తున్నారు? ఆవిణ్ని కాస్త పలకరించిపోతాను.

మనోరమ లోపలికెళ్ళింది. నిర్మల తన నేత్రాల్లో ప్రేమాశ్రువులు నింపుకొని, తలవాల్చి నిల్చొనిఉంది. తన కళ్ళను మనోరమ పాదపద్మాల క్రింద పర్చాలనిపించింది. "ఆహా! నా అదృష్టం!" అనుకున్నది.

ఎకాయెకీని వంగి నిర్మలాదేవి పాదాలపై శిరముంచి పులకితకంఠంతో "అమ్మగారూ! నా అదృష్టం; మీదర్శన భాగ్యం లభించింది. నాజీవితం సార్థకమయింది." అన్నది మనోరమ.

నిర్మలకిప్పుడు శిష్టాచారం ధ్యాసా లేదు, ఏ పాడూ లేదు. అంతా మరచిపోయింది. నిల్చొని ఒకటే ఏడ్పు, ఒకటే ఏడ్పు. మనోరమాదేవి వినయశీలాలు శిష్టాచారాన్ని తీసుకెళ్ళి మాతృ- వాత్సల్యతరంగాలలో గడ్డిపోచలా ప్రవహింపజేశాయి.

కారు కదలిపోగానే "సాక్షాత్తు దేవి-మహాతల్లి." అంది నిర్మల.

పదిగంటల పొద్దుపోయింది. అన్నానికి కూర్చున్నాడు మున్షీజీ. అబ్బబ్బ, ఏం సంతోషం, ఏంసంతోషం! పొంగి పోతున్నాడు. ఆ పొర్లిపోయే సంతోషంలో పూర్తిగా భోం చేయలేకపోయాడు. ఆదరాబాదరా రెండుమూడు ముద్దలు తిని బైటికి వెళ్ళాడు. చక్రధరుని స్వాగత - సన్మానాలను గురించి అర్ధరాత్రివరకూ తన ఇష్టమిత్రులతో ముచ్చటిస్తూ కూర్చున్నాడు. ఉదయం పట్నమంతటా కరపత్రాలు పంచి పెట్టాలనీ, సేవా - సమితి సభ్యులంతా బ్యాండుమేళాలతో స్టేషనుకు రావాలనీ నిర్ణయించబడింది.

తూర్పురేఖ లారకమునుపే తనగదిలోకొచ్చి డ్రాయరు దగ్గరకూర్చుని, ఏదో వ్రాయసాగింది మనోరమ హడావిడిగా. ఇంతలోనే దివానుగారు వస్తున్నారని తెలియచేయబడింది. అనుకుంటూ ఉండగానే ఆయనా వచ్చి ఎదుట కుర్చీలో ఆసీనులైనాడు.ఆయన్నుద్దేశించి'ఎస్టేటుబ్యాండు సిద్ధంగాఉంది కదూ?" అన్నది మనోరమ.

హరిసే:— ఔను, వాళ్ళందరికీ అప్పుడే తాఖీదులు పంపించాంగా.

మనో:—ఊరేగింపు ఏర్పాట్లన్నీ సరిగా ఉన్నాయి కదూ? నగుబాట్లు రావుగదా అని భయపడుతున్నాను.

హరిసే:—ప్రజలను ఊరేగింపు చేసుకోనిద్దాం; మనం పాల్గొనవలసిన అవసరంలేదని శ్రీశ్రీ రాజాగారి అభిప్రాయం.

మనోరమ కోపగించుకుని రాజాగార్ని నే నడిగాను. నా అభిప్రాయమేదో అదే వారి అభిప్రాయమూను. సత్పథాను సరణలో ఒకవేళ ఎస్టేటంతా జప్తయిపోయినా సరే నేను మాత్రం ఆ పంథానుండి వైదొలగజాలను.

"బిడ్డా! మీమేలుకోసమే చెబుతున్నా. కాల మెంత విషమంగా ఉందో గమనించటంలేదు నువ్వు" అన్నాడు దివాను సజలనేత్రాలతో మనోరమకేసి చూస్తూ.

"నాన్నగారూ! ఈ సదుపదేశం నిమిత్తం మీకెంతో కృతజ్ఞురాలను. కాని నా అంతరాత్మ అందుకు అంగీకరించ జాలదు. అదిగో, అప్పుడే గడియారంలో ఏడైపోయింది. ఎని మిదింటికల్లా సేషనుకు చేరుకోవాలి మీరు. నేనేమో సరిగ్గా సమయానికి చేరుకుంటాను. ఇక వెళ్ళండి." అన్నది మనో రమ ఉద్రేకంగా.

దివానుమహాశయుడు వెళ్ళాడు. మళ్ళీ ఆమె తన వ్రాత లో నిమగ్నురాలైపోయింది. అది చక్రధరుని స్వాగత సంద ర్భంలో ఇవ్వదలచిన ఉపన్యాసం. దాన్ని తయారుచేయటంలో లీనమైవుంది. రాజాగారు వచ్చి కూర్చున్నసంగతి కూడా తెలి యదు- ఆయనగారి శ్వాసనాళాలు దగ్గటానికి ఏవశుణ్ణి చేసే వరకూను.

ఉలిక్కిపడి మొగమెత్తి చూచింది మనోరమ. చూస్తే తీరా రాజాగారువచ్చి కూర్చుని, తన కేసి ప్రేమవిహ్వాల దృష్టితో చూస్తున్నారు. 'క్షమించండి. మీరు వచ్చినసంగతే తెలియలేదు. వచ్చి చాలసేపయిందా ఏమిటి?' అంది.

రాజా:—లేదు, లేదు; ఎంతోసేపుకాలేదు. ఇప్పుడే వచ్చి కూర్చున్నాను. చూస్తే ఏదోరాతలో మునిగివున్నావు. మాట్లాడించి పనికి విఘ్నంకలుగచేయటం బాగుండదను కున్నాను. ఈపట్టణచరిత్రలో కనీసం చిరస్థాయిగా ఉండేటంత అట్టహాసంగా, బ్రహ్మాండంగా ఊరేగింపు ఉండాలని నాకోరిక.

మనో:— నేను కోరుతున్నదీ అదేగా!

రాజా:—మిలిటరీ దుస్తులతో సైనికులకు ముందు పీఠీనవుండి నడవాలని వుంది.

మనోరమ సాలోచనగా "మీరు ఊరేగింపులో పాల్గొనటం ఉచితంగా తోచటంలేదు. ఇక్కడే ఉండి స్వాగతమివ్వండి. మీ హద్దులు దాటిపోవటం భావ్యంకాదు. మీ హోదాను నిభాయించుకోవటం అవసరం. అసలే ప్రభుత్వం మనల్ని అనుమానిస్తోంది. అప్పుడిక నడుంకట్టుకుని వెంటాడుతుంది-అసహ్యంగా వ్యాకులపరుస్తుంది" అంది.

మనోరమ మళ్ళీ తలవంచి వ్రాసుకోసాగింది. ఇది రాజాగారిని వెళ్ళిపొమ్మనమని సంకేతమని చెప్పవచ్చు. కాని, ఆయన కదల్లేదు, మెదల్లేదు. అలాగే కూర్చుని మనోరమకేసి చూస్తున్నాడు. మకరందపిపాసువైనభ్రమరంవలె మనోరమ మనోహర ముఖ-కమల మాధుర్యరసాస్వాదన చేస్తూఉంది అతనిదృష్టి.

గడియారం టంగుటంగుమని ఒకటి రెండు చివరకు ఎని మిది కొట్టింది. కుర్చీలోనుంచి తటాలున లేచి నిలబడింది మనో రమ. ఒక వృక్షచ్ఛాయలో విశ్రాంతి తీసుకూంటూ కూర్చున్న బాటసారివలె లేచి నిలబడ్డాడు రాజా. నెమ్మది నెమ్మదిగా గుమ్మందాకా వెళ్ళాడు. మళ్లీ వెనక్కి తిరిగి "నేనుకూడావస్తే నష్టమేమిటంటావు?" అన్నాడు మనోరమతో.

"సరే, మంచిది. అలాగేరండి" అంది మనోరమ కరు ణార్ద్రనేత్రాలతో చూస్తూ.

రైల్వే స్టేషనంతా జనంతో క్రిక్కిరిసిఉంది. ఇసుక వేసినా రాలనట్టుంది. లోపలి ప్లాటుఫారమూ, బయటి వెయిటింగు హాలూ రెండూ నిండిఉన్నాయి. ప్లాటుఫారంమీద విద్యా ర్థులు రంగురంగుల దుస్తులతో నిలబడిఉన్నారు. సేవాసమితి సభ్యులు వివిధరంగుల జెండాలతోఉన్నారు. అనేకమంది మహి ళలతో కలసి సేవాసమితి సభ్యులమధ్య నిలబడి ఉంది మనో రమ. వరండాలో రాజా విశాలసింగూ అతని ప్రధానోద్యో గులూ, నగర శ్రీమంతులూ, నాయకులూ గుమిగూడి ఉన్నారు. 'ఇదిగో అంతా సిద్ధంగా ఉండండి. సావధానంగా ఉండండి' అంటూ జనాన్ని హెచ్చరిస్తూ ఇటూ అటూ కాలు కాలినపిల్లిలా తిరుగుతున్నాడు వజ్రధరుడు.

సరిగ్గా పదిఅయింది. గుప్పుగుప్పున పొగలు గ్రక్కుకుం టూ వస్తోంది బండి. ఇంతవరకూ జనమంతా క్రమశిక్షణతోనే నిలబడిఉన్నారు. కాని బండి కంటికగపడగానే ఏర్పాట్లన్నీ చిందరవందరై పోయాయి. బండి వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. బండిలోంచి దిగివచ్చాడు చక్రధరుడు. అనురాగో

న్మత్తురాలై వెంటనడిచింది మనోరమ. కాని రెండుయూ డడు గులు నడిచిందో లేదో తటాలున ఆగిపోయింది. నిల్చొని ఒక మహిళ చాటుగా చక్రధరు నొకసారి తేరిపారజూచింది. సేవా సమితివారి మంగళగానం పూర్తయింది. తర్వాత వెంటనే రాజాగారు ముందుకొచ్చి నగరనాయకుల తరఫున స్వాగత మిచ్చాడు. అందరూ వరుసగా అతన్ని గాఢాలింగనంతో సత్క రించారు. ఊరేగింపుకు సిద్ధమవుతున్నారు. చక్రధరుడు ప్లాటు ఫారంమీద నుంచి బైటికొచ్చి ఏర్పాట్లన్నీ చూచి "ఇంత అట్టహాసంగా గౌరవించి నన్ను లజ్జితుణ్ణి చేస్తున్నారు. నన్నొక వింతవస్తువుగా తయారుచేయకండి" అన్నాడు.

దైవ వశాత్తు మున్షీ వజ్రధరుడు ఆ సమయాని కక్కడే నిలబడివున్నాడు. ఈ మాటలువిని "అంత వింతగా తయారు కావటం ఇష్టంలేకపోతే, మరి లోకులకోసం కంకణంకట్టుకుని ఎందుకు బయలుదేరావోయ్ ? నిన్ను నీవే గౌరవించుకో లేకపోతే ఇతరు లెందుకు గౌరవిస్తారు ?

"మనిషి ఏదైనా పని తలపెట్టాడంటే డబ్బుకోసమో లేక కీర్తికోసమో తలపెడుతూంటాడు. ఈ రెండింటిలో ఏదీ లభించని పక్షంలో ఆ పనిచేయటం శుద్ధదండుగ తప్ప ఇంకేం లేదు" అన్నాడు మండిపడుతూ.

ఇలా అని కొడుకును కౌగిలించుకున్నాడు వజ్రధరుడు. చక్రధరుని పాలిపోయిన మొహం లజ్జచే జేవురించింది. మెదలకుండా వచ్చి రాజాగారి జోడుగుర్రాల బండిలో చతికిల పడ్డాడు.

ఊరేగింపు నటేశ్వర్ - చేతగంజ్, దశాశ్వమేధ ఘట్టం, చౌక్ మొదలగు ప్రధాన వీధులగుండా బయలుదేరి మధ్యాహ్ననికి 'కబీర్ తిన్నె' వద్దకుచేరుకున్నది. ఇక్కడ మున్షీ గారి ఇంటిముందు ఒక పెద్దపందిరి వేయబడిఉంది. ఆ పంది ట్లోనే స్వాగతసభ జరపటానికీ, చక్రధరునికి అభినందనపత్రం సమర్పించటానికీ నిశ్చయింపబడింది. మనోరమ స్వయంగా అభి నందనపత్రం చదవాలని నిర్ణయం. కాని చదవటానికి నిలబడితే నోట్లోనుండి అక్షరం ముక్కకూడా బైటకి రాలేదు.

మనోరమయొక్క ఈ స్థితినిచూచి రాజాగారే స్వయం గా వేదికపైకెక్కివచ్చాడు. మనోరమను నెమ్మదిగా కుర్చీలో కూచోబెట్టి, అనంతరం సభికుల నుద్దేశించి "సజ్జనులారా! రాణిగారి వుపన్యాసంలో మీకు కలిగే ఆనందం నా నోటి మాటల్లో ఎక్కడ లభిస్తుంది? కోకిల స్థానంలో కాకి వచ్చి నిలబడింది. సన్నాయి స్థానంలో బాకా వచ్చికూర్చుంది. పూజ నీయులైన చక్రధర్ కొంతకాలం మనోరమకు గురువుగావున్నా రన్న విషయం బహుశా మీకు తెలియకపోవచ్చు. ఆవిడ వారిని ఇప్పుడూ యథాపూర్వభావంతోనే చూస్తోంది. తన గురువుగారిని గౌరవించటం శిష్యుని ధర్మం. ఈ సమ యంలో రాణిగారి కోమలహృదయం వివిధ భావావేగ-ఆవేశాలతో నిండివుంది. ఇప్పు డందులో ప్రవేశించటానికి రవ్వంతకూడ వాణికి తావులేదు. ఇందుకు ఆవిడ క్షమా ర్హ. బాబుగారు ఎలాంటి ధైర్యసాహసాలతో దీనజనుల్ని కాపాడారో మీ అందరికీ తెలిసిన విషయమే. జైలులో మ్రగ్గుతున్న రోజుల్లోకూడా తన కర్తవ్యధర్మాన్ని

చక్కగా నిర్వహించారు. వీరి హృదయం దయాంబుధి. ప్రేమ సాగరం. సామాన్యంగా యౌవనదశలో ఉన్నవ్యక్తి లక్ష్మీదేవి ఉపాసనలో నిమగ్నుడై ఉంటూంటాడు. కాని అలాంటి యువ కదశలో వీరు జాతి, మత, ప్రేమోపాసనకు పూనుకున్నారు. నేనూ వీరి పూర్వ భక్తుణ్ణే" అన్నాడు.

"నిజం, నిజం; వీరికిశిక్ష వేయించింది తమరేకదూ ?" అన్నది ఒక గొంతు మధ్యలో.

రాజా:- ఔను, మీరన్నది నిజమే. ఇది నే నంగీక రిస్తున్నాను. రాజ్యమదంలో కొన్నాళ్లు నన్ను నేనే మరచి పోయాను. అధికారప్రాప్తితో అతిశయించని — మిడిసిపడని వ్యక్తి ఎవ్వడున్నాడో చెప్పండి. ఇది మానవ స్వభావం. మీరంతా నన్ను తప్పక క్షమించుతారని ఆశిస్తున్నాను.

# పదహారో అధ్యాయం

ఆరోజుల్లో ఆగ్రా హిందూ - ముస్లిముల మధ్య చెప్పులు విసురుకోవటం సర్వసామాన్యమైపోయింది. చీమ చిటుక్కుమంటేచాలు ప్రతి చిన్నవిషయానికీ కర్రలు తీసుకుని ఉభయపార్టీల్లోనూఉన్న తలపొగరు రాయుళ్ళంతా గోరిల్లా వచ్చి పోగయేవారు. ఫలితంగా ఏముగ్గురికో నలుగురికో కాళ్ళూచేతులూ విరగటం జరుగుతూంటోంది. ఒకచోట ఎవరో కోమటితక్కెడదండిని ఒకసాహెబుమీదికి కాస్త విసిరా డట, ఇంకచూడండి! సాహెబులంతా ఆ షావుకారు

పాపుమీద దండెత్తుకొచ్చారు. ఒకచోట ముస్లిం నేతగా డొకడు ఒక హిందువుని మంచినీళ్ళ కడవ తాకాడట. ఇంకేం! పేటలోవాళ్ళ బుర్రల రాపుకీర్తన జరిగిపోయింది. న్యక్కిగత పోట్లాటలూ, కక్షలూ మతకలహసంగ్రామ - క్షేత్రంలోకి ఈడ్చుకురాబడుతుండేవి. ఉభయపార్టీలూ మతోన్మాదంలో ఒళ్ళుమరచి సంచరిస్తుండేవి.

అవి హోలీపండుగరోజులు. సందుగొందుల్లో వసంతం పిచకారీలకు దిట్టంగా పని తగిలింది. ఈ ఏడు జరిగినంత ఉత్సాహంగా హోలీపండుగ ఇదివరకెన్నడూ జరిగిఉండలేదు. దైవికంగా ఎవరో ఒకముస్లిం కోడిపెట్టను చేత్తో వ్రేలాడపట్టుకుని ఎక్కడనుంచో నడచిపోతున్నాడు. అతని బట్టలమీద వసంతం చింది రెండుమూడు బొట్లుపడ్డాయి. ఇంకే? కొండో, మిన్నో విరిగి మీదపడటయింది. తిన్నగా జామా మసీదుకు వెళ్లాడు. దాని గోపురంపైకెక్కి నిలబడి, బిగ్గరగా ఒక్క కేకపెట్టాడు. "ఓ రసూల్ బిడ్డలారా, అనుయాయులారా! ఇవాళ ఒక 'కాఫిర్ - పరమతస్థుని - చేతిలో నామతం గొంతు నులిమివేయబడింది. ఆ నాస్తికుని రంగుబొట్లు నా గుడ్డలమీద పడ్డాయి. ఈ నా మతహత్యకుగాను ఆ కాఫిరులపై ప్రతీకారం జరపండి. లేదంటారా, ఈ మీనార్ మీదనుండి దూకి 'అల్లా' దర్బారులో మొరవినిపించటానికి వెళ్తాను. చెప్పండి. ఏది అంగీకారమో చెప్పండి."

మహమ్మదీయులందరి చెవులకూ ఈ హెచ్చరిక వినిపించింది. వాళ్ళ మొహాలరంగు మారిపోయింది. కనుబొమ్మలు పైకి ఎగదన్నుకుపోయాయి. ప్రొద్దుగూకే వేళకు పదివేల

మంది కత్తులూ, కటార్లు తీసుకుని జామామసీదు ముందు కొచ్చి లుంగీలు ఎగగట్టుకు నిలబడ్డారు.

పట్నమంతా గగ్గోలుగావుంది. హిందువుల కసలు మతులే లేకుండా పోయాయి. తమలోతాము లేరు. హోలీ పండుగ నిషాఅంతా జింకపిల్లలా ఎగిరిపోయింది. రంగు గొట్టాలువదలి లాఠీలు చేతబట్టారు. కాని ఇక్కడ జుమ్మామసీదులేవీ? ఆ మతావేశమేదీ? ఎవడిగొడవవాణ్ని పట్టుకు ఏడ్పిస్తోంది.

యశోదానందనబాబు కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఒకసారి ఈ ఆఫీసరు దగ్గరకు వెళ్లితే ఇంకోసారి ఆఉద్యోగివద్దకు పరుగులుతీస్తున్నాడు.లక్నోకు, తంతిఇచ్చాడు, ఢిల్లీకి తంతివార్తలు పంపాడు. ముస్లిం నాయకులందరికీ తంతులిచ్చాడు. కాని ఫలితం శూన్యం. కడకు నిరాశచెంది లేచి నిలబడ్డాడు. అప్పటికి ముస్లింలు దాడిచేయనేచేశారు. "అలీ! అలీ!!"అని కేకలూ బొబ్బలూ పెట్టుకుంటూ సాగివస్తున్నారు. ఇంతలో యశోదానందనుడు కంటబడ్డాడు. ఇంకేం? 'కొట్టండి పొడవండి, చంపండి' అంటూ వందలాదిగా ముందుకురికారు. బాబుగారు పిస్తోలుతీసి శత్రువులముందు నిలబడ్డాడు. ప్రశ్నలూ సమాధానాలూ ఎవడికాక్కావాలి? నాలుగువేపులనుండీ అతని మీద ధమాధమ్మని లాఠీదెబ్బలు పడినాయి వడగండ్ల వానలాగా.

పిస్తోలు కాల్చవలసిన అవసరం కలగనేలేదు. నచ్చచెప్పినంతమాత్రాన వీళ్ళంతా శాంతించి వెళ్ళిపోయేపక్షంలో అనవసరంగా ఒకరిప్రాణాలు బలిగొనటం దేనికని ఆలోచిస్తూ

నిల్చొనిఉన్నాడు యశోదానందనుడు. అహింసాఆదర్శం, హింసా-శస్త్రం చేతిలో ఉన్నప్పటికీ ఆయనగారిని వదలిపెట్టనే లేదు వాళ్ళు.

బాబూ యశోదానందన్ మరణవార్త తెలియగానే సేవాదళం యువకులరక్తం ఉడికి ఉప్పొంగిపోయింది. రెండు వందలమంది యువకులు కత్తులు తీసుకుని బయలుదేరి ముస్లిం పేటలు ముట్టడించారు. ఇటు హిందువులపేటల్లో ముస్లింలు సాగిస్తున్నదానినే అటు ముస్లింపేటల్లో హిందువులూ చేయ సాగారు. హింసముందు అహింస తలవంచింది.

యశోదానందన్‌గారి ఇంటికి నిప్పు అంటించారనీ, తతిమ్మా ఇళ్ళనూ తగలబెడుతున్నారనీ అకస్మాత్తుగా ఒకపుకారు లేచింది. సేవాదళంవాళ్ళంతా సావధానులైనారు. రెండు రెండున్నర వేలమందిగల దళం ఒకటి చప్పున తయారై కదం తొక్కుతూ బయలుదేరింది. ఆ బడబానలం ప్రజ్వరిల్లుతున్న ప్రదేశానికి వెళ్లి చేరింది. చూస్తే అక్కడ ఒక్కముస్లింకూడా లేడు. నిప్పుమాత్రం అంటుకునిఉంది. అదీ బయటిభాగంలోనే. లోపలికెళ్ళి చూచారు. అంతా ఖాళీగాపడిఉంది. ఒకగదిలో తలుపులు బిడాయించుకుని కూర్చొనిఉంది వాగీశ్వరి. సేవా దళయువకులు కంటికగపడగానే ఏడుస్తూ బైటికొచ్చింది—" అయ్యో! అయ్యో!! నాతల్లి అహల్య ఎక్కడ? ఇంకాచూస్తా రేమిటి? పరుగెత్తండి, పరుగెత్తండి. ఎక్కడుందో వెదకిపట్టుకు రండి. దాన్నెట్టిదుర్గతికి పాల్పడచేశారోగదా! అయ్యో! నా బిడ్డా!" అంది వాగీశ్వరి.

"అహల్యను అపహరించుకుపోయారా? ఏమిటి?" అని ఒకయువకుడు అడిగాడు.

బాగీశ్వరి:—ఔను నాయనా! 'ఒసే అమ్మాయీ బైటికెళ్ళవద్దే, చస్తే అంతా ఒకచోటచే చావవచ్చునే' అని నెత్తినోరుపెట్టుకుని చెప్పాను. కాని, నామాట రవ్వంత కూడ చెవినివినిపించుకుంటేనా? ఖ్వాజా మహమూద్‌గారి దగ్గరకు పోయి అహల్యజాడ కనుక్కోవలసిందని చెప్పండి. 'మీకు సిగ్గలా లేకపోయింది! ఆ బాలికను మీరే తెచ్చి నాకు పుత్రికగా నాచేతుల్లో పెట్టారు. ఆ బాలిక పెళ్ళినిమిత్తం మీరే ఐదువేలు ఖర్చుపెట్టాలని నిశ్చయించుకుకూర్చున్నారు. కాని ఇవ్వాళ ఆ బాలికకు మీ అనుచరులచేతుల్లోనే ఇంతటి దుర్గతి కల్గటమా!' అన్నానని చెప్పండి. అయ్యయ్యో!

అందరూ గబగబా ఖ్వాజాగారి ఇంటికి పరుగెత్తుకుపోయారు. చూస్తే యశోదానందనుని శవ మాయన ఇంటిముందు పెట్టిఉంది; ఖ్వాజాగారేమో శవం దగ్గర కూర్చుని కన్నీరుమున్నీరుగా విలపిస్తున్నాడు. ఆ వెళ్ళినవాళ్ళను చూచి "ఇతను నాకు శత్రువని మీరనుకుంటున్నారేమొ! అదంతా 'అల్లా' కెరుక. నా సోదరుడూ, నా కొడుకుసైతం ఈయనకంటే నాకెక్కువ ప్రేమాస్పదులుకాదు. కాని, మా ఉభయుల జీవితాల్లో తుది ఏడాది ఒకరినొకరు అణచుకోవటంలోను, దెబ్బలాటల్లోనే గడచిపోయింది. ఇవాళ దాని అంతిమరూపం ఇలాపరిణమించింది. మేముఉభయులం మనఃపూర్వకంగా పరస్పరం కలహాలుమాని ఐక్యతగా ఉండాలని అభిలషిస్తూండేవాళ్ళం. కాని మా మనోభిలాషలను భిన్నంగా ఏదో అజ్ఞాత

శక్తి మమ్మల్ని కలవనీయకుండా పోరాడిస్తూ ఉండేది. ఆయన గారితో నాకెలాంటి గాఢమైత్రి ఉండేదో బహుశా మీకు తెలియకపోవచ్చు. అలాంటి మైత్రికి ఇలాంటి పరిణామం కల్గుతుందని ఎవరనుకున్నారు" అన్నాడు.

ఒకయువకుడు:- శవాన్ని అంత్యక్రియల నిమిత్తం తీసుకు వెళ్తామండీ.

ఖ్వాజా:—అలాగే తీసుకుపోండి నాయనలారా! నేనూ భుజంకాయటంలో ఏమైనా నష్టముందా? ఈమాత్రం దయ నా యెడ చూపవలసిఉంటుంది. నేనే గనుక ముందు చచ్చిఉంటే యశోదానందనుడు నెత్తినిండా దుమ్ముపోసుకుంటూ నా గోరీ వరకు తప్పకుండా వెళ్ళిఉండేవాడు.

యువకుడు:—అహల్యనుకూడా ఎత్తుకుపోయారు. ఆ విషయమై అమ్మగారు మీతో...

ఖ్వాజా:—ఏమిటీ! అహల్యను ఎత్తుకుపోయారా! నా అహల్యనా! ఎప్పుడూ?

యువ:—ఇవాళే ఇంటికి నిప్పు అంటించబోయేముందు.

ఖ్వాజా:—పవిత్ర ఖురాన్‌తోడు. అహల్య అంతు తెలుసుకోనేవరకూ పచ్చిమంచినీళ్ళు కూడా ముట్టుకోవటం పాపం. మీరు శవాన్ని తీసుకుపదండి. నేనూ ఇప్పుడేవస్తున్నా. ఈ లోపల పట్నమంతా గాలించి వస్తాను. నా యెడల ఏవిధమైన శత్రుభావమూ ఉంచుకోవద్దని వదినగారితో విన్నవించండి. యశోదాబాబుగారైతే లేడు కాని, మహమూద్ ఇంకా జీవించే ఉన్నాడు. ఈడిబొందిలో ప్రాణాలున్నంతవరకూ ఆవిడ కెలాంటి ఇబ్బందులూ కలుగబోవు. అహ

ల్యను వెదకి, గాలించి తీసుకురానన్నావస్తాను. లేదా ముఖానికి మసిపూసుకొని ఏగోతిలోనో నూతిలోనోపడి ఈవెధవబ్రతుకు చాలించనైనా చాలిస్తాను.'అని నా మాటలుగా వదినగారితో చెప్పండి.

ఇలా అని చివాలునలేచి నిలబడ్డాడు ఖ్వాజా. చేతికర్ర తీసుకుని బైటికి వెళ్ళిపోయాడు.

ఆగ్రాలో మతకలహమూ, యశోదానందనునిహత్యా, అహల్యాపహారణల దుఃఖవార్తలు చక్రధరునకు అందాయి. ఆ జాబును వ్యగ్రహృదయంతో తండ్రికి చదివి వినిపించాడు. తర్వాత వెంటనే 'అక్కడికి పోయి రావటం అత్యవసరం'' అన్నాడు.

వజ్ర:-అక్కడికివెళ్ళి ఇప్పుడుచేయగలిగినదేముంది? జరుగవలసినదేదో జరిగిపోయింది గదా. కాబట్టి ఇప్పుడిక వెళ్ళటం నిష్ప్రయోజనం.

చక్ర:—కనీసం అహల్యజాడ అయినా తెలుసుకోవలసిన అవసరం ఉందిగదా.

వజ్ర:—అదీ నిష్ప్రయోజనమేననుకో. అసలు ఆ అమ్మాయి జాడ తెలుసుకోవటమే కష్టం. అథవా తెలిసినా ఇప్పుడిక ఆ అమ్మాయితో ఏం సంబంధం? తురకల ఇళ్ళల్లో వుండివచ్చిన పిల్లను అడిగే హిందువుడెవడు ?

చక్ర:—అందుకే నేను వెళ్ళటం అత్యవసరమని చెబుతున్నాను.

వజ్ర:—ఇలాంటి వధువుకు మన గృహంలో స్థానం లేదు.

"ఆవిడ మీ ఇంట్లోకి అడుగుపెట్టబోదని మీరూ గుర్తుంచుకోండి" అన్నాడు చక్రధరుడు నిశ్చయాత్మక భావంతో.

"పుత్రప్రేమకారణంగా ఆ అమ్మాయి మన ఇంటికి రావటానికిఅంగీకరిస్తానని ఒకవేళ నువ్వు అనుకుంటే అదిఅంతా పట్టి భ్రమ మాత్రమే. అహల్య నా కుల-దేవిస్థానం ఎన్నడూ ఆక్రమించలేదు! ఈ విషయంలో నాకు పుత్రవియోగం కలిగినాసరే." అన్నాడు వజ్రధరుడూ చక్రధరుడు చెప్పినంత గట్టిగానే.

చక్రధరుడు ముందు కడుగువేశాడో లేదో వెంటనే అతనిహస్తం పట్టుకున్నది తల్లి. వాత్సల్యపూర్ణ తిరస్కార భావంతో "బిడ్డా! నీనుంచి ఇలాంటిఆశలు ఆశించలేదురా నాయనా! ఇప్పుడైనా నేచెప్పినమాట విను. మనవంశానికి అప్రతిష్ట తీసుకురాకు" అన్నది.

చక్రధరుడు చెయ్యి విడిపించుకుని- "నేనెన్నడూ మీ ఆజ్ఞను ఇంతవరకు జవదాటలేదు. కాని ఇప్పుడు ఈ వ్యవహారంలోమాత్రం నేను వివశుడను." అన్నాడు.

వజ్ర:—ఇది నీ తుదినిర్ణయమేనా?

చక్ర:—ఔను. అంతిమ నిర్ణయమే.

ఈవిధంగా అని గదిలోంచి బయటికొచ్చి కొన్నిబట్టలు చంకలోపెట్టుకొని, స్టేషనువేపుకు నడిచాడు.

చక్రధరుడు ఆగ్రా చేరుకునేటప్పటికి తూర్పుతెల్ల వారింది. ఒక నిమిషం నిల్చొని 'ఎక్కడికి వెళ్ళనా' అని ఆలోచించాడు. యశోదానందన్‌గారి ఇంటికి వెళ్ళటం వృధా.

చివరకు ఖ్వాజామహమూద్ గారి ఇంటికే వెళ్ళటం మంచిదని నిశ్చయించుకుని బయలుదేరాడు.

ఖ్వాజాగారి వాకిలి ముందుకు చేరుకున్నాడు. చూస్తే వేలాదిజనం ఒకశవంచుట్టూచేరి శోకవిహ్వలులై నిలబడిఉన్నారు. ఆ శవాన్ని గోరీల దొడ్డికి తీసుకుపోయే ప్రయత్నంలోఉన్నారు. చక్రధరుడు ఛెంగున జట్కాలోంచి క్రిందికి దూకాడు. గభాలున శవందగ్గరకుపోయి నిలబడ్డాడు. ఖ్వాజాగారే ఖర్మం చాలక హత్యచేయబడలేదుగదా యన్న శంకతో ఎవరినైనా అడిగి తెలుసుకోవాలని ముందుకు నడుస్తున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా ఖ్వాజాగారే ఎదురొచ్చి అతనిచేయి లాగించుకున్నాడు. కంటినిండా నీరు నింపుకుని 'సమయానికే వచ్చావు బాబూ, నీ కోసమే ఈ కళ్ళు వెతుక్కుంటున్నాయి. ఈ ముందున్న శవ మెవరిదో తెలుసా! ఇతను నా ఏకైక పుత్రుడు. వీడిమీదనే నా ఆశలన్నీ పెట్టుకున్నాను. కాని, దేవుని కెరుక - వీడి చావు చూచి నా కళ్లు ఒక్క కన్నీటి చుక్కనైనా కార్చలేదంటే నమ్ము. మానవత్వాన్నుండిక్రిందికి దిగజారిపోయినటువంటి 'ఆట' ఆడాడు వీడు. అహల్యను గురించిన సమాచారం నీకు అందే ఉండవచ్చు''అన్నాడు.

చక్ర:—ఔనండీ, అందింది. బహుశా ఏ బద్మాష్‌లో రౌడీలో ఎత్తుకుపోయి ఉంటారు.

ఖ్వాజా:- వీడూ ఆ బద్మాషుల్లో, ఆ రౌడీల్లోచేరిన ఘనుడే. నీ ఎదుట పడిఉన్న శవం వీడిదే. అహల్యాపహరణం ఈ ఘనుని ఘనకార్యమే. నేనేమో పాదాలన్నీ అరిగిపోయేటట్లు పట్నమంతా తిరిగి గాలించి వస్తూ ఉండేవాణ్ణి. కాని

ఆవిడేమో నా కొంపలోనే ఖైదుచేయబడి ఉంది. ఈ హంతకుడు, ఈ దుర్మార్గుడు ఆమెను బలాత్కరించ ప్రయత్నించాడు. ఇవ్వాళ ఆమెకు కాస్త వీలుచిక్కగానే వీనికియమపురికి మార్గం చూపెట్టింది. బాకు తీసుకొని గుండెలో పొడిచింది.

చక్ర:—— ఈ సంగతి విని నా కెంతో విచారంగా ఉంది. మీ యెడల నాకు పూర్తి సానుభూతి ఉంది. మీ బోటి న్యాయ రక్షకుడూ, కర్తవ్యపరాయణుడు ప్రపంచంలో ప్రస్తుతం లేడనే చెప్పవచ్చు. సరే, ఇంతకూ అహల్య ఇప్పుడెక్కడ ?

ఖ్వాజా:——ఇక్కడే - ఈ ఇంట్లోనే. 'పద; నిన్ను మీ ఇంటికి చేర్చివస్తా'నని ప్రొద్దుటనుంచి ఇంతవరకు ఎన్నో సార్లు చెప్పాను. కాని ఇంట్లోంచి కదలటమే లేదు. ఇంకేం లేదు, కూర్చుని ఒకటే ఏడుపు, ఒకటే ఏడుపు.

పాడిలేచింది. శోకార్తులు మొహాలు వ్రేలాడ వేసుకుని వెనకనడిచారు. చక్రధరుడూ ఖ్వాజాగారివెంట గోరీదొడ్డి వరకు వెళ్ళాడు. గోరీలో శవాన్ని ఉంచగానే అవురుమన్నాడు ఖ్వాజామహమూద్. అవి క్షమాశ్రుబిందువులు. చక్రధరుడూ కన్నీళ్లు ఆపుకోలేకపోయాడు.

మధ్యాహ్నానికి అంతా తిరిగి ఇంటికి చేరుకున్నారు. ఖ్వాజా కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని,తర్వాత"నాయనా రా, నిన్ను అహల్యవద్దకు తీసుకెళ్తాను, రా" అన్నాడు చక్రధరు నుద్దేశించి.

ఇలాఅని చక్రధరుని చెయ్యిపట్టుకుని లోనికి నడిచాడు. చక్రధరుని హృదయం పట్టరాని సంతోషంతో ఎగిరెగిరిపడు

తోంది. అహల్యను చూడాలన్న కోరిక ఇంత ప్రబలంగా అతని కెన్నడూ లేదు. ఆవిడ ఒక కిటికీదగ్గర నిలబడి తోటలోకి చూస్తోంది. హఠాత్తుగా చక్రధరుని చూసి త్రుళ్ళిపడింది. ముసుగులో ముఖం దాచుకున్నది. ఒక నిమిష మాగి అతని పాదాలపై బడి అశ్రుధారలతో పాదప్రక్షాళనం చేయసాగింది.

"అహల్యా! నిజంగా నేనే నీ పాదపద్మములపైన నతమస్తకుడను కావలసింది, కాని నువ్వే వచ్చి నా కాళ్ళపైబడి తద్భిన్నంగా వ్యవహరిస్తున్నావు." అన్నాడు చక్రధరుడు.

ఇలా అని అహల్య చేయి పట్టుకున్నాడు చక్రధరుడు. కాని ఆవిడ తన చెయ్యి వదలించుకుని దూరంగా పోయి నిలబడింది. "వద్దువద్దు. నా అవయవాలను తాకకండి. వాసనచూచినపుష్పం దేవుళ్ళకు అర్పించరు. మీపాద సేవా సౌభాగ్యం నానొసట లిఖించబడి లేదు. నేనుజన్మతోనే దురదృష్టవంతురాలను. నామూలంగా ఇకనేమీ దుఃఖించవలసిన అవసరంలేదని, వెళ్లి మీఅమ్మగారికి చెప్పండి. చెప్పి ఊరడించండి. నేను పూర్తిగా నిర్దోషురాలను, కాని మీప్రేమకుపాత్రురాలనయ్యే అర్హతమాత్రం నాకు బొత్తిగాలేదు." అన్నది అహల్య కంపితకంఠస్వరంతో.

చక్రధరుడిక మాట్లాడకుండా ఉండలేకపోయాడు. మళ్ళీ అహల్యచేయి పట్టుకుని "అహల్యా! పవిత్ర, నిష్కళంక అంతరాత్మ ఏదేహంలోనివాసంచేస్తుందో ఆ దేహం పవిత్రము నిష్కళంకంగానే ఉంటుంది. నాదృష్టిలో నీవు ఇవ్వాళ పూర్వం కంటే ఎన్నోరెట్లు నిర్మలంగానూ, పవిత్రంగానూ గోచరిస్తున్నావు." అన్నాడు.

అహల్య చక్రధరుని భుజంపై తలమోపి కొంతసేపటి వరకూ విలపిస్తూ ఉండిపోయింది. తర్వాత మళ్ళీ "కేవలం దయాభావంతోనూ, నన్ను ఏదోవిధంగా ఉద్ధరించాలన్న తలపుతోనే ఈ మనిని శిరస్సునదాల్చుతున్నారా లేక నిజమైన ప్రేమభావంతోనేనా?'' అంది.

చక్రధరుడు నిలువునా నీరైపోయాడు. అహల్య సరళ స్వభావంచూచి అతనికి జాలి వేసింది. ఈబిడ తన్నెటువంటినీచురాలిగానూ, దురదృష్టవంతురాలుగానూ భావించుకుంటున్నదంటే అతని నిర్మలప్రేమనే విశ్వసించలేకపోతున్నది. 'నీకెలా కన్పడుతున్నదేమిటి అహల్యా?"అని ప్రశ్నించాడు చక్రధరుడు.

అహల్య:- మీ మనస్సులో ప్రేమభావంకంటే దయాభావమే ఎక్కువగా ఉన్నట్టు కన్పడుతోంది.

చక్ర:- అహల్యా! నాపట్ల అన్యాయంగా వ్యవహరిస్తున్నావు.

అహ:- గ్రహించేందుకు నాలో సామర్థ్యం లేనటువంటి వస్తువుకోసం ఎన్నడూ చేతులు చాచను. మీ రిప్పుడు చూపుతున్న దయాభావమే నాకు పదివేలు. దీన్నే నా పరమ అదృష్టంగా భావిస్తున్నాను.

"మీరు నా కాశ్రయమిస్తే, మీరు స్వయంగా అపకీర్తిపాలవుతారేమోనని నా భయం. మీ తల్లిదండ్రులు మిమ్మల్ని బహిష్కరించవచ్చు. మీకు దాసినగుటకంటే సౌభాగ్యకరవిషయం నాకింకేముంటుంది? కాని మీరుస్వయంగా తిరస్కరింపబడి అవమానింపబడ్తారేమో నని ఆలోచించినపుడు ఈజీవితంఇంతటితో సమాప్తంచేసుకోవటమే మంచి

దని నామనస్సును తొలచుతున్నది." అన్నది అహల్య మళ్ళీ హఠాత్తుగా.

చక్రధరుని కళ్ళు కరుణచే చెమ్మగిల్లినవి. "అహల్యా! ఇలా మాట్లాడటం భావ్యం కాదు. నా అంతరాత్మ అంగీకారం ముందు తలిదండ్రుల వ్యతిరేకతను లక్ష్యంచేయను. ఇలాంటి మాటలు మళ్ళీ ఉచ్ఛరించవద్దని ప్రార్థించుతున్నాను" అన్నాడు

ఈసారి స్నేహపూర్వక సజలనేత్రాలతో చక్రధరుని ముఖంలోకి చూచింది అహల్య. ఆవిడ అంతరంగాన్ని దహించుతున్న ఆ సందేహాగ్ని ఈ శీతల - ఆర్ద్ర శబ్దాలచే చల్లారిపోయింది. శంకాజ్వాల చల్లారటంతోనే ఆవిడ పిపాసాదృష్టి స్థిరపడిపోయింది. చక్రధరుని సౌమ్యమూర్తి ప్రేమదీప్తిచే ప్రకాశమానమై కళ్ళఎదుట నిలబడినట్టు కన్పించింది.

యశోదానందనుని అంత్యక్రియలు పూర్తి అయిన మూడో రోజునే అహల్యా - చక్రధరులవివాహం జరిగినది. చక్రధరుడైతే మరి కొన్నాళ్ళు ఆగితే బాగుండునని తలచాడు కాని, బాగీశ్వరి గట్టిగా పట్టుబట్టింది. వివాహమహోత్సవం అట్టహాస - ఆర్భాటాలేమీ లేకుండానే జరిగిపోయింది.

అహల్యను తీసుకొని చక్రధరుడు కాశీకి బయలుదేరిన నాడు వేలాదిజనం స్టేషనుకొచ్చారు. భర్తృవియోగదుఃఖంతో బాగీశ్వరి పరిస్థితి అసలే అధ్వాన్నంగా ఉంది. దానికితోడు అహల్యా వియోగం వచ్చిపడింది. అహల్య పోయి మేనాలో కూర్చోగానే పాపం! బాగీశ్వరి దుఃఖాతిరేకంచే కుప్పకూలిపోయింది. అహల్యకూడ కన్నీరుకార్చివిలపిస్తోంది! కాని, అది శోకంవల్ల కాదు, వియోగంవల్లనే. బాగీశ్వరి మెడను గట్టిగా

రెండుచేతులు చుట్టి కౌగలించుకునిఉంటే, ఇతర స్త్రీలు వచ్చి ఎంతో కష్టంమీదగాని వదిలించలేకపోయారు.

కాని చక్రధరుని మరొక సమస్య ఎదుర్కొన్నది. అతను ఇంటికైతే వెళ్తున్నాడు కాని, ఆ ఇంటి తలుపులు గట్టిగా మూయబడి ఉన్నాయి. తండ్రిగారి క్రోధం; తల్లిగారి తిర స్కారం, గోత్రీకుల, చుట్టపక్కముల 'ఛీ ఛీ' లు ఈ సమస్త శంకలతో అతనికి మనోవ్యాకులత మిక్కుటమయింది. ఈబండి దిగి ఎక్కడికి వెళ్ళాలా అన్నది మరీ విషమసమస్యగా ఉంది. ఆలోచనలతో అతని ముఖమండలం చెప్పనలవిగానంతగా మాడి నల్లబడిపోయింది. ఏదో చెప్పటానికి అహల్య అతని ముఖంకేసి చూచింది. ఆ మాలిన్యంచూచి ఆవిడ కంగారుపడిపోయింది. ఆ వియోగబాధ ఇప్పుడుఉపశమించింది.హృదయంలోఉల్లాసం ఉద్రూతలూగుతోంది. కాని పతిఖిన్నవదనం చూచి గాబరా పడింది.-"ఇంత విచారంగా ఉన్నా రెందుకండీ! ఈక్షణం నుంచే నాగురించిన చింతమీాపైన ప్పారీ చేస్తున్నదా ఏమిటండీ?" అంది.

చక్రధరునికి కొద్దిగా సిగ్గేసింది. "అలాంటిదేమీ లేదే. విచారం దేనికంటావా? ఇది విచారపడేసమయమంటావా లేక ఆనందించే సమయమా!" అన్నాడు.

కానిచక్రధరుడు తనవిచారముద్రను మరుగుపరచజూచిన కొద్దీ అది మరింత స్పష్టంకాసాగింది - దరిద్రుడు తన మర్యా దనునిలబెట్టుకొనే ప్రయత్నంలో మరింత దరిద్రుడైనట్టుగా.

"సరే మీ ఇష్టం. అలాగే చెప్పకండి. కాని దీనిఅర్థం నాయందు మీకు నమ్మకంలేదన్నమాట" అన్నది అహల్య గంభీరంగా.

మాటలు అంటూంటే అహల్యనేత్రాలు అశ్రుమయమైపోయినై. చక్రధరుడు ఇంక చూడలేకపోయాడు. సంక్షేపంగా విషయాలన్నీ చెప్పి విన్పించాడు. చివరకు ప్రయాగలో దిగిపోతే బాగుండునని ప్రతిపాదించాడు.

"మనఇల్లు ఉండగా ఎక్కడో ప్రయాగలో దిగటం దేనికి? నేను తప్పక ఇంటికే వెళ్తాను. వా రెంత కోపతాపాలతో ఉన్నా సరే, ఎవరో పరాయివాళ్ళు కాదుగదా; తలిదండ్రులే గదా! ఈ చింతలన్నిటినీ మనస్సులోంచి పూర్తిగా అవతలకు పారద్రోలండి. వారిని సుముఖులుగా చేసేభారం నా మీద వదలండి. వారిని సంతుష్టులను గావించగలనని నాకు పూర్తిగా నమ్మకముంది" అంది దర్పంతో అహల్య.

చక్రధరుడు అహల్యకేసి సజలనేత్రాలతో ఒకసారి చూచి మౌనముద్ర వహించాడు

రాత్రి పదిగంటలకు బండి బెనారస్ చేరుకుంది. అహల్య ఎంతో ఊరడిస్తోంది. ధైర్యం చెబుతోంది. కాని చక్రధరునిచింత తగ్గకపోగా మరింత పెరిగిపోతోంది. 'ఏమో! ఏం జరుగుతుందో?' అన్నమాట ఒక్కటే అతనిబుర్రలో గిర్రున తిరుగుతోంది, మనస్సును కలవరపెడుతోంది. కాని స్టేషనులోదిగినతర్వాత అతని ఆశ్చర్యానికి మేరలేదు. మున్షీ వజ్రధరుడు ఇద్దరు మనుష్యుల్ని వెంటబెట్టుకుని ప్లాట్‌ఫారం మీద అతనికోసం వేచివున్నాడు. నాన్నగారి ఈ అపార అలౌకిక వాత్సల్యంచూచి పులకాంకితుడైనాడు. చెంగున వెళ్ళి తండ్రి పాదారవిందములపై వ్రాలాడు మున్షీజీ చప్పున లేవనెత్తి ఆలింగనంచేసుకున్నాడు. కన్నకుమారుని శ్రద్ధా

పూర్ణ అశ్రుబిందువులను తనరుమాలుతో తుడుస్తూ, వాత్సల్యముట్టిపడేటట్టు "ఫలానాబండిలో వస్తున్నానని కనీసం ఒక టెలిగ్రామన్నా ఇవ్వకూడదురా అబ్బాయ్! కనీసం ఒక ఉత్తరం ముక్కయినా వ్రాయకపోతివి. ఇప్పటికి పదిరోజులనుండి రోజుకు రెండుసార్లు స్టేషనుకు వచ్చి, తిరిగిపోని రోజంటూ లేదు. ఆపైన ఒక కూలిమనిషిని ఇరవైనాల్గుగంటలూ స్టేషనులోనే ఉంచుతున్నాను. మరి ఎప్పుడొస్తావో, ఏంబడిలో దిగుతావో తెలియదయ్యె. సరేగాని, కోడలెక్కడ? పద, వెళ్ళి పెట్టెలోనుంచి దింపుకొద్దాం. అమ్మాయితో కలిసి ఇక్కడే ఉండిపో. స్టేషను మాస్టరుతో చెప్పి వెయిటింగురూమ్ ఏర్పాటుచేయిస్తాను. నేనేమో చప్పున పోయి, మేళతాళాలు ఏర్పాటుచేసుకుని, లైట్లూ, బళ్ళసంగతీ చూచుకొని వస్తా. కోడల్ని తగు మర్యాదలతో తీసుకువెళ్ళాలిగద! లేకపోతే కోడలు వచ్చిందో లేదో, వస్తే ఎప్పుడువచ్చిందో ఏమిటో లోకానికెలా తెలుస్తుంది? అక్కడి సంగతంటే అది వేరనుకో. ఇక్కడ అలా కాదు. మనమూ కులస్థులందరితో పాటే ఆచారాలన్నీ విధిగా పాటించితీరాలి" అన్నాడు.

ఈవిధంగా చెప్పి కొడుకును వెంటబెట్టుకొని అహల్య ఉన్న పెట్టెదగ్గరకొచ్చి నిలబడ్డాడు. అహల్య నెమ్మదిగా దిగి మామగారిపాదములకు తలవంచి నమస్కరించింది. భక్తిశ్రద్ధలు ఉట్టిపడుతూండగా ఆమె నేత్రాలనుండిఆనందాశ్రువులు జలజలరాలాయి. మున్సిజీ ఆమె శిరస్సుపై హస్తముంచి ఆశీర్వదించాడు. దంపతులను వెయిటింగురూమ్లో కూర్చోబెట్టి "ఎవరినీ లోనికి రానివ్వకండి. నేను మాష్టరు

గారితో చెప్పానులే. నే వెళ్ళి మళ్ళీ ఒక గంటలో తిరిగి వచ్చేస్తా'' అన్నాడు.

చక్రధరుడు నీళ్ళ నములుతూ "ఇప్పుడు ఈవేళప్పుడు ఈ ఆర్భాటాలు అనవసర మనుకుంటాను. తెల్లవారినతర్వాత అందరికీ ఆదే తెలుస్తుందిగా" అన్నాడు తండ్రితో.

తన పన్నుకర్ర చేతిలోకి తీసుకుంటూ ''వింటున్నావా అమ్మాయ్ వీడికబుర్లు? తెల్లవారినతర్వాత తెలుసుకుంటే ఏమిటి ప్రయోజనం? అసలు కోడలు ఏరోజున, ఏ ఘడియలో వచ్చిందో లోకాని కెలా తెలుస్తుంది?'' అన్నాడు.

మున్షీజీ వెళ్ళిపోగానే చక్రధరునికి కమ్మటి చీవాట్లు చక్కగా పెట్టింది అహల్య. ఇటువంటి దేవతాపురుషునికి మీరు అకారణంగానే అపచారం చేస్తున్నారు. వారిపట్ల అన్యాయంగా ప్రవర్తిస్తున్నారు. వారినిచూస్తుంటే గంటల తరబడి వారిపాదములపైబడి ఏడ్వాలన్నబుద్ధిపుడ్తోంది.''

చక్రధరుడు చిన్నపోయాడు. ప్రతివాదమేమీ చేయలేదు. ఇప్పుడు లోకానికి చూపించేందుకు ఇంత ఆర్భాటం చేస్తే చేయుదురుగాక! కాని ఇంట్లో ఏదో ఒక రాద్ధాంతం జరగక తప్పదు అనే అతని మనస్సు పదేపదే చెబుతూంది.

మున్షీజీ వెళ్ళి ఇంకా అరగంట అయినా కాలేదు. ఇంతలో గది తలుపుదగ్గర కొచ్చి మనోరమ నిలబడి ఉండటం జరిగింది.

''భలే, బాబుగారూ! భలే. సడీ చప్పుడూ కాకుండా పెళ్ళికూతుర్ని ఎగరగొట్టుకొచ్చారే! ఐతే మాటమాత్రం కూడా చెప్పినపాపాన పోలేదేమిటి! మున్షీజీ చెప్పకపోతే నా

కసలు తెలియనే తెలిసేదికాదే. మీరు శుభమా అంటూ ఒక ఇంటివారయ్యారు. అమ్మాయిని తెచ్చుకున్నారు. మరి నా కోసంకూడా యేమైనా (పెళ్లి) కానుకలు తెచ్చారా లేదా ?" అన్నది మనోరమ.

ఇలా అని అహల్యను సమీపించింది. ఇద్దరూ ఆలింగ నం చేసుకున్నారు. మనోరమ చేరుమాలల్లోంచి రాళ్లుపొది గిన గాజు ఒకటి తీసి అహల్యచేతికి తొడిగింది. అహల్య మనో రమను కుర్చీలో కూర్చోబెట్టింది. తర్వాత తాంబూలం ఇస్తూ "నా మూలంగా మీకు శ్రమకలిగింది. ఇది మీరు విశ్రాంతి తీసుకునే సమయం కదా!" అంది.

చక్రధరుడు అదను కనిపెట్టి నెమ్మదిగా బయటికి వెళ్ళి పోయాడు. అతని ఉనికివల్ల ఇద్దరికి సంకోచంగానే ఉండేది.

"లేదు చెల్లీ! నా కేమీ శ్రమలేదు. అసలు నే నెలాగూ పన్నెండుకానిదే నిద్రపోను నిన్ను చూడాలని ఎన్నాళ్ళ నుంచో కోరికగా ఉంది. నువ్వు గొప్ప అదృష్టవంతురాల వనుకో. నీ భర్త మానవుల్లో రత్నంలాంటి వారు. అన్ని విధాల నిర్దోషి; నిష్కళంకమూర్తి" అంది మనోరమ.

భర్త ప్రశంస విని గర్వోన్నతయై "మీకోసం ఏమీ కానుకలూ గట్రా తీసుకు రాలేదా ?" అంది.

మనో:—నాకోసం నిన్ను మించిన కానుకలూ గట్రా ఇం కేం తీసుకొస్తారు ? నేను ప్రపంచంలో ఏకాకిని. నిన్ను పొంది ద్వికాకి నవుతాను.

అహ:- దీన్ని నా సౌభాగ్యంగా భావిస్తాను.

ఇంతలో మేళతాళధ్వనులు వినిపించాయి. మున్షీజీ పూరేగింపుసన్నాహంతో వచ్చేస్తున్నాడు.

అహల్య హృదయసాగరంలో ఆనందతరంగాలు లేస్తున్నాయి. ఒకప్పుడు తన కీవిధంగా సన్మానం జరుగుతుందనీ, ఒకరోజున ఒకమహారాణిగారు తనకు స్నేహితురాలు అవుతుందనీ, ఒకనాడు తనకు ఇంత బ్రహ్మాండంగా స్వాగతమివ్వబడుతుందనీ ఎన్నడూ ఊహించనైనా ఊహించలేదు అహల్య.

ఆమెను నెమ్మదిగా తీసుకెళ్ళి ఒకమేనాలో కూర్చోబెట్టింది మనోరమ. పెద్దలు బయలుదేరారు. చక్రధరు డేమో ఒక చక్కని అశ్వంపై ఆసీనుడైనాడు.

## పదిహేడో అధ్యాయము

విశాలసింగు విశాలపురం వస్తే, నిలవకుండా పారిపోతూండేవాడు—ఏదో పగవాడికొంప కొచ్చినట్టుగా. రోహిణికి ఈ నిర్దయతాప్రవర్తన భరింపశక్యంగాకుండా ఉంది. తన మనస్సులోఉన్న అక్కసంతా వెళ్ళగ్రక్కే అవకాశంకోసం ఎదురుచూస్తోంది కాని రాజా పొరపాటునగూడా గడపదాటిలోన పాదంపెట్టేవాడు కాదు. సరే, తుద కొకరోజున మనోరమమీదనే విసుచుకుపడింది, అత్తమీదికోపం దుత్తమీదనే సరి అన్నట్టు. ఇంతకూ కారణ మేమైనా ఉన్నదా అంటే, శూన్యమనే చెప్పాలి. ఒకనాడట "ఇక్కడ గ్రామంలో మీప్రాణాల కెంతోహాయిగా వుండొచ్చు. అక్కడ పట్నంలో నిత్యము తీయకుండా ఏదో ఒక మిడిమేలం నెత్తిమీది కొచ్చి

పడుతూనే ఉంటుంది'' అన్నదట మనోరమ. ఆమాట అన్నది ఏదో మనసులో పెట్టుకుని కాదు; సరళస్వభావంతోనే.

రోహిణి తుపాకి బారు చేసుకుని కూర్చునేఉండె. ఇంకేం, వెంటనే అందుకుని "ఔనే చెల్లీ, ఎందుకుండదే! పొరుగువాళ్ళ పస్తులు చూచి ఓర్వలేని ప్రాణాలూ ఉంటాయి. నీకు పంచభక్ష్య పరమాన్నాలే అసహ్యంగా కన్పిస్తున్నాయి. ఇక మాబోటి ఖర్మంకాలిపోయిన ముండలకు కారపుమెతుకులకు గూడా గతిలేదు!" అంది రోహిణి ఒళ్ళంతా విరగగొట్టుకుంటూ.

"పట్నంలో అంత సుఖమే ఉంటుందనుకుంటే అక్క-డికి రాగూడదూ? ఒంటరిగా నాకూ ఏమీ తోచకుండా ఉంటోంది. మీరుకూడా వస్తే బాగా కాలక్షేపమవుతుంది'' అన్నది మనోరమ మళ్ళీ వెనుకటి సరళభావంతోనే—

''అయ్యో! ఇటు రాజాగారిని గుప్పిట్లోపెట్టుకు కూర్చోటానికీ, అటు పెద్దపెద్ద అధికారులందర్నీ బుట్టలోవేసు కోటానికీ కావలసిన ఆ హావభావాలు నాలో ఎక్క-డ ఉండి చచ్చాయ్? ఆ ఒయ్యారాలన్నీ నాలుగచ్చరాలు చతికిన ఆ బస్తీ అమ్మలక్క-లకే చాతవ్వాలి. మే మంటావా, పల్లెటూరి గబ్బిలాయిలం; ఆ టక్కు-లు, మాయలు మా కేం తెలుస్తాయ్‌లే?'' అంది రోహిణి ముక్కు-విరిచి చీదరింపుగా.

నిల్చొన్నపళంగా నిర్ఘాంతపోయింది మ నో ర మ. పాదాలక్రిందనుండి అగ్గిమంటలు లేచి, నెత్తిపైగా వెళ్ళిపోయినట్టు అనిపించింది. పది పదిహేను నిమిషాలవరకూ అలాగే మాటాపలుకూ లేకుండా నిలబడి ఉంది. రాజాగారేమో, అక్క-డ బైట కారుదగ్గర నిల్చొని ఆమెకోసం ఎదురు

చూస్తున్నాడు. ఏమిటీ ఆలస్యమని కోపలి కెళ్ళాడు. అల్లంత దూరాన్నుంచే పిలుస్తూ "నోరా! (మనోరమకు ముద్దుపేరు) ఏం చేస్తున్నావు? త్వరగా రా, ఆలస్యమౌతోంది" అన్నాడు. మనోరమనుండి జవాబేమీ రాలేదు. అంతట రాజాగారు స్వయంగా మనోరమదగ్గరకెళ్ళి, చెయ్యిపట్టుకుని ఏదో చెప్ప బోయాడు. కాని ఆవిడముఖవైఖరి చూచి త్రుళ్ళిపడ్డాడు. పాముకరచినమనిషిలానిర్నిమేషనేత్రాలతో గోడకేసి తదేకంగా చూస్తోంది— కళ్ళలోనుంచి ప్రాణం లేచిపోతున్నదా అన్నట్టు.

"నోరా! ఒంట్లో బాగా లేదాఏమిటి?" అని అడిగాడు రాజాగారు కంగారుగా.

"నేను రానుగాని, మీరు వెళ్ళండి. ఇక్కడే ఉండిపో దలచాను. వెళ్ళి నా సామానూ అదీ పంపించండి"అంది మనో రమ వెక్కి వెక్కి ఏడుస్తూ.

రోహిణి ఏదో వ్యంగ్యాస్త్రం వదలిఉంటుందని గ్రహించుకున్నాడు రాజా. ఆవిడకేసి కళ్ళెర్రజేసిచూస్తూ "నీమూలంగానే 'బ్రతుకు జీవుడా' అని ఇక్కడినుంచి పారి పోయాను. అయినా నువ్వు నాప్రాణంవదలకుండా వెన్నంటే ఉన్నావు. అక్కడా శాంతంగా బ్రతుకనియ్యవనుకుంటాను. నీ కెందుకు? నా కిష్టమైనవాళ్ళతో మాట్లాడతా, ఇష్టంకాని వాళ్ళతోలేదు అదంతా నాఇష్టం. ఇందులో నువ్వు అసూయ పడవలసిం దేముంది? నీ కింత ద్వేషం దేనికే?" అన్నాడు.

రోహి:—ఆ ద్వేషమూ అదీ నేనంటే గిట్టనివాళ్ళ కుందేమో? నా కెందుకూ ద్వేషం! ఇక్కడున్నప్పుడు పూల పాన్పులమీంద పడుకోబెట్టావుగనకనా! ఇక్కడఏరాయిఅయినా

ఒకటిగానేఉంది పళ్ళూడగొట్టుకోటానికి. మొగుడుగారు ఇంట్లో ఉన్నా వీధిలోఉన్నా ఇక్కడ ఒరిగిపడేదేమీ లేదు. నొసట రాసిపెట్టిఉంది. అందుకే ఏడుస్తున్నాను.

రాజాగారి క్రోధాగ్ని మరింత ప్రజ్వరిల్లిపోతోంది. కాని మనోరమ ఎదుట తన పైశాచికస్వరూపం చూపించటానికి వెరపుగాఉంది. రోహిణికి అత్యంత ఆశ్చర్యంకలుగజేసేటటువంటిదీ, ఆవిడనోరు కట్టించేటటువంటిదీ ఏదైనా ఒక చురుకైనమాట అనాలని ఆలోచిస్తున్నాడు. అంతకటువుగా మనోరమను అన్నందుకు శిక్షగా రోహిణిని ఎంత కఠోరమైనమాట అన్నా అది క్షంతవ్యమే. ''ఇంత గరళం తాగి చచ్చినా పోయేదిగా! కనీసం ప్రాణంతీసే ఇలాంటి వెధవమాటలన్నా వినేఖర్మంపట్టకుండా ఉండేదిగదా!'' అన్నాడు రాజా.

రోహిణి చురచుర చూచింది రాజాగారికేసి. ఆచూపుల తీవ్రజ్వాలలలో అతన్ని భస్మీభూతం చేసివేస్తుందా అన్నట్లూ, ఆ చూపుల శూలాలతో భేదించి ముక్కలు ముక్కలు చేస్తుందా అన్నట్లూను రైముని తాంబూలపాత్రను కాళ్ళతో తన్నుకుంటూ, నీళ్ళచెంబును తన్ని ఒలకబోసుకుంటూ అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

రాజాగారు చాలాసేపు మనోరమకు బోధిస్తూ కూర్చున్నాడు. కానిమనోరమముందు అవన్నీఅరణ్యరోదనమయ్యాయి. ఈ అసూయ ఒక్క రోహిణికే కాదు, ఇక్కడివాళ్ళందరూ అలాంటిభావాలే కలిగిఉండొచ్చు నన్న శంక మనోరమ మనస్సులో పొడచూపింది. ఇక్కడ అందరిఎదుటా ఉండటం ద్వారానే ఈ సందేహనివారణా, ఈ అపవాద నివృత్తి

సంభవం. ఈ ఆలోచనే 'నేను రాను, ఇక్కడే ఉంటాను' అన్న ఆనిడసంకల్పానికి హేతువు. కడకు హాతాశుడై "ఐతే మరి నేనూ కాశీ వదలిపెట్టేస్తున్నానులే. ఒంటరిగా అక్కడ చివర కొక్కరోజైనా ఉండటం కష్టమే" అన్నాడు రాజా.

ఎకాయెకీని కర్ర తేకుకుంటూ వస్తున్నట్లు కన్పడ్డాడు మున్షీ వజ్రధరుడు. మొహం దించుకుపోయి ఉంది. పాయ జామా బంధు క్రిందకు వేలాడుతోంది. లోపలి ప్రాంగణంలో కొచ్చి నిలబడి "రాణిగారూ! ఎక్కడ? దయచేసి కాస్త ఇలా ఒక్కమాటు దయచేయండి. లేదా రమ్మనమని సెలవిస్తే, నేనే వస్తాను" అన్నాడు.

"ఏమిటేమిటి? ఏమిటిపని? సరే, నువ్వో రా; నీకూ ఇప్పుడే వచ్చిందీ పని. అంతా కట్టకట్టుకుని ఇక్కడికే చేరారూ! అక్కడకూడా ఎవరైనాఉండాలంటావా?" అన్నాడు రాజా చిరాకుగా.

మున్షీజీ గదిలో కొచ్చి 'ఏం చేయను హుజూర్! సంసారమంతా సర్వనాశనమైపోయేరోజు లొచ్చాయి. ఏలిన వారిదగ్గర మొరపెట్టుకోకపోతే, ఇంకెవరివద్ద చెప్పుకో మంటారు! బాబుచేష్ట లేమీ అర్థంకావటంలేదు. మళ్ళీ ఏదో తలపెట్టి కూర్చున్నట్టున్నాడు" అన్నాడు అతిదీనంగా.

"మున్షీగారూ! ఏమిటది? అలా అంటున్నా రేమిటి! ఇంతకు ముందే గదా, ఇవ్వాళ అక్కడ నాదగ్గర కొచ్చి వెళ్ళింది! అలాంటి దేమీ చెప్పినట్లు లేదే" అంది మనోరమ శంకితహృదయంతో.

మున్షీ:—తనవిషయం ఎవరితోనన్నా ఎప్పుడైనా చెబుతాడు గనుకనా, మీతో చెప్పలేదనుకోటానికి? నాతోనూ ఎన్నడూ ఏమీ చెప్పినపాపానపోలేదు. ఇవాళ ప్రయాగ వెళ్ళటానికి ప్రయాణంకట్టి కూర్చున్నాడు. కోడల్ని వెంట బెటుకు పోతున్నాడు.

మనో:—వెళ్ళటానికి కారణమేమిటని మీరడుగ లేదా? తప్పక ఏదో జరిగిఉంటుంది. దానివల్ల బాధకలిగి ఉండొచ్చు. లేకపోతే భార్యతోసహా బయలుదేరడు. ఇంట్లో ఎవ్వరూ ఏ రకమైన సూటీపోటీమాట లనలేదుగదా!

మున్షీ:—సరస్వతితోడు! ఎవరైనా నోరెత్తి చిన్నమెత్తు మాటఅంటే మిడిసిపడుతూ మాట్లాడేవాణ్ణయితే ఎవరైనా పోటుమాటలంటారు, వేళాకోళం చేస్తారు వాడేమో సేవా శీలములకు సాక్షాత్తు దైవంగదా! మరి వాణ్ణెవ్వరు ఎగతాళి చేయగలరు? ఔను. ఒకటిమాత్రం యదార్థం - మే మిద్దరమూ వాడు అంటుకున్నది తినటం లేదు.

“సరే, అదాసంగతి! ఐతే మరి ఇది బాబుగారెలా సహించుతారు? నేనే గనుక అహల్యస్థానంలో ఉంటేనా, ఒక్క నిమిషంకూడా ఆ కొంపలో ఉండేదాన్ని కాదనుకోండి. కాని, పాపం! ఆ ఇల్లాలు ఇన్నాళ్ళెలా సహించిఉండ గలిగిందో!” అన్నది మనోరమ తలఊపుతూ అర్థమయిందిలే అన్నభావంతో.

మున్షీ:—మీరు కాస్త దయచేసి వచ్చి, నచ్చచెప్పి పోండి. నాయందు యీమాత్రం కరుణించండి. పురాతనకాలం

నుండి ఆచారంగా పాటించబడుతూ వస్తున్న విషయాలను ఇప్పుడు వదలిపెట్టట మెలా సాధ్యం చెప్పండి?''

మనో:—ఎవ రొదిలిపెట్టమన్నారు? ఎవ్వరూ బలవంత పెట్టడం లేదే! మీకు మీ ధర్మం, మతం అంటే ప్రియం. అలా ఉండాలికూడాను. సరే, వారికీ తమ గౌరవ - మర్యాదలంటే ప్రేమ. అదీ తప్పక ఉండవలసిందే. మీ కోడలిచేతి అన్నం తినమని మిమ్మల్నేవిధంగా బలవంత పెటజాలనో అదేవిధంగా వారినీ ఈ అవమానం భరించమని ఒత్తిడిచేయలేను. ఇదంతా మీ ఉభయుల ఇష్టాయిష్టాలు. కనుక నన్ను తీసుకెళ్లి మధ్యలో ఇరికించకండి.

కొండంత ఆశతో ఇంతదూరం వచ్చాడు మున్షీజీ. కాని ఈ తీర్పు వినేటప్పటికి ఆవజీవాలు క్రుంగిపోయాయి. గచ్చుమీద చతికిలబడ్డాడు. ఇంక దిక్కు లేదన్నట్టుగా నెత్తి మీద చెయ్యి పెట్టుకుని ఇప్పు డిక ఏంచేయనా అని ఆలోచించసాగాడు.

మనోరమ అక్కడనుంచి వెళ్ళిపోయింది. ఆమె కెన్నో పను లున్నాయి. ఉండేదెక్కడో చూచుకుని ఏర్పాట్లుచేసు కోవాలి; పట్టణంనుంచి తనకు కావలసిన అత్యవసరవస్తువు లన్నీ తెప్పించుకోవాలి.

నడిరేయికి పైగా ప్రొద్దుపోయింది. కాని మనోరమ కంటికి కునుకు రావటంలేదు. హఠాత్తుగా చక్రధరుని జేబు బొత్తిగా ఖాళీగానే ఉండిఉంచవచ్చునని గుర్తుకొచ్చింది. ''భార్యతో వెడుతున్నాడు, చేతిలో చిల్లిగవ్వ లేదు, వెళ్ళేది కొత్తచోటు, ఒకరితో పరిచయమూ చేసుకోలేదు, సంకోచపడే

స్వభావం, ఉదారహృదయం. ప్రయాగలో ఎంత కష్టంగా ఉంటుందోగదా! అరరే! గొప్ప పొరపాటుచేశాను. మున్షీజీ వెంట వెళ్ళవలసింది. బాబుగారు నా కోసం ఎదురు చూస్తూ ఉండొచ్చు.''

మనోరమ గడియారంకేసి చూచింది. ఒంటి గంట అయింది. మనస్సులో ప్రశ్న లేచింది—''ఇప్పుడు మాత్రం ఎందుకు వెళ్ళ గూడదూ? ఒక గంట ప్రయాణమేగా?''

కాని,మళ్లీ ఇంకో ఆలోచన కలిగింది.—ఈ వేళప్పుడు బయలుదేరి వెళ్లే లోకు లేమనుకుంటారో?'' అని. దాంతో మళ్ళీ వచ్చి పడుకుంది. కన్ను మూయటానికి ప్రయత్నించింది. సరే, ఎలాగైతేనేం చివరకు నిద్రపోయింది. కాని, ఇంత ఆలస్యంగా పడుకున్నా మళ్ళీ ప్రొద్దుటే లేవటానికిమాత్రం ఆలస్యం కాలేదు. అంతా ఇంకా నిదురమంచాలమీద ఉండగానే లేచి కూర్చుంది. తత్క్షణం కారు సిద్ధంచేయమని ఆజ్ఞాపించింది. తర్వాత తన 'చేతిసంచిలో ఏవో కొన్నివస్తువులు సర్దుకున్నది. కారులోకూర్చుని వెళ్ళిపోయింది.

అటు చక్రధరుడూ చీకటిముఖాన్నే లేచి ప్రయాణ సన్నాహంలో నిమగ్నుడైనాడు. తలిదండ్రులను విడచిపోతున్నందుకు ఒకవేపున విచారంగానే ఉంది. కాని రెండోవేపున కొంపలో అహల్యపరిస్థితులు చూచి భరింపశక్యంగాకుండానూ ఉంది. ఎడింటికి బండి. పరుపూ, పుస్తకాలూ అవీ కట్టి వాకిట్లో పెట్టిస్తున్నాడు. అక్కడ లోపల ఇంట్లో తన అత్తగారినీ, ఆడబిడ్డనూ కౌగిలించుకుని కంటనీరుపెడ్తోంది అహల్య

ఇంతలో మనోరమకారు వచ్చింది. సిగ్గుచే నేలకంటుకు పోయాడు చక్రధరుడు.

"బాబుగారూ! ప్రస్తుతం కాస్త ఆగండి. ఇంత తొందరా, హఠాత్తుగా వెళ్ళిపోవడం దేనికి! ఎందు కెళ్తున్నారో, అక్కడ ఏం చేయదలచారో మొదలైనవన్నీ నాకు తెలిసేటంతవరకూ మిమ్మల్ని వెళ్ళనిచ్చేది లేదు" అంది మనోరమ కారులోంచి దిగుతూనే.

చక్ర:- విషయాలన్నీ తెలిస్తే బహుశా నన్ను ఆపటానికి ప్రయత్నించవు.

మనో:- ఐతే వినండి.మీ ఇంటివిషయం కొద్దో గొప్పో నాకూ తెలుసు. వీరంతా తమ సంస్కారానికి బద్ధులై వున్నారు. వారిని లొంగదీయటానికి మీరూ ఇష్టపడరనుకుంటాను. అహల్యను కొన్నాళ్ళు నాదగ్గర ఉండనిస్తే ఏం పోతుంది? ఇప్పుడిక జగదీశపురంలోనే ఉండటానికినిశ్చయించుకున్నాను. మీ రక్కడ ఉండవచ్చును గదా. కొన్నాళ్ళు మీరు నాకు అతిథులుగా ఉంటే బాగుంటుందని ఎన్నాళ్ల నుంచో కోరికగా ఉంది. అదీ మీ ఇల్లేగదా. మీరాకను నా అదృష్టంగా భావిస్తాను.

చక్ర:—వద్దు వద్దు. మనోరమా! నన్ను వెళ్ళనివ్వు.

మనో:— సరే, అంత వెళ్ళాలనిఉంటే వెళ్ళండి. కాని నామాట ఒకటిమాత్రం తప్పక అంగీకరించి తీరాలి. ఇదిగో, నా యీ కానుకను స్వీకరించండి.

ఇలా అని తనచేతిసంచిని, చక్రధరునివేపుకు అందించింది మనోరమ.

చ(క:—స్వీకరించకపోతేనో!

మనో:- మీ చెంబూ చేంతాడూ అన్నీ స్వయంగా తెచ్చి మళ్ళీ లోపల పెట్టేస్తాను.

చక్ర:- ఇంతకష్టం నీ కెందుకులే. సరే అలాగే తీసుకుంటున్నాను బహుశా అక్కడ ఇబ్బందిపడవలసిన అవసరం లేకుండా పోతుం దనుకుంటాను. ఆ సంగతి మీనంచి బరువే తెల్పుతూంది.

మనోరమ లోపలికి వెళ్ళింది.

"ఏమన్నా డమ్మా? ఇంతకూ విన్నాడా లేదా ?" అని అడిగింది నిర్మల.

మనో:—ఎంత చెప్పినా వినటం లేదు. చెప్పి చెప్పి ఊరుకోవలసివచ్చింది.

మున్షీ:—సరే, మీ మాట లక్ష్యపెట్టనపుడు, ఇంకొకరిమాట ేం వింటాడు లెండి.

జట్కా వచ్చి వాకిట్లో నిలబడింది. చక్రధరుడు, అహల్య బండిలో ఎక్కి కూర్చున్నారు. మనోరమకూడా వెళ్ళి తన కారులో కూర్చుంది. ఇంట్లో వాళ్లు ముగ్గురూ గుమ్మంలో నిలబడిపోయారు.

# పద్ధెనిమిదో అధ్యాయం

ప్రజాసేవకు కార్యక్షేత్రానికేమీ కొదువలేదు- కేవలం మనస్సులో సేవాభావం ఉండాలేగాని. చక్రధరుడు ప్రయాగలో ఇంకా సరిగా స్థిరపడనేలేదు. అప్పుడే అతన్ని ఇటు లాగటం అటు లాగటం ప్రారంభమైంది. కొద్ది రోజుల్లోనే నాయకుల్లో స్థానం లభించింది. అతనిలో దేశభక్తి ఉంది; కార్యోత్సాహం ఉంది. సంఘ నిర్మాణ శక్తి యోగ్యతా ఉన్నాయి. పట్టణమంతా వెదకిచూచినా అతనితో సరిసమానమైన నిస్వార్థవ్యక్తి కానరాడు. ఇతరులు తమ తీరికసమయాన్ని మాత్రమే ప్రజాసేవకు వినియోగించుతారు. ద్రవ్యోపార్జనయే వారిప్రధానలక్ష్యం. కాని చక్రధరుని విషయం వేరు. ప్రజాసేవమినహా మరోఆలోచనేలేదు పట్టణం చివర ఒక ఇల్లు అద్దెకు తీసుకుని ఉంటున్నాడు. ఎంతో మితవ్యయంతో జీవితం గడుపుతున్నాడు. ధనాభావం ఎప్పుడూ వెన్నంటి ఉండేది. సంసారజీవితంలో ఏదో కొద్దోగొప్పో స్థిరమైన రాబడి ఉండటం అవసరమన్న సంగతి ఇక్కడికొచ్చి వేరేయింటి కాపురం పెట్టిన తర్వాత అనుభవం కాసాగింది. తన్ను గురించి తనకంతగా చింతలేదు. కాని, అహల్యనుకూడా దారిద్ర్య పరీక్షకు గురిచేయటం ఇష్టంలేదు.

తన ఒక్క కుటుంబఖర్చు మాత్రమే అయితే బహుశా అతని కంతగా కష్టమయ్యేది కాదేమో. ఎందుకంటే అతను మంచి వ్యాసరచయిత. రెండుమూడు వార్తాపత్రికలకు వ్యాసా

లు వ్రాస్తే తన అవసరాలకు సరిపోతుంది. కాని, మున్షీ వజ్రధరుడు డబ్బుకోసం చేసే వత్తిడి మూలంగా ప్రాణంమీది కొస్తోంది. డబ్బుడబ్బని ఎప్పుడూ ఒకటే ఏడ్పించుకుతినటంవల్ల వివశుడై తండ్రికి అంతో ఇంతో సహాయం చేయవలసివచ్చేది.

మార్గశిరమాసం. అప్పుడే చలి ప్రారంభమయింది. కాని, చక్రధరుడు ఇంతవరకూ చలికాలపు ఉన్నిదుస్తులు కుట్టించుకోలేదు. అహల్యకు మాత్రం ఏవో పాతదుస్తులున్నాయి. చక్రధరుని కవీ లేవు. తండ్రిగారిమూలంగా తన పాతబట్టలైనా ఇంట్లో ఉండేవికావు. తండ్రిస్వయంగా తానన్నా తొడుక్కునేవాడు. లేదా దానమిచ్చేసేవాడు. ఎటునుంచైనా డబ్బు చేతికొస్తే ఒక గొంగళి కనుక్కోవాలనుకున్నాడు. ఎన్నాళ్ళనుంచో నోరుతెరచుకు కూర్చుండగా ఇవ్వాళ లక్నోనుంచి ఒక మాసపత్రికా కార్యాలయంనుండి ఒకపాతిక రూపాయల మనియార్డరు అందింది. అహల్యదగ్గర కూర్చుని బట్టలను గురించి పథకంవేస్తున్నాడు.

ఇంతలో పోస్టుజవాను కేకవేశాడు. చక్రధరుడు వెళ్ళి, ఉత్తరం తీసుకొని, చదువుకుంటూ లోనికొచ్చాడు. "నాన్నగారి ఉత్తరం అనుకుంటాను. అంతా క్షేమమేగదా?" అని అడిగింది అహల్య.

చక్ర:— నేను ఊరువదలి రావటంతోనే వాళ్ళకేం శనిపట్టుకుందో ఏమో గాని, ఎప్పుడు చూడబోయినా, ఏదో ఒక విపత్తి నెత్తిమీదికొచ్చిపడుతూ నేఉన్నట్టుంది. ఈమధ్యే మంగళ జబ్బుపడింది, ఇప్పుడు అమ్మ మంచమెక్కిందట. నాన్నగారికి దగ్గు ఎక్కువయిందని వార్త. రాణిగారిదగ్గరనుండి

ప్రస్తుతం ఆర్థికసహాయమేమీ అందటంలేదట. తక్షణం యాభైరూపాయలు పంపమని వ్రాశారు.

అహ:—అమ్మగారికి జబ్బు ఎక్కువగా ఉందని రాశారా?

చక్ర:—ఔను. ఈ వ్రాతను బట్టి చూస్తే అలాగే ఉన్నట్టు కన్పడుతోంది.

అహ:—ఐతే, మరి వెళ్ళి చూచిరాకూడదూ.

చక్ర:—నాన్నగారిని చూస్తోంటే నాకు వళ్లుమండి పోతోంది. అనవసరంగా నన్ను ఇబ్బంది పెడుతున్నారు. అమ్మకు జబ్బనేది కుంటిసాకు, వట్టి మిష.

అహ:- ఇది యథార్థమే కానీండి. లేక మిషయే కానీండి. యేమైనా, వెంటనే ఈ పాతికరూపాయలూ పంపిస్తూ తతిమ్మా పైకంకూడా యేదోఒకవిధంగా సాధ్యమైనంత త్వరలోనే పంపిస్తామని వ్రాయండి. మనకు శీతాకాలపు దుస్తుల అదృష్టం లేదులెండి.

పుష్యమాసం దొరబడింది. ఎముకలు కొరుక్కుతినే చలివేయసాగింది. స్నానం చేయబోతే నీళ్లు కరవవచ్చినట్టుగా ఉండేవి. కాని, ఇంతవరకూ చక్రధరుడు చలికాలపు దుస్తులు కుట్టించుకోనేలేదు. ఒకరోజున మబ్బుపట్టి చల్లనిగాలి సాగింది. చలిమూలంగా చక్రధరునకు నిద్రపట్టటంలేదు. అహల్యవేపు కన్నెత్తిచూచాడు. ఆవిడ కాళ్ళూచేతులూ ముడుచుకుని, దుప్పటి నెత్తికి ముసుగుపెట్టి ఒక మూటమాదిరిగా ముసగ దీసుకుని పడిఉంది. అతని కరుణాహృదయం ఆవురుమంది. అతని అంతరాత్మ వేయినాల్కలతో "ఛీ ఛీ" అని చీదరించుకో

సాగింది. 'నీ ప్రజాసేవ కేవలం భ్రమ; చాల ప్రమాదకరం. నీ నిమిత్తం ప్రాణంసైతం అర్పించగల ఒక రమణినే రక్షించ డం చేతకానివాడవు మరి ప్రజల నేం ఉద్ధరించగలవు ?'

మర్నాడు ఫలహారానంతరం ఇల్లువదలి బయటికిపో లేదు. తిన్నగా గదిలోకిపోయి యేదో చదువుతూ, రాస్తూ గడిపాడు. సాయంత్రం టంగుటంగుమని యేడు కొట్టినతరావ తనే గదిలోంచి బయటికి అడుగుపెట్టాడు. తర్వాత మళ్ళీ రాత్రి పదిగంటలదాకను వ్రాసుకుంటూ కూర్చున్నాడు. ఆనాటి నుండి ఇదే అతనికి నిత్య కార్యక్రమమైపోయింది. ఉద్యోగమూ అతను చేయలేదు. ఉద్యోగంమాట తలిస్తేనే అసహ్యం అతనికి. అందువల్ల ఎక్కువకాలం పుస్తకాలూ, వ్యాసాలు వ్రాయడానికే వినియోగించేవాడు. అతని విద్యా - బుద్ధులు ఇప్పుడు ప్రజాసేవ కధీనమైలేవు సరిగదా, పైపెచ్చు స్వార్థా నికే స్వాధీనమైపోయాయి. మొదట్లో అతనిది చవిటిపర్ర వ్యవ సాయం. అందులో పంటాలేదు. కీర్తీలేదు. ఇప్పుడుధనంతో పాటు కీర్తికూడా లభిస్తోంది. పత్రికా సంపాదకులు కావాలని అతని చేత వ్యాసాలు వ్రాయించుకునేవాళ్లు. పాఠకులు ఈవ్యాసా లను చాలా ఆప్యాయంగా చదివేవారు. ఇతని భాష అలం కారయుక్తంగా ఉండేగి; చక్కని భావాలు. ఆలోచనను రేకెత్తించేవిగా ఉండేవి; ఇక విషయం సంగతి వేరేచెప్పనక్క రలేదు_ ఎంతో ఉపయుక్తంగా ఉండేవి. తత్వశాస్త్రం అంటే అతనికి ప్రత్యేకాభిమానం. అందువల్ల అతని వ్యాసాలు చాల వరకు దార్శనికంగా ఉండేవి.

కాని చక్రధరున కిపుడు తన ఈ కృషిఅంటే అభిమానంలేదు. డబ్బు అయితే బాగానే వస్తోంది. యూరపు, అమెరికా దేశాల పత్రికల్లో సైతం అతనివ్యాసాలు ప్రచురింపబడుతున్నాయి. సమాజంలో గౌరవానికీ కొదువలేదు. కాని సమాజసేవాకార్యంలో కలిగే ఆనందం, శాంతి ఇందులో లభించడం లేదు. తన దీన, హీన, పీడిత ప్రజాసేవలో లభించే గౌరవానందాలు ఇప్పుడీ సభ్యసమాజ మిచ్చే విందుల్లో ప్రాప్తించటం లేదు. కాని, అహల్యమాత్రం హాయిగా ఉంది. ఇప్పుడామె ఒక అమాయక - అబోధబాలిక కాదు - గౌరవనీయ యువతి. గృహనిర్వహణలో చతుర, పతిసేవాపరాయణ, ఉదారవతి, దయాశీల. నౌకర్లు ఆమెకనుగప్పి రాగి దమ్మిడీయైనా దిగమ్రింగటానికి సాహసించేవారు కాదు. కోరికలన్నీ తీరుతుండేవి. భగవంతుడు ఒక చక్కని బాలుని కూడ ప్రసాదించాడు. ఇంకే! ఆ కొరతకూడా తీరిపోయింది.

ఈవిధంగా అయిదేండ్లు గడచిపోయాయి. ఒకరోజున రాజా విశాలసింగ్‌గారి టెలిగ్రాం ఒకటి కాశీనుంచి వచ్చిపడింది. అందులో "మనోరమకు జబ్బుగా ఉంది. తక్షణమే బయలుదేరి రండి. బ్రతికే ఆశ అత్యల్పం" అని ఉంది.

అహ:—ఇదేమిటి! మొన్ననేగదూ, అంతా క్షేమంగానే ఉన్నారని రాసింది?

చక్ర:—ఏమని చెప్పను! ఏంలేదు, ఇదంతా గృహకలహ ఫలితమే. రాజాగారిని పెళ్ళాడి గొప్పపొరపాటుచేసింది మనోరమ. సవతులంతా పోటుమాటలతో వేధించి వేధించి చివరకు ఆమెప్రాణాలుతీశారు.

అహ:—నేనుకూడా రానా? చూడాలనిపిస్తోంది. ఆమె స్వభావము, వాత్సల్యము మరచిపోదామన్నా మరపుకు రావనుకోండి.

చక్ర:—యోగేంద్రబాబుగారిని కూడా తీసుకెళ్దాం. ఇక్కడ ఈయనకు మించిన డాక్టరులేడు.

సరిగ్గా పదిగంటలకల్లా ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణమై కూర్చున్నారు. అహల్య కిటికీలోంచి వర్షాకాలపు మనోహర దృశ్యాలు చూస్తోంది. వ్యాకులపాటుతో గడియారం వంక చూస్తున్నాడు చక్రధరుడు - ఇంకెంతసేపటికి చేరుకుంటామా అని. కిటికీలోంచి దూకటానికి తంటాలుపడుతున్నాడు పాపడు.

చక్రధరుడు జగదీశపురం చేరుకునేటప్పటికి రాత్రి ఎని మిదిగంటలయింది. రాజభవనం ప్రాంగణంలో వేలాదిజనం చేరిఉంది. అన్నదానం జోరుగా సాగిపోతోంది. పేదలు ఒకడి మీద ఒకడు పడి విరగద్రోక్కుకుంటున్నారు.

హఠాత్తుగా కారుమోత విని బైటికొచ్చాడు మున్షీ వజ్రధరుడు. గుంపును పడద్రోసుకుంటూ గబగబా ముందుకు వెళ్ళి చక్రధరుని కౌగలించుకున్నాడు.

అహల్య భర్తవెనుక నిలబడిఉంది. పాపడేమో తల్లి చంకలోకూర్చుని ఆ ఇద్దరూ కన్నీళ్లు కార్చటం కుతూహలంగా చూస్తున్నాడు.

ఇంకా తండ్రీ కొడుకులమధ్య కుశలప్రశ్నలు జరగనే లేదు. ఇంతలో రాజాగారు లోపలినుంచి పరుగు పరుగున వస్తూండటం కన్పించింది. ఆకారంచూస్తే విచార - నిరాశలు స్పష్టమవుతున్నాయి. బక్కచిక్కి ఉన్నాడు. వచ్చీ రావటంతోనే

చక్రధరుని కౌగలించుకొని "నా టెలిగ్రాం ఎన్నిగంటలకు అందిందేమిటి?" అని అడిగాడు.

చక్ర:—సుమారు ఎనిమిదింటికి. తంతి చూడగానే ప్రాణం లేచిపోయింది. రాణిగారి కిప్పు డెలాఉంది?

రాజా:—ఏం చెప్పను? నువ్వే నీకళ్ళతోనే చూస్తావుగా. ఇంక ఆ సర్వేశ్వరుని మీద నమ్మకమొకటే మిగిలి ఉంది.— ఓహో! ఈయన శంఖధర మహాశయుడా ఏమిటి?

ఇలా అని ఆయన తన చంకలోకి తీసుకున్నాడు. ఆ బుడుతని కేసి వాత్సల్యంతో చూస్తూ 'నా 'సుఖద' అచ్చంగా వీడిమాదిరిగానే ఉండేది. వీడు దానితమ్ముడా అనిపిస్తోంది. దానిరూపం ఇప్పటికీ నాకళ్ళల్లో మెదులుతోంది. మొహం అచ్చం వీడిమొహమే.

లోపలికెళ్ళి చక్రధరుడు మనోరమను చూచాడు. ఆ పెద్దపెద్ద పరుపులమధ్య మంచానికి అంటుకుపోయి ఉంది. ఆ అంటుకుపోయిన తీరు చూస్తుంటే మంచంమీద మనిషే లేదనట్టు, కేవలం దుప్పటొక్కటే పరచిఉన్నట్టుగా కన్పడుతోంది.

చక్రధరుడు వచ్చిన అలికిడి తెలిసి దుప్పటిలోనుండి ముఖం బైటికిపెట్టింది. దీపపు క్షీణకాంతిలో ఎవరో ఒక దుర్బలజీవినిట్టూర్చుతూ అసహాయనేత్రాలతో ఆకాశం కేసిచూస్తోంది.

"నోరా! ఇదిగో, మీబాబుగారొచ్చారు" అన్నాడు రాజా మెల్లగా.

తలగడను కాస్త ఊతంగా చేసుకుని, "నా అదృష్టం! రండి రండి, బాబుగారూ రండి. చివరను మీదర్శనం లభించింది.

టెలిగ్రామే గనుక ఇచ్చిఉండకపోతే, మీా రెండు కొచ్చే వారు?" అంది మనోరమ.

చక్ర:—నా కసలు బొత్తిగా మీా జబ్బుసంగతి తెలియనే తెలియదు. టెలిగ్రాం చేరినమీాదటనే సంగతి తెలిసింది.

మనో:—(బాలునిచూచి) ఏమిటీ! అహల్యాదేవికూడా వచ్చారా? అహల్యా, కాస్త బాబుని ఇలా తీసుకురా.

రాజా:— వీడి పోలికలన్నీ పూర్తిగా 'సుఖద' పోలికలే నోరా! అచ్చంగా దాని తమ్ముడులాగే ఉన్నాడు.

'సుఖద' పేరు మొదటిసారి విన్నప్పుడే కొంచెం త్రుళ్ళిపడింది అహల్య. ఇప్పుడు మళ్ళీ ఆ పేరు చెవినిబడగానే మరల కంగుపడింది. బాల్యస్మృతి యేదో విస్మృత స్వప్నసాదృశ్యంగా చైతన్య - క్షేత్రంలో కొచ్చింది. ఆమె ముసుగులో నుండి రాజాగారి ముఖమండలంలోకి ఒకసారి తేరిపారజూచింది. అదే ఆకృతి తన స్మృతిఫలకంమీాద అంకితమై ఉన్నట్టుగా కన్పడింది.

బాలునిస్పర్శ తగలటంతోనే మనోరమ శిథిలదేహంలో ఒకవిధమైన కదలిక పుట్టింది– ఎవరో ఆరిపోతున్న దీపం వత్తిని, కొండి రాల్పి పైకిలాగినట్టుగా. బాలుని అక్కున చేర్చుకునిఉంటేఆమెకపూర్వఆనందానుభూతితోకల్గుతోంది—ఎన్నాళ్ళుగానోదాహంగొన్నగొంతుకు శీతలజలంసంప్రాప్తించినట్టూ కాని ఎంత తాగినా పిపాస తీరనట్టుగానూ. బాలునితోసహా లేచికూర్చుంది మనోరమ. "అహల్యా! ఇప్పుడిక ఈ పండును నీ కివ్వనే ఇవ్వననుకో. వీడు నావాడు ఇన్నాళ్ళనుంచీ నావిషయమే పట్టించుకోకుండా కూర్చున్నావు. అందుకు శిక్ష ఇది."

రాజాగారు మనోరమను చేతులానించిపట్టుకుని 'నోరా పడుకో పడుకో. కప్పుకు పడుకో. వంటికి గాలి తగులుతోంది చూడు. ఏమిటీపని?' అన్నాడు.

కాని మనోరమ బాలుని తీసుకుని గదివెలుపలికి వెళ్లి పోయింది. తూలి పడిపోతుందేమో అని వెనుకనే రాజా కూడా బయలుదేరాడు. గదిలో ఇప్పుడు అహల్యా చక్రధరులు మాత్రమే మిగిలిపోయారు.- 'ఇప్పుడు నాకు గుర్తుకొస్తూ ఉం దండీ. నన్నూ నా చిన్నతనంలో 'సుఖదా' అనే పిలిచే వాళ్ళండీ" అంది అహల్య చక్రధరునితో నెమ్మదిగా.

"చాల్లే, ఇక కట్టిపెట్టు. నోరెత్తేవ్. ఇంత అదృష్టం కూడానా నీకు? రాజాగారి 'సుఖద' ఏ తిరణాల్లోనూ తప్పి పోలేదులే. చనిపోయిఉండొచ్చు" అన్నాడు చక్రధరుడు.

ఈ మాట లిలా జరుగుతూండగానే బాలుణ్ని చంక నిడుకుని మనోరమతోసహా మరల గదిలో కొచ్చాడు రాజా. చక్రధరుని చివరిశబ్దాలు రాజాగారి చెవినిపడ్డాయి. వెంటనే అందుకుని "లేదులేదు, బాబుగారూ, లేదు. నా సుఖద చనిపో లేదు. త్రివేణీసంగమంతిరణాల్లో తప్పిపోయింది. ఇప్పటికి దాదాపు ఇరవైసంవత్సరా లయింది. నేను నా భార్యతో కలిసి త్రివేణీస్నానానికి పోయాను. అప్పుడు నా సుఖద షుమారు నాలుగేళ్ళ పిల్ల. ఆ తిరుణాల్లోనే తప్పిపోయింది. ఎంతగానో గాలించాం. కాని ఎక్కడా అంతు తగల్లేదు. దాని వియోగం భరించలేకనే దానితల్లి స్వర్గధామమలంకరించింది. నేనూ ఎన్నో సంవత్సరాలవరకూ పిచ్చెక్కినవాడిలా ఉన్నాను. కడకు చేయగలిగిం దేమీ లేక సహించి ఊరుకున్నా."

అహల్య ఎదుటికొచ్చి "నేనూ త్రివేణీ స్నానాల సందర్భంలో తప్పిపోయిన పిల్లనే. ఏమూలనోపడి ఏడుస్తూఉంటే చూచి ఆగ్రా సేవాసమితివారు తీసుకుపోయారు. యశోదానందనబాబుగారు నన్ను పెంచి పెద్దదాన్నిచేశారు" అంది నిస్సంకోచంగా.

రాజా:—నీ కిప్పు డెంతవయస్సు ఉంటుందమ్మా?

అహ:—ఇరవై నాలుగోఏడు గడుస్తోంది.

రాజా:—మీ ఇంటిగుర్తు లేమన్నా జ్ఞాపకమున్నాయా? మీ ఇంటిముందు ఏంచెట్టు ఉండేదో చెప్పగలవా?

అహ:—బహుశా మర్రిచెట్టు. దానిపళ్లుఏరుకునితింటూ ఉండేదాన్ని. ఇది నా కిప్పటికీ బాగా గుర్తు ఉంది.

రాజా:—సరే, మంచిది. మీ అమ్మగారి పోలిక లేమన్నా గుర్తున్నాయా?

అహ:- ఆ, గుర్తున్నాయి. చామనచాయగా ఉండేది. కాని పొడుగాటి మనిషి. పొద్దస్తమానం తమలపాకులు నములుతూండేది.

రాజా:- మీఇంట్లో ఇంకెవ్వరెవ్వరు ఉండేవాళ్ళు?

అహ:- నా కొక ముసలినాయనమ్మ ఉండేది. నన్ను చంకనెత్తుకుని కథలు చెపుతుండేది. ఒక ముసలతను నౌకరుగా ఉండేవాడు. రోజూఅతని భుజంమీాద ఎక్కి కూర్చుంటూ ఉండేదాన్ని. వాకిలిముందొక గుర్రం ఉండేది. ఇంటిముందు నుయ్యీ, వెనకప్రక్కన ఒక ముసలి మాదిగ దాని ఇల్లొకటీ ఉండేవి.

రాజా సజలనేత్రుడై చాలు చాలు. ఇంకెక్కువ అవసరంలేదు. నా తల్లీ! ఇలా రా. ఒక్క సారి తనివితీర కౌగిటచేర్చుకోనివ్వు! నువ్వే నా సుఖదవు. నిజంగా ముమ్మాటికీ నువ్వే. ఈ బాలునిముఖంచూడగానే అనుకున్నా. ఆహా! నా సుఖద దొరికింది. నా సుఖద దొరికింది'' అన్నాడు.

చక్ర:- ఇప్పుడప్పుడే ఇంత గోల దేనికి లెండి. ఏదో భ్రమపడటం కూడా సంభవమే అయిఉండొచ్చు.

రాజా:- భ్రమ అనేది లేశమాత్రంకూడా లేదు. నా సుఖద నిజంగా ఇదే. ఇది చెప్పినమాటలన్నీ యథార్థాలే. ఇక నాకిప్పుడు అవగింజంతకూడ సందేహ మనే దెక్కడాలేదు. ఇవ్వాళ మీ అమ్మగనక బ్రతికిఉంటే ఎంత ఆనందపడిపోయి ఉండేదోగదా! ఆ పరాత్పరునిలీల లేం లీలలో గదా! ఆయనమహిమ వర్ణించతరమా! గడపదాటి బైటికిపోకుండానే నా సుఖద నా ఒళ్ళోకొచ్చి కూర్చుంది. చిన్నదిగాపోయింది, పెద్దదిగావచ్చిందీ. అరె! నా శోకసంతాపంపాలనివారణార్థంఒక ముద్దులయ్యను కూడా వెంటబెట్టుకుని వచ్చింది. రా నాయనా చక్రధర్! ఇలా ఒకసారి రా. న న్నొకసారి నిన్ను కౌగిలించుకోనివ్వు. ఇంతదనుక నువ్వు నాకు మిత్రుడవు. ఇప్పటినుంచి పుత్రుడవు. నేను నిన్ను జైలుకు పంపించాను. గుర్తుందా? నోరా! ఈశ్వర లీల గమనించుతున్నావా? సుఖద ఏమో ఇంట్లోనే ఉంది. కాని నేనేమో దానిపేరు తలచుకుని ఏడుస్తూ మొత్తుకుంటూ కూర్చున్నా. ఇప్పుడు నా సమస్త వాంఛలూ పూర్తయ్యాయి. ఏఆశ

పూర్తి కాదని భావించానో అదీ ఇప్పుడు పూర్తయిపోయింది.

ఇలాఅంటూ ఆ ఉత్సాహావేశంలోనే దివాణం లోకి వెళ్లిచేరాడు. వాకిట్లోఉన్న బిచ్చగాండ్రగుంపు ఇంకా అక్కడే ఉంది. ఇద్దరు ముగ్గురు కచ్చేరీకర్మచారులు ఇంకా ఆఫీసులోనే కూర్చుని ఆఫీసుప నేదో చూచుకుంటున్నారు. పాపణ్ణి భుజాలమీద ఎక్కించుకుని "మిత్రులార్లా! ఇదిగో! ఇలాచూడండి. నే నిల్లు కదలకుండానే భగవత్కృపవల్ల నా నాకనకం- నావారసు- స్వయంగానే నాఇంటి కొచ్చిచేరింది. మీ అందరికీ తెలిసినవిషయమే. ఇరవైఏళ్ళ క్రితం నాపుత్రిక సుఖద త్రివేణీస్నానాల సందర్భంలో తప్పిపోయింది. ఆ సుఖ దయే ఇవాళ మరల లభించింది. ఈ బాలుడు నా సుఖద పుత్రుడే! నేటినుంచి మీరంతా వీడిని తమయువరాజుగా భావించుకోండి. నా అనంతరం నా ఎస్టేటుకు యజ మానివీడే. యువరాజగారికి సైనికవందనంఇవ్వమని మిలిటరీకి కబురుచెయ్యండి. నగారావాయిద్యగాళ్ళతో నగారామ్రోగా లనిచెప్పండి. ఇవ్వాళ్టికి ఏడోరోజున రాకుమా రునికి అభిషేకం జరుగుతుంది. ఈ ఘడియనుంచే ఆ సన్నా హాలు ప్రారంభంకావాలి." అన్నాడు ఎలుగెత్తి.

ఈరకంగా ఆజ్ఞలు జారీచేసి బాలకుని చంకనిడుకుని భగవత్సాన్నిధ్యానికి (గుడికి) వెళ్ళాడు. ఆ సమయంలో అక్కడ దేవునికి నైవేద్య,హారతులుఇవ్వటానికి సంసిద్ధంకాబోతు న్నారు. సాధువులూ భక్తులూ కొందరు చేరి ఉన్నారు.

"రాకుమారుని పరాత్పరుడు చిరంజీవిని చేయుగాక!" అన్నాడు పూజారి దీవిస్తూ.

రాజాగారు తనచేతివజ్రపుటుంగరంతీసి పూజారిచేతిలో ఉంచాడు. ఇలాంటి ఆశీర్వాదానికే ఒక బాపనయ్యకు వందఎకరాల నిక్షేపంలాంటి భూమి ఈనాముగా లభించింది.

కోవెల నుండి ఇంటికి చేరుకున్నాడు రాజా. చక్రధరుడు పీటపైకూర్చుని భోంచేస్తున్నాడు. ఎదురుగా నిలబడి వడ్డనచేస్తోంది మనోరమ. ఆవిడముఖమండలంలో హృదయపూర్వకోల్లాస కాంతిరేఖలు తళతళ మెరుస్తున్నాయి. ఇంతకు పదినిమిషాలపూర్వం మరణశయ్యపై పడిఉన్న మనోరమయే ఈ మనోరమయని ఊహించటం ఎవరితరం!

# పందొమ్మిదో అధ్యాయము

కొన్నాళ్ళనుండి సంస్థానవ్యవహారాల్లో పట్టించుకోవడం పూర్తిగా వదిలేసి కూర్చున్నాడు రాజా విశాలసింగ్. ఇప్పుడు పెత్తనమంతా మున్షీ వజ్రధరుడూ, దివాను హరిసేవకసింగు గార్లే వెలగబెడుతున్నారు. ప్రజల కష్టసుఖాలతో ఎవ్వడికీపనిలేదు. కాస్తోకూస్తో ఉంటే ఒక్క మనోరమకు మాత్రమే. రాజాగారికి సత్య- న్యాయములందు గల ఉత్సాహం పూర్తిగా చల్లారిపోయింది. మనోరమను పొందుటతో ఇంకేదీ ఆయనకు స్పృహలో లేకుండాపోయింది.

కాని ఈ బాలుని ఆగమనంతో రాజాగారి జీవితంలో ఒక నూతనోత్సాహం వెల్లివిరిసింది. ఇంతవరకూ రాజాగారి జీవితానికే లక్ష్యమూ లేదు. 'ఎవరికోసంలే' అన్న ప్రశ్న మనస్సులో ఉదయించుతూండేది. కాని, ఇప్పు డీజీవితానికొక

లక్ష్యం లభించింది. మరి ఇప్పుడు రాజ్యవ్యవహారాలపట్ల విర కుడై ఎలా కూర్చోగలడు? ఇంతవరకూ మున్షీజీ తన స్వార్థం కోసం దివానుతో కలిసిమెలిసి మెలగుతూండేవాడు. కాని, ఇప్పు డతడు ఎవరినిమాత్రం ఎందుకు లెక్కచేస్తాడు? ఇప్పుడత నికి తానే రాజునన్నట్లుగా కన్పడసాగింది. దివానుగారు మనో రమతండ్రి ఐతే, మున్షీజీ రాకుమారుని-మైనరురాజాగారికి తాత. మరి ఈ ఇద్దరిలో ఎవరు తగ్గుతారు? ఒకరి కొకరు లొంగుతారా? ఎస్టేటు నౌకర్లు ఇప్పట్లాగా ఇదివర కెన్నడూ చీవాట్లుపడి ఎరుగరు. మున్షీజీకంటబడితే చాలు, గడగడ వణకి పోతున్నారు. ఏ తాబేదారుడైనా ఆయనగారి ఆజ్ఞను వెంటనే నెరవేర్చకపోయెనా, ఇక మున్షీగారు ఒళ్లుమరచిపోయే వారు. సాక్షాత్తు రుద్రావతారం దాల్చేవాడు. ఏమైనా చెప్ప వలసినదుంటే అదంతా తర్వాత. ముందు 'తక్షణమే ఉద్యో గంలోంచి తీసివేస్తా' నని బెదరించేవాడు.

వినేవాళ్ళకు ఈమాటలు కటువుగానే ఉండేవి. ఎప్పు డైనా ఇలాంటిమాటలు చక్రధరుని చెవినిపడితే అతని తల దించుకుపోయేది. అత నిప్పుడు మున్షీజీతో మాట్లాడటమే అరుదు. తమ ఇంటికూడా ఒక్కసారిమాత్రమే వెళ్ళాడు. అక్కడ తల్లిగారు అన్నమాటలు విన్నాక మళ్ళీ ఆ గుమ్మం తొక్కటానికి మనస్కరించటంలేదు. మిత్రులను కలుసుకోవటం కూడా తగ్గించివేశాడు. నిజం చెప్పాలంటే, ఇక్కడి జీవితం అతనికి అసహ్యమైపోయింది. అతనికి తిరిగి తన శాంతికుటీరా నికి చేరుకోవాలని తహతహగా ఉంది. ఇక్కడ ఏనాడుచూచినా ఏదో ఒకగొడవ ఉండనేఉండేది. దానితో ఆనాడంతా మనసు

కలవరంగావుండేవి. ఒకచోట ఎస్టేటు నౌకర్ల మధ్య చెప్పులూ-చేంతాళ్ళూ లేచేవి ఇంకోచోట పెదరైతులమీద అదరింపులూ బెదరింపులూ. రాణివాసంలో ఏపనికన్నో లాగులాటలూ-పీకులాటలూ జరిగేవి ఎస్టేటులో ఎక్కడో ఏ ఉపద్రవమో, దెబ్బలాటో వుంటూండేవి. ఒకొక్కప్పుడు నౌకరులను తనే మందలించవలసివచ్చేది. విశేషించి అనేకసార్లు నౌకర్ల మీద చెయిచేసుకోవలసివచ్చింది. అన్నిటికంటె విషమ సమస్య ఏమంటే అతని పాతసిద్ధాంతాలు నీళ్ళుకారిపోతున్నాయి. నోటినుండి ఒక్క అపశబ్దకూడా రానివ్వకుండా ఉండాలని ప్రయత్నించేవాడు. కాని నిత్యము అలా అనకతప్పని పరిస్థితులు వచ్చిపడుతూండేవి. విశేషించి దండనీతిని సైతం ఆశ్రయించవలసివస్తూండేది.

కానీ, అహల్యమాత్రం ఈజీవితంలో చరమసుఖానుభూతి పొందుతోంది. ఎంతోకాలం కష్టాలు అనుభవించిన అనంతరం ఇప్పుడీ సుఖం లభించింది. ఆమె ఈ సుఖంలో మునిగివుంది. ఆమె తనజీవితంలోని వెనుకటిరోజులు త్వరగానే మరచిపోయింది. వాటిని గుర్తుకుతెస్తే ఆమెకు దుఃఖం ముంచుకొచ్చేది. ఆమెనడత పూర్తిగా మారిపోయింది. రాచబిడ్డలా తయారయింది. ఆమెకు ప్రౌఢస్తమానమూ భోగ-విలాసాలు మినహా మరో పనేలేదు.

ఇప్పుడు చక్రధరుడు తన మనోభిప్రాయాలను అహల్య ఎదుట వెల్లడించటమే మానివేశాడు ఈ నడమంత్రపుసిరి అతని సర్వనాశనానికే వచ్చింది. అహల్య ఈసుఖసౌఖ్యాలు, భోగభాగ్యాలూ త్యజించి తనతో రావటానికి అంగీకరిస్తుందా?

ఈప్రతిపాదనను ఆమె ఎగతాళితో ఎగరగొట్టేసుందేమోనని అతనిశంక. లేదా, తన్నే ఆపటానికి బలవంతం చేస్తుందేమో ననికూడా అనుకునేవాడు. ఇలాంటి సమస్యలే చక్రధరుని మన స్సులో రేగుతూండేవి. అత డేవిధంగానూ తన కర్తవ్యమార్గం నిశ్చయించుకోలేకుండా ఉన్నాడు. కాని ఒకటిమాత్రం నిశ్చయం; అదేమంటే ఈ బంధనాల్లోపడి, తన జీవితాన్ని పాడుచేసుకోదలచటం లేదు. ఈ ఐశ్వర్యం నిమిత్తం తన సిద్ధాంతాలను బలిచేయటానికి అంగీకరించ లేదు.

ఒకరోజున చక్రధరుడు కారులో వాహ్యాళికి బయలు దేరాడు. అది ఎండాకాలం. ఒళ్ళంతాకంపరంగా, మనస్సంతా చీకాకుగా ఉంది. చల్లగాలివచ్చి తగిలింది. ప్రాణానికి హాయిగా ఉండేటప్పటికి ప్రక్కగ్రామందాకా వెళ్లి రావాలనిపించింది. అలాగే ముందు కెళ్ళాడు. అప్పటికి చీకటిపడింది. డ్రైవరును కూడా తీసుకురాలేదు. ముందుకుపోయినకొద్దీ రోడ్డుచెడిపోయి వుంది. అలా పోతూండగా అకస్మాత్తుగా ఒక ఆబోతు దారి కడ్డుగానిలబడిఉండటం చూచాడు. గొంతంతా బ్రద్దలయ్యేటట్లు కేకలుపెట్టి అదలించాడు. కాని, ఆబోతు కదల్లేదు, మెదల్లేదు. హార్ను ఆబోతుకదూ మరి! కారు ఆబోతును సమీపించింది. ఐనా, అది అక్కడే నదురూబెదురూ లేకుండా నిలబడివుంది. అతను దారితొలగి పక్కగా వెళ్ళిపోవాలని చూచాడు కాని, అది బుసలుకొడుతూ వచ్చి కారుకు అడ్డంగా నిలబడింది. కొట్టి పారద్రోలాలని చేతికర్ర తీసుకుని కారులోంచి క్రిందికి దిగాడు. కాని అది పారిపోకపోగా అతని వెంటపడింది. అదృష్టవశాత్తు రోడ్డుప్రక్కన, ఒక చెట్టొకటికన్పించింది. కారువదలి, కర్రపారేసి

పరుగున చెట్టుదగ్గరకుపోయి పైకెక్కి కూర్చున్నాడు. ఆబోతు ఒక నిమిషం చెట్టును ఢీకొన్నది కాని చక్రధరుడు అందక పోవటంచూచి, వెనక్కితిరిగి కారువద్దకు పోయింది. కొమ్ములతో టామతూ, గుద్దుతూ వెనక్కి నెట్టుకుంటూ, కారును పరుగెత్తించింది. కొంచెంసేపట్లోనే కారు రోడ్డుదిగిపోయి ఒక చెట్టుకు కొట్టుకుంది. అప్పుడు ఆబోతు శోకవెత్తి, రంకెలు వేయసాగింది. ఒకొక్క ముక్కుముక్కి ఒకొక్కనెట్టు నెట్టుతోంది. వెనక్కినక్కిపోయి పరుగెత్తుకొచ్చి తలతో ఢీకొంటున్నది. కాని కారుమాత్రం ఒక్క అంగుళంకూడా ముందుకు కదల్లేదు. అప్పుడది పక్కకుపోయి,కోపంతో సత్తువ కొద్దీ విసురుగా ఒకటామటాకింది. దాంతో పిల్లిమంతరాలు కొట్టుకుంటూ తలక్రిందులుగా పడిపోయింది కారు. అప్పటికూడా తన్నానియ్యా! ఆబోతు దాన్నంతటితో వదలిపెట్ట లేదు. ఒకసారి దానిచక్రాలను పొడిస్తే, ఇంకోసారి వెనక్కి నెట్టిపారేయటానికి శక్తినంతా ప్రయోగిస్తోంది. కారు టైర్లు నజ్జునజ్జయిపోయి బద్దలుబద్దలుగా పగిలిపోయాయి. నట్లు ఊడిపోయాయి. ఐనా, అది వదలకుండా తనపని సాగిస్తూనే ఉంది.

శత్రువుకీళ్ళన్నీ నదావదలై, ఇంకలేవలేదనుకొని, ఆబోతు రంకెలు వేసుకుంటూ ఎటో వెళ్ళిపోయింది ఇక, అప్పుడు నెమ్మదిగా చెట్టుదిగాడు చక్రధరుడు. కారు దగ్గరకు వెళ్ళి చూస్తే అది తలక్రిందులుగా పడిఉంది. తిన్నగా కెనదీసిచూస్తే గాని, ఎక్కడ ఏం చెడిపోయిందీ, నడిచేస్థితిలో ఉందో లేదో తెలియదు. కారును ఎత్తి తిన్నగా నిలబెట్టాలంటే ఒకమనిషికి

సాధ్యమయ్యేపని కాదు. తూర్పుదిక్కున కొద్దిదూరంలో ఒక పల్లెటూరు కనిపిస్తోంది. అటుకేసి నడిచాడు చక్రధరుడు. అదొక చిన్నపల్లె. ఇంతనుముందే చెరకుతోటలు తడిపి, ఇళ్ళకు చేరుకున్నారు రైతులు. ఒకడు ఎడ్లకు నీళ్లూ మేతా చూచు కుంటూంటే, ఇంకొకడు తిండికి పోతున్నాడు. మరొక రైతు పాలతపేళా చేత బుచ్చుకుని దూడను విడువబోతున్నాడు. ఇంతలో హఠాత్తుగా చక్రధరుడు వచ్చి "ఈ ఊరుపేరేమిటి?" అని అడిగాడు

"భైంసార్" అన్నాడు అందులో ఒకడు.

చక్ర:—ఏ ఎస్టేటులోది?

రైతు:—మహారాజాగారిది తమరెక్కణ్ణుంచి వస్తున్నారు?

చక్ర—మహారాజాగారిదగ్గరనుండే వస్తున్నాం. ఆ బడ్మాష్ ఆబోతు ఎవ్వరిదేమిటి? ఈవేళప్పుడు రోడ్డుమీద వదలిపెట్టటమా?

రైతు:—ఎవరిదో ఏమిటో తెలియదండీ. దానిమూలం గా మేమూ చచ్చిపోతున్నాం.

చక్రధరుడు ఆబోతు చేసినపని చెప్పి, తనవెంట వచ్చి కారును లేవదీసి పోవలసిందని అడిగాడు.

ఆ మాట విని తన వాకిట్లోనుంచే ఒకరైతు-'అయ్యా! ఇప్పుడీ రాత్రివేళ కారును లేవదీయించి చేసేదేముందండీ! బహుశా అది నడిచేస్థితిలో ఉండిఉండదు.'' అన్నాడు.

మొదటిరైతు:—అయ్యా! ఈ పూటకు ఇక్కడే ఉండి పోండి. ప్రొద్దున్నే వెళ్దాం. అంతగా నడిచేస్థితిలో లేకపోతే బండిమీద అయినా వేసుకొచ్చి దింపుతాం.

''ఏమిటోయ్ ఆ కబురు? తెల్లవార్లూ నన్నిక్కడే పడి ఉండమంటారా? అంతా కాదు, ఇప్పటికిప్పుడే మీరంతా రావాలి.'' అన్నాడు చక్రధరుడు కోపంగా.

వారిలో ఎవడికీ ఇతనెవ్వరో తెలియదు. రాజాలదగ్గరకు అమాంబాపతు మనుషులూ వస్తూపోతుంటారు.

అలాంటివారిలో ఎవరో అయివుంటాడులే అనుకున్నారు వాళ్ళంతా. అందులో ఆ గ్రామస్థులంతా క్షత్రియులు. సహాయంపేరుతో క్షత్రియునిచే ఏపనైనా చేయించుకోవచ్చు, గాని వెట్టిచాకిరి పేరు వింటేనే చాలు, వాళ్ళ మొహాలు మారిపోతాయి. కనుబొమ్మలు ముడివేసి, ''అయ్యా! ఇప్పుడుమట్టుకు మేం రావటం సాధ్యపడదు. ఒకవేళ మీకంతగా వెట్టిచాకిరిగాళ్ళు కావాలనుకుంటే అదుగదిగో- అటు ఉత్తరాన వూరు కన్పడుతోంది చూచారూ, అక్కడికి వెళ్ళండి. కావలసినంతమంది ఉన్నారు మాదిగలు.'' అన్నాడు రైతు. ఇలా అని అతను ఇంట్లోకి వెళ్ళిపోతున్నాడు.

ఆ పోయేవాడి చెయ్యిపట్టుకు వెనక్కి ఈడ్చుకురావాలనీ, తన్నుకుంటూ లాక్కురావాలన్నంతకోపం వచ్చింది చక్రధరునికి. కాని, తనకోపాన్ని ఎలాగో ఆపుకుని ''నేను మెత్తమెత్తగా చెబుతుంటే మీరంతా ఏవో వెధవకబుర్లు చెబుతున్నారు. ఏదో వేళాకోళంగాఉంది. కాని ఇప్పుడేగనక ఏజమానో వచ్చి కళ్ళెర్రజేసి రెండు విదలింపులు విదలిస్తే చాలు, ఊరంతా ఒక్కసారిగా కదలి, గొఱ్ఱెలమందలాగా వాడివెంట బయలుదేరుతారు'' అన్నాడు.

ఆ రైతు అక్కడే ఆగిపోయాడు. వెంటనే అందుకుని "ఏం? జవాను ఎందుకు బెదరిస్తాడేం? అంత బెదరించటానికి మేమేం దొంగలమా? మా ఇష్టం. మేం రాము. మీరు చేసేదేమిటో చేసుకోండి." అన్నాడు ధైర్యంగా.

చక్రధరు డిక నిగ్రహించుకోలేకపోయాడు. పన్ను కర్ర చేతిలో ఉండనే ఉంది. అతను డేగలాగా రైతుమీద కురికాడు. ఒక్క తోపు త్రోసి "నడుస్తావా లేక రెండుపుచ్చుకోమంటావా? మీకసలు తన్నులు తగిల్తేగాని మాట వినర్లే." అన్నాడు.

నిత్యం కసరత్తు చేసే మనిషి చక్రధరుడు. ఆ తోపుకు రైతు వెళ్ళి నేలను కరుచుకున్నాడు. ఒకరకంగా అతనూ పుష్టిగల మనిషే. కలబడి తేమట్టుకు అతన్ని పడేయటం చక్రధరుని కంత తేలిక కాదు. కాని అతను చక్రధరుని డాబుసరికి లొంగిపోయాడు. 'ఎవరో గొప్ప ఉద్యోగస్థుడై ఉంటాడు. లేకపోతే ఇంత తొందరగా చెయ్యెత్తి మీదికి రావటానికి దమ్ములుండవ్' అన్న ఆలోచనలో పడ్డాడు. నేలమీదనుంచి నెమ్మదిగా లేచాడు ఆ దెబ్బతిన్న రైతు. వీడు లేస్తే తనమీద చెయ్యి చేసుకుంటాడనుకొని, చక్రధరుడు గభాలునపోయి మళ్ళీ ఒక తోపు త్రోశాడు. ఆకస్మికంగా ఎదురుగావున్న ఇంట్లోంచి ఒక వ్యక్తి లాంతరు పుచ్చుకుని బైటకొచ్చాడు. చక్రధరునిచూచి "ఏం భక్తుడుగారూ! ఏతే ఈవేషం ఎప్పుడ్నుంచేమిటి? నన్ను గుర్తుపట్టారా? నేను మీతో కలిసి జైల్లో ఉన్నాంగదూ" అన్నాడు.

చక్రధరునికి ఆ వ్యక్తిని గుర్తించటానికి ఎంతసేపో పట్ట లేదు అతను తనతో జైల్లోవున్న ధన్నాసింగే. చక్రధరుని కోపతాపాలన్నీ బంతిలోనిగాలిలాగా తుస్సుమని ఎగిరిపోయినై. "మీఇల్లు ఇక్కడేనా ఏమిటి ధన్నా?" అన్నాడు సిగ్గు పడుతూ.

ధన్నా:—ఔనండీ! మీరు కాల్చన్నుతున్న ఇతను నాతమ్ముడే. ఇంట్లో అన్నందగ్గర కూర్చొనిఉన్నాను. లేచివచ్చే టప్పటికే మీరు నూటనాలుగు డిగ్రీలకు ఎక్కిపోయారు. మీస్వభావం ఇంత కౄరంగా మారి ఎన్నాళ్ళయిందేమిటి? జైలరును రక్షించేనిమిత్తం ఆనాడు రొమ్మిచ్చి తుపాకిని ఎదు ర్కోవటమేమిటి? ఈనాడు స్వల్పవిషయానికే ఈ ఉగ్రరూపధా రణ ఏమిటి?

చక్రధరుడు నిలువునా నీరైపోయాడు. తన చేష్టను సమర్థించుకునేమాట ఒక్కటీ అనలేకపోయాడు. గత జీవితంలో ఎన్నెన్నికష్టాలు అనుభవించి గడించాడో ఆ సంచితమంతా ఇక్కడ కోల్పోయాడు.

ధన్నాసింగ్ తనసోదరుని చెయ్యిపట్టుకుని కూర్చో బెట్టబోగానే అతను "బాబో, నాయనో, చచ్చానురో" అని బిగ్గరగా ఆర్తనాదం చేయసాగాడు. ఆ రెండోసారి త్రోపుకు కుడిభుజం గూడుకు బాగా దెబ్బతగిలింది. అతనిచెయ్యి విరిగి పోయి ఉంటుందనుకున్నాడు ధన్నాసింగ్. వెంటనే చక్రధరుని యం దతనికున్న భక్తి కాస్తా అదృశ్యమైపోయింది. చక్రధరుని కేసి కళ్ళెర్రజేసి చూస్తూ "అయ్యగారూ! మీరు వీనిచెయ్యి విరగగొట్టనేగొట్టారు. (పెదవులు కొరుక్కుంటూ) ఏం

చెయ్యను! మా వాకిట్లోకొచ్చావు. పైగా పాతవిషయాలన్నీ జ్ఞప్తికున్నాయి. లేకపోతేనా? నీ చెయ్యి విరగదీయాలన్నంత కోపం వస్తోంది. తత్క్షణమే వెళ్ళి మహారాజాగారితో చెప్పితే నిల్చొన్నపాటున రెక్కలు విరిచికట్టి తీసుకుపోతారు నిన్ను. చక్రధరబాబుగారి పేరు వినేవుంటావు. వారు రాజ్యానికి వచ్చినప్పటినుంచీ వెట్టి చేయించుకు కులకటాని కెంత గొప్పఉద్యోగస్థుడికీ దమ్ముల్లేవు. మరి నీవొక సెక్కా జనూ! నీఉపదేశాలు, నీతిబోధలఫలితంగా నేనాదురలవాట్లుతప్పిపోయాయి. గంజాయి; సారా మొదలైన మత్తుపదార్థాలన్నీ వదిలేశాను. ఇక జూదం ఛాయకూడాపోవటంలేదు. వందలబుగ్రలతో రామకీర్తన పాడి రక్తం చవిజూచిన నా బాణాకర్రఇప్పుడువిరిగి మూలబడి ఏడుస్తోంది! నాకేమో నీతులు బోధించావు. మరి నువ్వేమో నిరుపేదలను కాలరాస్తున్నావా? మన్నాసింగ్ మాత్రం ఏమంత పొరపాటు మాట్లాడాడు ? ఇంతకూ అతను అన్నదల్లా 'ఈ రాత్రికి ఇక్కడే ఉండిపొండి. ప్రొద్దున్నే వెళ్దాం. అంతగా నడిచేస్థితిలో గనుక లేకపోతే బండిమీద చేరుస్తాం' అనేగదా! ఇందులో ఏం తప్పుందీ?'' అన్నాడు.

"ధన్నాసింగ్ ! నేనెంతో సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించు. నీ ఇష్టమొచ్చిన శిక్షవిధించు. ఇదిగో నీ ముందు తలవాల్చి నిల్చున్నాను రవ్వంతైనా తల ఇటూ అటూ కదల్చితే ఒట్టు. నోరెత్తితే అప్పుడడుగు''అన్నాడు చక్రధరుడు గ్లానీ - వేదనా వ్యథితకంఠంతో.

ఇలా అంటూ అతను గద్గదకంఠుడైపోయాడు. అటు ధన్నాసింగుకూడ అలాగే అయిపోయాడు. చక్రధరు నుద్దేశించి

"అయ్యో భక్తుడా! ఇలా అనకండి. అన్నదమ్ముల సంబంధం ఎంతో గంభీరము గాఢమైనదీ! సోదరుడు శత్రువే కావచ్చు. కాని తన సోదరుని పరాయివాడొచ్చి కొడుతూండగా చూచి ఏ అన్న సహించుతాడు? ఆ కోపాన్ని ఆపుకోగలిగిన సమర్థత ఏ సోదరుని కుంటుంది? జైలులో నన్నెటువంటి దాసునిగా భావిస్తూ ఉండేవాడివో ఇప్పుడూ అటువంటి దాసునిగా నే ఎంచుకో. సరే. నీ కా రెక్కడ? పద. నేను లేపుతాను, పద. లేక బండి కట్టుకు రమ్మంటావా, అందుకూ సిద్ధమే" అన్నాడు.

"ఇతని చెయ్యి నయమయ్యేంతవరకూ నే నిక్కణ్ణుంచి కదిలేది లేదు. కాని ధన్నాసింగ్! జగదీశపురం వెళ్ళేవా రెవరన్నా దొరికితే వారిద్వారా నా ఉత్తరమొకటి పంపించే ఏర్పాటుచెయ్యి" అన్నాడు చక్రధరుడు ఏడ్పు మొహంపెట్టి.

ధన్నా:—జగదీశపురంలో నీ కెవరున్నారు? ఎస్టేటులో నౌకరుగా చేరావా ఏం?

చక్ర:—నౌకర్ని కాదు. నేను మున్షీ వజ్రధర్‌గారి అబ్బాయిని.

"అరె! అయ్యగారే చక్రధర్ బాబుగా రన్నమాట! ధన్యులం! ఇన్నాళ దొరగారి దర్శనమవటం మా అదృష్టం" అన్నాడు ధన్నాసింగ్ విస్మితుడై.

ఇలా అంటూనే అంగలార్చుకుంటూ ఇంట్లోకివెళ్ళాడు. చప్పున ఒక మంచం తెచ్చి వాకిట్లో వేశాడు. మళ్ళీ హడావుడిగా పోయి ఊరందరికీ చెప్పివచ్చాడు. కన్నుమూసి తెరచేలోపల ఊరంతా పెళ్ళగిలివచ్చి, చక్రధరుని దర్శనం చేసుకో

సాగారు. ఎటుజూచినా కోలాహలంగా ఉంది. అందరూ అతని కీర్తిని వేనోళ్ళ పొగడేవారే. ''దొరగారు వచ్చిననాటినుంచి మా స్థితిగతులన్నీ మారిపోయాయి. మంచిరోజు లొచ్చాయి మీ సుస్వభావాన్ని గురించి ఏం విన్నామో ఇప్పుడు మా కళ్ళఎదుట చూస్తున్నాం; మీరు సాక్షాత్తు పరమాత్ములు.''

''నే నసలు గుర్తుపట్టనేలేదు. కోపంతో ఒళ్ళు తెలియకుండా యేమేమి వాగానో నాకే తెలియదు'' అన్నాడు ధన్నాసింగ్.

"ఫలానా అని దొరగారు మాటమాత్రం చెప్పిఉంటే వారిని భుజాలమీద తీసికెళ్ళి, దించి రాకపోయామా!" అన్నాడొక క్షత్రియుడు.

చక్రధరునకు ఈ ప్రశంస లేమాత్రం ఆనందదాయకంగా లేవు. వాళ్ళను చూస్తుంటే ఎంతో జాలి కలుగుతున్నది. తన క్రోధాగ్నికి గురి అయిన వ్యక్తే అతని శౌర్య-ప్రతాపాలను గురించి పొగడుతున్నాడు.

అవమానాన్ని దిగమ్రింగి సంతృప్తిపడి కూర్చోవటం అనేది పతనానికి తుదిహద్దు. ఈ ప్రశంసలు వినే, మనం ముగ్ధులమైపోతూంటాం. అసహ్యించుకోవలసినదాన్ని చూచుకొని ఉబ్బి తబ్బిబ్బైపోతూంటాం. తన కింత కోపం ఎలా వచ్చిందాయని ఆలోచిస్తుంటే చక్రధరుని కిప్పుడు పరమాశ్చర్యంగా ఉంది. సంస్థాన వాసన ఎంత నిగూఢంగా ఎంత అలక్షితరూపంతో తనలో పాదుకొన్నదో ఇవ్వాళ మొదటిసారిగా అనుభవమయింది. అందువల్ల తన మానవత్వమూ,

వ్యక్తిత్వమూ, సిద్ధాంతాలూ సర్వనాశనమైపోతున్నాయో తెలిసివచ్చింది.

చక్రధరునికి తెల్లవార్లూ కన్ను మూతపడనేలేదు. అంత క్రోధావేశానికి ఎందుకు గురయ్యానా అని పదేపదే పశ్చాత్తాపం కల్గుతోంది. ఒక నిర్బలప్రాణిపై చెయ్యిచేసుకోవటం అతని జీవితంలో ఇదే మొదటిసారి. జీవితమంతా దీనజనసేవలో గడపినవానిలో ఈ విపరీతమార్పు – ఈ తలక్రిందుల పరిణామం నైతికపతనం గాకపోతే మరేమిటి ?

చక్రధరుడేమో ఈవిధమైన ఆలోచనల్తో సతమతమవుతూంటే, అహల్య తనఅందాలపడకగదిలో ముఖమల్ పాన్పుపై పడుకుని ఒళ్ళు విరుచుకొంటోంది. చక్రధరుడు గదిలో ప్రవేశించగానే చూచి నొసలువిరిచి ''రాత్రిళ్లు అసలు దర్శనమే కావటం లేదే!'' అంది అహల్య.

చక్ర:- నీ కసలు మతి ఉందాఅని. సరిగా అరగంట లేపాను. కాని నువ్వు కన్నువిప్పిచూడకపోతే, వచ్చినదారినే తిరిగిపోయాను. ఇక్కడి కొచ్చినతర్వాత నిద్రాప్రవీణవైనట్లున్నావే.

అహ:- యేమిటీ! నిజంగా నే నెక్కువగా నిద్రపోతున్నానా!

చక్ర:- భలే! ఇందులో సందేహంకూడానా ? అదిగో అటు గడియారం చూడు; ఎనిమిదయింది. తెల్లవారుజామున పదింటికే లేచి పనులన్నీ చేసుకోనారంభించేదానివే.

అహ:- అప్పటి సంగతులు పోనిద్దూ. ఇప్పుడంత పెందలాడే లేవాల్సిన అవసరం మాత్రం యేముంది?

చక్ర:- ఐతే యావజ్జీవితం ఇక్కడే చుట్టాగా ఉండి పోతావా యేం? "అంటే?" అంది అహల్య విస్మితురాలై.

చక్ర:- మరేంలేదు - ఇక్కడికొచ్చి చాలారోజు లయింది. ఇక మన కొంపకు మనం వెళ్ళిపోదామని.

అహ:- మన ఇల్లా! ఎక్కడా?

చక్ర:- కష్టపడి ఎక్కడ ఆర్జిస్తే అక్కడే. అత్తవారింటి పప్పు - భోజనాలు చాలా తిన్నాం. తినటానికది రుచిగానే ఉంటుంది. కాని వివేకం మాత్రం భ్రష్టమైపోతుంది. చూడు, ఈ కొద్ది రోజుల్లోనే మన మిద్దరమూ ఎలా మారిపోయామో చూడు! పూర్తిగా తలక్రిందులయ్యాం. ఇక్కడే గనుక మరి కొన్నాళ్ళుంటే కనీసం నేనైనా ఎందుకూ పనికిరాకుండా పోతాను. నిన్న ఒక పేదరైతును పట్టుకుని అన్యాయంగా చావ చితకగొట్టారు. నా నోట రావటానికి నిరాకరించటమే అతను చేసిన మహాపరాధం.

అహ:- అదొక లెక్కచేయవలసిన విషయం కాదు లెండి ఈ పల్లెటూరువాళ్ళ మూర్ఖత్వం చూచి కోపతాపాలు కల్గటం సహజమే నా సంగతే చూడండి, ఇక్కడ ఇంట్లో దాసీలమీద ఎప్పుడూ కస్సు - బుస్సుమంటూనే ఉంటాను. ఐనా ఇల్లువదిలి పారిపోవాలన్న భావం నా కెన్నడూ కలుగ లేదు.

చక్ర:- నీ ఇల్లు కనుక, నువ్వు ఉండొచ్చు. కాని, నేను మాత్రం వెళ్ళిపోవటానికే నిశ్చయించుకున్నాను.

"మీరు వెళ్ళిపోతే నేను మాత్రం ఇక్కడే ఉండి చాపుకునే దేముంది? నా రాజ్యం, వైభవం మీరే. అలాంటి

మీరే ఉండనపుడు, నే నొక్కత్తెనే ఉండి చేసే దేముంది? మీ రెప్పుడు బయలుదేరాలని ఉంటే అప్పుడే బయల్దేరండి. కాని, ఒకసంగతి. నాన్నగారితో ఒకసారి సంప్రదించండి. వారితో చెప్పకుండా వెళ్ళిపోవటం ఉచితంకాదు. సరే ఒకటి మాత్రం నిశ్చయం. మనం ఇల్లువదలి వెళ్ళిపోవటంతోనే, ఇక్కడి వ్యవహారమంతా ధ్వంసమైపోతుంది. సంస్థానం అప్పుల పాలయిపోతుంది. ఒకనాటికి ఈ చిక్కులన్నీ మనబిడ్డే ఎదుర్కోవలసివస్తుంది.

తను వత్తిడిచేస్తే ఈబిడ బయలుదేరేటట్లే ఉన్నదని గ్రహించాడు చక్రధరుడు. ఐశ్వర్యమూ పతిప్రేమా - ఈ రెండింటిలో ఒకదాన్ని గ్రహించి, రెండో దాన్ని త్యజించవలసి వచ్చినప్పుడు అహల్య ఎటు మొగ్గుతుందన్న విషయంలో చక్రధరుడికి రవ్వంతైనా సందేహం లేదు. కాని, ఆమె కా కఠోర ధర్మసంకటస్థితిని కలిగించటం భావ్యం కాదనుకున్నాడు. పట్టుబడితే గత్యంతరం లేక బయలుదేరుతుందే అనుకో. ఐతే, అందువల్ల ప్రయోజనం? ఎప్పు డేకష్టంవచ్చినా మనసులో విసుక్కుంటుంది; కుములుతుంది. ప్రతిమాటకూ కోపగించుకుంటుంది. పిల్లవాణ్ణి ఇక్కడ వదలిపెట్టక తప్పదుగద! మనోరమ వాణ్ణి వదలి ఒక్కక్షణమైనా ఉండలేదు. వాడు కళ్ళముందు లేకపోతే రాజాగారసలు ప్రాణత్యాగమే చేయవచ్చు. కొడుకును వదలి ఇల్లు విడచి బయలుదేరటానికి అహల్య అయినా సిద్ధపడదు. కాక ఒక వేళ సిద్ధపడి బయలుదేరి వచ్చినా, మళ్ళీ త్వరలోనే తిరుగుముఖంపట్టుతుంది.

చక్రధరుడు చాలసేపు ఈ ఆలోచనా సాగరంలోనే మునగానాం తేలానాంగా కూర్చొని ఉన్నాడు. తుదకు ఎవరికీ తెలియకుండానే వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నాడు. ఇంతకు మినహా బ్రతికిబైటపడే ఉపాయం మరొక టేదీ తట్టటం లేదు అతనికి.

చక్రధరుడు తనగదిలోకి వెళ్ళాడు. రెండుమూడుబట్టలూ కొన్ని పుస్తకాలూసర్ది, మూటకట్టాడు. పెద్దబరువైన సామానేమీలేదు. ఒకమనిషి తేలిగ్గా చేత్తో పుచ్చుకుపోగలడు. ఆ రాత్రి సడీ చప్పుడూ గాకుండా బొక్సా తీసుకుని వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.

ప్రయాణసన్నాహంపూర్తి చేసుకొనితనమనస్సునుచక్కగా సమాధానపర్చుకున్నాడు. అప్పుడుపడకగదిలోకివెళ్ళినిద్రనటించసాగాడు. అహల్య నిద్రపోయిన తర్వాత నిశ్శబ్దంగా తన మూట తీసుకుని అయిపులేకుండా వెళ్ళిపోవాలని చూస్తున్నాడు. నిద్రాదేవి ఇవాళ అహల్యకళ్ళకు యోజనాల దవ్వున ఉంది. యేదో ఒక ప్రసంగం తెచ్చి మాటల్లో దింపుతూండేది. చివరకు నడిరేయికూడా దాటి పోతోంది. అప్పుడు చక్రధరుడు "అబ్బ! ఇక కాస్సేపు పడుకోనిద్దూ. ఇవ్వాళ నీ నిద్రంతా ఎక్కడ మాయమైందేమిటి!" అన్నాడు అహల్యతో.

దుప్పటితీసి నిండా ముసుగుపెట్టాడు చక్రధరురు. అటు తిరిగి పడుకున్నాడు. వేసవిరోజులు. గదిలో 'పంఖా' తిరుగుతున్నది. ఐనా ఉడకపోతగానే ఉంది. రోజూ తలుపులన్నీ బార్లగా తెరచిఉండేవి. కాని చక్రధరునికి నిద్రపట్టిందని తనకు నమ్మకం కల్గగానే అహల్య తలుపులు బిగించివచ్చింది. నిద్ర

దీపాలు ఆర్పి పడుకున్నది. ఇవాళ ఇంతగా ఆమె జాగ్రత్త పడ టానికి కారణమేమిటో! పిచ్చిదానా! వెళ్లేవాళ్ళను ఎవరాప గలిగారమ్మా?

ప్రొద్దుపోవటంతో రాత్రి చల్లబడింది. అహల్యకు వెం టనే నిద్రపట్టింది. ఈవిధంగా అహల్య జాగ్రత్తపడటంచూచి చక్రధరుని ప్రేమపీడితహృదయం ఒకసారి చలించింది. తన అశ్రువేగాన్ని ఆపుకోలేక పోయాడు. ఉదయాన తను కనపడక పోయినప్పుడు ఆమె స్థితి ఎలాఉంటుందోనని ఆలోచించినపుడు అతని హృదయం బ్రద్దలై పోతోంది.

సర్వత్రా నిశ్శబ్దత వ్యాపించిఉంది. సమస్త రాజభవనం ప్రశాంతంగాఉంది చక్రధరుడు లేచాడు. తలుపుకోసం తడుముకో సాగాడు కాని దిక్కులే మరచిపోయిన కారణంగా గుమ్మం యే దిక్కుగా ఉందో తెలియలేదు. కడకు గోడలను తడుము కుంటూతడుముకుంటూపోయి ఎలాగైతేనేం విద్యుద్దీపం వెలిగిం చాడు. చప్పుడు కాకుండా బైటిగదిలోకి చేరాడు. మూటా ముల్లె చేతబట్టి బైటికి వెళ్ళిపోయాడు.

బయటికొచ్చి రాజభవనంకేసి తలెత్తిచూచాడు చక్ర ధరుడు. అసంఖ్యాకంగావున్న కిటికీలగుండా విద్యుద్దీపాల దివ్య కాంతి కన్పిస్తూంది. ఆ దివ్యభవనం అతని కిప్పుడు తన్ను సర్వ నాశనంచేసిన సహస్రనేత్ర పిశాచంలా కన్పడింది. అడుగు ముందుకువేస్తూ వెళ్ళిపోతున్నాడు చక్రధరుడు. సూర్యో దయం కాకపూర్వమే ఎవ్వరికీ కన్పడనంత దూరం వెళ్ళిపోవా లని తాపత్రయంగాఉంది. తెల్లవారటాని కింక ఎంతో ఆలశ్యం

లేదు. నక్షత్రకాంతి అప్పుడే వెలవెలపోసాగింది. మరింత వడిగా నడవ నారంభించాడు చక్రధరుడు.

హాఠాత్తుగా రోడ్డు ప్రక్కన నూతివద్ద ఎవరో కొందరు మనుష్యులు కూర్చుని ఉండటం చూచాడు. వాళ్ళమధ్య ఒక శవం పడిఉంది. కొంతమంది దుంగలూ, కట్టెలూ తీసుకుని వెనక వస్తున్నారు. ఎవరు చచ్చిపోయారేమిటని చక్రధరుడు అడగాలనుకున్నాడు. కాని ధన్నాసింగ్ గొంతు వినిపించటంతో ఎక్కడివాడక్కడే స్తంభించిపోయాడు అతను తన్ను గుర్తుపట్టాడో కొంపమునిగిందన్నమాటే.

"చావుమూడితే, ఎవరేం చేయగలరు? బాబుగారి చేతిలో పాపం కర్రతుంపన్నా లేదు. ఏదో రెండు మూడు గుద్దులువేసి ఉంటాడేమో. కాని ఆరోజే మొదలనుకోండి, మళ్ళీ మంచం మీదనుండి లేచి ఎరుగడు." అన్నాడుసింగ్.

"అదంతా దెబ్బ తగిలేచోటూ తగలరానిచోటు మీద ఉంటుంది. మన్నాకు తగలరానిచోటనే తగిలింది" అన్నాడు ఇంకోవ్యక్తి.

ధన్నా:—ఇదివింటే బాబుగారెంతో దుఃఖిస్తారు. జైల్లో మేమంతా ఆయనగారిని భక్తుడు అని పిలిచేవాళ్ళం.

"ఒరే ధన్నా! జైలుసంగతి చెప్పకురా. అక్కడ వేరనుకో. అక్కడ దయామూర్తిలా ఉంటే ఉన్నాడేమో! కాని రాజ్యం వచ్చిపడిన తర్వాత దయామూర్తిలా ఉంటే అప్పుడనుకోవాలి" అన్నాడు ఒక వృద్ధుడు.

ధన్నా:—అలా అనకు తాతా! ఆయన రాజ్యం వచ్చినా ఎగిరిపడేమనిషి కాదు. మీరూ చూశారుగా, ఇక్కడి నుంచి వెళ్ళగానే శిస్తులన్నీ రద్దుచేయించాడు.

వృద్ధు:—ఓరి పిచ్చివాడా! ఎన్ని శిస్తుగద్దులైనా ప్రాణానికి బదులవుతాయిట్రా? బాబుగారు మహాదయామయుడని నువ్వెంతో గొప్ప చెపుతున్నావుగాని నేనుమాత్రం అతగాణ్ణి గురించి వందహంతకు లోకఎత్తూ ఆయనొక్కడే ఒకఎత్తూ అని చెబుతాను. రాజులు కాబట్టి బ్రతికిపోతున్నారు. ఇంకొకడైతేనా, ఈపాటికల్లా ఉరికంబానికెక్కి ఊగుతుండేవాడు.

ఇక ఒక్క నిమిషంకూడా అక్కడ నిల్చోలేకపోయాడు చక్రధరుడు. ఎగుటికెళ్ళేందు కసలే ధైర్యం చాల్లేదు.

ఏడేండ్లు గడచిపోయాయి. కాని చక్రధరుని జాడలేదు. మళ్ళీ ఆ వేసవి రోజులే. పగలు పడమటివడగాడ్పు. రాత్రిళ్ళు నిప్పులవర్షం. ఐనా అహల్యకిప్పుడు పంఖా అవసరంలేదు. వట్టివేళ్ళ తడికల అవసరం అంతకంటే లేదు. ఆ వియోగినిఇప్పుడు అహర్నిశలు ఒకటేపడ్డాటం. భర్తనెంట ఎందుకు పోకపోతినా అని తన్ను తాను దూషించుకుంటుంది.

"అమ్మా! నాన్నగారెప్పుడు వస్తారే! ఎందుకెళ్ళిపోయారే? ఆయన మనిషికాదటగా, దేవతఅటగా? అలా అని రాణీ అమ్మ చెబుతూంది, ఏమే అమ్మా! నిజమేనా ఆమాట? అలాగైతే జనమంతా ఆయనగారిని పూజిస్తూఉంటారనుకుంటా" అని అడుగుతుంటాడు శంఖధరుడు. కాని ఈ ప్రశ్నలన్నిటికీ అహల్యనున్న సమాధానం ఒక్కటే. అదే ఏడుపు. శంకధరుడు అప్పుడప్పుడు ఒంటరిగాకూర్చుని ఏడుస్తూంటాడు

ఒకప్పుడు ఒక్కడే కూర్చుని నాన్నగారొచ్చే ఉపాయమేమిటా అని ఆలోచిస్తుంటాడు.

తన తండ్రికీర్తి ఎంత విన్నా తనివితీరేది కాదు శంఖధరునికి. రోజూ నాయనమ్మదగ్గర కెళ్ళి కూర్చునేవాడు. గంటల పర్యంతం ఆవిడ ఒడిలో కూర్చుని ఆవిడ చెప్పే మాటలు ఎంతో శ్రద్ధగా ఆలకించేవాడు. నిర్మల వాడికోసం చీకటిపడేవరకూ ఎదురుచూస్తూ కూర్చునిఉండేది. ఆ బుడుతడు కంటకగపడగానే జన్మతరించిపోయినట్లయిపోయేది. శంకధరుడే ఇప్పుడామె జీవితాధారం. అహల్యమొహం కూడా చూడ్డానికి ఇష్టపడేదికాదు.

మున్షీజీ కిప్పుడు సంస్థానంనుంచి నెలకు వెయ్యి రూపాయలు పింఛను వస్తోంది. రాజాగారు ఆయన్ను సంస్థానోద్యోగ బాధ్యతలనుంచి విముక్తికలుగజేశారు. కాబట్టి ఇప్పుడాయన ఎక్కువకాలం ఇంటిదగ్గరే ఉంటున్నాడు. సిరితోపాటు మద్యపానవృద్ధిమాత్రం జరగలేదు. పైగా తగ్గిపోయింది. అయితే సంగీత ప్రేమ పెరిగింది. శంఖధరుని చంకనెత్తుకుని పేటలోని పిల్లలందరికీ మిఠాయిలూ, పంచదార బిళ్ళలూ, డబ్బులు పంచిపెట్టిన సమయం అతని ఆనందానికి సర్వోత్కృష్ట సమయంగా ఉండేది. అంతకుమించిన ఉల్లాసాన్ని గురించి ఆయన ఊహించ నన్నా ఊహించలేదు.

ఒక రోజున తొమ్మిదింటికే వచ్చి కూర్చున్నాడు శంఖధరుడు. అప్పుడు స్నానంచేసి, తులసిపూజచేసి, అర్ఘ్యమిస్తోంది నిర్మల. ఆ పని ముగించుకుని వచ్చి కూర్చోగానే శంఖధరుడు "అవ్వా! పూజలెందుకు చేస్తున్నావే?" అని ప్రశ్నించాడు.

నిర్మలశంఖధరుని ముద్దుగా ఒడిలోకితీసుకుని 'నాయనా! నా మనోరథ నెరవేర్చమని దేవుని వేడుకుంటున్నాను బాబూ!'' అంది.

శంఖ:—ఐతే దేవుడికి ఎవరిమనసులో ఏముందో అంతా తెలుసా ?

నిర్మ:—ఔను బాబూ! భగవంతుడికి అన్నీ తెలుసు.

ఆమర్నాడు ప్రొద్దున్న స్నానంచేశాడు శంఖధరుడు. స్నానానంతరం అల్పాహారానికి రానేలేదు. అహల్య అక్కడా ఇక్కడా వెదకసాగింది. మనోరమవద్దకెళ్ళి చూచింది. అక్కడా లేడు. గదిలోచూచింది. అక్కడ అంతకంటేలేడు. డాబామీదికి పోతే అక్కడా కన్పడలేదు. రమణీమణులిద్దరికీ కంగారుపుట్టింది. స్నానంచేసి ఎక్కడికి పోయాడో? దాసీలనందరినీ అడిగారు. వాళ్లూ 'స్నానంచేసి రావటం మాత్రమే చూశాం, మరి ఆ తర్వాత ఎక్కడికివెళ్ళిందీ చూడలే'దని సమాధానం చెప్పారు. నలుమూలలా వెదకసాగారు. ఇద్దరూ తోటలోకి పరుగెత్తారు. అక్కడా లేడు. హఠాత్తుగా తోటచివర పగలుకూడా మానవ సంచారంలేక, బావురుమంటూ, ప్రశాంతంగా ఉండేచోట ఎక్కడో ఒక ప్రక్కన కన్పించాడు. ఆ ఇద్దరూ ఒక చెట్టు చాటునచేరి ఏం చేస్తున్నాడో నని చూడసాగారు. శంఖధరుడు తులసికోటముందు ఆసనం వేసుకుని కూర్చున్నాడు. కళ్ళుమూసు కొని ధ్యానంచేస్తున్నాడు. ముందు కొన్ని పువ్వులుఉన్నాయి. ఒక నిమిషంతర్వాత కళ్లు తెరిచాడు. అటుగుచుట్టూ ప్రదక్షిణం చేశాడు. తులసీదేవికి నమస్కరించి నెమ్మదిగా లేచాడు. ఇం తలో అమ్మలిద్దరూ వచ్చిఎదురుగా నిలబడ్డారు. వాళ్ళనుచూచి

కాస్త బిడియపడ్డాడు శంఖధరుడు. పల్లెత్తి ఒక్కమాటకూడా మాట్లాడకుండానే ముందుకుసాగాడు.

మనో:—ఇక్కడేం చేస్తున్నావు బాబూ?

శంఖు:—ఏంలేదు ఊరికే తిరుగుతున్నాను.

మనో:—కాదులే, ఏదో చేస్తున్నావులే.

శంఖు:—ఊఁ, పోవే, అదంతా నీకెందుకు?

అహ:—నీకు చెప్పడులేవమ్మా. నేను అమ్మనుకదూ, తప్పకుండా నాకు చెప్తాడమ్మా నా చిట్టితండ్రి, నా మాటేదీ కాదనడు సరేగాని, బాబూ! ఏంచేస్తున్నావో చెప్పమ్మా? నెమ్మదిగా చెవిలో చెప్పులే ఎవ్వరితోనూ చెప్పనుగా.

కంటనిండా నీళ్లు తెచ్చుకుని "ఏమీలేదే. నాన్నగారు త్వరగా తిరిగి రావాలని ప్రార్థనచేస్తున్నానమ్మా! పూజచేస్తే అందరికోరికలూ నెరవేరుస్తాడుగా భగవంతుడు.

అమాయిక బాలుని ఈ పితృభక్తి, శ్రద్ధా చూచి ఆ మహిళలిద్దరూ విలపించసాగారు- పాపం! వీనికిఎంతవిచారంగా ఉంటోందో! శంఖధరుడు మళ్ళీ అడిగాడు "ఏమే అమ్మా! నువ్వు నాన్నగారికి ఉత్తరం రాయవేమే?"

"ఏం వ్రాయను బాబూ? ఆయనగా రెక్కడున్నారో తెలియదుగా!" అన్నది అహల్య.

## ఇరవయ్యో అధ్యాయము

ఇటీవలకొన్నాళ్ళనుంచి లౌంగీ తీర్థయాత్రచేస్తూపుణ్య క్షేత్రాలు సేవిస్తోంది. ఆమె కిలాంటి ఉత్సాహం కల్గటానికి గురుసేవకసింగే ముఖ్యకారణం. ఆమె ఇల్లు వదలివెళ్ళినది లగా

యుతు దివానుగారికి మనఃస్థిమితం లేకపోయింది. "నాన్న గారిని కనిపెట్టుకుని ఉండేందుకు అది (లాంగీ) ఇంట్లో ఉండ టం అవసరమే" అన్నవిషయం గురుసేవకసింగుకూడ అప్పు డప్పుడు ఒప్పుకోక తప్పేదికాదు. ఇంట్లో ఇప్పుడు ఏ నౌకరు వచ్చినా ఒక వారంరోజులకంటే ఎక్కువ నిల్చేవాడు కాదు. అందులో ఎందరో మొదటి చీవాట్లతోనే ఒకదణ్ణ పెట్టి పారి పోయేవాళ్లు. దివాన్జీమద్యపానపరిమాణం ఆరోజూకారోజు పెరిగి పోతూంది. అదిచూచి ఏ భయంకరవ్యాధి వచ్చిపడుతుందోనని భయమేస్తూ ఉండేది. ఇప్పుడు తిండి చాలవరకు తగ్గిపోయింది.

లాంగీ ఉండగా రోజుకు రెండు, రెండున్నరసేర్ల పాలు తాగించేది. ఏదో ఒకరూపేణా అరగిద్దుకు తక్కువకాకుండా నేయికూడా ఎక్కించేది. భుజింపజేసే విషయంలో ఆమె మహా నేర్పరి. 40 ఏండ్లుదాటిన పతికి భార్య చూపవలసిన శ్రద్ధలలో అతి ముఖ్యమైనది ఆహారవిషయం. ఈ సిద్ధాంతం ఎప్పుడూ లాంగీ కళ్ళముందు మెదుల్తూండేది. దివానుగారికిప్పుడు లాంగీ దర్శనాపేక్ష లేదు. ఇదే తన జాబుల్లో వ్రాస్తున్నాడు. ప్రతి ఉత్తరంలోను తన ఆరోగ్యాన్నిగురించి వ్రాస్తున్నాడుకూడాను. ఆయన జీర్ణశక్తి ఇప్పుడు బాగుపడింది. రక్తవృద్ధికారణంగా సంభవించే జబ్బులనుగూర్చిన భయమేమీ లే దిప్పుడు.

దివానుగారి జీర్ణశక్తి ఇప్పుడు బాగుపడితే బాగుపడి ఉండొచ్చు. కాని ఆలోచనాశక్తిమాత్రం అవశ్యం క్షీణించి పోయింది. ఏది నిశ్చయించుకోవటానికీ సామర్థ్యంలేకుండా పోయింది. రాజాగారు అతన్నెంతో గౌరవంగా చూస్తుండే వాడు. కాని ఆయనకూడా పదేపదే మందలించవలసి వచ్చే

టటువంటి గొప్పపొరపాట్లు చేస్తూండేవాడు. బంట్రోతునౌకరీ నుండి దివాను పదవిదాకా తెచ్చిన ఆ కార్యదక్షతా, దీక్షా ఆలోచనాశక్తీ ఇప్పు డతన్ని విడచిపెట్టేశాయి. ఇలా ఐపోయాడేమిటి? అని అందరూ ఆశ్చర్యపడుతూండేవారు. నాన్నగారి వెనక ఇంకేదో శక్తిఉండి సంస్థానాన్ని నడుపుతుండేదని గురుసేవకునికి సైతం బోధపడసాగింది.

"లౌంగీ ఇంకెన్నాళ్ళకు తిరిగివస్తుంది?" అన్నాడు గురుసేవకసింగ్ తండ్రితో ఒకరోజున.

"అదంతా దానికే తెలియాలి. అదీగాక, మళ్ళీ ఇక్కడికి రావలసిన అగత్యంమాత్ర మేముంది? మంచిదే. తన కర్మలకు ప్రాయశ్చిత్తం చేసుకోనీ. ఇక్కడికొచ్చి మాత్రం చేసేదేముందిలే." అన్నాడు దివ స్జీ విరాగిలాగా.

ఆనాడే అన్నా, చెల్లెలి మధ్య ఈ విషయంలో చర్చ జరిగింది. "అన్నా! లౌంగీ అమ్మను మరచిపోయావా ఏమిటి? నాన్నగారి పరిస్థితి గమనించటంలేదూ? ఎండి వరుగైపోయారు. అమ్మ చనిపోయిన తర్వాత నాన్న తన్నామె చేతులకే అప్పగించారు. లౌంగీయే గనక ఆదుకోకుండా ఉన్నట్లయితే, అమ్మ వియోగదుఃఖంలో నాన్నగారు ప్రాణమే త్యజించి ఉండేవారు. నే నింతవరకు ఏ వివాహిత స్త్రీలోనూ ఇంత పతిభక్తి చూడలేదు. నాన్నగారి ప్రాణాలు దక్కించుకోవాలనుకుంటే, వెళ్ళి లౌంగీ అమ్మను వెంటబెట్టుకు తీసుకురా" అంది మనోరమ.

గురు:- నేను వెళ్ళటం మాత్రం కష్టం, నోరా!

మనో:- ఎందుకని? ఇందులో అవమాన మేముంది?

గురు:- చివరకు ఈయనకే అవసరమొచ్చిందా అనుకుంటుంది. వచ్చి, మరీ నెత్తికెక్కి కూర్చుంటుంది! దాని గర్వం చుక్కల కంటుతుంది.

మనో:- సరే, నువు వెళ్ళకపోతే మానే. కాని, నేను వెళ్ళితే నీకేమీ అభ్యంతరముండదు గదూ?

గురు:- నువ్వు వెళ్తావా!

మనో:- ఏం! నేను ఎవరేం? లాంగీఅమ్మ కాదా తన చంకనెత్తుకుని నన్ను పెంచింది? నేను జబ్బుపడితే, తెల్లవార్లూ నా మంచందగ్గరే కూర్చొని ఉండేదే! ఇవన్నీ జీవితంలో మరచిపోగలనా? తల్లి రుణం తీర్చుకోవటం సంభవమైతేకావచ్చు కాని, లాంగీ అమ్మ రుణం మాత్రం తీర్చుకోవటం సంభవం కాదు- ఇలాంటి పది జన్మలెత్తినా సరే.

గురుసేవకుడు సిగ్గుపడి ఇంటికివచ్చి చూస్తే తండ్రి శాలువ ముసుగుపెట్టి పడుకుని ఉన్నాడు. "ఒంట్లో ఎలా ఉందేమిటి?" అని అడిగాడు.

దివానుగారి ఎర్రగుడ్లు పైకి తేలిఉన్నాయి. 'ఏంలేదు, ఏదో కాస్త చలిగా ఉన్నట్టుంటేనూ, శాలువా కప్పుకున్నానులే" అన్నాడు. తండ్రి.

గురు:- మీ కిష్టమైతే నేవెళ్ళి లాంగీని పిలుచుకురానా"

హరి:- నువ్వా! వద్దువద్దు దాన్ని పిలుచుకురావటానికి నువ్వేం వెళ్తావులెద్దూ. అంత అవసర మేముందిలే! ఇష్టమైతే వస్తుంది. లేకపోతేలేదు. హుం, నువ్వు దాన్ని పిలుచుకురావటానికి వెళ్తావా! అదేం జమీందారిణా ఏం?

మర్నాడు దివానుగారికి జ్వరంవచ్చింది.థర్మామీటరు పెట్టి చూచాడు గురుసేవకుడు 104 డిగ్రీల జ్వరంఉంది. కంగారు పడి వెంటనే డాక్టరుకోసం కబురంపాడు. ఈ సంగతి తెలియగానే మనోరమ ఆదరా బాదరా పరుగెత్తుకొచ్చింది. వచ్చీరావటంతోనే "లాంగీ అమ్మను పిలుచుకు రమ్మనమని నీకు నిన్ననే చెప్పాను. కాని నువ్వు కదలనేలేదు. ఈపాటికి హారిద్వారంపోయి, తిరిగివస్తూ ఉండేవాడివి. ఇప్పుడైనా మించి పోలేదు. నేను వీరిని కనిపెట్టుకుని ఉంటాను. నువ్వు ఈ పూట బండికే బయలుదేరి వెళ్ళి, ఆవిణ్ణి వెంటబెట్టుకురా. నాన్నగారు జబ్బుగా ఉన్నారని తెలిస్తే, ఆవిడ ఒక్క క్షణంకూడా ఆగదు. కేవలం నిన్నుచూచే భయపడి రావటంలేదు." అంది మనోరమ.

దివానుగారు మనోరమను చూచి "ఇలారా నోరా! నా కివ్వాళ జ్వరంగా ఉంది. నువ్వేమో లాంగీకోసం వెళ్తున్నావని గురుసేవకుడు చెప్పాడు. బిడ్డా! ఇది నీకు పరువుతక్కువమ్మా! అయ్యయ్యో! లోకం ఏమంటుంది! ఎంత చెడ్డ పేరు వస్తుంది?" అన్నాడు.

మనో:- ఇక లోకాన్ని ఏమైనా అనుకోనియ్యండి, నేను అన్నయ్యను పంపించేశాను.

హారి:- నిజం! ఏంపని చేశావమ్మా? లాంగీవస్తుందా!

మనో:- ఎందుకురాదూ? అంతగా రాకపోతే; స్వయంగా నేనే వెళ్ళి బ్రతిమాలి ఒప్పించి మరీతీసుకొస్తాను.

హారి:- నువు దాన్ని బ్రతిమాలటానికి - వెళ్తావా!

రాణీ మనోరమ గొల్లముండ లాంగీని కాళ్ళా గడ్డం పట్టుకోటానికి వెళ్తుంచా !

మనో:- మనోరమ గొల్ల లాంగీరొమ్ముపాలుత్రాగి పెరిగి పెద్దదై ఉండకపోతే, ఇవాళ రాణీ మనోరమ ఎలా అయ్యేది ?

హరిసేవకుని వాడిపోయిన ముఖకమలం వికసించింది. ఆరిపోయిన నయనజ్యోతి మళ్ళీ ధగధగలాడింది. "నోరా ! నువు నిజంగా దయాదేవివి. ఇదిగో, ఇలా చూడు ! లాంగీవస్తే మరి. నేను లేకుండాపోయినా- దాని మంచిచెడ్డలుచూస్తావు గదూ? అది నా కెంత సేవ చేసిందో చెప్పలేను. దాని ఉపకారానికి ప్రత్యుపకారం చేయటం నా జన్మలో అసంభవం. గురుసేవకుడు దాన్ని ఏడ్పించుకుతింటాడు; ఇంట్లోంచి వెళ్ళ గొట్టవచ్చు కూడాను. ఐనా నువ్వు ఆ దీనురాలిని కనిపెట్టి చూస్తూఉండు. నేను తలచుకుంటే నా ఆస్తియావత్తూ దాని పేరవ్రాసి పోగలను కాని, లాంగీ అందులోని పూచికపుల్ల కూడా ముట్టుకోటానికి అంగీకరించదు సరిగదా పైపెచ్చు అవసరమైతే, తన ఒంటిమీది నగలూ - నాణ్యాలూతీసి, ఈ సంసారంకోసం వెచ్చిస్తుంది. దాని కింకేమీ అవసరంలేదు. అది కోరేదల్లా ఒక్క గౌరవం మాత్రమే. దాంతో గౌరవంగా మాట్లాడి ఎవ్వరైనాసరే దాన్ని దోచుకోవచ్చు. ఇంటికి యజమానురాలుగా ఉండి ఆకలి దప్పులతో చావనన్నా చావగలదు. కాని, దాసిగా బంగారమిచ్చినా ముట్టుకోదు. నోరా! అది వెళ్ళినప్పట్నుంచి నే నెలాగో అయిపోయానమ్మా ! నా ఆత్మ

లేచిపోయినట్టుగా వుంది. నీ చిన్ననాటి సంగతులు గుర్తున్నాయా!" అన్నాడు అత్యంతానందంతో.

మనో:- మరీ చిన్నప్పటిసంగతులైతే గుర్తులేవు కాని, లాంగీ అమ్మ నన్నెత్తుకుని ఆడించటమూ, నాకు జబ్బురావడమూ, అప్పుడామె విసనకర్రతో విసరటమూ గుర్తున్నాయి.

"అంతకు ముందు సంగతులు చెబుతా విను. గురుసేవకుడు మూడేళ్ళవాడు. నువ్వేమో ఏడాది పిల్లవు. ఆ వయస్సులో మిమ్మల్ని వదలిపెట్టిపోయింది మీ అమ్మ. నాకసలు మతేలేకుండా పోయింది. ఎటూ పాలుపోక ఆత్మహత్య చేసుకుంటే బాగుండు ననిపించేది. ఆ స్థితిలో లాంగీయే నన్ను కాపాడింది. దానిపరిచర్యలు నన్ను ముగ్ధుణ్ని చేశాయి. దానికి మీరంటే ఎంతో ప్రాణంగా ఉండటం చూచి, దానియందు నాకు ప్రేమభావం ఏర్పడింది. మీ కన్నతల్లికూడా అంతఇదిగా మీపోషణ చేయగలిగి కాదనుకో. అదేం జబ్బో ఏమిటో గాని, ఒకసారి గురుసేవకుడు రోగగ్రస్తుడయ్యాడు. రక్త విరేచనాలు పట్టుకున్నాయి. అదీ కొద్దికొద్దిగానే అవుతూండేవి. బ్రతికే ఆశఎక్కడా కన్పించటంలేదు. ఎముకలన్నీ కరిగిపోయాయి ఎండిపోయిన తోటకూరకాడలా అయిపోయాడు. అప్పుడు వాణ్ని మృత్యుముఖాన్నుండి కాపాడిందిలాంగీయే. ఇవాళదాన్నే ఇంట్లోంచి బైటికీడుస్తానంటూ బయలేరాడు.ధనాశతోనేఅదినాదగ్గర చేరిందని అభిప్రాయపడుతున్నాడు. వాడిఎముకలగూడును ఒడిలోపెట్టుకుని కన్నీరు మున్నీరుగా విలపించిన నాడు ఈనాడు కన్పడేటస్థి ఎక్కడ ఉన్నదా అన్న ఆలోచనే ఈ మూర్ఖుడికి ఉన్నట్లు కన్పించటంలేదు. నిజం చెప్పాలంటే,

ఈ ఇంట్లో లాంగీపాదం పెట్టినతర్వాతనే లక్ష్మివచ్చింది. ఏం నోరా, నాతలవేపున నిలబడిం దెవరు? బయటిమనిషి కాదు గదా? ఐతే; ఇక్కణ్నుంచి వెళ్ళిపొమ్మని చెప్పు." అన్నాడు హరిసేవకసింగ్ అవరుద్ధకంఠస్వరంతో.

మనో:—ఇక్కడ నేనుతప్ప ఇంకెవ్వరూలేరే. ఏమన్నా బాధగాఉందా? డాక్టరుగారికి కబురుచేయమంటూరా?

హరి:—నాజబ్బుకు మందు లాంగీదగ్గరే ఉందమ్మా. ఆహా! ఆ సతీమణి మహిమ ఎలాంటిదో గదా! అది దగ్గర ఉన్నంతకాలమూ నాకు తలనొప్పిఐనా వచ్చిఎరగదు. నా తెలివితక్కువతనం చూడు! తీర్థయాత్రలకు వెళ్తున్నానని చెప్పినపుడు నన్నెవ్వరికి అప్పగించి వెళ్తున్నావన్నమాటన్నా నా నోట్లోనుంచి వచ్చినపాపానపోలేదు. ఈమాత్రం నేను అనగలిగిఉంటే అది వెళ్ళేదేకాదు.

ఇలా చెపుతూచెపుతూ మళ్ళీ త్రుళ్ళిపడ్డాడు దివాను గారు. గుమ్మంకేసి సశంకితనేత్రాలతో చూస్తూ "ఎవరు లోపలికొచ్చింది? వీళ్ళు నన్ను చుట్టుకున్నారెందుకు? నాకేం జబ్బూగిబ్బూ లేదే. ఊరికే పడుకుని మాట్లాడుతున్నాను, అంతే.'' అన్నాడు.

దడదడకొట్టుకుంటున్న హృదయాంతరాళంలో నుండి పొంగిపొరలివస్తున్న కన్నీటిప్రవాహాన్ని దిగమ్రింగి "మీ కేమైనా గాబరాగా ఉందా?'' అని అడిగింది మనోరమ.

హరి:—అలాంటిదేమీ లేదు నోరా! నేను నాజీవిత కాలంలో చేసిన మంచిపనులు చాలా తక్కువ. చెడుపనులు మాత్రం అధికం. ఆ మంచిపనులైనా లాంగీచేసినవే. ఔను,

ఆ చెడ్డవన్నీ మాత్రం నావే. ఆ దుష్కృత్యాలఫలితమనుభ వించవలసినవాడను నేనే. లాంగీచెప్పినప్రకారం నడచుకొని ఉంటే బహుశా ఇవ్వాళ నా అంతరాత్మ కొంతో శాంతిలభించి ఉండేది.

మనోరమ కన్నీటిప్రవాహాన్ని బలవంతాన ఆపుకుని కూర్చునివుంది. ఆ చిరపరిచితస్థానంలో ఇవాళ ఏదో విచిత్ర సందేహచ్ఛాయలు కన్పడుతున్నాయి. సూర్యకాంతి క్షీణించి పోయినట్టు గోచరిస్తోంది. అస్తమయ మాసన్నమైనట్టుగా కన పడుతోంది. నాన్నగారిముఖంకేసి కన్నెత్తిచూడటానికి ధైర్యం చాలటంలేదు.

దివానుగారు ఇంటికప్పుకేసి రెప్పలు వాల్చకుండా చూస్తున్నాడు—అతనిదృష్టి అనంతానికవతలిఒడ్డుకు చేరగోరు తున్నదా అన్నట్టు. హఠాత్తుగా క్షీణస్వరంతో 'నోరా!' అని పిలిచాడు.

"ఇక్కడే ఉన్నాను నాన్నా!" అంది మనోరమ తండ్రి కేసి దీనంగా చూస్తూ.

దివాను:—కాస్త కలం- కాగితం తీసుకురా. ఇంకె వ్వరూ లేరుగదా ఇక్కడ? నా వీలునామా వ్రాయి. గురు సేవకునికి ఎలాగూ లాంగీతో సరిపడదు. నాఅనంతరం దానికి కష్టాలు తప్పవు. నా ఆస్తి అంతా లాంగీ కిచ్చివేస్తున్నాను. వాడు ఆ స్తిమీది ఆశతోనయినా దానికి కాస్త లొంగిఉంటాడు నువ్వు ఇదివ్రాసుకో. నీవే సాక్షిగా ఉండు ఈ వీలునామాను నీదగ్గరే ఉంచు.

మనోరమ లోని కెళ్ళి పడ్వసాగింది. పొంగివస్తున్న ఆ అశ్రుప్రవాహాన్ని ఇంక ఆపుకోలేకపోయింది.

కొంచెంసేపటికి రాజాగారు వచ్చారు. అహల్యకూడ వచ్చింది. మున్షీ వజ్రధరునికీ ఈవార్త అందింది. ఆయనా పరు గెత్తుకొచ్చాడు. సంస్థానసిబ్బంది యావన్మందీ చేరసాగారు. డాక్టరూ వచ్చి చేరుకున్నాడు. కాని దివానుగారు కళ్ళు తెరువ లేదు. స్పృహతప్పి పడిఉన్నాడు. కాని, కళ్ళనుండి కన్నీటి ధారలు ప్రవహించి చెక్కిళ్ళమీద పడుతున్నాయి.

హఠాత్తుగా జోడుగుర్రాలబండి ఒకటి వచ్చి గుమ్మం ముందు ఆగింది. అందులోంచి ఒక స్త్రీ దిగి ఇంట్లోకొచ్చింది. "వచ్చింది, వచ్చింది, వచ్చింది, వచ్చింది." అన్నారు ఒక్క సారిగా అందరూ. ఆ వచ్చింది లౌంగీయే.

లౌంగీ హరిద్వారంనుండి ఇవాళే బయలుదేరింది. గురు సేవకుడు ఆమెను కలుసుకోనే లేదు. ఇంటినిండా జనాన్ని చూచి ఆమెగుండెలు గుభేల్ మన్నాయి. ఆవిడ గదిలో అడుగు పెట్టగానే అక్కడ ఉన్నవాళ్ళంతా బైటికెళ్ళిపోయారు. మనో రమా, మనోరమ వదినగారూ, అహల్య మాత్రమే వుండి పోయారు.

దివానుగారి తలమీద చెయ్యివేసి గద్గదస్వరంతో "ప్రాణనాథా! నన్ను వదలిపెట్టి పోతున్నారా!" అన్నది లౌంగీ

దివాను కళ్ళువిప్పి చూచాడు. ఆకళ్ళల్లో ఎంత వేదనా, ఎంత ప్రేమా ఉన్నవో!

తన రెండుచేతులూ చాచి "ఇంకా కాస్త ముం దెందుకు రాలేదూ?" అన్నాడు దివాను.

ఆ చాచినచేతుల్లో తన తలదూర్చి ఆ కడసారి ఆలింగ నానందపారవశ్యంలో విహ్వాలయైపోయింది. ఎవరి చరణార విందములకు తా నాత్మసమర్పణ చేసిందో ఆయన తుదిఘడియ వరకు తనవాడుగానే ఉన్నాడని ఆమెకు ఇవ్వాళ తెలిసింది. ఈ శోకమయకల్పన కూడ ఎంత మధురం! ఎంత శాంతిదాయకం!

లాంగీ ఇంకా ఆత్మ- విస్మృతావస్థలోనే ఉంది. ఇంతలో మనోరమ ఒక్కసారిగా ఆవురుమనటం విని లాంగీ త్రుళ్లిపడి దివానుగారి ముఖమండలంలోకి చూచింది. వెంటనే స్వామి పాదారవిందారములపై శిరముంచి వెక్కి-వెక్కి ఏడ్వసాగింది. ఒక్కనిమిషంలో ఇల్లంతా ఏడ్పులూ, బొబ్బలూను.

హరిసేవక సింగుగారి అంత్యక్రియలూ, కర్మలూ అన్నీ అయిపోయినతర్వాత ఒకరోజున లాంగీ తన గుడ్డా-గుడుసూ సర్దుకొని మూటకడుతోంది. తనదగ్గర ఉన్న డబ్బు కాస్తా ఆ గురుసేవకుడికే అప్పగిస్తూ "బాబూ! ఇక ఏ పల్లె టూరికో పోయి ఉండదలచాను. ఇక నిక్కడ ఉండలేను" అన్నది లాంగీ.

లాంగీ ఇప్పుడు ఈ ఇంట్లో ఉండలేకపోతున్నమాట యథార్థమే. ఇంటిలోని ప్రతివస్తువూ తన్ను మ్రింగటానికొస్తు న్నట్టుగాఉండేది. పాతికేళ్ళు ఈ ఇంట్లో యజమానురాలుగా చలామణీఅయింది. ఇప్పుడు ఒకరి క్రింద ఆశ్రితురాలుగా బ్రత కటం కష్టమే. అసలే వైధవ్యదుఃఖంతో జీవచ్ఛవమైపోతూంది. దానికితోడు ఒకరి మెతుకులపైన బ్రతుకుతున్నానన్న భావం కూడా కలిస్తే, అది సహించటం మరింత దుర్భరం. ఆవిడవిష యంలో గురుసేవకుడు పూర్వంకంటె ఇప్పుడు కాస్త మెరుగే.

కొంచెం గౌరవంగానే చూస్తున్నాడు. ఆవిడ మనస్సుకు కష్టంగాఉండేమాట ఏదీ నోట్లోంచి రానివ్వటంలేదు. ఐనా ఆమె పరాధీనతను చాటేటటువంటి మాటలు అడపాదడపా అప్రయత్నంగానే జారివస్తూఉండేవి. ఈకారణంవల్లనే ఇప్పు డావిడ ఏ పల్లెటూరికో పోయి జీవించాలని నిశ్చయించుకున్నది. చివరకు దివానుగారు చచ్చిపోతూ దమ్మిడీ ఆస్తి అయినా ఆమెపేర వ్రాయకపోతే, ఆమెను బియ్యంలోని వడ్లగింజలా తీసి అవతలపారేస్తే, మరి ఆమె ఆ ఇంట్లో పడివుండి ఒకరినెందుకు దేబిరించుకు బ్రతకాలి? ఇప్పుడామెకు కావలసిందిమాత్రం ఏముంది? ఏదో ఒక చిన్న పూరిగుడిసె, ఒక పట్టెడు మెతుకులేగా.

"ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నావేమిటి?" అన్నాడు గురుసేవకుడు.

లాంగీ:— ఆ శ్రీమన్నారాయణమూర్తి ఎక్కడికి తీసుకుపోతే అక్కడికే. పుట్టింటికనో, అత్తింటికనో చెప్పటానికి అసలుంటే గదా!

గురు:—నువ్వు వెళ్ళిపోతే నా కెంత చెడ్డపేరువస్తుందో ఆలోచిస్తున్నావా? ఈ వెధవ ఒక వెధవముండకు పట్టెడు మెతుకులు పెట్టి పోషించలేకపోయాడని లోకమంతా ఆడిపోస్తుంది. మొహం మెత్తుకు తిరగటానికే ఆస్కారముండదు. నీ కిక్కడ ఏ విషయంలోనైనా లోటువుంటే నాతో చెప్పు. ఏదైనా అవసరమైతే నాదగ్గరకొచ్చి ఇదిగో ఫలానా కావాలని నాతో చెప్పు. ఆ పిమ్మట నావల్ల ఏదైనా లోపంజరిగితే

అప్పుడు నీయిష్టానుసారంగా నిర్ణయించుకో. అలాగే చేసుకో. అంతేగాని, ఊరికే వెళ్ళిపోతానంటే మాత్రం వెళ్ళనివ్వను.

లాంగి:—ఐతే కట్టేసి ఉంచుతావాయేం?

గురు:—ఔను, కట్టేసే ఉంచుతాను.

ఇంతకాలం జీవితంలో గురుసేవకునిమాటల్లో లాంగికేదైనా నచ్చిందంటే అది అతని ఈ మొండిపట్టుదలతో కూడిన మాట ఒక్కటేనని చెప్పాలి. లాంగిహృదయం ఆనందపులకితమైంది. ఈ చిన్నమాటలో ఆత్మీయత నిండిఉన్నట్టుగా కన్పించింది. "ఎందుకట్టేస్తావేం? నీకేమన్నా అమ్ముడుపోయానా? అంది కొంచెం విసురుగా.

గురు:—ఔను, అమ్ముడుపోయావు. నా కమ్ముడుపోలేదనుకో. మానాన్నగారికి అమ్ముడుపోయావా లేదా? లేకపోతే ముప్పైఏండ్లు ఈఇంట్లో ఎలా ఉండగలిగేదానివి? గడప దాటావో, తర్వాత లోకం ఏమన్నా సరే, కాళ్ళువిరగ్గొట్టి పడేస్తాను. ఇష్టమొచ్చినట్లు వ్యవహరించటానికీ, ఇష్టమొచ్చినచోటు కెళ్ళిపోటానికీ, అందు కెవరూ నోరెత్తకుండా ఉండటానికీ అంత స్వతంత్రురాలవా ఏమిటి నువ్వు? నా గౌరవమూ, నాతండ్రీ గౌరవమూ నీపేరుతో పెనవేసుకుని ఉన్నాయి.

గురుసేవకుని మాటలువిని అతనిపాదములపైబడి యేడ్వాలనిపించింది; అతన్ని కౌగిలించుకుని 'నాన్నా, నిన్ను చంకనెత్తుకుని ఆడించాను. డొక్కలోపెట్టుకుని పెంచాను. నిన్ను వదలి ఇంకోచోటికి ఎలాపోతాను?' అని అనాలనిపించింది. కాని మళ్ళీ కోపంగానే, "ఇదీ మంచి వేళాకోళంగానే ఉందే! ఇతడు నన్ను కట్టేసి ఉంచుతాట్ట! "అంది లాంగి.

గురుసేవకుడు రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు. లాంగీ గదిలోకిపోయి కూర్చుని తెగవడ్చింది. నిన్ను కట్టేసి ఉంచుతానని ఏ దాసీనైనా అనగలడా గురుసేవకుడు? ఎన్నడూ అనలేడు. కాని ఈ మాట తనభార్యనైతే అనగలడు. కారణం అతని గౌరవ–మర్యాదలు ఆమెతో పెనవేసుకుని ఉన్నాయి. కొంచెంసేపైనతర్వాత లాంగీ లేచి ఒక దాసీని పిలచి, "ఏమేవ్ ఎక్కడా? వినపడిందా ? ఇదిగో, నాకు తలనొప్పిగా వుంది. కాస్త ఇలా వచ్చి ఒత్తిపోవే'' అంది.

హఠాత్తుగా మనోరమ గదిలోకొచ్చింది. లాంగీ తలకు నూనెరాయించుకోవటం చూచి "వంట్లో బాగుండలేదా అమ్మా? తలనొప్పిగా ఉందా?" అని అడిగింది.

దాసి వెళ్ళిపోయింది. మనోరమ కూర్చుని తలఒత్తబోయింది. గభాలున ఆమెచెయ్యికడ్డొచ్చి "వద్దమ్మా తల్లీ! వద్దు. నువు ఒత్తనక్కు. నొప్పింలేదమ్మా, ఎవరైనాచూస్తే ఏమనుకొంటారు? ఈ ముసలిముండకేమైనా మతిపోయిందా ఏమిటి, రాణిగారిచేత తల ఒత్తించుకుంటోంది, అంటారు."

మనోరమ శిరస్సు ఒత్తుతూ "రాణిగాఉండేచోట రాణిని; ఇక్కడమాత్రం నీ చంకలో పెరిగిన నోరానే. ఇవాళ అన్నయ్య నీ దగ్గర్నుంచి వెళ్ళి అక్కడ కూర్చుని నీ మీద పెద్దపెద్ద కేకలువేస్తున్నాడు – 'దానికాళ్లు విరగ్గొడ్తాను. దానిమెడ తెగేస్తాను" అంటున్నాడు. అసలువిషయం మేమిటో కాస్త చెప్పమని ఎంతగానో అడిగాను. కాని, ఆ కోపంలో మాట వినిపించుకుంటేనా? అన్నగారైతే కావచ్చు. కాని, ఆయనచేసేఅన్యాయం నేను చూడలేకుండాఉన్నాను. ఈయన

స్వభావం అప్పుడే గ్రహించారు నాన్నగారు. నే నింతవరకు నీతో ఒక విషయం చెప్పలేదు. కాని, ఇవాళ ఆ మాటలు విన్నతర్వాత చెప్పేస్తున్నాను. నాన్నగారు వెళ్ళిపోయేప్పుడు తన ఆస్తియావత్తూ నీపేర వీలునామా వ్రాసి పోయారు''అంది.

ఈ వార్త విని లాంగీ రవ్వంతైనా చలించలేదు. ఏవిధమైన ఉల్లాసంగాని, ఉత్సాహంగాని, గర్వంగానీ ఆవిడ మొగంలో కన్పించలేదు. ఉదాసీనభావంతోనే చాపమీద పడియున్నది.

"ఆ వీలునామా నాదగ్గరే వుంది. నన్నే సాక్షిగా ఉంచారు. ఈ మహాశయుడు అది చూచుకున్నప్పుడుగాని కళ్లు తెరవడు" అన్నది మనోరమ మళ్ళీ.

''నోరా! ఈ వీలునామా తీసుకుపోయి అతనిచేతిలోనే పెట్టు మీ నాన్నగారు అనవసరంగా రాసిపోయారు. ఆయనగారి ఆస్తికి నేనేమీ తపించలేదు. నేను తపించిందల్లా ఆయనగారి ప్రేమకోసమే. ఈ విషయంలో నేనెంతో అదృష్టవంతురాలిని. ఇలాంటి అదృష్టం ప్రపంచంలో చాలా తక్కువ మందికి లభిస్తుంది. ఈ మాట ఈశ్వరసాక్షిగా చెబుతున్నా. నాకు ఆయనగారి ప్రేమధనం లభించింది. దాంతోనే పూర్తిగా సంతృప్తిచెందాను. ఇప్పుడింకే ధనమూ అక్కరలేదు. గురుసేవకుని చంకనెత్తుకుని ఆడించాను. డొక్కలోపెట్టుకుని పెంచి పెద్దవాణ్ణిచేశాను. అతను నాభర్తకన్న కొడుకు అతనిహక్కును ఎలాఅపహరించగలను? అతని ముందున్నపళ్ళెం ఎలా లాక్కోగలను? ఈ కాగితం చించి అవతలపారెయ్. ఈ కాగితం వ్రాసి ఆయనగారు తన పట్లా, తనకుమారునిపట్లా అన్యాయం

ఘోరఅన్యాయంచేసిపోయారు. గురుసేవకుడు నిజంగా తన తండ్రికి జన్మించిన పుత్రుడే గనుక అయితే, నాకేమీ అప చారంచేయలేదు. తప్పకుండా గౌరవంగానేచూస్తాడు. అతను ఆదరించినా ఆదరించకపోయినా నేనుమాత్రం అతన్ని బిడ్డ గానే భావిస్తున్నాను. నువు నా పక్కలోకూర్చుని నా తల ఒత్తుతున్నావు ఆ ఐశ్వర్యంలో ఆ ఆస్తిలో ఈ సుఖం లభిస్తుందా అమ్మా? గురుసేవకుని నోటినుండి 'అమ్మా' అన్న మాట చెవినిపడినప్పుడు ప్రపంచానికి రాణినైతే కలుగని ఆనందం కల్గుతుంది. అతనితో ఈ మాటొక్కటే చెప్పు.

ఇలా అంటూవుంటే లాంగీ కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున కమ్ముకొచ్చాయి. మనోరమ ఆమెకేసి ప్రేమ, శ్రద్ధాభక్తు లతో ఆశ్చర్యంగా చూస్తోంది—ఆమె దేవతా అన్నట్టు.

# ఇరవై ఒకటో అధ్యాయం

జగదీశపురంలోని కోవెలకు సాధువులు, సన్యాసులూ మహాత్ములూ, భక్తులూ నిత్యం వస్తూఉంటారు. శంకధరుడూ నిత్యం వారివద్దకు పోయి కూర్చుంటాడు. వారుచెప్పేమాటలు అత్యంత శ్రద్ధతో ఆలకిస్తూంటాడు. తనదగ్గరఉన్న ఫొటోతీసి సాధుసన్యాసుల రూపురేఖావిలాసాలతో పోల్చిచూస్తుంటాడు. కాని ఆ ఫొటోలోని ఆకృతిని పోలే ఆకృతిగల సన్యాసి ఎవ్వరూ తగలటంలేదు. ఎవరిసంభాషణలద్వారానూ చక్రం ధరుని ఆచూకీ ఏమీ తెలియటంలేదు.

ఒక రోజున శంఖధరుడు మనోరమతో కలసి లాంగీ వద్దకువెళ్ళాడు. చాలాసేపటివరకు ఆవిడ తన తీర్థయాత్రలను గూర్చి ముచ్చటిస్తూ కూర్చుంది. ఆవిడమాటలు శ్రద్ధగా విన్న మీదట "ఏం, ఐతే చాలామంది సాధు - సన్యాసులు నీకు కలిసిఉంటారనుకుంటానే" అన్నాడు.

"ఔన్నాయనా! ఎందుకు కలియలేదూ? లెక్కలేనంత మంది కలిశారు బాబూ! అచ్చంగా మీ నాన్నగారివంటి రూపంగలాయనకూడా ఒక మహాత్ముడు కలిశాడు. మారు వేషంలో సరిగ్గా గుర్తుపట్టలేకపోయాను. కాని తరవాత ఆయనే అయిఉంటారని అనుకున్నా" అన్నది లాంగీ.

"జడలు బాగా పెరిగిఉన్నాయా?" అన్నాడు శంక ధరుడు ఔత్సుక్యంతో.

లాంగీ:— లేదు లేదు. జడలూ గిడలూ ఏమీలేవు. కాషాయగుడ్డలూలేవు. కాని ఒక కమండలంమాత్రం చేతిలో ఉంది. జగన్నాథంలో ఉన్నన్నాళ్లూ రోజు కొక పర్యాయ మైనా నాదగ్గరకొచ్చి "ఏం తల్లీ! మీకే ఇబ్బందీలేదుగదా?" అని అడిగి పోతూండేవాడు. తనితరయాత్రికులనూ ఇదేవిధంగా పరామర్శచేసిపోతూండేవాడు.

"అవ్వా! మరి నువ్విక్కడికి టెలిగ్రాం ఎందుకివ్వలేదూ? ఇస్తే మేం తక్షణం బయలుదేరి వచ్చేవాళ్ళంగదూ!" అన్నాడు శంకధరుడు.

లాంగీ:—అరె! అసలు ఆయనగారెవ్వరో ఏమిటో తెలుసుకోకుండా పెట్టుకోకుండానే టెలిగ్రాం ఎలా ఇస్తాను బాబూ?

శంఖ:—ఒక్క సారంటే ఒక్క సారి నేనే గనక చూడ గల్గితేనా, ఇంక వదలిపెట్టక్కే! ఏం అవ్వా! ఇప్పు డాయనగారు ఎక్కడ ఉండొచ్చునంటావ్?

మనో:—ఇప్పు డెలా చెప్పగలదు బాబూ? సన్యాసులు ఒకచోట స్థిరంగా ఉంటారు గనుకనా ఈమె చెప్పటానికి?

శంఖ:—ఐతే సరేగాని, అవ్వా! ఈ మాట చెప్పు, ఆయనగారికి వయస్సు ఎంత ఉంటుందో?

లాంగి:—నలభై ఏళ్ళు దాదాపుగా ఉంటాయేమోనను కున్నాను.

శంకధరుడు ఏదో గుణించుకుని "రాణీ అమ్మా! నాన్న గారి వయస్సు అంతే ఉంటుందేమో?" అన్నాడు మనోరమతో.

మనోరమ కృత్రిమకోపంతో "ఔనౌను, ఆ సన్యాసి గారే మీ నాన్నగారు. చాల్ చాలు, అప్పుడే నలభై ఏళ్ళు ఎలా వస్తాయిరా?" అంది.

రాణీఅమ్మకి ఈ ప్రసక్తి ఇష్టంలేదని గ్రహించాడు. ఆ తర్వాత మళ్ళీ ఆ విషయంలో ఒక్క మాటకూడా నోటి నుండి రానివ్వలేదు. ఇక అక్కడ ఉండలేకపోయాడు. జగ న్నాథపురిని గురించి భూగోళంలో చదివాడు. కాని ఆ స్వల్ప పరిజ్ఞానం వానిని సంతృప్తిపరచలేదు. పూరీకి ఏబండి వెళ్తుంది? అక్కడ యాత్రకొచ్చినవారు బసచేసే దెక్కడ? ఈ విషయా లన్నీ తెలుసుకోవాలని కుతూహలంగా ఉన్నాడు. ఇంట్లో లైబ్రరీలో ఆవివరాలు తెలిపే పుస్తకం యేదైనా లభిస్తుందేమో నని ఆలోచించి, బైటకొచ్చి డ్రైవరుతో తన్ను యింటికి తీసుకుపొమ్మన్నాడు.

ఇంటికొచ్చి గ్రంథాలయంలోకిపోతూండగా గురుసేవక సింగ్ ఎదురైనాడు. అతన్ని చూడగానే "గురుబాబుగారూ! కాస్త నామీద దయఉంచి తీర్థక్షేత్రాల వివరాలున్న పుస్తక మేదైనాఉంటే తీసిఇవ్వండి" అని అడిగాడు.

"ఇలాంటి పుస్తకమేమీ మన లైబ్రరీలో లేదను కుంటాను" అన్నాడు గురుసేవకసింగ్.

శంఖ:— ఐతే మరి ఎక్కడనుంచైనా తెప్పించండి.

ఇలా అని మళ్ళీ గబుక్కున వెనక్కి తిరిగాడు. ఇంతలో మరల ఏదో ఆలోచించి,బయటికి వెళ్లిపోయాడు.కారును సిద్ధం చేయించి పట్నానికి బయలుదేరాడు. వాని కిప్పుడు పదమూ డేళ్ళ కంటే ఎక్కువ లేవు. కాని ఒకసారి మనస్సులో నిశ్చ యించుకున్నదానిని పూర్తిచేసేవరకు కాలుమడవడు.

అంతపట్టుదలగల బాలుడు. పట్నంవెళ్లి ఇంగ్లీషుపుస్త కాలషాపు లెన్నిటికో తిరిగిచూచాడు. తర్వాత పుస్తకాల కట్టతో ఇంటికి తిరిగి వచ్చాడు.

రాజాగారు భోజనానికి కూర్చున్నాడు. చూస్తే శంఖ ధరు దక్కడ కన్పించలేదు. అహల్య గదిలోకెళ్ళి చూస్తే అక్కడ పుస్తకం ముందేసుకు కూచుని ఉన్నాడు.

"వచ్చి, ముందు అన్నంతిని పో. తాతయ్య పిలుస్తు న్నారు" అంది అహల్య.

"అమ్మా! నా కసలు ఆకలిగాలేదే"

అహ:- కొత్తపుస్తకం ఏదైనా తెచ్చావా ఏమిటి? అందుకే ఆకలి చచ్చిపోయి ఉంటుంది. ఏం పుస్తకమేమిటి!"

వాని ఎదుట తెరచిఉన్నపుస్తకం పైకితీసి అందులో రెండు మూడు పంక్తులు చదివి "ఇందులో తీర్థక్షేత్రాల వివరాలు రాసిఉన్నాయే - పూరీజగన్నాథం, బదరీనాథ్, కాశీ, రామేశ్వరం - ఈ పుస్తకం ఎక్కడనుంచి తెచ్చావ్ ?" అని అడిగింది.

శంఖ:- ఇవ్వాళే షాపులో కొనుక్కొచ్చాను. నాన్నగారిపోలికలుగల సన్యాసిగా రొకరు జగన్నాథపురంలో కన్పించారని నాయనమ్మ చెప్పిందిగా.

అహల్య శంఖధరునికేసి సజలనేత్రాలతో జాలిగా చూచిందే గాని, నోటినుండి ఒక్క పలుకైనా వెలువడలేదు. 'ఆహా! నా చిట్టి తండ్రీ! నీలో ఇంత పితృభక్తి ఎందుకున్నదిరా ? తండ్రి నియోగంతో ఎంత పిచ్చివాడవయ్యావురా! నువ్వసలు తండ్రిముఖం చూచి ఎరుగవే. ఆయనగారి చంకనెక్కి ఆడి ఎరుగవే. ఆయనగారు ఎప్పుడు ముద్దుగా పల్కరించారో, ఎప్పుడు విన్నావో నువ్వు - ఇదీ జ్ఞాపకంఉండి ఉండదు. ఐనా ఆయనమీాద ఎంతప్రేమ నీకు? మరి ఆయనగారెంత నిర్దయులు !' అనుకొని, "బిడ్డా! నీకు లేచిరావటానికి అంతగా ఇష్టంలేకపోతే అన్నం ఇక్కడికే తీసుకొస్తానులే" అంది అహల్య అశ్రువేగాన్ని ఆపుకుంటూ.

శంఖ:- సరే అలాగే తింటాను గాని, ఇంకెవ్వరితోనైనా పంపించు; నువ్వెందుకులే తేవటం ?

అహల్య వెళ్లి ఒక్క నిమిషంలో ఒక చిన్న పళ్ళెంలో అన్నంపెట్టుకు చక్కావచ్చింది. పళ్ళెం శంఖధరునిముందు పెట్టి తానూ అక్కడే చతికిలపడింది.

ఇప్పుడు శంఖధరునికి అన్నమంటే అరుచిగా ఉన్నదని కాదు. ఇంతవరకూ తనతండ్రినిగురించి నిశ్చితంగా ఏమీ తెలియదు. ఎక్కడో ఇంకొకచోట సుఖంగానే ఉండి ఉండవచ్చునని అనుకునేవాడు. కాని ఆయన సన్యాసి అయ్యాడని ఇవ్వాళనే మొదటిసారిగా తెలిసింది. మరి తా నిప్పుడు రాజులకుతగిన షడ్రసోపేతభోజనం ఎలా ఆరగించగలడు? 'నువ్వెందుకు తేవటం, ఇంకెవ్వరితోనయినా పంపించు' అని అహల్యతో అన్నది ఈ కారణంచేతనే. ఇప్పు డీ పళ్ళెంచూచి మహా ధర్మసంకటంలో పడ్డాడు. నేనేమో ఇక్కడ వెండి బంగారు పళ్ళెరములలో పంచభక్ష్య పరమాన్నాలు ఆరగించబోతున్నాను; అక్కడ నాన్నగా రేవిధంగా ఉన్నారో! పాపం! ఏ చెట్టుక్రిందో పడిఉండొచ్చు. ఇవ్వాళ ఏమైనా తిన్నారో లేదో! అని తండ్రిని తలచుకున్నాడు. శంఖధరుడు పళ్ళెం ముందు కూర్చున్నాడేగాని ముద్దకలిపి ఎత్తాడో లేదో వెంటనే వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. అహల్య అతని మనోభావం పసికట్టింది. తానూ ఏడ్పు ఆపుకోలేక కొడుక్కు జతఅయింది. ఎవరు ఎవర్ని ఊరడించాలి!

తండ్రి అన్వేషణ నిమిత్తం శంఖధరు డెక్కడ ఇల్లొదిలిపోతాడో నన్న సందేహం ఈ ఘడియనుండే ప్రారంభమై ఇరవై నాలుగు గంటలూ అహల్యను పీడించసాగింది. శంఖధరుని ఎదుట తండ్రి ప్రసక్తి తీసుకురావద్దని అందరిని హెచ్చరించింది. తండ్రి గృహత్యాగ హేతువు, చక్రధరునికి రాజ్యమంటే అసహ్యమన్న విషయమూ తెలిస్తే, ఇంక వీనిని ఆపటం ఎవరితరం?

శంఖధరుని తీసుకుని, భర్తతో ఎందుకు వెళ్ళకపోతినా? అన్న ఆలోచన, పశ్చాత్తాపములే ఇప్పు డామెను అహర్నిశలు బాధిస్తున్నాయి. రాజ్యకాంక్షచే పతిని మొదటే కోల్పోయి కూర్చుంది; ఇప్పుడు మరలకొడుకునుకూడా కోల్పోవదుగదా!

శంఖధరుని బడిలో చేర్పించారు. బడి వదలిపెట్టగానే తిన్నగా తాంగి దగ్గరకు పోయి కూర్చునేవాడు శంఖధరుడు. తీర్థక్షేత్రాలనుగురించి వివరాలు అడుగుతూంటాడు. యాత్రికుల బసలెక్కడ? ఏం భోంచేస్తారు? రైళ్ళుబండ్లు లేని ప్రదేశాల కెలా వెళ్తారు? దొంగలుండరుగదా? ఈ ప్రశ్నలతో తాంగీ అతని మనోభావాలను గ్రహించుకొనేది. కాని ఇష్టం లేకపోయినా అత నడిగిన ప్రశ్నల కన్నిటికీ సవిస్తరంగా జవాబులు చెప్పక తప్పేదికాదు. ఒక్కొక్కసారి విసుక్కునేది, మందలించేది. కాని ఆ బాలుడు పట్టుబట్టి మారాంచేసి ఒడిలో చేరి కూర్చున్నప్పుడు ఆమెకు జాలివేసేది.

శెలవుల్లో తప్పకుండా పితృగృహానికి వెళ్ళేవాడు. ఆ గృహం అతని కొక పుణ్యక్షేత్రం. నిర్మలనేత్రాలు అతన్నెంత చూసినా తృప్తిచెందేవి కావు. తాత - ముత్తవ లిద్దరూ బాలునిమాటలు విని, ముగ్ధులవుతూండేవారు. వాళ్ళ హృదయాలు పులకితమైపోతూండేవి. చక్రధరుడే బాలరూపందాల్చి ఈ రూపంతో తమ మనసుల్ని హరించటానికి వచ్చాడన్నట్టుగా మురిసిపోయేవాళ్ళు.

"నాయనా! ఇక్కడికే వచ్చి ఉండకపోయావట్రా. నువ్వు వెళ్ళిపోగానే ఈ ఇల్లు ఏదో రాక్షసిలా కరవవొచ్చి నట్టుగా ఉంటుందిరా." అంది నిర్మల శంఖధరునితో ఒకరోజున.

శంఖధరుడు ఏదో ఆలోచించి గంభీరభావంతో—"అమ్మేమో రానేరాదయ్యె. ఇక్కడికెప్పుడూ రా దెందుకనే నాయనమ్మా?" అన్నాడు.

నిర్మ:—ఏమో నాయనా! నాకేం తెలుసురా బాబూ మీ అమ్మ మనస్సులో ఏముందో? నువు ఆమెను అడగనే అడగవనుకుంటా - ఐనా ఇవాళ అడిగిచూడు, ఏమంటుందో?

శంఖ:- వద్దులే నాయనమ్మా! ఆ మాట ఎత్తితే ఏడుస్తుందే. ఇక కొద్దిరోజుల్లో నేను రాజునై గద్దెమీద కూర్చున్నప్పుడు ఈ ఇల్లే నాకు రాజభవన మవుతుంది. అప్పుడుగాని అమ్మ రాదనుకోవే.

శంఖధరుడు బయలుదేరినపుడు నిర్మల తలుపుదగ్గర నిలబడిఉంది.

హఠాత్తుగా శంఖధరుడు గడపదగ్గ ఆగి "నాయనమ్మా! నిన్నొకటి అడగా లనుకున్నానే" అన్నాడు.

నిర్మల విస్మితురాలై సజలనేత్రాలతో అతనికేసి చూచింది. గద్గదకంఠంతో "ఏంకావాలి నాయనా?" అంది.

శంఖ:- నా మనోరథం పూర్తి కావాలని ఆశీర్వదించు.

మనుమణ్ణి గభాలున కౌగిటచేర్చుకుని "తండ్రీ! నా రోమరోమం నిన్ను ఆశీర్వదించుతూనే ఉంటుంది. ఈశ్వరుడు నీ మనోరథం సిద్ధింపజేయుగాక!" అంది నిర్మల.

శంఖధరుడు ఇంటికి చేరుకున్నాడు. ‘‘ఇంతసేపు ఎక్కడ ఉన్నావురా నాన్నా? నీ కోసం ఎప్పటినుంచో చూస్తు న్నాను!’’ అంది తల్లి అహల్య.

శంఖ:- ఆలస్యమేమయిందే అమ్మా! కాసేపు నాయనమ్మ దగ్గర కెళ్ళివచ్చా. ఇవాళ ఆవిడగారు నీకో మాట చెప్ప మన్నది.

అహ:- ఏమిటా సందేశం? చెప్పు. మీ నాన్నగారి సమాచార మేమైనా తెలియ లేదుగదా?

శంఖ:- లేదులేదు. అదేం కాదు. సరేగాని, నువ్వెప్పుడూ నాయనమ్మగారి ఇంటికి వెళ్ళ వెందుకనే?

‘‘ఎందు కెళ్ళనూ? వెళ్ళాను’’ అని పైకి అన్నది అహల్య. కాని ఆ ఇంటికి వెళ్ళటం ఉచితంగా భావించటం లేదనిమాత్రం ఆ మాటలవల్ల స్పష్టంగా తెలుస్తోంది. బహుశా ఆవిడ చెప్పగల్గితే ‘‘అక్కణ్ణుంచి ఒకసారి బైటికిగెంటబడ్డాను. ఇప్పుడు మళ్ళీ ఏ ముఖంతో పోతాను! ఇప్పు డింకోరూసం ఎత్తానాఏమిటి?’’ అని చెప్పిఉండేది.

అహల్య పళ్ళెంలో పెట్టుకుని ఇన్ని కిస్‌మిస్ పళ్ళూ, ఇంత మిఠాయీ తీసుకొచ్చింది. ఒక దాసిని పిలిచి మంచినీళ్ళు తెమ్మనమని చెప్పి, కొడుకుతో అక్కడ ‘ఫలాహారమేమీ తిని ఉండవు. ఇవిగో, ఇవి కొంచెం తిను. ఇవాళ ఇంత దిగులుగా ఉన్నావెందుకురా బాబూ?’’ అంది.

‘‘ఇప్పు డసలు ఏమీ తినాలని లేదే’’ అన్నాడు శంఖ ధరుడు పళ్ళెంకేసి చూడకుండానే.

ఒక నిమిషం ఆగి, మళ్ళీ "ఏమే అమ్మా, నాన్నగారి కసలు మనం ఎప్పుడన్నా జ్ఞాపకంవస్తామా లేదా?" అన్నాడు.

"ఏమో తండ్రీ! జ్ఞాపకమొస్తే ఇన్నికోసుల దూరాన వెందుకు కూర్చుంటారూ!" అంది తల్లి కంటతడిపెట్టుతూ.

శంఖ:- ఐతే మహా కఠినుడా యేమిటి?

అహల్య యేడుస్తోంది. యేమీ సమాధానం చెప్పలేక పోయింది.

శంఖధరుడు:- "అమ్మా! నా కాయన నిర్దయుడై వుంటారనే అనిపిస్తోంది. కనుకనే మన దుఃఖం ఆయనకు తెలియటంలేదు. కనపడితే నమస్కారం కూడా చేయకూడదనిపిస్తోంది. అంతేగాదు. 'మీకు నా కెవ్వరేమిటి ? మాతో సంబంధమేమిటి? మమ్మల్ని విడిచిపెట్టిపోయిన మహాత్ములే గదూ మీరు?' అని అడగాలనికూడా అప్పుడపుడు మనస్సులో అనుకుంటూ ఉంటాను."

ఇంక నోరెత్తకుండా ఉండలేకపోయింది అహల్య. "తండ్రీ ! ఆయనగారు మనల్ని విడిచిపెట్టలేదు. అక్కడ వారి స్థితి ఎలాఉంటుందో నాకు తెలుసు. ఒక క్షణంకూడా ఆయన మనల్ని మరచిపోలేరు. అన్నపానాదుల ధ్యాసకూడా ఉండి వుండదు. అయ్యో! ఇదంతా నా తప్పేబాబూ! ఆయనగారి దోషమేమీ లేదురా నాయనా!" అంది అహల్య గద్గదకంఠంతో.

శంఖధరుడు కొంచెం సిగ్గుపడ్డాడు. "సరే, అమ్మా, ఐతే నన్నుచూస్తే వారు గుర్తుపట్టగలరంటావా!" అన్నాడు.

అహ:- విన్నా! బహుశా గుర్తుపట్టలేరేమోననే అనుకుంటాను. ఆయనగారు వెళ్ళేనాటికి నువ్వు బొత్తిగా చిన్నపిల్లవాడివి. ఆయనవెళ్ళి ఇదిపన్నోయేడు. యెలా ఉన్నారోయేమో! యెక్కడో ఒకచోట భగవంతుడు క్షేమంగా ఉంచుగాక! రాసిఉంటే ఎప్పుడోఒకనాడు దర్శనభాగ్యం లభించితీరుతుంది.

శంఖధరుడు తనధ్యాసలోనే తానుమునిగిఉన్నాడు. అతనికి మాటలు వినపడనేలేదు. 'కాని, అమ్మా! నే నాయన్ని చూస్తే ఇట్టే గుర్తుపట్టేస్తాను. ఆయన యే వేషంలో ఉన్నా సరే, నేను గుర్తుపట్టగలనమ్మా!" అన్నాడు.

అహ:- లేదు నాయనా! నువ్వుకూడా గుర్తుపట్టలేవు ఆయనగారి ఫొటోచూస్తే చూచిఉండొచ్చు. కాని, ఆఫొటో యెప్పుడో పన్నెండేండ్లక్రింతం తీసినది. మరి ఇపుడు జడలు పెంచుకొని ఉంటారు.

శంఖధరుడు మరి సమాధానం చెప్పలేదు. తోటలోకి పోయి గోడలకేసి చూస్తూ నిలబడ్డాడు. మళ్ళీ గదిలోకివచ్చి నిశ్శబ్దంగా కూర్చుని, ఏదో ఆలోచించుకోసాగాడు. ఇక్కడి నుంచి ఎప్పుడు పారిపోదామాఅని కొట్టుకులాడుతున్నాడు.

'అందరూ వెదకి పట్టుకోటానికి బయలుదేరుతారేమో, పోలీసు స్టేషన్లలో గుర్తులు వ్రాయించుతారేమో, వీరు ఇబ్బంది పడుటయే గాక, నన్నూ ఇబ్బందిపెడ్తారేమో! కనుక నే వెళ్ళేదెక్కడికో, ఏంపనిమీద వెళ్తున్నానో కాస్త తెలియజేసి వెళ్ళటం అవసరం. బలవంతంగా తీసుకురాదలంచితే మాత్రం బాగుండదు. అదంతా నాఇష్టం. ఇష్ట మొచ్చినప్పుడు

వస్తాను. నా రాజ్య మెవడూ ఎత్తుకుపోవటంలేదు గదా' అని ఆలోచించుకొని, ఒక జాబువ్రాసి పక్కమీద పెట్టాడు.

నడిరేయి దాటిపోయింది. శంఖధరుడు ఒక చొక్కా వేసుకుని గదిలోంచి బయటికొచ్చాడు. ప్రక్కగదిలోనే రాజా గారు పవళించిఉన్నారు. పెరటిదొడ్డివేపు తోటలోకి వెళ్ళాడు. ఒక జామచెట్టుపై కెక్కి గోడ అవతలికి దూకాడు. ఇప్పుడు వాని నెత్తిపైన నక్షత్రమయ నీలాకాశం, ఎదుట విశాలమైన మైదానం వున్నాయి. ఉత్సాహోల్లాసములతో, ఆశ-నిరాశ లతో దడదడలాడుతున్న హృదయం ఉంది. పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వడివడిగా ముందుకు సాగిపోతున్నాడు. ఎక్క డికి వెళుతున్నాడో తెలియదు. అదృష్టదేవత ఎక్కడికి తీసుకు పోతున్నదో!

# ఇరవైరెండో అధ్యాయము

ఐదేళ్లు గడచిపోయింది. కాని శంఖధరునిజాడా లేదు; చక్రధరుని జాడా లేదు. రాజా విశాలసింగ్ దయాధర్మాలకు తిలోదకాలిచ్చి అత్యాచారములకు దిగాడు. అవీ యథేచ్ఛగా సాగిస్తున్నాడు. దయా - ధర్మాలవల్ల వచ్చే దేమిటో అనుభ వం గడించాడు. ఇప్పుడిక అధర్మాలూ - అనాచారాలవల్ల ఊడిపోయేదేమిటో అనుభవంద్వారా తెలుసుకోవాలని నడుం కట్టాడు. ప్రజలపై నల్లేరుమీద బండితోలినట్టుగా నానారకాల అత్యాచారాలూ చేయబడుతున్నాయి. ప్రజలగోడు ఆలకించే నాథుడులేడు. రాజాగారికి ఎవరిమీదా దయఅనేది కల్గటం

లేను. ఇంకేమి ఉన్నదనీ, ధర్మాన్ని పట్టుకుని ఆయన వ్రేలాడటానికి? ఎవని సందర్శనమాత్రంచేతనే హృదయాకాశంలో అరుణోదయం అవుతూండేదో ఆ కిశోరుడిప్పు డేడీ? సమస్త జీవితానికీ మృత్యువుకూ కూడాఆశాజ్యోతియైన ఆ కిశోరు డెక్కడికిపోయాడు? ఏమో, ఎవరికి తెలుసు? ఇంతమందిలో ఇంకా ధైర్యం కోల్పోకుండా ఉన్నది ఒక్క మనోరమ మాత్రమే. కాని, ఇప్పు డామె మాట చెవినిపెట్టేవా రెవరు? రాజాగారికి ఇప్పు డామెమొహం చూడ్డానికైనా ఇష్టంలేదు. ఈ సమస్త అనర్థాలకు మూలం మనోరమయేనని ఆయన నమ్ముతున్నాడు. ఆయన హృదయేశ్వరియైన మనోరమ—సంస్థానచక్రాన్ని తన కనుసన్నలచే నడపిన మనోరమ ఇప్పుడు రాజభవనంలో భికారిణివలె ఉంటోంది. ఆవిడ అజా - పజా కనుక్కునేవాడే లేడు. ఈ భయంకరాంధకారంలో ఆమె ఇప్పుడుకూడా దివిటీలాగా వెలుగుతూనేఉంది. కాని ఆమె ప్రకాశం తనవరకే పరిమితమై ఉంటున్నదేగాని, అంధకారంలోకి ప్రసరించటంలేదు.

సాయంకాలమయింది. సూర్యభగవానుడు పర్వతముల చాటునమాయమైపోయాడు. రమణీమణులు నీళ్ళ బిందెలు తీసుకునిబావికి వచ్చారు. అదేసమయంలో ఒక యువకుడు ఖంజరి చేతబట్టి, వచ్చి నూతిగట్టుమీద చతికిలబడ్డాడు. ఇతడెవ్వరో కాదు, శంఖధరుడే. అతని ఆకారము, వేష - భూషలుచూస్తే తల్లి - అహల్యకూడా ఉలిక్కిపడుతుంది. ఆ తేజోవంతుడు కిశోరుడు కాదు, అతని ఛాయ మాత్రమే. కండలు కరగిపోయి కేవలం అస్థిపంజరం మాత్రంగా వున్నాడు. ఏదో భయంకర వ్యాధిగ్రస్థుడై ఇప్పుడే లేచాడన్నట్టున్నాడు.

ఒక రమణి అతనికేసి చూచి "ఎక్కడనుంచి వస్తున్నావయ్యా పరదేశీ ! జబ్బుగా ఉన్నట్టున్నావే !" అని అడిగింది.

"జబ్బేమీ లేదు అమ్మగారూ ! దూరాన్నుండి రావటంవల్ల అలసిపోయి ఇలా ఉన్నాను." అన్నాడు శంఖధరుడు నభోమండలం కేసి అనిమేషదృష్టితో చూస్తూ.

ఇలా అని శంఖధరుడు తన ఖంజరి తీసుకుని వాయిస్తూ పాడసాగాడు.

ఈ బలహీన యువకుని కంఠస్వరంలోని మాధుర్యం, వ్యాకులత, అనురాగం విని ఆ రమణీమణులు గోడమీది బొమ్మల్లా నిలబడిపోయారు.

"పూజనీయా ! ఇప్పుడు వేళమించిపోయింది, ఈపూటకిక్కడే ఉండిపోండి. ముందు చాలాదూరంవరకూ ఏవూరు - పల్లె లేదు." అన్నది ఒక యువతి.

శంఖ:- మీ ఇష్టం తల్లీ! అలాగే ఉండిపోతాను. అయితే, అమ్మా! ఇక్కడ మహాత్ము లెవరూ ఉండటంలేదా ?

"ఈ మధ్య కొద్దిరోజులక్రితం ఒక మహాత్ముడు వచ్చి ఇక్కడ కొన్నాళ్ళున్నాడు. కాని, ఆయన సన్యాసులవేషంలో లేడు. ఇక్కడ పూర్తిగా ఒక మాసంరోజులు ఉన్నాడు. మీరు ఒక్కరోజు ముందుగా వచ్చి ఉంటే వారిదర్శనం లభించి ఉండేది." అంది రెండవ ఆమె.

"సాధు - సన్యాసుల నెందరినో చూశాను. కాని, అలాంటి పరోపకారిని చూచిఎరుగను.మీ దేవూరు నాయనా" అన్నది ఒక ముసలావిడ.

శంఖ:- ఏదని చెప్పను అమ్మగారూ! దేశాలుపట్టుకు తిరుగుతున్నాను.

ముసలామె:- మీ తలిదండ్రులు జీవించే ఉన్నారు కదూ బాబూ?"

శంఖ:- ఏమో, నాకు తెలియదు తల్లీ! నాన్నగారేమో చాలారోజుల క్రితమే ఎక్కడికో వెళ్ళిపోయారు. నే నప్పుడు రెండు మూడేళ్ళవాణ్ని. ఇక అమ్మసంగతీ తెలియదు.

ముస:- మీ నాన్నగారు ఇల్లొదిలి ఎందుకు వెళ్ళారు? మీ అమ్మతో జగడమాడాడా ఏం?

శంఖ:- లేదమ్మగారూ! జగడమేమీ లేదు. ఈ సంసారమాయలో పడటం ఇష్టంలేక వెళ్ళిపోయారు.

ముస:- ఐతే, నువ్వు ఇల్లొదిలిపెట్టి ఎన్నాళ్ళయిందేమిటి?

శంఖ:- సరిగ్గా ఐదేళ్ళయింది తల్లీ. నాన్నగారిని వెతకటానికనే బయల్దేరాను కాని ఈ ఘడియవరకు ఆయనగారి జాడ ఎక్కడా అంతుచిక్కలేదమ్మా!

"ఏమే అమ్మా! వీరి రూపురేఖలన్నీ ఆ మహాత్ముని రూపురేఖల మాదిరిగానే కన్పడుతున్నాయికదూ? నీకేమైనా కన్పిస్తోందా?" అంది ఒక యువతి ఆ ముసలమ్మతో.

ముస:- ఔనే, ఏదో కొద్దిగా కనపడుతోందిలే. ఏం నాయనా! మీ నాయనగారి కన్నేళ్ళుంటాయి?

శంఖ:- షుమారు నలభై యేళ్ళుంటాయి.

ముస:- కళ్లు చాలా పెద్దవిగా ఉంటాయిగదూ?

శంఖ:- ఔను తల్లీ! అంత పెద్దకళ్ళు ఇంకెవ్వరికీ నేను చూడలేదు.

ముస:- పొడుగ్గా, ఎర్రగా ఉంటాడా?

శంఖధరుని హృదయం దడదడ కొట్టుకోసాగింది.

"అవునమ్మా! ఆయన బాగా ఎరుపే'' అన్నాడు.

ముస:- నాయనా! ఇంతకుముందు ఎవరో ఒక మహాత్ముని గురించి నీతో చెప్పానుకదూ. ఆయనగారి రూపం నీ రూపుతో చాలవరకు కలుస్తోంది

శంఖ:- ఆయనగారు ఇక్కడినుంచి ఎక్కడికి వెళ్లి ఉంటారో యేమైనా చెప్పగలరా అమ్మా?

ముస:- నే నదేమీ చెప్పలేనుగాని, ఆయనగారు వెళ్ళటం మట్టుకు ఉత్తరదిశగా వెళ్ళారు.

"ఆయనగారి నామధేయమేమిటి అమ్మగారూ?" అని అడిగాడు వణకుతున్న హృదయంతో శంఖధరుడు.

ముస:- ఆయన పేరైతే భగవాన్ దాస్. కాని, అది అసలు పేరుగామాత్రం తోచలేదు. అసలు పేరు ఇంకేదో ఉండి ఉంటుంది.

"ఇక్కడ ఆయనగారి ఫోటో ఒకటి ఉందిగా" అన్నది ఒక యువతి.

శంకధరుని హృదయం వందరెట్ల వేగంతో కొట్టుకుంటోంది. "కాస్త ఆ ఫోటో చూపించండి నాయందెంతో దయచూపినవారవుతారు'' అన్నాడు.

ఆ యువతి ఒక్కపరుగులో ఇంటికి వెళ్ళింది. రెప్పపాటు కాలంలో మళ్ళీ ఫోటోతోసహా తిరిగివచ్చింది.

శంఖధరుడు తన రెండుచేతులతో గుండెను జాగ్రత్తగా పట్టుకుని భయకంపితదృష్టితో ఫోటోవంకచూచాడు. వెంటనే గుర్తుపట్టాడు. ఔను, ఇది చక్రధరునిఫోటోయే. ఇందులో లేశ మాత్రంకూడా సందేహానికి తావులేదు. శంఖధరుని గుండెవడ ఆగింది. దేహం చల్లబడింది. ఆశ, భయము, విచారము, అస్థిమితములు ముప్పిరిగొంన వ్యాకులపడి, హతబుద్ధిలా నిలబడి పోయాడు—ఏదో స్మృతికివచ్చినట్టు.

హఠాత్తుగా అతను నిద్రనుంచి మేల్కొన్నవానివలె "ఆయనగారు ఇటు ఉత్తరదిశగానే వెళ్ళారు కదూ? ముందు ఏదైనా ఊరు ఉందా?" అని అడిగాడు.

ముస:—ఔను నాయనా! ఇక్కడికి ఐదుకోసుల్లో ఒక ఊరు ఉంది. ఏదో గుర్తుకొచ్చిచావటంలేదు. ఆఁ 'సాయీగంజ్, సాయీగంజ్. ఇవ్వాళికి ఇక్కడ ఉండవూ?

"లేదు అమ్మగారూ! శెలవిప్పించండి." అని శంఖ ధరుడు ఖంజరీ తీసుకుని లేచి నిలబడ్డాడు.

ఆ రాత్రివేళ అగమ్యాంధకారంలో శంఖధరుడు కాలు భూమిమీద ఆనకుండా పరుగు తీస్తున్నాడు. కాళ్లూరప్పా గుచ్చుకొని అతనిపాదాలు జల్లెడలా తూట్లుపడిపోయాయి. ఒళ్ళంతా అలసి శిథిలమైపోయింది. ఆకలితో ప్రాణం సొమ్మ సిలి, కళ్ళకు బయర్లుకమ్ముకొస్తున్నాయి. దప్పికచేత గొంతు పిడచకట్టుకుపోయింది. అడుగు ఒకచోటవేస్తే ఇంకోచోట పడుతోంది. కాని అతను అలాగే పడుతూ లేస్తూ ముందుకు పోతూనేఉన్నాడు. తెల్లవారేటప్పటికి సాయీగంజ్‌లో ఉండాలి. లేకపోతే చక్రధరుని దర్శనం లభించదేమో! ఇంకా

క్కడికైనా ఆయన వెళ్ళిపోవటం కద్దు. తర్వాత ఈ అనాథ బాలుని ఐదేళ్ళ శ్రమా, ఉరుకులూ-పరుగులూ బూడిదలో పోసిన పన్నీరుచందమయిపోవచ్చు.

క్రూరమృగాల భయంకరారనములు వినపడుతున్నాయి. కటికిచీకటి. మెరకో పల్లమో, పుట్టో, గొయ్యో యేమీ తెలియటంలేదు. ఐనా అతనికి తనప్రాణభీతి ఏమాత్రం లేదు, సూర్యోదయాత్పూర్వమే 'సాయీగంజ్' చేరుకోవాలన్న దొక్కటే అతనిధ్యాస.

గగనమండలంలో అరుణోదయరేఖలు వ్యాపించినవి. తారాగణము అలసిపోయిన పథికునిచందాన తమ ఉజ్వల నేత్రాలు మూసుకొని విశ్రమించ నారంభించినవి. పక్షులు వృక్షాగ్రములపై కలకలారావములు చేయసాగినవి. కాని సాయీగంజ్ జాడ మాత్రం ఎక్కడా కానవచ్చుటలేదు.

హఠాత్తుగా చాలదూరాన ఒక కొండమీద చిన్నచిన్న ఇళ్లు బాలికల బొమ్మరిళ్ళవలె దృగ్గోచరమైనాయి. ఇదే సాయీగంజ్, వచ్చేసింది! శంఖధరుని గుండెదడ మళ్ళీ ఆరంభమైంది. అతని శిథిలదేహంలోకి అద్భుతమైన చురుకుదనం వచ్చింది. ఎక్కడనుంచి వచ్చిందోగాని కాళ్ళకు రెట్టింపుశక్తి వచ్చింది.

కొండపై కెక్కటం అంత తేలిగ్గాదు. పైగా శంఖధరునికి దారి తెలియదు. మార్గం అడిగి తెలుసుకుందామంటే మనిషే కన్పించటంలేదు. ఐనా, నడుంబిగించి ఎక్కిపోతున్నాడు

''ఇటు ఎక్కడికయ్యాయ్? దారి తెలియదా ఏమిటి? అటు పడమరగా ఉంది దారి. కాలుజారి పడ్డావా, వందగజాలు

క్రిందికి జారి పడిపోతావు.' అని పైనుంచి ఆ ఊరుమనిషి ఒకడు పెద్దగా కేక వేశాడు.

కాని ఈమాటలు వినేతీరిక శంఖధరుని కెక్కడిది? చూస్తూమాస్తూండగానే పైకిచేరుకున్నాడు. "బాబా భగవాన్‌దాస్‌గారు ఇంకా ఈవూళ్లోనే ఉన్నారుగదూ?" అని అడిగాడు.

రైతు:— ఏ భగవాన్‌దాసు గారయ్యా?

శంఖ:— బాబా భగవాన్‌దాసుగారినే ఎరుగవా? ఈ ఊళ్లోకే వచ్చారే? సాయీగంజ్ ఇదే కదూ?

రైతు:— సాయీగంజా? అరరె! సాయీగంజ్‌ని నువ్వు అటు తూర్పుగా వదలిపెట్టొచ్చావు. దీన్ని 'బేందో' అంటారు.

శంఖధరుడు హతాశుడై 'ఐతే, సాయీగంజ్ ఇక్కడి కెంతదూరం ఉంటుంది?" అన్నాడు.

రైతు:— సుమారు ఐదుకోసులుంటుంది. కాని, దారి మంచిదికాదు, అంతా ఎగుడు దిగుడు దారి.

గుండెలు చెదరిపోయి చతికిలబడ్డాడు శంఖధరుడు. మళ్ళీ ఐదుకోసుల ప్రయాణం! అదీ మిట్టపల్లాలదారి. అతను ఒకసారి నిరాశచెందిన నేత్రాలతో ఆకాశంకేసి చూశాడు. మరల తలవాల్చి ఆలోచించసాగాడు. 'ఇలాంటి అవకాశం మళ్ళీ చేజిక్కటందుర్లభం. ఇవాళే ఆరాధ్యదేవుని దర్శించక పోతే ఇంక దర్శించటం అసంభవమే'

కూర్చోటానికి సమయం ఎప్పుడూ ఉంటూనేఉంటుంది. ఈవాళ ఈ తపస్సు అంతంకావటమో లేక ఈ జీవనాంతమో ఏదోఒకటి తప్పక జరిగితీరాలి అనుకొని లేచినిలబడ్డాడు.

"వెళ్ళిపోతున్నావా యేమిటి బాబూ! కాస్త ఏదో చిలుంగిలం తాగి వెళ్ళకపోయావూ" అన్నాడు రైతు.

కాని శంఖధరుడు అప్పటికే నడకలంకించుకున్నాడు. వెనకచూపూ లేదు, ఒకరిమాటల ఆలకింపూ లేదు. ఒకటే నడక, ఒకటేపోవటం; ఏదో ఒక అంధశక్తిలా వెళ్ళిపోతున్నాడు. దారిలో కనపడిన ప్రతివ్యక్తినీ 'సాయీగంజ్ ఎంత దూరముం'దని అడుగుతాడు. "అబ్బే! ఎంతోనా! ఆ ముందు వచ్చేదే సాయీగంజ్' అని ప్రతివానినోటినుండీ ఒకే సమాధానం వచ్చేది. కాని ముందున్న గ్రామానికి చేరుకుని 'ఇదేనా సాయీగంజ్!' అని అడిగితే, 'అబ్బే! ఇదికాదు, అదిగో, ఆ ముందు కన్పడుతున్నదే సాయీగంజ్' అని జవాబు. చివరకు మిట్టమధ్యాహ్నానికి ఒక దేవాలయగోపురం కాస్త దృగ్గోచరమయింది. ఒక గొల్లడకాపరిని 'ఇదేవూ'రని అడిగాడు. సాయీగంజ్ అని చెప్పాడతను. సాయీగంజ్! సాయీగంజ్ వచ్చేసింది!

కాని, ఊరు సమీపించేకొద్దీ శంఖధరుని కాళ్ళలో శక్తి శిథిలమవుతోంది. 'ఆయనగారు ఈ ఊరినుండి వెళ్ళిపోలేదుగదా! ఇంక ఆయన దర్శనంకాదేమో!' అన్న శంక కలిగింది. ఈ దుశ్శంకను తన మనస్సులోనుంచి తరిమివేయాలని శతవిధాల ప్రయత్నించుతున్నాడు శంఖధరుడు. కాని, దాని తస్సాదియ్యా! ససేమిరా అని తిష్టవేసికూర్చుని కదలదే!

సాయీగంజ్ కనుచూపుమేరలోకి వచ్చింది. స్త్రీ-పురుషులు తమతమ పొలాల్లో కోతలుకోస్తూ కన్పించుతున్నారు. ఇప్పుడతను ఊరిపొలిమేరలోకి చేరుకున్నాడు. అనేకమంది అతని ముందునుంచే వెళ్ళారు. కాని ఎవ్వరినీ

ఏమీ అడగలేదు. స్వాములవారు ఉన్నారని ఎవడైనా చెప్పి తాడనుకో, ఐతే తను చేసేదేముంది? ఏంచేయ్యాలి?

ఈ సందిగ్ధావస్థలో ఏమీతోచక, గుడిముందు అరుగు మీద చతికిలబడ్డాడు. హఠాత్తుగా గుడిలోనుంచి ఎవరో ఒక వ్యక్తి రావటం చూచి శంఖధరుడు తుళ్ళిపడ్డాడు. అనిమేష నేత్రాలతో అతనికేసిఒకనిమిషం సేపు చూచాడు. ఆపురుషుని పాదాలమీద పడాలని గభాలున లేచినిలబడ్డాడు. కాళ్ళుకంపించి ఏదో నది అతనివేపుకు ప్రవహించిరాగా పాదాలు తేలి పోయినట్టయి-శంఖధరుడు మూర్ఛిల్లి పడిపోయాడు.

శంకధరుడు తనకు స్పృహవచ్చిచూస్తే తాను గుడివరం డాలో చక్రధరునిఒడిలోఉన్నట్టు తెలుసుకున్నాడు. చక్రధరుడు విచారంగా అతనిమొహంకేసి అదేపనిగా చూస్తున్నాడు. గ్రామస్థులనేకులు చుట్టూ నిలిచి ఉన్నారు. ఆహా!శంఖధరునికి ఎన్నాళ్ళ కి సౌభాగ్యం సంప్రాప్తమయింది! అతను కన్నతండ్రి ఒడిలో పడుకొనిఉన్నాడు.

శంఖధరుడు మరల కళ్ళు మూసుకున్నాడు.

"ఏం నాయనా! ఎలాఉంది?" అనడిగాడు చక్రధరుడు వాత్సల్యపూరిత మధురస్వరంతో.

ఏం స్నేహమయమధురశబ్దాలు! ఎవరి వీనులైనా ఎన్నడైనా ఇలాంటి కోమలవాణి నాలకించిఉంటాయా! శంఖ ధరుడేమీ జవాబివ్వలేదు. అతని కా పాదములపై శిరముంచి తనివితీర ఏడ్వాలనిపించింది. అంతకుమించిన సుఖాన్ని అతను ఊహించుకోలేకుండా ఉన్నాడు.

"ఏం బిడ్డా! ఎలా ఉంది?" అని అడిగాడు మళ్ళీ చక్రధరుడు.

"ఇప్పుడు బాగానే ఉన్నాను. భగవాన్‌దాస్ తమ నామధేయమేనా!" అన్నాడు శంఖధరుడు కాతరకంఠస్వరంతో.

చక్ర:—ఔను, నన్నే భగవాన్‌దాస్ అంటారు.

శంఖ:—నేను తమ దర్శనార్థమే వచ్చాను. తమదర్శన భాగ్యం లభించింది. నేను కృతార్థుడనయ్యాను. ఇక నాకష్టాలు తీరిపోతాయి. నన్ను ఉద్ధరించగల్గినవారు తమ రొక్కరే.

చక్రధరుని మనఃస్థైర్యం చలించింది. ఆ యువకుని రూపలావణ్యాల్లో, వాణిలో ఏమున్నదోగాని, అతనితో సంభాషించాలని ప్రబలమైన కోరికగల్గుతోంది. 'ఈ యువకుడెవ్వరు? నా దర్శనార్థం ఎందుకొచ్చాడు? నాదర్శనానికి ఎందుకింత తహతహ? ఆహా! ఎంత సుశీల బాలకుడు! ఇతని మాటల్లో ఎంత వినయం! రూపురేఖలు చూస్తే సాక్షాత్తు దేవకుమారునిలాగే ఉన్నాడు.'

ఒకమనిషినీళ్ళుతెచ్చాడు.శంఖధరుడుకాళ్ళూ-చేతులూ కడుక్కున్నాడు.పరగడుపునే మంచినీళ్లుతాగబోయాడు. కాని, చక్రధరుడు వారించాడు - "ఆఁ ఆఁ! అదేమిటి? ఇప్పుడప్పుడే మంచితీర్థం పుచ్చుకోకు నాయనా. వచ్చి కొంచెం భోంచెయ్యి.

శంఖ:—దాహంగా ఉందండీ.

చక్ర:— దాహంగా ఉంటే మంచితీర్థ మెక్కడికీ పారిపోవటంలేదులే. ఏదో కాస్త ఎంగిలిపడిన తర్వాత త్రాగు.

ఆ త్రాగటంకూడా కడుపులో నీళ్ళు కదిలేట్టు త్రాగవద్దు సుమా.

శంఖ:—రెండు గుక్కలు త్రాగుతానండీ. దాహం ఆపుకోలేకపోతున్నాను.

చక్రధరుడు ముందు కొచ్చి శంఖధరుని చేతిలోని చెంబు లాక్కున్నాడు. "ఇప్పుడు ఒక్కచుక్కకూడా త్రాగటానికి వీల్లేదు సుమా. ప్రాణం తీసుకోటానికి తయారై కూర్చున్నావా ఏమిటి?" అన్నాడు చక్రధరుడు కొంచెం కఠినంగా.

ఈ మందలింపులో శంఖధరునకు కలిగిన ఆనందానుభూతి తన తల్లి ప్రేమమయవాక్కులో సైతం అనుభవం కాలేదు.

గుడివెనుక ప్రక్కన ఒక తోట. ఆ తోటలో చిన్న బావి ఉన్నది. అక్కడే ఒక చెట్టుక్రింద చక్రధరుని వంట తయారు చేయబడింది. ఆయన వంటచేసుకోవటం స్వయంగానే. అంట్లూ - సంట్లూ తానే తోముకుంటాడు. చివరకు నీళ్ళు కూడా స్వహస్తాలతోనే చేదుకుంటాడు. శంఖధరుడు ఆయనగారితో భోంచేసేనిమిత్తం అక్కడికెళ్ళాడు. చూస్తే భోజనం ఏంభోజనం! పూరీలు, లడ్లూ, పాలూ, పెరుగూ, వెన్నా, నెయ్యి మొదలైన సమస్త పదార్థాలూ సిద్ధంగా ఉన్నాయి. ఇవన్నీ తన నిమిత్తమే తెప్పించబడినవని తెలుసుకున్నప్పుడు శంఖధరునికి అమితాశ్చర్యం కల్గింది. శంఖధరుని కొక విస్తరిలో వడ్డించాడు చక్రధరుడు. తానూ ఒక విస్తరిలో కొంచెం మందపాటి రొట్టెలూ, ఇంత ఆకుకూరా వడ్డించుకు కూర్చున్నాడు. అవి అతని స్వయంపాకమే.

'మీరు అన్నీ నాకే వడ్డిస్తున్నట్టున్నారు. ఆమె కోసం ఏమీ ఉంచుకోనేలేదు?" అన్నాడు శంఖధరుడు.

చక్ర:— నాయనా నేను రొట్టెలు మినహా మరేమీ భుజించను. నా జీర్ణశక్తి చెడిపోయింది. అందువల్ల ఒక్కపూట మాత్రమే భోంచేస్తాను.

శంఖ:—ఇవి మీరు కూడా పుచ్చుకోకపోతే, నాకూ అవసరంలేదు.

చివరకు శంఖధరుడుపట్టుబట్టుటచే చక్రధరుడు పదహారేళ్ళ నుండిఆచరిస్తూవస్తూన్ననియమాన్ని భగ్నంచేయవలసివచ్చింది. విసుక్కుంటూ "అబ్బాయ్, నువ్వు మహా మొండిఘటంలా ఉన్నావే. సరే, కానీ, అలాగే తీసుకుంటున్నాలే" అన్నాడు చక్రధరుడు.

అన్నిపదార్థాలూ కొద్దికొద్దిగా తీసుకుని తన విస్తరిలో వేసుకున్నాడు చక్రధరుడు. తతిమ్మావన్నీ శంఖధరుని ముందు పెట్టాడు.

శంఖ:—తమరేదో మాట చెల్లించినట్టుగా కన్పడుతున్నారు. ఇలా తెండి నేను వడ్డిస్తాను.

చక్ర:—ఇదిగో! ఈవిధంగా మొండిపట్టుపట్టావంటే నీకు వైద్యంచేయను సుమా!

శంఖ:—సరే, అలాగే చేయకండి.ఇక్కడే పడ చచ్చిపోతాను. నేచుచస్తే ఏడ్వటాని కెవరున్నారు?

ఇలా అంటూంటే శంఖధరుని కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున నిండాయి. చక్రధరుడు అదిచూచి వ్యాకులుడై "సరే,మంచిది.

నీచేత్తో నువ్వేవడించు. అలాంటి అశుభ శబ్దాలు నోటినుండి రానివ్వటం దేనికి? అన్నాడు.

అక్కడ ఉన్న సమస్త పదార్థాలూ సగానికిపైగా తీసి చక్రధరునిముందు ఉంచాడు శంఖధరుడు. స్వయంగా విసన కర్రతీసుకొని విసరసాగాడు. వాత్సల్యంతో కూడిన కాఠిన్యంతో "ఇవ్వాళ ఆట్టేచూస్తే, నన్ను మంచమెక్కించేటట్టున్నావ్. వహ్వా! ఇన్ని పదార్థాలు అందులో ఇంత తిని నేను జీర్ణించు కోగలనా?" అన్నాడు.

శంఖ:—అందుకనే చాలా తగ్గించిపెట్టాను.

చక్ర:—ఇది చాలా తక్కువా! ఏతే, మరి నువ్వు అన్నీ నా పొట్టలోనే కుక్కదలచావా ఏమిటి? ఇకనైనా శెల్ఫ భోంచేస్తావా లేదా? నాకు విసరవలసిన అవసరంలేదులే.

శంఖ:—ముందు మీరు ఆరగించండి. ఆ తర్వాత నేను మీ విస్తరిలోనే తింటాను.

అతని నేత్రాలు మళ్ళీ ఒకసారి జలమయమైపోయాయి.

చక్రధరుడు తిరస్కారభావంతో "ఎందుకని? నా ఎంగిలి తినటమేమిటి? భక్తీ! ఇక అన్నీ నీ యిష్టప్రకారమే జరుగుతున్నాయే" అన్నాడు.

శంఖ:—నాకు ఎన్నాళ్ళనుంచో ఈ కోరిక ఉంది. మీ కీర్తి విన్ననాటినుంచీ ఇలాంటి సదవకాశంకోసం ఎదురుచూస్తు న్నాను.

చక్రధరుడు మరొకసారి పరాజయం అంగీకరించక తప్ప లేదు. అతను ఏకాంతవాసి, నిగ్రహంగలవాడు, వ్రతధారి

అయిన యోగి. కాని ఈనాడు ఆ అపరిచితబాలకుని మొండి తనాన్ని ఏవిధంగానూ త్రోసిపుచ్చలేకుండాఉన్నాడు.

చక్రధరుడు భోంచేసి లేచిన తరువాత ఆ విస్తరిలోనే మిగతా పదార్థాలన్నీ వడ్డించుకుని భోజనానికి కూర్చున్నాడు శంఖధరుడు. ఆహా! ఈ భోజనంలో ఎంత రుచి ఉన్నదో! అమృతమైనా ఇంతరుచిగా ఉంటుందా!

చక్రధరుడు చేతులుకడుక్కున్నాడు. శంఖధరు నుద్దేశించి "ఇవాళ నువ్వు నానియమాలు రెండూ భంగపరచావు. ఊరూపేరూ తెలుసుకోకుండా అతిథినిపిలవటంవల్ల కలిగేఫలిత మిదే. ఇటువంటి మొండిపిల్లవాణ్ణి నాచెంత ఉంచుకోను. సరే, నీ దేవూరు? ఇక్కడికి ఎంతదూరంలోఉంది?" అన్నాడు గద్గద కంఠంతో.

శంఖ:—నా కేవూరూ లేదు.

చక్ర:—తలిదండ్రులు ఉండివుంటారుగద. వా రే గ్రామంలో ఉంటున్నారు?

శంఖ:—ఇదీ నాకు తెలియదు. నాన్నగారు నా చిన్న తనంలోనే గృహత్యాగంచేసి ఎక్కడికో వెళ్ళిపోయారు.

ఇక తల్లిగారిసంగతంటారా? ఏడేళ్ళనుంచి ఆమె సమాచారం కూడా తెలియదు.

చక్రధరునికి భూమి రసాతలానికి క్రుంగిపోతున్నట్టుగా వుంది. ఆయన నదీప్రవాహంలో కొట్టుకుపోతున్నట్టనిపించింది. ఏమిటీ? తండ్రి ఇతనిచిన్నతనంలోనే గృహత్యాగం చేశాడా? తల్లి సమాచారం తెలిసి ఏడేళ్ళయిందా! ఓరి భగవంతుడా! నా హృదయంలో నుంచి తొలగించటానికి పదహా

రేండ్లనుంచి నేను ప్రయత్నించుతూన్న చిన్నారి బాలు డితడు కాడుకదా! "ఐతే నువ్వీ ఐదేండ్లనుంచి ఎక్కడున్నావు! ఇంటికి వెళ్ళకుండా ఏంచేస్తున్నావు?" అన్నాడు చక్రధరుడు తన హృదయాన్ని చిక్కబట్టుకుంటూ.

శంఖ:—నాన్నగారి అన్వేషణకోసం బయలుదేరాను. ఆయన కనబడేంతవరకూ ఇంటిముఖం చూడదలచుకోలేను.

చక్రధరునికి పృథ్వీమండలం అంతా ఊగిసలాడుతున్నట్టు గానూ, బ్రహ్మాండం ఒక ప్రళయభూకంపంతో ఆందోళితమవు తున్నట్టూతోచింది. వసారాలో గుమ్మానికి ఆనుకుని కూర్చుని ఉన్నాడు. ఆశ భయావేశములను అణచివుంచటంవల్ల క్షీణించిన స్వరంతో "నీపేరేమిటి నాయనా?" అని ప్రశ్నించాడు. కాని ఇదొక ప్రశ్నే కాదు. తనకు తెలిసిన విషయాన్ని బలపరచుకో వటం మాత్రమే. దడదడలాడే హృదయంతో సమాధానం కోసం చెవులు రిక్కించి, ఒక నేరస్థుడు తన శిక్షను వినుటకై న్యాయాధీశునికేసి చూస్తూ చెవియొగ్గియున్నట్టు - సావధాన చిత్తుడైవున్నాడు.

"నాపేరు శంఖధరసింగ్"

చక్ర:—మరి మీ తండ్రిగారి పేరో?

శంఖ:—ఆయనపేరు మున్షీ చక్రధర్‌సింగ్.

చక్ర:—ఏవూరు?

శంఖ:—జగదీశపురం.

సర్వనాశనం! చక్రధరునికి బొందిలోనుండి ప్రాణం ఎగిరిపోతున్నట్టుగా కనిపించింది. నలువేపులూ శూన్యంగా తోచింది. శంఖధరుడు! చాలు! ఈ ఒక్క శబ్దమే శూన్యా

కాశంలో ఒకానొక పక్షివలె తిరిగినచోటనే తిరుగుతున్నది. శంఖధర్!ఆ ప్రాణంలేనట్టున్న శూన్యస్థితిలో చైతన్యాన్ని సంస్కారములతో బంధించిఉంచిన స్మృతి ఇదే.

శంఖధరుడు తన తండ్రిదగ్గరకువచ్చి అప్పుడే ఒకనెల రోజులైపోయింది. అతను వెళ్ళాలన్నమాటే తలచడు. చక్రధరుడూ వెళ్ళమని అంతకంటే చెప్పడు. శంఖధరుడెంతో హుషారుగా ఉంటున్నాడు- తన కింక ప్రపంచంలో ఏమీకష్టమూ దుఃఖమూ, బాధా లేదన్నట్టుగా. ఈ కొద్దిరోజుల్లోనే అతని ఆకారమంతా మారిపోయింది. ముఖమండలంలో యౌవన తేజస్సు ధగధగ మెరిసిపోసాగింది. బక్కచిక్కిపోయిన దేహం కూడ కోలుకొని కండలుదేరింది. అఖండ బ్రహ్మచర్యవ్రతధారుడైన ఋషికుమారుడా అన్నట్టున్నాడు.

చక్రధరు డిప్పుడు తనచేతులతో ఇవతలిపుల్లతీసి అవతల పెట్టవలసిన అవసరంలేదు. సమస్తము శంఖధరుడే చేసుకుపోతున్నాడు. చివరకు ఆయనగారు స్నానంచేసిన ధోవతిని సైతం పిండి ఆరవేయనిచ్చేవాడుకాదు. ఒకరు ప్రశ్నిస్తే రెండోవారు సమాధానం చెబుతూన్న సమయం ఆ ఇద్దరు ప్రాణులజీవితంలో అన్నిటికంటే ఆనందదాయకమైన సమయం. స్వాములవారు తన సమస్త జీవితానుభవాలూ, తత్వశాస్త్రము, ధర్మశాస్త్రము చరిత్రలకు సంబంధించిన విషయాలన్నీ నూరిపోయాలని అభిలషిస్తున్నారు. అన్యులనోట వాని సుగుణాలు, సమాన - శీలములు వర్ణింపబడుతూంటే విన్నప్పుడు ఎంత గర్వానుభూతి కలుగుతుంది! బ్రహ్మానందంతో గద్గదుడైపోతుండేవాడు. నేత్రములు అశ్రుపూరితములవుతూండేవి. ఈ యువకుడు స్వాముల

వారి పుత్రుడే నన్న విషయం ఊరంతా పాక్కింది. తనకుమా రుడు కాదని చక్రధరుడు ఎంతచెప్పినా ఆ ఇస్వారిరూపు రేఖల పోలికలనుబట్టి ఎవరూ ఆయనమాట నమ్మేవారుకాదు. అంద రికీ తెలిసిన విషయమే ఆయనకు తెలియదు. తెలుసుకోవాలన్న కోరికా లేదు.

తండ్రిగారి పాదములపైబడి అంతా స్పష్టంగా చెప్పి వేయాలని అప్పుడప్పుడు శంఖధరుని మనస్సులో ప్రబలమైన కోరిక తలెత్తుతూండేది. ఈ కోరిక అతని మనస్సులో మాత్రమే కాదు. చక్రధరుడూ పుత్రప్రేమతో విహ్వలుడై పోతూండేవాడు. కుమారుని కౌగలించుకుని "బాబూ! నువ్వు నాకంటిపాపవే; నువ్వు నా గుండెలో గుండె" వని చెప్పాలని పించేది. శంఖధరుడు తన తల్లి విరహదుఃఖమూ, నాయనమ్మ శోకాలూ, తాతగారి క్రోధగాథలూ వర్ణించి చెబుతుండే వాడు. అతని నోటినుండి ఆ వర్ణనలు ఎంతవిన్నా చక్రధరునికి విసుగనేది కలిగేదికాదు. తనివితీ రేదికాదు. రాణీగారు వాని నెంతగానో ప్రేమిస్తున్నదన్న విషయం విని చక్రధరుడు విచారపడుతుండేవాడు.

ఈవిధంగా ఒక నెల గతించింది. ఈయనగారిని ఇంటికి తీసుకుపోయేమార్గమేమిటా అని శంఖధరు డిక ఆలోచించ సాగాడు. నాన్నగారితోసహా ఇంటికి చేరుకున్నసమయం ఎంత ఆనందదాయకంగా ఉంటుంది!

కాని, ఎంత ఆలోచించినా వానికి దారీతెన్నూ కన్పించ లేదు. 'ఐతే, జాబురాసి అమ్మనే ఇక్కడికి ఎందుకు రప్పించ కూడదు? జాబుచూడగానే ఉరుకులు పరుగులతో వచ్చి

వాలదూ' అని ఆలోచించుకున్నప్పుడు ఇన్నాళ్ళూ అనవస రంగా జాగుచేశానే! అని పశ్చాత్తాపపడసాగాడు. ఆ రాత్రే తల్లికి ఉత్తరంవ్రాసి పోస్టులో వేశాడు. ఇక్కడి చిరునామా, రైలుస్టేషను వగైరా వివరాలన్నీ స్పష్టంగా వ్రాశాడు.

మళ్ళీ ఒకనెల గడిచింది. అహల్యా రాలేదు; ఇంక వరూ రాలేదు. శంఖధరుడు ప్రొద్దస్తమానం ఆవిడకోసం ఎదురుచూస్తూండేవాడు. అక్కడికి రైల్వేస్టేషను ఐదుమైళ్ళ దూరంలోఉంది. దారీ మంచిదే. ఐనా ఎవ్వరూరాలేదు. చక్ర ధరుడు ఎక్కడికైనా వెళ్ళిపోయినపుడు శంఖధరుడు గప్‌చిప్‌గా స్టేషనువేపుకు వెళ్ళేవాడు. నిరాశతో తిరిగివచ్చేవాడు. ఎట్ట కేలకు నెలరోజులకు ఒకఉత్తరంముక్క అందింది. అది చదువు కున్నాడు. అంతే. అతని దుఃఖానికి అంతులేకపోయింది. అహల్య అందులో ఇలా వ్రాసింది— "నేను చాలా దురదృష్ట వంతురాలిని. ఇంత కఠిన తపస్సుచేసి, నువ్వు వారిని దర్శించగలి గావు. ఆ దేవతామూర్తిని దర్శించాలని ఎంత అభిలాషఉన్నా నేను ఇక్కణ్నుంచి కదలలేను. నెలరోజులనుండి జబ్బుగా వున్నాను. బ్రతుకుతానన్నఆశ లేదు. నువ్వు వచ్చెయ్యి. లేకపోతే నిన్ను చూడాలన్న ఈ కడసారి కోరికకూడా నా తను వుతోనే వెళ్ళిపోతుంది. నేను కొన్ని నెలలనుంచి ఆగ్రాలో ఉన్నాను. మనస్సు కంగారుగా ఉంటోంది. ఏదో ఒకవిధంగా నాస్వామిని తీసుకురాగలిగావా, నా అంత్యదశలో వారి చర ణారవిందముల నొకసారి దర్శనంచేసుకోగలుగుతాను. ఆయన గారు రారని నాకుతెలుసు. అనవసరంగా వారిని బలవంతం

చేయవద్దు. కాని, నువ్వుమాత్రం ఒక్కక్షణంకూడా ఆలసింపక వచ్చేసెయ్యి."

శంఖధరుడు పోస్టాఫీసు ఎదుట నిలబడి చాలసేపు ఏడ్చాడు.

అతనిమొహం చిన్నపోయి, విచారంగా ఉండటం చూచి "ఏం నాయనా! ఇవాళ ఇంత విచారంగా ఉన్నావెందుకని?" అని అడిగాడు చక్రధరుడు.

శంఖ:—అమ్మదగ్గరనుంచి ఉత్తరంవచ్చింది. ఆమె చాలా జబ్బుగాఉంది. నేనేమో నాన్నగారి అన్వేషణకు బయలుదేరాను. ఆయనగారు దొరకలేదు సరిగదా; అమ్మ కూడా వెళ్ళిపోతోంది. మీమీద ఎన్నో ఆశలుపెట్టుకుని వచ్చాను. కాని, మీకూ ఈ అనాథునియందు కరుణ కలిగి నట్లు లేదు. భగవంతుడు తమకు యోగబలం ప్రసాదించాడు. తలచుకుంటే మీరు మానాన్నగారిజాడ చెప్పగలరు.

"నాయనా! నేను యోగీశ్వరుణ్ణి కాదు. కాని, మీ తండ్రిజాడమాత్రం తెలుసుకునేఉన్నాను. ఆయన్ను కలుసుకున్నాను కూడాను. ఆయనా నిన్నుచాటుగా చూశారు.'' అన్నాడు చక్రధరుడు గంభీరంగా.

శంఖ:—ఏమిటీ? తమరునాన్నగారిని కలుసుకున్నారా? ఐతే, ఇంతవరకు నాతో చెప్పలేదేం? దీన్నిబట్టిచూస్తే, తమకు నామీద దయకలుగలేదని తెలుస్తూంది.

చక్రధరుడు దీనికి జవాబేమీ ఇవ్వలేదు. అతని కిప్పుడు అగ్నిపరీక్షగా ఉంది. ఎన్నాళ్ళకో అనాయాసంగాను, అప్ర యత్నంగానూ అతనికి కన్నకుమారునిమొగంచూచే సౌభా

గ్యం లభించింది. తన మనస్సులోనుంచి పారద్రోలిన సమస్త భావనలూ పునః జాగృతమయ్యాయి; ఇప్పు డవి వియోగ భీతిచే ఆర్తనాదం చేస్తున్నాయి. అతి ప్రయాసతో తాను సడలించుకోగలిగిన మోహపాశం ఇప్పుడు అతన్ని నూరురెట్లవేగంతో తనవేపుకు లాగుతోంది.

"ఐతే, ఇక నాకు నిరాశయే గతియా?" అన్నాడు శంఖధరుడు డగ్గుత్తికతో.

తన హృదయాంతరాళం నుండి పైకెగసి వస్తున్న ఉచ్ఛ్వాసాన్ని బలవంతంగా ఆపుకుని "కాదు నాయనా! పుత్రప్రేమ పీడితుడై ఆయన స్వయంగానే నీ దగ్గరకు పరుగెత్తుకు వస్తే రావచ్చు. నువ్వు నీజీవితంలో ఉన్నతాదర్శాలను నెరవేర్చగలిగితే నీ నాయన్ని తప్పక ఆకర్షించుతావు." అన్నాడు చక్రధరుడు.

శంఖ:—తమ దర్శనభాగ్యం మరల నా కెప్పుడు కల్గుతుంది! తా మెక్కడున్నది నాకెలా తెలుస్తుంది? నేను తమను పితృతుల్యులుగా భావించుకున్నాను; అలాగే జీవితమంతా భావిస్తూఉంటాను. నామనసులో తమపాదారవిందములయందు భక్తి - ప్రపత్తులు సదా స్థిరంగా ఉంటాయి. తమ దర్శనార్థం నాఆత్మ ఎల్లప్పుడూ తహతహలాడుతూనే ఉంటుంది. మా అమ్మగారికి కాస్త కులాసాచిక్కగానే మళ్ళీ తమసన్నిధికి వచ్చేస్తాను."

"వద్దు నాయనా! వద్దు. నువు శ్రమపడిరావలసిన అవసరంలేదు. నేనే స్వయంగా అప్పుడప్పుడు నీ దగ్గరకు వచ్చిపోతుంటాను. నేనూ నిన్ను పుత్రతుల్యునిగానే తలచాను, ఇక

ముందూ అలాగే ఎంచుతాను. నా ఆశీర్వాదం సర్వదా నిన్నంటిపెట్టుకొనే ఉంటుంది" అన్నాడు చక్రధరుడు ఆర్ద్ర కంఠంతో.

సంధ్యా సమయం. శంఖధరుడు తనతండ్రిదగ్గర శెలవు తీసుకొని బయలుదేరాడు. చక్రధరునికి తన హృదయం తన రొమ్మునూ బద్దలుకొట్టుకొనిశంఖధరునితో పోతున్నట్లనిపించింది. అతను కనుచూపుకు అందకుండా దాటిపోయినప్పుడు ఒక దీర్ఘ నిట్టూర్పువిడిచి, చక్రధరుడు బాలునివలె విలపించ సాగాడు.

చక్రధరునికి ఆ ప్రతిభావంతుడైన యువకుడు మరల కంటికగపడడేమోనన్న తలంపు కలిగింది.

# ఇరవైమూడో అధ్యాయము

అభాగ్యురాలైన అహల్యకు ఈ ఇహలోకం శూన్యమై పోయింది. భర్తను ముందే పోగొట్టుకున్నది. జీవితానికి ఏకైక ఆధారంగా ఉన్న కుమారుడు కూడావెళ్ళి పోయాడు. ఇప్పుడిక ఎవరిముఖం చూచుకొని జీవిస్తుంది? జగదీశపురి రాజ్యం ఆవిడపట్ల ఋషీశ్వరుని శాపంగా పరిణమించింది.

ఆ రాజభవనం ఆమెను రాక్షసిలా కరవవచ్చినట్టుగా ఉంటోంది. ఆమె ఇప్పుడా కొంపనువదలిపెట్టి ఇంకెక్కడికైనా వెళ్ళిపోవాలనుకుంటోంది. ఒక చిన్న తాటాకుగుడిసెయో, ఒక చెట్టు పంచో, ఒక గుహో,నదీతీరమో, ఇందులో ఏదైనాసరే,

ఈ భవనాలకంటే వేయిరెట్లు ఉత్తమంగా ఆమెదృష్టికి కన్పడుతోంది. కన్నబిడ్డను హృదయానికి హత్తుకుంటూ, భర్తతో ఆ చిన్నకొంపలో ఉండేరోజులు ఎంత ఆనందదాయకమైనవి! ఉండుండి ఆమెకు తనభోగలాలసత్వంపట్ల కోపమూ, అసహ్యమూ కల్గుతుండేది. అదే ఆమె నీ స్థితికి పాల్పడజేసినది.

ఆ పాపాని కేమీ ప్రాయశ్చిత్తం లేదా? ఈ జన్మలో మళ్ళీ పతిదేవుని సందర్శనభాగ్యానికి నోచుకోలేదా! తనప్రియ కుమారుని ముద్దుమోము మరల చూడజాలదా? ఇందు కేమీ ఉపాయంలేదా!

రాజభవనం ఇప్పుడు దెయ్యాలకొంపగా-తయారైంది. ఆ భవనాని కిప్పుడు యజమాని అంటూలేడు. రాజాగా రసలు అటుకేసి తొంగిచూడటమే మానివేశాడు. ఆయనగా రిప్పుడు ఎక్కువకాలం తమ ఎస్టేటుగ్రామంలోనే గడపుతున్నాడు. ఆయనచేసే దుండగాలు అత్యాచారాలు వర్ణింపశక్యంకాదు. ఆ గాథలు వింటే రోమములు నిక్కపొడుచుకుంటాయి. సంస్థానమంతటా కాకిగోలగా వుంది. ఎక్కడో ఒక గ్రామాని నిప్పంటించి భస్మీపటలంచేసేవాళ్లు. మరొకచోట ఊళ్లో నూతులన్నీపూడ్చటమో, పాడుచేయటమో చేస్తుండేవాళ్లు. ఎవ్వడి మీదా రాజాకు దయా - దాక్షిణ్యాలు ఉండేవికాదు. ఆయనలో ఉన్న సద్భావనలన్నీ ఆ శంఖధరునితోనే పోయినై. ఆ పాపిష్టిదినం అతనిపై అకారణంగా ఇంత కఠోరప్రహారం చేశాడు రాజా దానికి ఇతరులను హింసించుటద్వారా బదులు తీర్చుకుంటున్నాడు.

ఇప్పుడు రాజా యమధర్మరాజులా తయారయ్యాడు. అతనిముందుకు వెళ్ళటాని కెవ్వరూ సాహసించలేకపోతున్నారు. మనోరమ కంటపడితేనే రాజా ప్రళయకాల రుద్రుడైపోతుండేవాడు. ఏదైనా చెప్పటానికూడా అహల్య సహితం గజగజ వణకిపోతోంది. తన ప్రియసుతుని, భర్త అన్వేషణనుగూర్చిఅనేకవిధాలుగా ఊహించుకుంటుంది అహల్య. కాని ఎవరితో చెప్పాలి. తన ఈ భోగ-పరాయణత్వానికిగాను ఈశ్వరుడీ శిక్ష విధించాడని అనుకునేది. తన భర్తృగేహానికి వెళ్ళటంద్వారా దీనికి ప్రాయశ్చిత్తం చేసుకుంటే బహుశా ఈశ్వరుడు ఆమె అపరాధాన్ని క్షమించితే క్షమించవచ్చు. కాని, అయ్యో! మానవహృదయమా! ఇలాంటి ఘోరాతి ఘోర విపత్కాలంలో సహితం అభిమానభూతం నెత్తిమీది నుండి దిగదు.గదా! వెళ్ళాలని మనస్సులో ఉంది. కాని, ఒక షరతు. ఎవరైనా వచ్చి రమ్మనమని అడగాలి. రాజా గనుక మున్షీజీతో ఏదో సాంకేతికంగా చెప్పితే చాలు.ఆమెకు ఆహ్వానంవచ్చితీరుతుంది. కాని, రాజాగారు యేడీ? ఆయనగారి దర్శనమే గగనకుసుమంగదా! ఒకవేళ దర్శనమైనాకూడ నోరు విప్పిచెప్పటానికి ధైర్యంలేదు.

అహల్య తన అభిప్రాయాన్ని గనక మనోరమ ముందు వెలిబుచ్చితే అతితేలికగా పనిజరిగిపోతుంది. ఇందులో సందేహమేమీలేదు. కాని అహల్యమనస్సు మనోరమమనస్సుతో యేనాడూ కలియలేదు. ఇప్పుడూ లేదు. మరి ఆవిడతో చెప్పేదెట్లా?

ఒకనాటిసంగతి : అహల్య మనోవ్యాకులత భరించ లేక సంకోచ బిడియా లన్నీ వదలి మనోరమదగ్గిరకు వెళ్ళి కూర్చున్నది. మనోరమ సన్నిధికి అభ్యర్థినిగా వస్తూ, అహల్య కెంత మానసికబాధకల్గిందో ఒక్కమాటలో చెప్పితే చాలు— తనగదిలోనుంచి, మనోరమ గదికి రావటానికి కనీసం రెండుగంటలసేపు పట్టింది. అనేకసార్లు గడపదాకా వచ్చి మళ్ళీ తిరిగిపోయింది. జీవితపర్యంతం ఎవరిని తిరస్కరించుతూ వచ్చిందో ఆవ్యక్తి ఎదుటకే ఇవాళ తనఅవసరంకోసం వెళ్ళటానికి ఆమె సిగ్గుపడింది. కాని, ఆ శ్రీమన్నారాయణమూర్తియే ఆవిడకు గర్వభంగం చేసినపుడు, ఇప్పుడిక కృత్రిమాభిమానంవల్ల ఏం ప్రయోజనం ?

"నేను ప్రాయశ్చిత్తం చేసుకోగోరుతున్నాను. ఆ విషయంలో మీ సహాయం కోరుటకే వచ్చాను. ఈ యావత్తు అవమానానికి మూలకారణం నా విలాసప్రేమయేనని ఇప్పుడు నా కనుభవము కాసాగినది. దీనికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని నా కోరిక. ఇక్కడినుంచి కదలిపోతే, నా మనోరథం సిద్ధిస్తుందని నామనస్సు పదేపదే చెబుతున్నది. నాఅంధవిలాసాల కారణంగానే నా కీశిక్షయావత్తూ సంప్రాప్తమవుతున్నది. మీరువెళ్ళి నన్ను తీసుకువెళ్ళమని అత్తగారితో చెప్పండి. ఈ భవనంలో పాదంపెట్టి నాసుఖాన్ని కోల్పోయాను. ఇక్కడి నుంచి వెళ్లిపోతేనే మళ్ళీదాన్ని పొందగల్గుతాను" అని చెప్పింది అహల్య.

"మంచిది, అహల్యా ! ఇవాళే వెళ్ళివస్తాను" అన్నది మనోరమ.

అటుపిమ్మట నాలుగో రోజున కోడలికి ప్రయాణం చెప్పి పంపాడు మున్షీ వజ్రధరుడు. అప్పుడు రాజా క్యాంపులో ఉన్నాడు. మున్షీగారి సందేశం అందినవెంటనే జగదీశపురం వచ్చేశాడు. రాజాగా రెక్కడ ఖర్మంచాలక తనవద్దకు వస్తాడో అని అహల్యకు గుండెదడగా ఉంది. ఎదుటపడకుండా మొహం తప్పించి తిరుగుతోంది. రాజాగారు తన్న త్తవారియింటికి పంపటానికి అంగీకరించాడన్నట్టుగా కన్పడసాగింది. కాని, ఈమెకు వెళ్ళాలని ఇప్పు డంతగా అభిలాష లేదు. ఇక్కడనుంచైతే వెళ్లాలనే ఉంది గాని, వెళ్ళబోతే పుట్టెడుదుఃఖం ముంచుకొ స్తోంది. ఈ ఇంటినే ఇంతవరకూ తనఇల్లుగా భావిస్తూవచ్చింది. అత్తవారిఇల్లు పరాయిఇల్లుగా ఉండేది. నిర్మల యేమాట అంటుందో యేమో ! అంటే అప్పుడు తనేం చేస్తుంది! ఒక నాడు స్వాభిమానంతో వదలివచ్చిన ఇంటికే మళ్ళీ ఈనాడు వెళ్ళవలసివస్తోంది. ఈ విషయాలన్నీ ఆలోచిస్తూంటే ఆమె మనస్సెంతగానో క్షోభ చెంది, రాజాగారివద్దకు వెళ్ళి "నన్ను పంపుతున్నా రెందుకనీ? నాకు వెళ్ళాలని లేదే" అన్నది అహల్య.

రాజాగారు నవ్వుతూ "సంతోషపూర్వకంగా అత్తవా రింటికి వెళ్ళే ఆడపిల్ల లెవ్వరున్నారమ్మా? కూతుళ్ళను సం తోషపూర్వకంగా సాగనంపే తండ్రులు మాత్రం యెవ్వరుం టారు ? నువ్వు వెళ్ళిపోవాలని నే నెప్పుడు కోరాను ? కాని, ఇది మున్షీజీ ఆజ్ఞ. మరి నేను దానిని శిరసావహించవలసిందే. ఆయనగారు మగపిల్లవాని తండ్రి; నే నేమో ఆడపిల్ల తండ్రిని, మరి మాఇద్దరిమధ్య సమానత్వ మెలాఉంటుంది ? అదీగాక,

అమ్మాయ్! నాకూ ఏవో ముచ్చట్లూ, కోర్కెలూ ఉంటా యిగదా. వాటిని తీర్చుకోటానికి ఇంతకంటె సదవకాశం ఏ ముంటుంది? ఔను, శంఖధరుడే గనుక ఉండిఉంటే వాడిపెళ్ళి పేరంటాలతో నా ముచ్చట్లన్నీ తీరిఉండేవి. ఇప్పు డన్నీ నిన్ను కాపరానికిపంపటంలోనే తీర్తాయి" అన్నాడు.

అహల్య దీని కేం సమాధానం చెబుతుంది?

మర్నాటినుంచి కుమార్తెను పంపే ఏర్పాట్లలో దత్తచిత్తుడై ఉంటున్నాడురాజా. ఎస్టేటులో ఉన్న బంగారు పనివారంతా పిలుచుకు రాబడ్డారు. ఆభూషణాలు తయారు కాసాగాయి. దుస్తులపనంతా సంస్థానంలోని దర్జీలకు అప్పగించబడింది. పిండివంటవాళ్ళు ఇనపకళాయి లెక్కించారు. బుట్టలకు బుట్టల మిఠాయిలు తయారవుతున్నాయి. భవనానికి సున్నం పూతలు వగైరా పనులన్నీ జోరుగా సాగిపోతున్నాయి. రాజాలూ, శ్రీమంతులూ, ఆఫీసర్లకందరికీ ఆహ్వానాలు వెళ్తున్నాయి. పట్నంలో ఉన్న భోగంమేళాలన్నిటికీ బయానాలు ఇవ్వబడినై. విద్యుద్దీపాలంకరణకు ఏర్పాట్లుప్రారంభమయ్యాయి. ఈ సామగ్రి, ఈ అట్టహాసాలు చూచి అహల్య లోలోపల విసుక్కునేది, సిగ్గుపడుతూండేది. 'ఈ లేనిపోని బెడద ఒకటి కొనితెచ్చుకున్నానే! ఇప్పు డీ ముసలితనంలో కాపరానికి వెళ్ళటమేమిటి? కాటికి కాళ్ళు చాచుకూర్చున్న నన్ను కాపరానికి పంపటానికి ఈ ఆర్భాటాలా' అనుకున్నది.

అహల్యను అత్తవారిఇంటికి పంపించే విషయంలో రాజా విశాలసింగ్ చూపిన ఉత్సాహం రాజాల్లోగాని, శ్రీమంతుల్లోగాని కన్పించదు. ఈ సారెవస్తువులన్నీ పెట్టుకొనుటకు

మున్సీ వజ్రధరుని ఇంట్లో స్థలంకూడా లేదనే చెప్పవచ్చు. కంచుపాత్రలు, వెండివస్తువులు, గాజు, కొయ్యసామాన్లూ, బట్టలు, పళ్లూ - ఫలాలూ, రకరకాల తినుబండారాలూ, ఆవులూ, గేదెలూ అసంఖ్యాకంగా వచ్చిపడ్డాయి. ఇవన్నీ కొన్ని వారాలపాటు వస్తూనే ఉన్నాయి. రెండుఏనుగులూ, ఐదుగుర్రాలుకూడా వచ్చి చేరాయి. వాటిని కట్టివేయటానికి ఇంటివద్ద స్థలంలేదు. అహల్యవెంట ఐదుగురు దాసీలుకూడ వచ్చారు. తహశీల్‌దారుగారు కొత్తఇల్లు కట్టించినమాట నిజమే! కాని, ఒకరోజున జగదీశపురం ఎస్టేటులో సగానికి సగం తనఇంటి కొచ్చిపడుతుందని, ఆ కట్టేరోజున అతను కలగన్నాడా ఏం? సామానుతో ఇంటిలోని మూలమూలా క్రిక్కిరిసిపోయింది. అటకలూ, చూరులూ, ఒకటేమిటి అన్నీ ఒక గడ్డిపోచకు సందులేకుండా నిండిపోయినై. చివరకు అక్కడికీ సామాను మిగిలిపోతే ఇరుగు - పొరుగువాళ్ళ ఇళ్ళల్లో కూడ సర్దిపెట్టవలసివచ్చింది. ఇవన్నీగాక లక్షలరూపాయల రొఖ్ఖంకూడాను. తెచ్చుకోటానికైతే అవన్నీ తెచ్చుకున్నాడు కాని, తహశీల్దారు మహాశయుడు ఇప్పుడు వాటిపంక చూచి నిలపిస్తూంటాడు; లోలోపల మండిపడుతుంటాడు. కామా మరి? పాపం! ఇవన్నీ అనుభవించేవా రేరి?

నిత్యము మాటిమాటికీ చక్రధరుని పేరెత్తి కోపగించుకుంటూ ఉంటాడు- "వట్టి చేతగానివెధవ, పరమదౌర్భాగ్యుడు తాను పోనేపోయాడు, పైగా పిల్లవాణ్ణికూడా తీసుకుపోయాడు. దిక్కూదివాణంలేకుండా ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో! ఈమొనగాడా దేశాన్ని ఉద్ధరించేది? 'ముందు

ఇల్లు చక్కబెట్టుకో, తర్వాత ఊరు ఉద్ధరిద్దువుగాని' అనిపెద్దలు ఊరకేచెప్పారా! ఇంట్లోవాళ్లు చస్తుంటే చీమకుట్టను, కాని, లోకంకోసం ప్రాణబలికి సిద్ధం! ఇక చెప్పాడయ్యా చెప్పండి, ఈ ఏనుగుల్లూ, ఈ గుర్రాలూ, ఈ కార్లూ, ఈ బళ్లూఏంచేసు కోను? ఒక్కణ్నే దేనిమీాదని. ఎక్కి తైతక్కలాడమంటావు? కోడలుగారున్నదంటే ఏడ్పులతో తీరికేలేదు. ఇక ఆవిడగారు (భార్య) ఉండటానికి ఉంది! కడుపులో పుట్టెడుదుఃఖం పెట్టు కొని, అసలు మంచంమీాదనుంచి లేవలేకుండా పడిఉంటోంది. ఇంకెవరూ వీటి నెక్కి తిరిగేదీ? ఈ సామాను నా ప్రాణానికి జంజాటమయింది!'

అహల్య ఇక్కడికివచ్చి మరింత పశ్చాత్తాపపడసాగింది. ఆ రాణివాస విలాసమయజీవితంతో విరక్తిచెంది, ఏదో ప్రాయశ్చిత్తం చేసుకోవాలన్న ఉద్దేశంతో ఇక్కడికొచ్చింది. కాని, ఆ సిరిసంపదలపీడ తన్ను వదలకుండా ఇక్కడికీ వచ్చి కూర్చుంది. ఆమె సిరిసంపదల బారినుండి తప్పించు కోవాలని చూస్తోంది. కాని అవి ఆమెను మరింత పెనవేసు కున్నాయి. అక్కడే కొంత నయంగా ఉండేది. కాస్సేపు ప్రశాంతంగా కూర్చోవన్నా కూర్చోగలిగేది; కొంచెంసేపు నవ్వుతో ఉల్లాసంగా కాలంగడపనన్నా గడపగలిగేది. ఒకరి ఆములూ - ధూములూ, ఎత్తిపొడుపులూ వినవలసిన గతిమాత్రంలేదు. కాని ఇక్కడ అత్తగారివాక్యాలాలు తూట్లు పడేటట్లు ఛేదించివేస్తున్నాయి. పుండుమీాద కారం చల్లు తోంది. కోడలి కారణంగానే కన్నపుత్రుని కోల్పోయింది నిర్మల. కోడలి కారణంగానే ముద్దుల మనుమడూ చేజారి

పోయాడు. ఇలాంటికోడలిని పువ్వుల్లో పెట్టి పూజిస్తుందా మరి? సిరి-సంపద లొచ్చిపడ్డాయి, నిజమే. ఐతే నెత్తినవేసుకు కొట్టుకుంటుందా? ఇప్పుడూ తనవంట తానే చేసుకుంటున్నది. అహల్యతోవచ్చిన వంటలక్కల సువారం నిర్మల ముట్టుకోదు. ఇక తినటంసంగతి దేవుడికెరుక. ఇక, అహల్యను అస్పృశ్యగానే భావిస్తోంది. ఇప్పుడు మంగళ వచ్చి ఇక్కడే ఉంటోంది. ఈ వస్తువులన్నీ చుట్టబెట్టుకుపోవాలని ఆమె ఆరాటం. కాని, అహల్య తినవస్తువులన్నిటినీ చాల జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉంటున్నది. నాటిని చిందరవందర కానివ్వటంలేదు. ఈ కారణంగా వదినా ఆడుబిడ్డలమధ్య అప్పుడప్పుడు కీచులాటలు కూడా జరుగుతుండేవి.

ఈరకంగా కొన్ని నెలలు గడచిపోయాయి. అహల్య యొక్క ఆశాజ్యోతి క్రమంగా మందగించిపోతోంది. ఈ మోహపాశాన్నుండి బయటపడాలనుకుంటున్నదే గాని, మనస్సును బంధించటం శక్యంగాకుండా ఉంది. 'ఈ సిరిసంపదల వ్యామోహంలోపడిఉన్నంతవరకు నీ పతి, పుత్రులదర్శనం కలుగుట కల్ల సుమా!' అని ఎవ్వరో ఆవిడ మానసమందిరంలో కూర్చుని నిత్యము పలుకుతుండేవారు. కాని, ఈవ్యామోహం వదలిపెట్టితే మాత్రం ఆమె మనోరథం సిద్ధిస్తుందని ఎవరు చెప్పగలరు? మరి అప్పుడామె భికారిణిగా జీవితం గడుపుతుందా? సంపద చేజారిపోయినతరువాత ఇంక ఆవిడజీవితానికి ఆశ్రయమేముంటుంది?

ఇకనుంచి తన పనులన్నీ స్వయంగానే చేసుకుంటూ ఒంటిపూట భోజనంతోనే ఉంటూ, ముతకఅన్నం తింటూ

కాలయాపనచేయాలని ఏమేమో ప్రతినలు చేస్తుండేది అహల్య. కాని అందులో ఏ ఒక్కదానిని గట్టిగా నిర్వహించగలిగేది కాదు. ఆమె క్రియాశక్తిని బలహీనపరుస్తూ వుండేది. సుఖభోగానురక్తి. ఇక్కడవుండి తన విముక్తి కేమీ చేసుకో లేనన్న భావం క్రమంగా ఆమెకు అనుభవమయింది.

ఇప్పుడామెకు బాగీశ్వరి జ్ఞప్తికివచ్చింది. ఆమెతో కలిసి వున్నరోజులే నిజంగా సుఖమైనరోజులుగా కన్పించాయి. పుట్టిల్లుగాకపోయినప్పటికీ తన కక్కడలభించిన సుఖం మళ్ళీపొందనే లేదు. ఆస్నేహము, సుఖము స్వప్నమైపోయాయి. ఇక అత్తగారేమో ఇలాంటిదిదొరికింది. ఆదుబిడ్డతరహా చెప్పనక్కరలేదు. కన్నతల్లి లేనేలేదు కేవలం తండ్రి ఒక్కడుమాత్రం లభించాడు. కాని, అందుగ్గాను ఏమేమి చెల్లించుకోవలసి వచ్చిందో!

ఇప్పుడు అహర్నిశలు అహల్యకు ఒకేఒక చింత—ఏదో విధంగా బాగీశ్వరి దగ్గరకు చేరుకోవాలనీ, అక్కడగాని తన కష్టాలన్నీ తీరిపోవనీ.

తుద కొకనాడు అత్తగారిముందు ఈ ప్రసక్తి తేనే తెచ్చింది అహల్య. నిర్మల ఏమీ అభ్యంతరం చెప్పలేదు. ఎలాగైనా ఈపాపిష్టిది ఇక్కణ్నుంచి కదలిపోతుంది గదా యని బహుశా ఆవిడకు సంతోషంగా ఉండిఉండొచ్చు. అహల్య వెళ్ళిపోయేవిషయం విని మంగళ మరీ ఉబ్బిపోయింది. అహల్య వెళ్ళిపోతే, ఇక ఆమెదేగదూ ఇంట్లో యిష్టారాజ్యం! కోరినదల్లా మూటగట్టుకుపోవచ్చు. చేతికి అడ్డువచ్చేవారుగాని, నోరెత్తి అదేమని అనేవారు గానీ ఎవరూ ఉండరుగదా!

మర్నాడు ఇక్కడినుంచి ప్రయాణమైంది అహల్య. తనవెంట పెద్దగా ఏమీతీసుకోలేదు. దాసీలైతే వెంట వెళ్ళటానికి సిద్ధంగానే ఉన్నారు కాని, ఆమె ఏ ఒక్కరినీ వెంట తీసుకువెళ్ళలేదు. కేవలం ఒక ముసలి గొల్లవాణ్ణిమాత్రం పంపించివచ్చేందుకు తోడు తీసుకుని బయలుదేరింది. అతన్ని ఆగ్రాచేరిన రెండోరోజున తిరిగి ఇంటికి పంపించివేసింది.

ఇవాళ—— ఇరవైసంవత్సరాల అనంతరం మళ్ళీ ఈఇంట్లో పాదంపెట్టింది అహల్య.

కాని, అయ్యో! ఈఇంటి ఆకారమే మారిపోయింది. పూర్తిగా కూలిపోయిఉంది. ప్రాంగణం పత్తాయేలేదు. హాలు మొదలే కన్పించటంలేదు. ఇంటిచుట్టూ, ఎక్కడచూచినా మురికికుప్పలూ, చెత్తపోగులూ కుప్పతిప్పలుగా పడిఉన్నాయి. వాటిపైన ఉమ్మెత్తలూ, జిల్లేళ్లూ మొలిచిఉన్నాయి. చిన్నగది ఒకటి మాత్రం పడిపోకుండా కాస్త మిగిలిఉంది. బాగీశ్వరి అందులోనేఉంటోంది. ఆవిడగారిఆకారమూ ఆ ఇంటి ఆకారం మారినట్టుగానే మారిపోయింది. నోట్లో పళ్ళూలేవు, కళ్ళల్లో కాంతీలేదు. తలమీది జుట్టు జనపనారపీచులా వుంది. నడుం కమానులా వంగిపోయింది. ఇద్దరూ ఒకరినొకరు కౌగిలించుకుని పుట్లశోకం వెళ్ళబోసుకున్నారు. కన్నీటి ప్రవాహవేగం కాస్త మందగించిన తరువాత "బిడ్డా! సామానేమన్నా వెంటతెచ్చుకున్నావా? లేక మళ్ళీ తిరిగిపోయే బండిలోనే వెళ్లిపోవాలన్న ఆలోచనతోనే వచ్చావా? ఇన్నాళ్ళకు వచ్చావు గదా అనుకుంటే ఈరకంగా వచ్చావు? ముసలిదాన్ని బొత్తిగా మరచే

పోయావు. ఔనులే, ఈపాడుపడ్డకొంపలో ఉండటం నీకేం బాగుంటుందిలే!'' అంది బాగీశ్వరి.

అహ:—అమ్మా! మేడల్లో ఉండిఉండి నాప్రాణం విసుగెత్తిపోయింది. ఇప్పుడు కొన్నాళ్ళు ఈ శిధిలగృహంలోనే గడపాలనిఉంది. నీకుసేవచేస్తూఉంటాను. ఈఇల్లు విడిచిపోయిన ఘడియనుంచీ ఒకటే దుఃఖమనుకో. నాజీవితంలో ఆనందమైన రోజులేమైనాఉంటే అవి ఈఇంట్లో గడపిన రోజులేనమ్మా.

బాగీ:—అబ్బాయిజాడ ఏమైనా తెలిసిందా?

అహ:—ఎవ్వరిజాడా తెలియలేదమ్మా! నేను రాజ్య భోగంలో తలమునిగి కూర్చున్నా. దానిఫలితమే, ఇప్పు డనుభ విస్తున్నాను. రాజ్యసుఖంలో లభించే దేమిటో బాగానే చవి చూశాను. ఇప్పుడిక దానిపరిత్యాగంవల్ల పోయేదేమిటో కూడ చూస్తాను. కాని, నీవు చాలా కష్టపడుతున్నట్టుందే?

బాగీ:—ఏంకష్టంలేదమ్మా! భర్తగారు జీవించిఉన్నంత కాలం ఆయనగారి పాదసేవచేయటంలోనే ఆనందం, సుఖం పొందేదాన్ని. తీర్థాలూ, వ్రతాలూ, పుణ్యాలూ, దాన ధర్మాలూ అన్నీ ఆయగారి సేవా-శుశ్రూషల్లోనే ఉండేవి. ఇప్పు డాయనగారు లేకపోతే, వారి 'గౌరవ-మర్యాదల'ను సేవించుతున్నాను. ఇప్పటికీ ఆయనగారి భక్తులెందరో నాకు సహాయంచేయటానికి సిద్ధంగాఉన్నారు. కాని ఒకరి సహాయం నేనెందుకు తీసుకోవాలి? మీనాన్నగారు జీవించినంతకాలం పరోపకారమే చేస్తూవచ్చారు. అందులోనే జీవితం వెళ్ళ బుచ్చారు. అలాంటప్పుడు నే నేమొగంతో ఒకరి సహాయానికి చేతులుచాచను!''

ఇలా అంటూంటే ముసలమ్మ మొగం స్వాభిమానంచే మెరిసిపోయింది. నేత్రాలలో ఒక అద్భుతకాంతి ప్రకాశించ సాగింది. అహల్యశిరస్సు లజ్జచే క్రుంగిపోయింది. "అమ్మా! నువ్వు నిజంగా ధన్యురాలవమ్మా! నీ జన్మ ధన్యం. నిజానికి నువ్వు నీగురించి ఎంతగర్వపడినా అది అల్పమే!"

"నే నే కొద్దోగొప్పో ప్రతినెలా తీసుకుంటూ ఉండా లని ఖ్వాజా మహమూద్‌గారికోరిక. పుట్టింటివాళ్ళూ వచ్చారు పిలవటానికి. నెల కేదోకొంత తీసుకుంటూఉండమన్నారు. మా అన్నగారు గొప్ప ప్లీడరు. కాని, నేను ఎవరి సహాయమూస్వీకరిం చలేదు. భర్త కష్టార్జితంమీద తప్ప స్త్రీకి ఇంకెవరి సొమ్ముమీదైన హక్కు లేదు. ఒకళ్లు తమనోటితో బైటకి చెప్పకపోవచ్చుగాని, మన స్సుల్లోనైనా ఈబిడ్డమీద దయతలచానని అనుకొనకమానరు. కంటిచూపు ఉన్నంతకాలమూ బట్టలు కుట్టుకుంటూబ్రతికాను. కళ్లు పోయాయి; తిరుగలి పట్టి, పప్పూ పిండీ విసరుతున్నాను. అప్పుడప్పుడు ఆయనగారిమీద కోపం వస్తూఉంటుంది. సంపా దించింది కాస్తా ఊదిపారేశారు. నువ్వూ చూస్తూనే ఉండే దానివిగా. ఏరోజూ నలుగురు అతిథులకు తక్కువ ఉండేవారు కాదు. అయితే ఆయనగారు ఏ చెడ్డపనికీ డబ్బు తగ లెయ్యలేదు గదా అని మళ్ళీ అనుకుంటాను. చేసినదేదో పరోపకారార్థమే చేశారుగదా. చివరకు ప్రాణంకూడాఅందుకే అర్పించారాయెను. నే నెందుకు పశ్చాత్తాపపడాలి? ఎందు కేడ్వాలి? పేరు - ప్రఖ్యాతులు ఉట్టినే వస్తాయా? సరే, నేను నా కబుర్లతోనే కూర్చున్నానే! పద, కాళ్లూ మొహం

కడుక్కో. కాస్త ఎంగిలిపడిన తర్వాత, మళ్ళీ మాట్లాడుకో వచ్చు" అన్నది బాగీశ్వరి.

కాని అహల్య కాళ్ళుకడుక్కొనేందుకు లేవనేలేదు. బాగీశ్వరియొక్క ఆదర్శమయ పతిభక్తిని చూచి ఆవిడ అంత రాత్మ ఆవిణ్ని ఛీ ఛీ అంటోంది - అభాగినీ, పతిభక్తిఅంటే ఇదీ. అష్టకష్టాలూ అనుభవించి, సహించి భర్తగౌరవ-మర్యాద లను కాపాడుతోంది. పుట్టింటివాళ్ళు వచ్చి పిలచినా అటుకేసి తొంగిచూడదు. ఇలాంటి స్థితిలో పుట్టింటికిచేరినా ఎవరూ నిం దించరు. అయినా కష్టాలన్ని సహించుతోంది. అదీ పైపైన కాదు, మనఃపూర్వకంగానే. మరి నువ్వో ఉన్నావు. పుట్టింటి సిరిచూచుకొని పొంగిపోయావు. కళ్ళు నెత్తికెక్కి చూపే ఆనకుండాపోయింది. మొదట రాకుమారివి, తర్వాత రాజ మాతవు అవుతావన్న వెఱ్ఱిలో నీకు భర్తయందు లక్ష్యమే లేకుండాపోయింది. ఐశ్వర్యంముందు పతిని గణింపనేలేదు. అతన్ని తృణీకరించావు; అతను నిన్ను తనవెంట తీసుకుపోవా లనుకున్నాడు. కాని నువ్వు వెళ్ళితేనా! రాజ్యసుఖాన్ని వదలు కోలేకపోయావు. ఇంకేం, యేడ్వు, చేసుకున్నదాన్ని అనుభ వించు.

"ఇంకా నువ్వు కూర్చునే ఉన్నావటే అమ్మాయ్. ఔనులే, దాసి నీళ్ళు తేలేదుగా, మరి ఎలాలేస్తావు. ఇదిగో, నేవెళ్లి తీసుకొస్తున్నాలే, లేచి కాళ్ళూ చేతులూ కడుక్కో. ఈ లోపల నీకోసం వేడివేడి రొట్టెలు తయారుచేస్తాను; అదీ చూస్తాగా, నా చేతిరొట్టెలు నీ కిప్పుడు రుచిస్తాయో లేదో.

ఇక్కడున్నపుడు నేనుచేసిన రొట్టెల్ని ఎంతో మెచ్చుకుంటూ తినేదానివి" అంది బాగీశ్వరి మళ్ళీ.

ఈ ప్రేమాదర వాక్కులు విని అహల్య పులకిత అయింది. ఈ 'నువ్వు' లో ఉన్న సుఖం, ఆనందం 'తమరు' 'అమ్మగారు' 'దొరసానిగారు' అన్న పదాల్లో ఎక్కడఉంది? చిన్ననాటి రోజులు మళ్ళీ ఒక్కసారి కళ్ళల్లో కొచ్చి తిరు గాడినై. ఒక్క క్షణంసేపు ఆవిడసమస్తకష్టాలూ విస్మృతి గర్భంలో విలీనమైపోయినై. "ఇప్పుడేమీ ఆకలిగాలేదు గాని, కూర్చోవే; అమ్మా కూర్చుని ఇంకాసేపు కబుర్లు చెప్పవే. నీతో నా దుఃఖగాధ చెప్పటానికి ఎప్పుడెప్పుడని ఆతురపడిపోతున్నాను. నాకు ముక్తిమార్గమేమిటో చెప్పు" అంది అహల్య.

"భర్తృసేవావంచితయైన స్త్రీకి తరణోపాయ మేముం దే తల్లీ? పతియే స్త్రీకి సర్వస్వం. ఆ సర్వస్వం కోల్పోయిన స్త్రీకి సుఖమెక్కడిది? దేనికోసం నువ్వు పతిని పరిత్యజించావో, దాన్ని పరిత్యజించటం ద్వారానే మళ్ళీ భర్తను పొందుతా వమ్మా! రాజ్యము, సిరిసంపదల వ్యామోహం వదలిపెట్టి నంతవరకు ఆ త్యాగధనుని దర్శనం లభించదు తల్లీ!" అంది బాగీశ్వరి గంభీరభావంతో.

అహ:—అమ్మా! నేను కేవలం శంఖధరుని శ్రేయో భిలాషతోనే ఆయనవెంట వెళ్ళలేదు. ఇది నిజ మమ్మా.

బాగీ:—ఆ భావంలో నీ సుఖ - భోగలాలస అంత ర్హితమై లేదా? బాగా ఆలోచించిచూడు. నువ్వీ విషయాన్ని కాదనలేవు.

"కావచ్చునమ్మా, నేను కాదనలేను." అంది అహల్య సిగ్గుపడుతూ.

బాగీ:—సిరి - సంపదలు ఇక్కడా నిన్ను వదలిపెట్టవు చూస్తూ ఉండు. నన్నంటకు అని దానికి దూరంగా పరుగెత్తే వారినే అదీ వెంబడిస్తుంది. వ్యామోహంలో పడిపోతావనే నా సందేహం. ఒకసారి కాలుజారినందుకు పశ్చాత్తాపపడి ఏడ్వ వలసివచ్చింది. మళ్ళీ రెండోసారి గనుక జారావో ఇక జీవితాం తం ఏడుస్తూ గడపాల్సిందే.

అహల్య ఆగమనవార్త విని పేటలోని అమ్మలక్క లెం దరో తండోపతండాలుగా వచ్చిచేరారు. పట్నంలోని అనేక మంది ధనిక కుటుంబ స్త్రీలూ వేంచేశారు. సాయంత్రందాకా ఒకటే రాకపోకలు. కొందరు విజ్ఞప్తులతో ఏవో సంస్థలకు చందాల నిమిత్తమై వచ్చారు. వీరిని తప్పించుకొని బైట పడటం అహల్యకు చాలా కష్టమైపోయింది. తన గోడు ఎందరి కని చెపుతుంది? పనిసాధించుకోవటమే ప్రధానంగా ఎంచేవారు తమగోడవలు చెప్పటంతోనే ఊపిరిసలపనిచ్చేవారుకాదు. మరి వారు ఇతరులు చెప్పేది ఏం వింటారు? చేతిలో గుడ్డిగవ్వ లేకుండా ఇక్కడికి వచ్చినందుకు అహల్య కెంతో సిగ్గుగాను, నామోషీగాను ఉంది. ఇక్కడ ఇలా వెంటబడతారని తెలిసిఉంటే కనీసం పది పదిహేనువేలనగదు మూటగట్టుకు తెచ్చి ఉండేది. ఇదంతా చూచి ఇప్పుడామెకు ఈ పాడుపడ్డ కొంపలో ఉండటానికే సిగ్గుగా ఉంది. ప్రపంచం అహల్యను రాజకుమారిగా ఎరిగినతర్వాత ఇంతవరకెన్నడూ ఆమెసంస్థానం దాటి బయటికి అడుగుపెట్టలేదు. కొన్నాళ్లు కాశీలో వుంటే

మరికొంతకాలం జగదీశపురంలో ఉండేది మూహాచోటుకు రావటం ఆవిడ కిదే మొదటిసారి. ధనం కేవలం భోగ వస్తువుమాత్రమే కాదనీ-దానివల్ల పేరు, ప్రతిష్ఠలుకూడ సంప్రాప్తిస్తాయనీ ఆమె కిప్పుడే మొదటిసారిగా తెలిసింది. భోగమంటే ఆమె కసహ్యంకలిగింది. కాని, కీర్తికాంక్ష కిదే మొదలు. సాయంత్రానికి పదిపదిహేనువేల రూపాయల చందాలు వేసింది. వెంటనే డబ్బుపంపమని మామగారికి ఒక జాబు వ్రాసింది. ఉత్తరం చేరటమే ఆలస్యంగా డబ్బు వచ్చేసింది. ఇంకేం! బెల్లంఉంటే చీమల కేం కొదువ? వాకిట్లో ఎప్పుడు చూచినా యాచకులు, బిచ్చగాండ్రూ గుమికూడి ఉండేవారు. కుంటీ గుడ్డివాళ్ళ లగాయతు గుఱ్ఱపుబళ్ళలో, చిన్న కార్లలో తిరిగే భిక్షుకులవరకు యాచనకు రాసాగారు. ఏ మూలనుంచో ఒక అనాథ శరణాలయాన్ని దర్శించగోరుతూ ఆహ్వానమో, ఇంకోవైపునుండి తేనీటివిందులో పాల్గొనవలసిందని ప్రార్థనాపత్రమో వచ్చేవి. నగరంలోని కన్యామండలి, బాలికా విద్యాలయం, మహిళాసంఘము మున్నగు సంస్థలన్నీ అహల్యాదేవిగారికి సన్మానపత్రాలు సమర్పించాయి. వాటికి ఆమె ఇచ్చిన చక్కని సమాధానాలవల్ల ఆమె ఎంతో యోగ్యురాలనీ, ఆలోచనాపరురాలనీ గణనకెక్కింది. వెనుకటి కెవరో ఒక అమ్మి అమృత కలశం తెద్దామని ఇంద్రపురికి బయలుదేరిందట చల్దికట్టుకుని. కాని నడివీధిలో తోలుబొమ్మల భాగోతం చూచి అక్కడే కూర్చుండిపోయిందట. అలా అయింది అహల్య పరిస్థితి. తపస్సు చేద్దామని వచ్చింది. కాని,

ఇక్కడ సభ్యసమాజ క్రీడల్లో ప్రవమై పోయింది తా నిక్కడి కెందుకొచ్చిందో కూడ మరచిపోయింది.

ఇప్పుడు అహల్య నిత్యము యేదో ఒక సభలోనో, సమావేశంలోనో పాల్గొనవలసివస్తోంది. ఆ పాల్గొనటంకూడ మహోల్లాసంగా పాల్గొనేది రెండువారాల్లోనే ఆమె పూర్తిగా మారిపోయింది. కీర్తికాంక్ష డబ్బుమీది ఉపేక్షాభావాన్ని ఆమె మనసులోనుంచి తరిమివేసింది నిజానికి ఆమె ఈ ఆడంబరాల్లో తన కష్టాలన్నీ మరచిపోయింది. చక్కని ఉపన్యాసాలు తయారుచేయటంలో మునిగిఉండేది. ఇది ఒక విధమైన నిషాలాగా పట్టుకున్నది. నిజంగా అది నిషాయే. కీర్తికాంక్షకు మించిన నిషా మరొకటిలేదు.

బాగీశ్వరి పూర్వకాలపు మనిషి. ఆమె భావాలూ పాతవే. అహల్య ఈవిధంగా బయట తిరగటం, ఉపన్యాసాలివ్వటమూ, డబ్బు తగలేసుకోవటం ఆమెకు నచ్చటంలేదు. "యేమే అహల్యా! చివరకు ఉన్నదికాస్తా మంగళంచేసు కూర్చోదలచావా యేమిటి?" అని ఒకరోజున అడిగేసింది బాగీశ్వరి.

"మరి ధనం దేనికోసమంటావు? ధనంలో ఉన్న చెడు యేమిటంటే దాని మూలంగానే భోగ - లాలసత వృద్ధిచెందుతుంది. కాని, ఒక మంచికూ ఉంది. దానిలో పరోపకార సామర్థ్యంకూడా ఉంది" అన్నది అహల్య సగర్వంగా.

పరోపకారం అన్నమాట వినగానే బాగీశ్వరి మూతీ ముక్కూ విరిచి, "నువు చేస్తున్నది పరోపకారం కాదు, కీర్తి సంపాదన" అన్నది.

రెండో రోజున పోస్టుజవాను శంఖధరునిజాబు తెచ్చాడు. ఆ ఉత్తరం కాశీ, జగదీశపురం యాత్రచేసుకుంటూవచ్చింది. జాబు చదవగానే ఎగిరి గంతేసింది అహల్య. ఒక్క పరుగున బాగీశ్వరివద్దకు పోయి "అమ్మా అమ్మా! చూడు చూడు. ఇదిగో బాబు దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఇద్దరూ ఒకచోటే ఉన్నారు. నన్ను రమ్మనమని రాశాడు" అంది సంతోషం పట్టలేకుండా.

బాగీ:—ఐతే మరి ఆలస్యందేనికి ? బయల్దేరు; పద, నేనూ నీకూడా వస్తాను''

అహ:—నిండా ఏడేళ్ళతర్వాత కబురు అందింది. అమ్మా, నా ఆగ్రాయాత్ర ఫలించింది. ఇది నీ ఆశీర్వాదమే నమ్మా.

బాగీ:—తండ్రిజాడ కనుక్కొని మరీ రాసిన ఆ బిడ్డనే చెప్పుకోవాలి. బిడ్డంటే వాడే బిడ్డ.

అహ:—ఈ ఆనందంలో ఇవాళ ఉత్సవం చేసుకోవాల్సిందే.

బాగీ:—పండగలూ పబ్బాలకేంలే. తర్వాతఎన్నైనా చేసుకోవచ్చు గాని, ముందు అక్కడికివెళ్ళే సన్నాహంచెయ్యి అక్కణ్ణుంచి ఇంకెక్కడికైనా వెళ్ళిపోయాడంటే చేతులునలుపుకుని, లబోలిబోమంటూ అఘోరించాల్సివస్తుంది.

పగలంతా గడచిపోయింది; కాని అహల్యమాత్రం ప్రయాణసన్నాహానికి పూనుకోనేలేదు. ఆమె ప్రయాణానికి అంత కుతూహలంగాలేదు. ప్రథమ ఆనందావేశంపొంగు చల్లారుటతోనే అక్కడికి వెళ్ళనా వద్దా అన్న సందిగ్ధావస్థలో పడి

పోయింది. 'అక్కడికి వెళ్ళటమంటే ఏ పది పదిహేనురోజుల కోసం వెళ్ళటం మాత్రమే కాదు, రాజ్యానికి కూడ తిలోదకా లివ్వవలసిఉంటుంది; పైగా శంఖధరుని భవిష్యత్తునుబలిఇవ్వాల్సి ఉంటుంది. పితృభక్తుడైన శంఖధరుడు తండ్రిని వదలిపెట్టి ఎలాగూ రాడు; నేనూ ప్రేమ- పాశంలో చిక్కుకుపోతాను' అని ఆలోచించుకొని శంఖధరుని ఏడుపాయంద్వారానైనాసరే రప్పించుకోవాలనినిర్ణయించుకున్నది. శంఖధరుడువస్తే పతిసందర్శనమూ తప్పకలభిస్తుందని ఆవిడ మనస్సు పదేపదే చెబుతోంది. ఇప్పుడక్కడికిపోయి తన ప్రేమాకాంక్షలకు తన కన్న కుమారుని జీవితాన్ని బలిచేయజాలదు. ఇన్నాళ్ళూ పతివియోగాగ్ని లో దహించుకుపోయినట్లే మరికొన్నాళ్ళు దగ్ధమవుతూండ టానికే ఆమె నిశ్చయించుకున్నది. శంఖధరునికిజవాబురాసింది, అందులో 'నేను చాలా జబ్బుగా ఉన్నాను. బ్రతికే ఆశ బహుతక్కువ. ఇంకే కోరికాలేదు. నిన్నొకసారి చూడాలన్న అభిలాష ఉంది. నువ్వువస్తే, బహుశా నేను జీవిస్తానేమో! కాని రానిపక్షంలోమాత్రం నీ అమ్మ చనిపోయినట్టే భావించుకో" అని రాసింది. ఈ జాబుచూడగానే శంఖధరుడు పరుగెత్తు కుంటూ వస్తాడని అహల్య దృఢవిశ్వాసం. భర్త ఒక వేళ వాడివెంట రాకపోయినా, కనీసం వాడైనా రాకుండా అడ్డగించడానికూడా ఆవిడ నమ్మకం.

సాయంత్రం "వెళ్ళాలనిలేదా యేమిటే?" అని అడిగింది వాగీశ్వరి.

అహల్య సిగ్గుపడుతూ "అమ్మా, అబ్బాయికి ఇప్పుడే ఉత్తరంవ్రాశాను. వాడు గనుక రాకపోతే వెళ్తాలే" అంది.

బాగీ:- బాబువెంట చక్రధర్ కూడా వస్తాడా! చేజిక్కిన ఇలాంటి సదవకాశాన్ని చేజారిపోనిస్తున్నావు. నీ కేం రాసి పెట్టిఉందోలే!

అహల్య తన కష్టాలన్నీ పూర్తిగా మరచిపోయి, శంఖ ధరుని రాజ్యాభిషేకమహోత్సవాన్ని ఊహించుకుంటూ కల్పనా జగత్తులో విహరించుతోంది.

# ఇరవైనాలుగో అధ్యాయము

రాజా విశాలసింగు హింసావృత్తి మాత్రం తగ్గు ముఖంపట్టడంలేదు. తనస్థితిని తలచుకొని విచారం వృద్ధి చెందే కొలదీ ఆయనఅన్యాయ - అత్యాచారాలు అభివృద్ధి చెందుతూండేవి. అతనిహృదయంలో ఇప్పుడు ప్రేమ, సాను భూతి, దయా - దాక్షిణ్యాలు, ధైర్యములకు సూదిమొనంత కూడా స్థానంలేదు. అతని సకల ప్రవృత్తులు హింస! హింస!! హింస !!! అని కేకలుపెడుతున్నాయి. ఇటీవల అతడు నూతనంగా మరొక ప్రతీకారాస్త్రం కనిపెట్టాడు. దైవం అతనికిచేసిన అపచారం ఇంతింతని చెప్పరానిది. మొదట సంతానహీనునిగావుంచి, తర్వాత లభించిన బిడ్డను నిర్దాక్షిణ్యంగా లాక్కుపోయాడు. దేవుని ఆయుధాగారంలోఆయన శిక్షించటానికి ఇంతకుమించిన కఠోరమైన ఆయుధం మరొకటి లేదు. ఈ ఆయుధాన్ని ఆ దైవంచేతిలోనుండి లాక్కోవాలని చూస్తున్నాడు రాజా. రాజా ఏడవ వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. రాజులు తలచుకుంటే కానిదేమున్నది?

మహారాజులకు కన్యలకేం కొదువ? కొన్ని నెలలనుంచి ఈ సప్తమ వివాహానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. రాత్రనక పగలనక రాజవైద్యులు అనేక బలవర్ధక ఔషధములు తయారుచేస్తున్నారు. ఇంకా నలుదిశలనుండి విరివిగా తెప్పిస్తున్నారు. తన వివాహం చూచి దేవతలు సైతం ముక్కుమీద వేలువేసుకుని, ఈర్ష్యచెందేటంత వైభవోపేతంగా ఏర్పాట్లుచేయించుతున్నాడు రాజా.

మనోరమ చాలా రోజులనుంచి గృహకార్యకలాపాలు, సంస్థానవ్యవహారాలు- వేటిలోనూ కలుగజేసుకోవడం పూర్తిగా మానివేసి కూర్చుంది. ఒకవేళ ఆమె ఏమైనా మాట్లాడినా ఆలకించేవారెవరు? ఆవిడఅంటేనే రోతపుట్టింది రాజాకు. మనోరమకు ఇప్పుడా భవనం నరకకూపంలా ఉంది. వచ్చిన కష్టాలన్నీ నోరుమూసుకుని సహించుతూండేది. 'నావల్ల జరిగిన నేరమేమిటి?' అని ఒకసారి రాజాగారివద్దకు పోయి అడగాలనుకుంటున్నది. కాని, రాజా అలాంటి అవకాశ మిస్తేగదూ?

మనోరమ ఇప్పుడు తరచుగా ఏదో ఒక అవమానానికి గురిఅవుతోంది. ఆమెను గర్వభంగం చేయాలని నిత్యం ఏదో ఒకకుట్ర పన్నబడుతుండేది. కాని మనోరమలో ఆ వెనుకటి గడుసరిస్వభావం లేదు సరిగదా, పైపెచ్చు ఇప్పుడామె శాంతి, ధైర్యములకు అగాధసాగరంలా ఉంది. అందులో అల్పమైన గాలిదెబ్బలకు సంచలనమేమీ కలుగుటలేదు. ఆమె చిరునవ్వుతో అన్నీ శిరసావహించుతున్నది. ఈ వికటహాసం ఆమెనెప్పుడూ వదలిపెట్టేది కాదు. కొత్తరాణిగారికోసమని నూతన భవనం కట్టించబడుతోంది. ఆ అందాలమేడలో అలంకరించేం

దుకు ఒక పెద్ద అద్దం కావలసివచ్చింది. చిన్నరాణి మేడలోని అద్దం తీసుకురావలసిందని హుకుం జారీఅయింది. మనోరమ ఈఆదేశాన్నాలకించి ఒకచిరునవ్వు నవ్వి ఊరుకున్నది. తర్వాత తివాచీ అవసరమైంది. చిన్నరాణి కచేరీసావడిలోంచి తీసుకు రమ్మనమని మరో ఆజ్ఞ. మనోరమ ముసిముసినవ్వుతో తివాచీ లన్నీ ఇచ్చివేసింది. మరికొన్నాళ్ళకు "చిన్నరాణికారును కొత్తమేడకు తీసుకురండి." అని ఇంకొకఆజ్ఞ. ఆ మోటారు కారంటే మనోరమ కెంతో ఇష్టం. స్వయంగా నడిపేది. ఈ ఆజ్ఞ వినికూడా నవ్వుకున్నది. కారు వెళ్ళిపోయింది.

మొదట మనోరమదగ్గర దాస-దాసీలు చాలమంది ఉండేవారు. క్రమేణా తగ్గిపోసాగారు. చివరకు వాళ్ళసంఖ్య ముగ్గురుదాకా దేకింది. 'అసలే తిమ్మన్న, అందులో బోడిపరా చక' మన్నట్టు, ఆ ముగ్గురిలో ఇద్దరిని కొత్తమేడకు తీసుకు పొమ్మని తాఖీదు వచ్చింది ఆపిమ్మట ఇంకోవారానికి ఆ ఒక్క దాసినికూడా పిలిపించుకున్నారు. ఈఆజ్ఞనుకూడ మనోరమ చిరునగవుతోనే ఆహ్వానించింది.

కాని అన్నిటిని తలదన్నిన ప్రహారం ఇంకాఉండనేఉంది. కొత్తరాణిగారి నిమిత్తం నూతన భవననిర్మాణం సాగిపోతూనే ఉంది. ఆమె తల్లిగారి నిమిత్తం కూడా మరో మేడ కావలసి వచ్చింది. చిన్నరాణి మందిరం ఖాళీచేయించమన్నాడు రాజా. ఈ ఆజ్ఞ చిన్నరాణిచెవినిపడింది. ఇందుకూ నవ్వి ఊరు కున్నది.దాసీలుండే భాగాన్నే మనోరమ తననివాసంగా చేసు కున్నది. ద్వారాలకు గోనెపట్టాపరదాలు తగిలించింది. తన అందాలమేడలో ఉన్నంత ఆనందంగానే ఇక్కడా ఉంటోంది

రాత్రి చాలా ప్రొద్దుపోయింది. బైట పెళ్లికి తరలి వెళ్ళటానికి సన్నాహాలు జరుగుతున్నాయి. ఈ నగరంలో కని విని ఎరుగనంత బ్రహ్మాండంగా ఊరేగింపు ఉండాలని ఏర్పాట్లు జరుగుతున్నాయి. తెల్ల, నల్ల సిపాయిలు, సంస్థాన సాయుధ దళము, మిలిటరీ బ్యాండు, స్వారీ గుర్రాలూ, ఏనుగు అంబారీలు, పువ్వులతో చక్కగా అలంకరింపబడిన గుడిసెబళ్ళు, అందమైన పాలకీలు – మొదలైన వెన్నోఉన్నాయి. వరుసగా సాయంకాలం మొదలు తెల్లవారుజామువరకు సాగిపోయినా తరుగనన్ని సమకూర్చబడినాయి. బ్యాండులు, డప్పులు, బాకాలువగైరా అన్నిరకాల మేళ తాళాలూఉన్నాయి. వందలాది విమానాలుకూడ అలంకరింపబడ్డాయి. ఇక పూలసామగ్రికి అంతేలేదు. తెల్లవార్లూవాకిటముందుమహా కోలాహలంగా ఉంది. రాత్రంతా షోకులుతీర్చి దిద్దుకోవటంతోనే సరిపోయింది రాజాగారికి.

పట్టణంలో ఎక్కడజూచినా ఈ ఊరేగింపు చర్చలే; ఈ వివాహాన్నిగురించిన అపహాస్యాలే. నౌకర్లు – పనివాళ్లు కూడ తమలో తాము ఎగతాళిగా చెప్పుకుంటున్నారు. రాజాగారిని హేళనచేస్తున్నారు. కాని, తనపిచ్చి– బ్రహ్మానందంలో మునిగియున్న రాజాకుమాత్రం కళ్ళుండికూడా కన్పించటం లేదు; చెవులుండికూడ విన్పించటంలేదు.

నాలుగు గంటలకు పెళ్లి ఊరేగింపు బయలుదేరింది. ఊరేగింపు రెండు మైళ్ళకు తక్కువ ఉండదు. రకరకాల వాయిద్యాలు వాయించబడుతున్నాయి. డబ్బు విరజిమ్మబడు

తోంది. అడుగడుగునా పూలవర్షం కురుస్తోంది. ఈ తమాషా చూడ్డానికి పట్నమంతా— పిల్లాపీచు గోసహా విరగబడివచ్చింది.

సరిగ్గా ఇదేసమయంలో అహల్యా శంఖధరులు పట్నం లో ప్రవేశించారు. నెమ్మదిగా రాజభవనాభిముఖులై సాగిపో తున్నారు. కొద్దిదూరం వెళ్లేటప్పటికి పెళ్ళిఊరేగింపు దారి కడ్డువచ్చింది. అది రాజా విశాలసింగ్‌గారి పెళ్ళిఊరేగింపు అని తెలియగానే తక్షణం తన కారు ఆపుచేశాడు శంఖధరుడు. కారు కప్పుపైకెక్కి చేరుమాలు ఊపుతూ "ఆగిపోండి, ఆగి పోండి ఎక్కడివాళ్ళక్కడే ఆగిపోండి. ఒక్క అడుగుకూడా ముందుకు వేయకండి. యువరాజు శంఖధర్ వచ్చారని తక్షణం మహారాజాగారికి తెలియజేయండి" అని బిగ్గరగా అరచాడు.

క్షణంలో ఊరేగింపంతా ఎక్కడిదక్కడే ఆగిపోయింది. 'యువరాజాగారొచ్చారు, యువరాజాగారొచ్చారు' అన్న మాటలు గాలిదుమారంలాగా ఈదరినుండి ఆదరికి పరుగు తీశాయి. ఎక్కడివారక్కడే నిలబడిపోయారు. తర్వాత ఆయన దర్శనార్థం జనం గుంపులుగుంపులుగా పరుగెత్తుకురాసాగారు. ఊరేగింపంతా చెల్లాచెదరైపోయింది. ఈ ఉరుకులూ పరు గులూచూచి ఏదో ఉపద్రవంవచ్చిపడిం దనుకున్నాడు రాజా విశాలసింగ్.

అంతలోనే శంఖధరుడు ఎదుటికొచ్చి నమస్కరించాడు.

శంఖధరుని చూడగానే రాజాగారు గుర్రంమీదినుండి అమాంతంగా క్రిందికిదూకి శంఖధరుని ఆలింగనంచేసుకున్నాడు దేనికోసం తా నిన్నాళ్లూ ఏడ్చాడో,ఆ అభిలాషకూడ ఇవ్వాళ ఈశుభముహూర్తంలో తీరిపోయింది. శంఖధరుని పదేపదే ఆలిం

గనం చేసుకుంటున్నా రాజాగారికి తలెత్తటంలేదు. అశ్రుధారలు ఎడతెగకుండా ప్రవహించుతున్నాయి మనసు కొంచెం స్థిమితపడిన తరువాత "నువ్వు వచ్చావా నాయనా? నామీద జాలితలచావు. చక్రధరుని తీసుకొచ్చావుకదూ" అన్నాడు.

శంఖ:—ఆయనగారు రాలేదు.

రాజా:—వస్తాడు, వస్తాడు. వస్తాడనే నా అంతరాత్మ చెబుతోంది. నేను నిరాశ చెందాను. మీ అమ్మకూడ వెళ్లిపోయింది. నువు అంతకుముందే వెళ్ళిపోయావు. మరి నేనెవరిని చూచుకుని జీవించాలి? జీవితానికేదో ఒక ఆధారం కావాలి కదా! అప్పట్నుంచి అహల్య ఎక్కడ తిరుగుతోందో, ఏం చేస్తూ ఉందో!

శంఖ:—ఆమె నాతోనే ఉంది.

రాజా:—భలే! అమ్మాయి వచ్చేసింది! వహ్వా! ఓరి దేవుడా! సమస్తసంతోషాలూ ఒకేరోజుకు అట్టేపెట్టిఉంచావా! పద, అమ్మాయిని చూచి, మనసు కాస్త శాంతపరచుకుంటాను.

ఊరేగింపు ఆగిపోయింది. రాజాగారు, శంఖధరుడు అహల్యవద్ద కేతెంచారు. తండ్రీ-కూతుళ్ళ కలయిక ఎంత ఆనందదాయకమైన దృశ్యం! ఎన్నాళ్ళక్రితమో నిరాశయనే మంచువర్షానికిగురియై మ్రోడులైన కోరికలనే వృక్షతతులు నేడు చిగిర్చి పచ్చపచ్చని ఆకులచే అలరారుతూ ఎదుటనిలబడి ఉన్నాయి. అశ్రువేగం తగ్గింది, కాదు, ఆగిపోయింది. అప్పుడు రాజాగారు "ఈ పెళ్లి ఊరేగింపు చూచి నీకు నవ్వువచ్చి ఉంటుంది. అందరూ నవ్వుతున్నారులే. కాని, బిడ్డా! ఇదినిజంగా

పెళ్ళిడూరేగింపు కాదు. ఏంపెళ్ళి? ఏంపెళ్ళికొడుకు? ఇది పిచ్చి వాని హృదయభావావేశం. అంతే, మరేంకాదు. ఈశ్వరునికి నా ధ్యాసేలేనపుడు, నామీద రవ్వంతైనా జాలిదలచనపుడు, అకారణంగానే నన్ను పీడిచుతూంటే, నేనుమాత్రం ఆయనకు ఎందుకు భయపడాలి? యజమానికి సేవకునిగూర్చి చింతలేనపుడు యజమానిని గురించి సేవకునికిమాత్రం చింత ఎందుకుంటుంది? నేను నాచేతనైన అన్యాయాలూ, అత్యాచారాలూ చేశాను. ధర్మాధర్మాలు, పాప–పుణ్యాల ఆలోచననే నామనస్సులోనుంచి తరిమివేశాను. చివరకు నాకు విజయం లభించినదంటావా లేదా?' అన్నాడు

మున్షీ వజ్రధరుని కీ శుభవార్త అందింది. తక్షణం గుర్రమెక్కి బయలుదేరి, రాజభవనంలో కొచ్చి వాలాడు. శంఖధరుడు వజ్రధరుని ఆగమనం తెలుసుకొని, కాళ్ళకు చెప్పులైనా వేసుకోకుండానే పరుగెత్తుకుపోయి తాతగారి పాదములకు నమస్కరించాడు. మున్షీజీ మనుమని కౌగిటచేర్చుకొని గద్గదకంఠంతో "ఈ శుభఘడియచూచే అదృష్టం రాసిఉండబట్టే ఇంతవరకూ చావకుండా బ్రతికిఉన్నాను. ఈ కోరిక తీరింది. ఇక ఒకేఒక అభిలాష– నీ పట్టాభిషేకం చూడాలన్న కోరికమాత్రమే మిగిలివుంది. నాయనమ్మ నీకోసం ఎదురు చూస్తోంది. ఆవిడను మరచిపోయావా?' అన్నాడు.

శంఖధరుడు కొంచెం సిగ్గుపడి "లేదండీ! సాయంకాలం వద్దామనుకున్నాను. ఆమెగారి ఆశీర్వాదంవల్లనే నాన్నగారి దర్శనభాగ్యం లభించింది. ఆమె నెలా మరచిపోగలను?" అన్నాడు.

మున్షీ:—ఐతే నువ్వు అబ్బాయిని వెంటబెట్టుకు రాలేదా?

శంఖ:—ఆయన తమజీవితకాలంలో తలపెట్టి, చేస్తున్న పవిత్రకార్యాన్ని వదలి ఎన్నడూ రారు. నన్ను నేను ఆయన దగ్గర వెల్లడించుకోనేలేదు. లేకపోతే బహుశా నాతో మాట్లాడటానికికూడా అంగీకరించి ఉండేవారు కాదు.

తరువాత శంఖధరుడు తనయాత్రావివరాలూ, పడిన కష్టాలూ, తండ్రిని కలుసుకున్న వైనం మొదలైన విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పి విన్పించాడు.

ఇలా మాట్లాడుకుంటూ మున్షీజీ రాజాగారిదగ్గరకు వచ్చాడు. రాజా చాల మర్యాదతో అతనికి అభివాదనం చేశాడు. "తమ రీ దారే మరచిపోయినట్టున్నారే?" అన్నాడు.

మున్షీ:—మహారాజా! మన ఉభయుల సంబంధం ఇప్పుడు మరొకలాంటిది. నా రాకపోకలు ఎక్కువైతే 'ఇక్క డితని కేంపని? ఏదో దురాశతోనే వస్తున్నా' డని తమరే అనుకోవచ్చు. జీవితంలో ఎన్నడూ ఐశ్వర్యవంతుణ్ని కాదు, గాని, పరువుప్రతిష్టలను మాత్రం ఎప్పుడూ కాపాడుకుంటూ వచ్చాను.

రాజా:—ఐతే, ప్రొద్దస్తమానమూ కూర్చొని ఏం చేస్తున్నారు? కూర్చునికూర్చుని విసుగు కల్గటం లేదా?

మున్షీ:—ఇప్పుడు రాకుమారుని రాజ్యాభిషేకం జరగటం మంచిది. మీరూ కొన్నాళ్ళు విశ్రాంతిగైకొని ఆనందంగా గడుపవచ్చు.

రాజా:—నా ఆలోచనా అదే. కాని, మున్షీజీ! ఎందుకనో చెప్పలేను గాని, శంఖధరుడు వచ్చినలగాయతు నా మనస్సులో ఏదో శంకగా ఉంది. ఈ పానకంలో ఏదో పుడక బయలుదేరి తీరుతుందని భయంగాఉంది. మనస్సు నెంత సమాధానపరచుకున్నా ఈ శంకమాత్రం వదలిపోకుండా ఉంది.

మున్షీ:—దైవాన్ని స్మరించి,పట్టాభిషేకం తలపెట్టండి. విచ్ఛిన్నమైపోయిన ఆశలన్నీ నెరవేరగా లేనిది ఇది మాత్రం నెరవేరకుండా ఉంటుందా. అంతా శుభమే జరుగుతుంది. ఇంటివద్ద ఏదో కాస్త ఆనందోత్సవం జరుపుకుంటాం. ప్రస్తుతం పట్నంలో మంచిమంచి కళాకారులు వచ్చిఉన్నారు. వారంతా వచ్చి పాల్గొంటారు. తమరుకూడ దయచేస్తే నా అదృష్టంగా భావించుకుంటాను.

రాజా:—వద్దు మున్షీజీ! క్షమించండి. నా మనస్సు బాగుండలేదు. మీతో నిజం చెబుతున్నా. ఈవాళే నాప్రాణం పోతే నా కంటె అదృష్టవంతుడు, సుఖమైనవాడూ ప్రపంచంలోనే ఉండడనుకోండి. క్షోభ–దుఃఖాలు చూచాను. ఆనందోల్లాసాలూ అనుభవించాను. ఇప్పుడింకేదీ చూడాలన్న కోరిక లేదు. త్రాసు మళ్ళీ రెండోవైపుకు మొగ్గుతుందేమోనని భయపడుతున్నాను.

మున్షీజీ చాలాసేపటివరకు రాజాగారికి ధైర్యం చెబుతూ కూర్చున్నాడు. తరువాత అంతఃపురాంగనల నందరినీ తన ఇంటికి రావలసిందని ఆహ్వానించాడు. శంఖధరుని మరొకసారి ఆలింగనం చేసుకున్నాడు. గుర్రమెక్కి చక్కా వెళ్ళాడు. రాగ–ద్వేష, సుఖ – దుఃఖాలకు అతీతుడైన ఈ ప్రాణి విచారాన్ని

ఎన్నడూ తనదరి చేరనివ్వలేదు. ధనాకాంక్ష ఉంది; ఐశ్వ ర్యాభిలాషా ఉన్నది. కాని వీటికోసమని తపించేవాడు కాదు. ఇక కూడబెట్టే బుద్ధి అతడు నేర్చుకోనేలేదు. అంతంతమాత్రం గా ఉన్నప్పుడూ లేమి ఉండేది. కొల్లలుగా లభించినప్పుడూ అంతే. బ్రతికినన్నాళ్ళూ ఈ లేమి అతన్ని వదలనేలేదు. ఒక ప్పుడు మంచి రుచిగల పదార్థాలకోసం మొహంవాచిపోయి, ఇప్పుడేమో దోసిలితో దానంచేయటానికి తహతహలాడిపోతు న్నాడు. ఏం తీసుకురావాలి ? ఏం దానంచెయ్యాలి ? ఇదొ క్కటే అహర్నిశలు ఆయన ఆలోచన. మరో ఆలోచనేఉండేది కాదు. నడుము వంగిపోయింది. చూపు మందగించింది. కాని ఎప్పుడూ పదిమంది కూడి సభతీర్చి ఉండేవాళ్ళు. నవ్వులాటలు, వేళాకోళంచేయుటలో వెనకపడేవాడు కాదు! ఎన్నడూ ఒక రితో వైర మెరుగడు. ఒకరికీడు కోరి ఎరుగడు.

మర్నాడు సంధ్యాసమయాన మున్సీగారి ఇంటివద్ద గొప్పగా ఉత్సవం జరుపబడింది. నిర్మల మనుమణ్ణి కౌగలించు కుని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. వాడు తమఇంట్లోనే ఉంటే బాగుండు ననిపించింది. ఆహా ! ఎంత ఆనందంగా ఉంటుంది ! శంఖధరునితో ఎంతసేపు మాట్లాడినా ఆమెకు తనివితీరేదే కాదు. అహల్య కారణంగానే కన్నబిడ్డ చెయిజారిపోయాడు. ఆమె మూలంగానే ఇప్పుడు మనుమడూ చేతిలోంచి వెళ్ళిపో తున్నాడు. అందుచేత ఇప్పుడుకూడ ఆవిడకు మనస్సులో అహల్యయందు సద్భావం లేదు. తన పిల్లా—జెల్లాతో కలసి వుంటూ ఎన్నికష్టాలైనా అనుభవించటానికి ఇష్టమే. ఇప్పుడు తన అంత్యకాలంలో ఏ ఒక్కరూ తన కళ్ళముందు లేకుండా

పోవటం సహించలేకుండా వుంది. మరి ఎప్పుడు ప్రాణం లేచి పోతుందో యేమో! ఎప్పుడు కళ్లు మూతపడిపోతాయో! పాపం! ఎవరినీ చూడకుండానే వెళ్లిపోవలసివస్తుందేమో!

వాకిట్లో పాటలు జోరుగా సాగిపోతున్నాయి. పట్టణం లోని శ్రీమంతులందరికీ విందుయేర్పాట్లు చేస్తున్నాడు మున్షీజీ. అహల్య లాంతరు పుచ్చుకుని ఇంట్లో వస్తువులన్నీ పరిశీలించుతోంది. తన వస్తువులన్నీ సర్వనాశనం కావటం చూచి లోలోన మండిపోతోంది. అక్కడ నిర్మల మంచంమీద పడుకొని శంఖ ధరుని మాటలు వినటంలో తన్మయురాలవుతోంది.

ఉదయాన శంఖధరుడు శెలవు తీసుకొని ప్రయాణమై నప్పుడు "బిడ్డా! ఇంకేన్నాళ్లో జీవించను. ఈ బ్రతికిన నాల్గు రోజులైనా రోజూ వస్తూపోతూ వుండు" అన్నది నిర్మల.

ఇవ్వాళ రాజభవనంలో కూడ వుత్సవము జరుగుతుంది. అందుచేత వుండాలని వున్నా శంఖధరుడు వుండజాలక పోయాడు.

నిర్మల పాదారవిందాలను స్పృశించి అమ్మలక్కలంతా వెళ్ళిపోయినప్పుడు శంఖధరుడు లేచి నిలబడ్డాడు. నిర్మలయేడుస్తూ "రేపు నీకోసం ఎదురుచూస్తూ వుంటాను నాయనా!" అంది.

"తప్పకుండా వస్తాను నాయనమ్మా"అన్నాడు శంఖ ధరుడు.

శంఖధరుడు వెళ్లి కారులో కూర్చున్నాడు. నిర్మల గుమ్మంలో నిలబడి అతనివంకే చూస్తోంది. శంఖధరునితో తన హృదయమూ వెళ్ళిపోతున్నట్టుంది ఆమెకు. యువకుల ప్రేమలో వ్యాకులత వుంటుంది. వృద్ధుల ప్రేమ హృదయవిదా

రకంగా వుంటుంది. యువకుడు తాను ప్రేమించిన వ్యక్తి నుండి కూడా ప్రేమ ఆశించుతాడు. ప్రేమకు బదులు ప్రేమ లభించకపోతే ప్రేమను తన హృదయంలోనుండి నెట్టివేస్తాడు. ఐతే వృద్ధులూ ఇలాగే ఆశించుతూంటూరా? వాళ్ళు ప్రేమిస్తారు. దానికి బదులు తనకులభించే దేమీలేదని వారికి తెలుసు. ఒక వేళ లభించినా దయ లభిస్తుంది. శంఖధరుని నేత్రాల్లో అశ్రువులులేవు; హృదయంలో తహతహ లేదు. వాహ్యాళికివెళ్ళి తిరిగి పోతున్నట్టు ఉల్లాసంగా వెళ్ళిపోతున్నాడు.

కాని నిర్మలహృదయం వ్రయ్యలైపోతోంది. వజ్రధరుని కళ్ళముందు అంధకారం క్రమ్ముకొస్తోంది.

♦ ♦ ♦

# ఇరవైఐదో అధ్యాయము

చాలరోజులు గడచిపోయాయి. రాజా హరిభజన, దైవోపాసనల్లో నిమగ్నుడై వుంటున్నాడు. ఇటీవల దాదాపు అయిదారేండ్లుగా యే గుడిగుమ్మంలోకీ తొంగిచూచి ఎరుగడు. ధార్మిక చర్చలను ఒకరకంగా బహిష్కరించినట్టుండేవాడు. యెస్టేటులో ధర్మఖాతాలూ, దానపత్రాలూ అసలే యెగరగొట్టేశాడు. కాని అలాంటివాని కిప్పుడు హఠాత్తుగా మళ్ళీ దేవుళ్ళయందు, దేవతలయందు శ్రద్ధా-భక్తులు యేర్పడినై. ధర్మఖాతాలు మరల ఆరంభించబడినాయి. ఆపుచేయబడిన ధార్మికవేతనాలు మున్నగునవి మళ్ళీ ఇవ్వ నారంభించాడు. రాజాగారు మరోసారి రంగు ఫిరాయించాడు. శంఖధరుడు

తిరిగిరావటంతో అతని ధర్మానురక్తి కళ్ళునులుముకుని మేల్కొన్నది. సంపద కలిగినప్పుడేగదా కావలివాండ్ర అవసరం!

ఎప్పుడు చూచినా ఏదో ఆలోచిస్తూ ఏకాంతంగా ఉంటున్నాడు రాజా. దివాణందాటి బయటికి రావటం అరుదయింది. అన్న-పానములపట్ల రుచి తప్పింది. నైరాశ్యస్థితిలో అతన్ని ఆవరించుకుని ఉన్న మానసికాంధకారం ఇప్పుడు హఠాత్తుగా ఆశాజ్యోతివల్ల పటాపంచలైపోయింది. ధర్మానురక్తితో పాటు ఆయన కర్తవ్యజ్ఞానంకూడ మేల్కొన్నది. చావటానికి కాళ్లు చాచుకు కూర్చున్న సమయంలో మనకు దైవభక్తి కలిగినట్లుగానే, మహాభోగపరాయణులు కూడా రామాయణ భారత - భాగవతపారాయణం ప్రారంభించినట్లే ఇప్పుడు రాజాగారికిన్నీ తమ అపకీర్తినిగూర్చిపశ్చాత్తాపం కలుగ నారంభించింది అర్ధరాత్రికి పైగా దాటిపోయింది. రాణివాసమంతా మైమరచి నిద్రిస్తోంది. అహల్య ఎంతచెప్పినా, బ్రతిమాలినా మనోరమ తన పూర్వపు మందిరానికి వచ్చేందుకు అంగీకరించ లేదు. ఆ కొద్దిపాటి గదిలోనే వుండి కాలం గడుపుతోంది. హఠాత్తుగా రాజాగారు ఆ గదిలోకి వచ్చాడు. మనోరమ ఆశ్చర్యచకితాత్మయై దిగ్గునలేచి నిలబడింది.

ఆ గదిని క్రిందామీదా తేరిపారజూచి కరుణార్ద్రస్వరంతో "నోరా! నా అపరాధం క్షమించమని కోరుటకే ఇవ్వాళ నీ దగ్గరకు వచ్చాను. నీపట్ల ఘోరదురన్యాయం చేశాను. నన్ను క్షమించు" అన్నాడు రాజా.

"ఆ సంగతులు తలపకండి. అందువల్ల మీకూ నాకూ-ఉభయులకూ దుఃఖం కలుగుతుంది. మీపట్ల నా మనస్సులో

ఒక్క క్షణమాత్రం కూడా చెడుతలంపు కలుగలేదు. ఇది ఆ భగవంతునికే తెలుసు" అన్నది మనోరమ కంటతడిపెట్టి.

రాజా:—ఔనౌను. ఆసంగతి దేవుడికేకాదు, నాకూ తెలుసు నోరా! నువ్వీ గదిలో- ఈ చీకటికొట్టులో ఉండడం చూచి ఇప్పుడు నా హృదయం బద్దలైపోతోంది. అయ్యో! చెడురోజులువస్తే మనస్సులోని కోమలభావాలు మంటకలసి పోతాయనీ, వాటి స్థానంలో కఠోర పాశవికభావాలు ఆక్రమించు కుంటాయనీ ఇప్పుడు బోధపడుతున్నది. నిజంచెప్పాలంటే ఒకవిధంగా నాకీ రాజ్యం లభించిఉండకపోయినా నా జీవితం ఇంతకంటే ఉత్తమంగా ఉండి ఉండేదని నాకప్పుడప్పుడూ అనిపిస్తూఉంటుంది.

మనో:—నాకూ తరచుగా ఇలాంటిభావమే కల్గు తూంటుంది.

రాజా:—ఇప్పుడు ఇహలీల సమాప్తం కానున్నసమ యంలో గత జీవితంపై ఒకసారి దృష్టిసారించి చూస్తుంటే నాజన్మ వ్యర్థమైపోయిందని అర్థమవుతోంది. నా వల్ల ఎవ్వరికీ ఉపకారమనేది జరుగలేదు. నిరుపేద కుటుంబీకులకు సైతం సులభంగా లభ్యమయ్యే ఆ కుటుంబజీవన సుఖం నాకు లేక పోయింది. శంఖధరుడు నా హృదయంలోని కోమలత్వా న్నంతా తనవెంట తీసుకుపోయాడు వానిని పొంది మళ్ళీ ఇవ్వాళే నేను నేనయ్యాను. కాని హృదయంలో లోపల కంపించిపోతూంది. నోరా! ఏదో అనిష్టం జరుగుతుందన్న శంక నా హృదయాన్ని కలవరపెడుతోంది. దాన్నేవిధంగానూ మనసులోనుండి తరిమివేయలేకున్నాను.

మనో:—దేవుడు చచ్చిపోయిన ఆశాంకురాలను మళ్ళీ చిగురింపజేసినపుడు ఇప్పటిక అంతా శుభమే జరుగుతుంది.

రాజా:—ఏంచేయను నోరా! ఈ జంకు కారణంగా నా మనస్సుకు శాంతి లేకుండాపోయింది. ఇది ఏదో అమంగళానికి పూర్వ చిహ్నమేమోనని భయంగా ఉంటోంది.

ఇలా అంటూనే రాజా మనోరమను సమీపించాడు. ఆమె చెవిలో "ఈ భయం అకారణంగా కల్గటంలేదు నోరా! దేవప్రియరాణిగారి భర్త నాకు అగ్రజుడు. ఆయన పోలికలకూ శంఖధరుని పోలికలకూ తేడాలేదు. ఆయనగారి నొకసారి యౌవనంలో ఉండగా చూచాను. అచ్చంగా ఇదేరూపం. ఆవగింజంతైనా తేడాలేదంటే నమ్ము. ఆయనగారి ఫోటో ఒకటి నా 'ఆల్బమ్' లో ఉంది. దీన్ని చూస్తే అసలిది శంఖధరుని ఫోటోయేనని నువ్వుకూడా అంటావు. ఇంత ఏకరూపం కవలల్లోకూడా ఉండదనుకో. ఇప్పుడు సంస్థానపు పాతనౌకరెవ్వరూ లేరు, గాని లేకపోతే వాడిచేత రుజువుచేయించేవాణ్ని. అన్నగారి రూపురేఖలతో నా రూపురేఖలు ఎంతగా కలిసిఉండేవో మొదట్లో శంఖధరుని పోలికా అలాగే ఉండేది. కాని ఇప్పుడు చూస్తే అన్నయ్యే వచ్చాడా అన్నట్టున్నాడు శంఖధరుడు.

మనో:—సరే, కాని, ఇందులో శంకించవలసినదేమున్నది? శంఖధర్ కూడా ఆ చెట్టుపండేగా.

రాజా:—అయ్యో! నోరా! నీవీవిషయం సరిగ్గా అర్థం చేసుకోవటంలేదు. నీ కెలా విప్పిచెప్పను? ఇందులో భీషణ రహస్యం దాగిఉంది నోరా! నేనీసారి శంఖధరునిచూచి త్రుళ్ళిపడ్డాను. వెంటనే నా ఒళ్లు గగుర్పొడిచిందంటే నమ్ము.

"ఈ శంకలన్నీ వట్టి నిరాధారమయినవి" అన్నది మనోరమ ఈసారి దృఢభావంతో.

రాజా తొడమీద చెయ్యిచరచి కొట్టుకుని "నోరా! నువ్వు ఇప్పటికూడా అర్థంచేసుకోలేకపోయావు. సరే, రేపటినుండి నువ్వు కొత్తమేడలో ఉండాలి. ఇది నా ఆజ్ఞ" అన్నాడు.

ఇలా అంటూనే లేచి నిలబడ్డాడు. విద్యుద్దీపాల నిర్మల కాంతిలో అతన్ని చూస్తూ నిలబడిపోయింది మనోరమ. దర్పంతో ఉప్పొంగిపోతూంది ఆవిడహృదయం. తన భర్త తన్నింతగా ఆదరిస్తున్నాడు గదా యని ఆమె గర్వం. సహృదయత యొక్క రసమయరూపమే ప్రేమ. ప్రేమ లేనప్పుడు సహృదయతయే దాంపత్యసుఖానికి మూలాధారమౌతుంది.

రాజాగారి కిప్పుడు ఏవిధంగానూ శాంతి లభించటం లేదు. ఏదో ఒక భయంకర విపత్తి రానున్నదన్న జంకును మనస్సులోనుండి పారద్రోలలేకపోతున్నాడు. ఎవరైనాముగ్గురు నలుగురుచేరి బిగ్గరగా మాట్లాడితే చాలు, ఏదో దుస్సంఘటన జరిగిపోయినదని కంగారుపడిపోతున్నాడు. శంఖధరు డెక్కడి కైనావెళ్ళే మళ్ళీకులాసాగాతిరిగివచ్చేదాకా వ్యాకులపడిపోతూ ఉండేవాడు. తన కళ్ళముందునుండి శంఖధరుడు రెప్పపాటు కాలంకూడ వైదొలగిపోకుండా ఉంటే బాగుండు ననిపిస్తోంది. శంఖధరుని ముఖంలోకి చూచి ఆయన కళ్లు ఇట్టే చెమ్మగిలి పోతూండేవి. రాత్రివేళ లేచి గుడికి వెళ్ళేవాడు, గంటల తర బడి ఈశ్వరప్రార్థన చేసేవాడు. తన మనసులోని శంకను బయ టపెట్టటానికి సాహసించలేకపోయేవాడు. ఆ శంకను స్వయం

గా వ్యక్తపరచేవాడుకాదు. తన మృతసోదరుని స్మృతిని అరికట్టాలని ప్రయత్నిస్తున్నాడు. కాని ఆ రూపం కళ్ళముందు నుంచి పైదొలగిపోవటంలేదు. నెత్తిమీద తిరుగాడుతున్న సంకటాన్ని తప్పించుకోవటానికి ఆయనచేయని పూజలూ, పునస్కారాలూ, విధులు — ఏమీ లేవు. కాని రాజాగారికి శాంతిమాత్రం లభించటంలేదు.

చీకటి పడబోతున్నది. రాజాగారు కారు తెప్పించి మున్షీ వజ్రధరుని ఇంటికి వెళ్ళాడు. మున్షీగారి సంగీత సమాజం సమావేశమైఉంది. అతని దాన - వ్రత-ధ్యాన - తపస్సులన్నీ సంగీతమే. అతని సమస్తచింతలూ, సకలకష్టాలూ సంగీతస్వరాల్లో విలీనమైపోతుంటాయి. మున్షీజీ రాజాగారిని చూడగానే లేచి నిలబడి 'రండి, రండి, మహారాజాగారూ రండి. ఇవాళ గ్వాలియర్ సంగీతాచార్యులవారి పాట వినెదరు గాని రండి. మీరు చాలా పాటలు వినిఉండొచ్చు. కాని, వీరిపాట మరో తరహాదనుకోండి!'' అన్నాడు.

మున్షీగారి నిర్విచారంపట్ల రాజా లోలోపల విసుక్కున్నాడు.'తమ విలాసోల్లాసములముందు ప్రపంచంలో ఇంక దేన్నీ లక్ష్యపెట్టని మనుషులుకూడ ఉన్నారు. శంఖధరునితో మా ఇరువురకూ ఒకేరకమైన సంబంధం - కాని ఈయనగారు తన సంగీతంలో మైమరచిఉంటే, నేను శంకలతో క్రుంగిపోతున్నాను.'ప్రాపంచికమోహ-మాయలులేనటువంటిమూఢులే అందరికంటె మెరుగు' అన్నదీ నిజమే!' తనలో ఇలా అనుకొని పైకి "“మీతో కొంచెం మాట్లాడాలని వచ్చాను'' అన్నాడు.

ఇద్దరూ ఒకగదిలోకి వెళ్ళి ఏకాంతంగా కూర్చున్నారు. సంభాషణ ఎలా ప్రారంభించడమా అని ఆలోచిస్తున్నాడు రాజా. ఆయనగారుసందిగ్ధస్థితిలో ఉండటంచూచి "నే చేయ గలిగిన దేమైనాఉంటే తెలవీయండి. మీా రేదో చాలా విచారంగా ఉన్నట్టు కన్పించుతున్నారు. కారణమేమిటి?"అన్నాడు మున్షీ వజ్రధరుడు.

రాజా:-ప్రాపంచిక విషయాల్లో మనసుంచడమే సకల దుఃఖాలకూ మూలమన్నట్టుగా తోస్తున్నది. జగదీశపురం రాజ్యాన్ని అనుభవించటమే ఒకప్పుడు నా జీవితపరమావధిగా భావించాను. నేను చేసినది ప్రతిదీ ఆ ఆశయసిద్ధికోసమే. కాని నా జీవితాన్నిగురించి ఒక్కక్షణమైనా ఆలోచించిన పాపానపోలేదు. జన్మసార్థకం చేసుకొనే దెలాగాఅని యోచించనేలేదు. రాజ్యప్రాప్తికి పూర్వం సేవాభావాలు మనస్సులో తిరుగాడుతూండేవి. అదైనా చక్రధరబాబు సాంగత్యంవల్లనే ననుకోండి. రాజ్యం లభించటంతో నేను పూర్తిగా మారిపోయాను. మళ్లీ ఎన్నడూ ఆత్మవిచారణావశ్యకతే కల్గలేదు. శంఖధరుడు లభించటంతో నేను పరిపూర్ణానందం పొందాను. నా జీవితానికొక జ్యోతి లభించినట్టుంది. నే నింకేదీ పొందవలసినది లేనట్టే భావించాను. కాని శంఖధరుడు తిరిగివచ్చినతరువాత నా కతని విషయంలోఏదో భయంకరశంక కలుగుతోంది.మీారు మా అన్నగారిని చూచిఉంటారనుకుంటాను?

మున్షీ:_లేదండీ. ఆయనగారు ఉండగా నేను ఎక్కడో నౌకరీ చేస్తున్నాను.

రాజా:—అన్నగారి రూపం నేటికీ నా కళ్ళలో మెదు లుతూ నేఉంది. ఇదిగో, ఇలా చూడండి. ఇది ఆయనగారి ఫొటోయే.

రాజాగారు ఒక ఫొటోతీసి మున్షీజీకి చూపించాడు. మున్షీజీ దాన్ని చూచి వెంటనే 'ఇది శంఖధరుని ఫొటోయే' అన్నాడు.

రాజా:—కాదయ్యా, ఇది మా అన్నగారి ఫొటో. శంఖధరు డింతవరకు తన ఫొటోయే తీయించుకోలేదు. ఫొటో తీయించుకోనటమంటే వాని కెందుకో అయిష్టం.

మున్షీ:—నే నెలా అంగీకరిస్తాను? ఇది చచ్చులేకుండా శంఖధరుని ఫొటోయే.

రాజా:—ఐతే నా కళ్ళు మోసపోవటంలేదని నిర్ధారణ అయింది.

మున్షీ:—అలాగైతే చోద్యమైన సంగతే!

రాజా:—మీతో ఇప్పు డేం చెప్పను? నాకు చాలా జంకుగా ఉంటోంది రాత్రిలం దసలు కన్ను మీదమూతపడితే ఒట్టు. పగలేమో కూర్చున్నపళంగానే త్రుళ్ళిపడుతూంటాను. ఇద్దరు వ్యక్తులరూపం ఇంతయిదిగా ఎన్నడూ కలియదు. అన్నయ్యే మా ఇంట్లో మళ్ళీ పుట్టాడన్నదానిలో నాకు సందే హమేమీలేదు. ఈవిధంగా నాయందు దయదలచటానికి కారణమేమిటో ఆ ఈశ్వరునికే తెలియాలి. శంఖధరుని కేమాత్రం ప్రమాదం వాటిల్లినా నా ప్రాణం ఎగిరిపోయినట్లే.

మున్షీ:—భగవంతుడు తిన్నగాచూస్తే అంతా సవ్యం గానే వుంటుంది. ఇందులో గాభరాపడవలసిన దేమీ లేదు. అప్పుడప్పుడు అలా జరుగుతూనే వుంటుంది.

రాజాగారు లేచి నిలబడ్డాడు వెళ్ళబోతూ గంభీరంగా "అడగాలని వచ్చిన విషయం అసలు మరచేపోయాను. మీరు సాధు - సన్యాసుల నెందరినో సేవించారు. మరణానంతరం జీవాత్మ్మకి ఏవిధమైన దుఃఖమూ వుండదుగదూ ?" అన్నాడు

మున్షీ:—వుంటుం దుంటుంది. ఇహలోకంలోకన్న ఎక్కువగానే వుంటుందని విన్నాను.

రాజా:—అబద్ధం, పూర్తిగా అబద్ధం. నేను నమ్మలేక పోతున్నాను. ఆ లోకపు సుఖ - దుఃఖాలు మరోలా వుండ వచ్చు. ఏ సంగతీ గుర్తే వుండకపోవచ్చునని నా అభిప్రా యం. నా అనంతరం జరుగవలసిన దేదో జరిగితీరుతుంది. కాని అహల్యకు ధైర్యం చెప్పమని మాత్రమే మీకు చెబుతున్నాను. మనోరమ విషయంలో నాకేమీ విచారంలేదు. ఆమె ఏస్థితిలో నైనా తన్ను తాను సంబాళించుకోగలదు. కాని అహల్య అలాంటి పిడుగుపాటును తట్టుకోలేదు.

మున్షీజీ భయభీతుడై రాజాగారి చెయ్యి పట్టుకున్నాడు కంటినిండా నీరు తెచ్చుకుని "మీ రింతగా నిరాశ చెందుతా రెందుకు ? దేవునియందు విశ్వాసంతో వుండండి. అంతా శుభంగానే వుంటుంది" అన్నాడు.

రాజా:—ఏంచేయను ? నా హృదయం మీ హృద యంలాంటిదికాదు. శంఖధరుని మొహం చూచినప్పుడల్లా నా రక్తం చల్లబడిపోతున్నది. వాడు నాకు మనుమడుకాదు,

శత్రువు. ఇంతకన్న గొడ్డుమోతుగా వుంటేనే బాగుండేది మున్షీజీ! నిరుపేదగా వుండివుంటేనా! ఇంతకంటే ఎంతో సుఖంగా వుండేవాణ్ణనిపిస్తోంది.

రాజాగారు గుమ్మంవేపు నడిచాడు. మున్షీజీకూడ ఆయన వెంట కారువరకు వెళ్ళాడు. శంకాపీడితుడైనందున నోట్లోనుంచి మాటరావటంలేదు. దీనంగా రాజాగారికేసి చూస్తున్నాడు — ప్రాణభిక్ష యాచించుతూన్నట్లు.

రాజాగారు కారులో కూర్చుని "ఇక వుండిపోండి. నే చెప్పిన సంగతి మాత్రం జ్ఞాపకం వుంచుకోండి" అన్నాడు.

మున్షీజీ పాషాణమూర్తిలా నిలబడివున్నాడు; బుర్రుమని కారు వెళ్ళిపోయింది.

రాజా విశాలసింగు కారుదిగి వాకిట్లో అడుగుపెట్టాడో లేదో ఇంతలో అహల్య "అయ్యో బిడ్డా! నన్ను విడచిపెట్టి ఎక్కడికి పోయావురా నాయనా! ఇందుకే నన్ను ఆగ్రానుంచి తీసుకొచ్చావటరో!" అని విలపించటం విన్పించింది.

ఈ దీనాలాపం చెవిని పడగానే రాజాగారి పాదాల క్రింద నేల క్రుంగిపోయినట్టయింది. నిలువునా నీరైపోయాడు. తన కళ్ళతో చూడకూడదనుకున్నదే చూడవలసిన గతిపట్టింది, అదీ ఇంతత్వరలో! మున్షీ వజ్రధరుని దగ్గరనుంచి తిరిగి వచ్చిరావటంతోనే! అయ్యో! ఇంత త్వరలోనే విధి ఈ సర్వనాశనం తలపెడతాడని ఎవరెరుగుదురు? దీనికిముందే తన జీవితాంతం కావాలనుకున్న ఆయన ఆశనే వమ్ముచేశాడు విధి.

రాజాగారు గదిలోకి వెళ్ళి శంఖధరుని మొహంకేసి చూచాడు. అతని జీవనాధారం నిర్జీవంగా పడిఉంది. ఈ దృశ్యాన్నే ఆయన యాభైఏండ్లకు పూర్వం చూచాడు.

ఆయన నోటివెంట ఒక్కవిలాప- శబ్దంకూడా వెలువడ లేదు. కళ్ళనుండి ఒక్క కన్నీటిచుక్క అయినా జారిపడలేదు. నిల్చున్నవాడు నిల్చున్నట్టుగానే విరచుకుపడ్డాడు. అంతే, ప్రాణవాయువు అనంతంలో విలీనమైపోయింది.

# ఇరవై ఆరో అధ్యాయము

శంఖధరుడు వెళ్ళిపోయినతరువాత చక్రధరునికి ప్రపంచమే శూన్యంగా గోచరించసాగింది. ఆ వెనుకటి సేవాభావోత్సాహము ఇప్పుడు అంతరించిపోయింది. అహర్నిశలు ఆ సుందరయువకుని రూపమే కళ్ళముందు నృత్యంచేస్తోంది. వాని మాటలే కర్ణపుటాల్లో ప్రతిధ్వనించుతున్నాయి. భోంచేయటానికి కూర్చున్నప్పుడు ప్రక్కను శంఖధరుని పీట ఖాళీగా ఉండటంచూచి ముద్ద గొంతుదిగటంలేదు. ఎప్పుడుచూచినా ఏదో కోల్పోయిన మనిషిలా ఉంటాడు. కొడుకుదగ్గరకు పోవాలని మాటిమాటికీ బుద్ధిపుట్టి బయలుదేరబోయేవాడు. కాని, మళ్ళీ ఆగిపోయేవాడు. ఇటు 'సాయీగంజ్' ని వదలిపెట్టటానికీ మనస్కరించటంలేదు. అక్కడ ఉన్నన్నిరోజులు ఇంతవరకెక్కడా అతను ఉండివుండలేదు. శంఖధరుడు వేసుకు పడుకున్న గొంగళిని నిత్యం దులిపి తుడిచి మడతపెడుతుంటాడు. శంఖధరుడు వెళ్లేటప్పుడు తన ఖంజరిని అక్కడే వదలిపెట్టి

వెళ్ళాడు. ఇప్పుడు చక్రధరునికి ప్రపంచంలో ఈ ఖంజరికి మించిన అమూల్యవస్తువేదీ లేదు. శంఖధరుని పాతధోవతీ,చినిగి పోయినచొక్కా రెండూ తలక్రింద పెట్టుకొని పడుకునేవాడు చక్రధరుడు. స్త్రీ తన మాంగల్యాన్నైనా ఇంత భద్రంగా దాచుకుంటుందో లేదో!

పొద్దుకూకిపోయింది. చక్రధరుడు గుడి వరండాలో కూర్చుని ప్రయాణసన్నాహం చేస్తున్నాడు. ఇక్కడ ఉండటం ఇప్పు డతనికి అసాధ్యమైపోయింది.ఆదేవకుమారుని చూడాలని వ్యాకులపడిపోతున్నాడు.

ఆరాత్రి ఒక భయంకర స్వప్నం చూచాడు. అందులో ఒక నదీతీరం. శంఖధరుడు తనప్రక్కనే కూర్చునిఉన్నాడు. హఠాత్తుగా దూరాన ఒకనావ వస్తున్నట్లు కన్పించింది. అందులోంచి మన్నాసింగ్ దిగాడు. అతను నవ్వి "బాబూగారూ! ఇతనేకదూ రాజకుమారుడు? ఇతనికోసమే ఎన్నాళ్ళనుంచో వెదకుతున్నాను. రాజాగారు ఈయన్ని రమ్మనమన్నారు." అన్నాడు. వెంటనే శంఖధరుడు లేచి నిలబడి మన్నాసింగ్‌తో బయలుదేరాడు. ఇద్దరూ నావలో కూర్చున్నారు. మన్నాసింగ్ తెడ్డుపుచ్చుకుని నడుపుతున్నాడు. చక్రధరుడు అక్కడే ఒడ్డున నిలబడిపోయాడు. నావ కొంచెందూరం వెళ్ళిందో లేదో గిరగిరా సుడులు తిరుగసాగింది. శంఖధరుడు చేతులు రెండూ ఎత్తి చక్రధరుని పిలిచాడు. అతను ఉరికాడు. కాని ఇంతలో నావ నదిలో మునిగిపోయింది. మళ్ళీ మరుక్షణంలోనే పైకి తేలింది. యథాప్రకారంగానే తెడ్డువేస్తున్నాడు మన్నాసింగ్. కాని శంఖధరునిజాడ మాత్రం లేదు. చక్రధరుడు కెవ్వుమని

కేకపెట్టి, కళ్ళు తెరిచాడు. హృదయం దడదడకొట్టుకుంటోంది. "ఈశ్వరా! ఇది స్వప్నమా లేక జరుగనున్న యథార్థమా?" అన్నమాటలు అతనినోటినుండి అప్రయత్నంగా వెలువడినాయి. వెంటనే అప్పటికప్పుడు లేచి కూర్చున్నాడు. చేమూట పట్టుకొని బయల్దేరాడు.

పిండారబోసినట్లుంది వెన్నెల. దశదిశలు నిశ్శబ్దంగా ఉన్నాయి. పర్వతపంక్తులు అభిలాషల సమాధుల్లా గోచరిస్తున్నాయి. వృక్షతతులు శ్మశానభూమిలో లేచే పొగవలె కన్పడుతున్నాయి. చక్రధరుడు రాతిమయంగా వున్న కాలిబాటను ముందుకు సాగిపోతున్నాడు.

చక్రధరుని మానసికస్థితి ఇప్పుడు తన్నుతానే మరచిపోయినట్లుంది. తెల్లవార్లూ ఆ రాళ్ళలోపడి నడుస్తూనేఉన్నాడు. ఉదయానికి రైలుస్టేషనుకు చేరుకున్నాడు. బండివచ్చింది. ఎక్కి కూర్చున్నాడు. బండిలో ఎవరెవరు కూర్చున్నారో, తన్నేమేమి ప్రశ్నించుతున్నారో, ఆప్రశ్నలకు తానేమిసమాధానాలు చెప్తున్నాడో, దారిలో ఏయేస్టేషనులు వచ్చాయో, ఎప్పుడు మధ్యాహ్నమయిందో, ఎప్పుడు ప్రొద్దుకూకిందో, ఇవేమీ అతనికి తెలియవు. కాని, తాను చేయవలసినదే చేస్తున్నాడు. ఎవరిప్రశ్నకూ తలాతోకా లేని సమాధానం చెప్పటంలేదు. కూర్చోగూడని బండిలో కూర్చోవటంలేదు. దిగగూడని స్టేషనులో దిగటంలేదు. అభ్యాసం (అలవాటు) తరచుగా చైతన్యస్థానాన్ని ఆక్రమించుతూ ఉంటుంది.

మూడోరోజుఉదయం బండి కాశీ చేరుకున్నది. రైలు గంగానదివంతెనమీదికిచేరగానే చక్రధరుని స్మరణశక్తిమేల్కొ

న్నది. దిగటానికి సిద్ధంగా కూర్చున్నాడు. నదికి ఎడమప్రక్కన పచ్చపచ్చగా కనులపండువుగా ఉంది. రెండోవైపున కాశీ నగరం విరాజిల్లుతోంది. ఎత్తయినమేడలు- మిద్దెలతో, ఆకాశాన్నంటుతున్న దేవాలయ గోపురాలతో అలరారుతూ, బాలభాస్కరుని దివ్యకాంతిలో ధగధగ మెరుస్తోంది. భాగీరథి మందగమనంతో అనంతాభిముఖంగా పరుగులుతీస్తూ పోతోంది. చిరకాలానంతరం నేడు ఈ చిరపరిచితదృశ్యం చూచి, చక్రధరుని హృదయం ఒక్కసారి ఎగిరి గంతు వేసింది మనసులో భక్తిభావతరంగాలు ఉవ్వెత్తున లేచాయి. ఒకక్షణం అతను తన చింతలన్నీ మరచిపోయాడు. గంగలో స్నానం చేయాలని ప్రబలేచ్ఛ కలిగింది. దానినాపుకోవటం అతనిశక్తికి మించిపోయింది.

స్టేషనులో అనేకమంది పాతమిత్రులు కలిశారు. వాళ్ళ ఆకారాలెంత మారిపోయాయి! చక్రధరునిచూచి వాళ్ళంతా ఒకసారి ఉలిక్కిపడ్డారు. క్షేమసమాచారాలడిగి, చప్పున తమదారిని చక్కాపోయారు. "ఎవ్వడికీ నిలబడి రెండుమాటలు మాట్లాడేందుకూడా తీరికలేకుండా ఉన్నారే! ఎంత కఠినాత్ములు!" అనుకున్నాడు చక్రధరుడు మనసులో.

దశాశ్వమేధ ఘట్టందగ్గర టాంగా నుంచి దిగాడు. పూర్వమూ ఈ ఘట్టంలోనే స్నానంచేస్తుండేవాడు. 'పండా' లందరికీ చక్రధరుడు చిరపరిచితుడే. కాని ఇవ్వాళ ఏఒక్కడూ సంతోషంగా 'రండి రం'డని స్వాగతమివ్వలేదు. అసలు పలుకరించటమే బలవంతపు బ్రాహ్మణార్థంగా తోచింది. ఎక్కడెక్కడ తిరిగొచ్చారు? ఏంచేస్తుండేవారు? అని ఒక్కడూ అడిగినపాపానపోలేదు.

స్నానంచేసి చక్రధరుడు మళ్ళీ టాంగాలో కూర్చు న్నాడు. రాజభవనాభిముఖంగా బండి సాగిపోతోంది. రాజ భవనం సమీపించుతున్నకొద్దీ అతని హృదయం మరీ కలవర పడసాగింది.

టాంగా సింహద్వారంముందుఆగింది. రెపరెపలాడుతూ ఎగురుతూండే రాజపతాకం దించబడిఉంది. అదిచూచి చక్ర ధరుని కాళ్లు చల్లబడ్డాయి. హృదయం సమ్మెటలాగా దడదడ కొట్టుకో సాగింది.

టాంగాను చూడగానే ఒక ముసలిగేటుకాపరి దగ్గర కొచ్చి నిలబడి చక్రధరునికేసి బాగా పరిశీలనగా చూడ సాగాడు. తర్వాత గబగబా లోనికిపోయాడు. మరుక్షణంలోనే లోపల హాహాకారములు వినవచ్చినవి. తానేదో భయానక మృగగర్భంలో తన్నుకులాడుతున్నట్టు తోచింది చక్రధరునికి.

ఏంజరిగింది? ఏంమూడిందని అడిగి తెలుసుకుందామను కుంటే మనిషేడీ? దగ్గరకొచ్చినవాడే లేడు. అందరూ తలలు వాల్చి దూరంగా నిలబడిఉన్నారు. అదిగో ఎవ్వరో కర్రను ఊతచేసుకుని వస్తున్నారు అరె! ఆయన మున్షీ వజ్రధరుడే! చక్రధరుడు గభాలున బండిదిగి, పరుగున పోయి తండ్రి పాదాలపై వాలాడు.

"రెండు మూడురోజులు ముందుగానైనా వచ్చి అఘో రించకపోయావూ? కన్నకొడుకుముఖమన్నా కడసారిచూపు అందేదేమో! అంతా సర్వనాశనమై దుమ్మయిపోయినతర్వాత ఇప్పుడు వచ్చావా? అక్కడ ఇదే మొక్కుకుంటూ కూర్చు

న్నావా ఏమిటి?" అన్నాడు మున్సీ వజ్రధరుడు తిరస్కార భావంతో.

చక్రధరుడు విలపించలేను సరిగదా, పైపెచ్చు గంభీర ముద్రవహించి, దృఢభావంతో "అంతా ఈశ్వరేచ్ఛ. ఒక్కరూ జాబైనా వ్రాయలేదే? సరే, ఇంతకూ జబ్బేమిటి?" అన్నాడు.

మున్సీ:— అబ్బే! అసలు తలనొప్పయినా ఎరుగడు, ఇక జబ్బేమిటని చెప్పేది? అలా జరుగవలసిఉంది. ప్రారబ్ధమనుకో. రాత్రి భోంచేసి కూర్చుని, ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు, అంతే ప్రాణం వదలి స్వర్గానికి దారిపట్టాడు. ఏమైందో తెలుసుకోవటానికి ఏ వైద్యునితరమూ కాలేదు; ఏ డాక్టరుబుద్ధీ పనిచేయలేదు. విన్నవాడల్లా 'అరె!' అని ఆశ్చర్యంతో వేలుకరుచుకున్నాడు. పాపం! ఈదుఃఖంతోనే రాజాగారూ వెళ్ళిపోయారు. ఇక, నువ్వూ మరచేపోయావు. కాని, వాడికిమాత్రం అహోరాత్రులు నీ నామస్మరణే! ఇంకా ఈ లోకంలో ఉండి చేసేదేముంది?కడుపునిండింది;బ్రతికినంతకాలం ఏడ్వటం మినహా ఇంకేముంది? ఈశ్వరుడెంత కఠినాత్ముడు!

చక్రధరుడు ఒక నిట్టూర్పు విడిచి "అదంతా నా కర్మఫలితం. అనవసరంగా దేవునిమీద నెపం వేయకండి" అన్నాడు.

మున్సీ:—అటువంటి కర్మలు నువ్వుచేశావేమో! నేను మాత్రం చేయలేదు. మరి నా కింత దెబ్బ ఎందుకుతగలాలి? నేనూ ఇంతవరకు దేవుడు గొప్ప దయాళుడనే అభిప్రాయపడుతూవచ్చాను. కాని ఇప్పుడు అటువంటి శ్రద్ధా-భక్తులేమీ

లేవు. అతగాడి గుణగణాలనుస్తుతిస్తూనే వయస్సంతా వెళ్ళమారి పోయింది ఐనా అందు కీ ఫలితం కల్గింది. పైగా ఇంకా ఆ దేవునిమీద నెపంవేయవద్దని చెబుతున్నావా! ఇలాంటి దయా దాక్షిణ్యాలులేనివాని మహిమను ఎవడు కీర్తించుతాడు? అస లెందుకు కీర్తించాలి! ఓరి చచ్చుప్రాణమా! నీకళ్లు వంకళ్ళురా! ఒక్కచుక్కఅయినా కన్నీరు కారదే! పాషాణమూర్తిలా నిల బడి చూస్తున్నావా? ఇదిగో, నే చెబుతున్నా విను - ఏడ్వు, బాగా ఏడ్వు; లేకపోతే గుండెల్లో సెలపడుతుంది సుమా. గొప్ప గొప్ప త్యాగమూర్తుల్ని చాలామందినిచూశాం. కాని కడు పుబ్బ ఏడ్వనివాడు మళ్ళీ నవ్వటమూ చూడలేదు. పద, లోప లికి పద. కోడలు తల గోడకేసికొట్టుకుంది. కట్టుకట్టుకుని పడి ఉంది. నిన్ను చూస్తే కాస్త ధైర్యం కలుగుతుంది. కాని ఆవిడ దగ్గరకు వెళ్ళినతర్వాత నువ్వూ ఏడ్చేవ్? ఒకవేళ అలాంటి దేమైనా జరిగిందా అంటే ఆవిడ ప్రాణమే ఎగిరిపోతుంది సుమా.

ఇలా అని చక్రధరునిచెయ్యి పట్టుకుని అంతఃపురానికి తీసుకువెళ్ళాడు మున్షీజీ. చక్రధరుని ఆగమనవార్త విని అహల్య లేచి నిలబడాలనుకున్నది. కాని లేచే ఓపిక ఉంటేగా !

చక్రధరుడు ఎదుటికిపోయి "అహల్యా!" అన్నాడు.

అహల్య మళ్లీ లేచేందుకు ప్రయత్నించింది. కాని, ఎండతరబడి క్లేశ - దుఃఖములు, అనేక దినముల ఉపవాసము, గోడదెబ్బతో చాలా రక్తం కారిపోవటంవల్ల శరీరం శిథిలమై పోయింది. పక్కకు ఒత్తిగిలి పతిపాదముల వేపుకు రెండు చేతులూ చాచింది; కాని పతిచరణములను స్పర్శించలేక

పోయింది. చాచినచేతులు చాచినట్లుగానే ఉండిపోయాయి. ఒక్క క్షణంలో క్రిందికివాలిపోయాయి. చక్రధరుడు ఖంగారు పడి ఆవిడముఖంలోకి చూచాడు. నిరాశచే వాడిపోయిఉంది. నేత్రాలు దయాభిక్షకోరుతున్నాయి.

“అహల్యా! నేను వచ్చేశాను. ఇంకెక్కడికీ వెళ్ళను. దైవసాక్షిగా చెబుతున్నాను. ఎక్కడికీ వెళ్ళను. అయ్యో! దేవుడా! ఇది చూపించటానికే నన్నిక్కడికి తీసుకొచ్చావా?” అన్నాడు చక్రధరుడు గద్గదస్వరంతో.

అహల్య తృషిత - దీన - తృణీకార దృక్కులతో ఒకసారి భర్తకేసి చూచింది; అంతే. ఇంక శాశ్వతంగా కళ్లు మూసుకున్నాయి.

అదే సమయంలో మనోరమ గుమ్మంలోకి వచ్చి నిల బడింది. ‘‘రాణిగారు! కాస్త ఇలా వచ్చి ఈమెను మంచం మీాదనుంచి క్రిందికి దించండి’ అన్నాడు చక్రధరుడు కన్నీరు ఆపుకుంటూ.

మనోరమ లోపలికివచ్చి అహల్యముఖం చూచింది. ఏడుస్తూ ‘‘ఇంతకూ మీా దర్శనభాగ్యం రాసిపెట్టిఉంది లేక పోతే ప్రాణం ఏనాడో లేచిపోయేది. పాపం! దీనురాలికోరిక ఏదీ నెరవేరనేలేదు” అంది.

ఇలా అంటూండగానే మనోరమ కళ్ళనుండి అశ్రుధార ప్రవహించసాగింది.

# ఉపసంహారము

కొన్నేండ్లు గడచిపోయాయి. మున్సీ వజ్రధరు డిప్యూటం లేదు. గుర్రపుస్వారీ అంటే ఆయన కెంతో ఇష్టం. 'మూతి మీద మీసముండున్న మగవాడికి గుర్రమే తగిన వాహనం. జట్కాలూ, పల్లకీలూ, మోటార్లూ ఇవన్నీ స్త్రీలకే' నని ఆయనగారి అభిప్రాయం. ఒకరోజున జగదీశపురం వెళ్ళి చాలా ప్రొద్దుపోయి వస్తున్నాడు. దారిలో ఒక కాల్వ ఉంది. అందులో దిగివెళ్ళటానికి మార్గంకూడ నిర్మించబడిఉంది. కాని కాల్వదిగి వెళ్ళటం నామోషీగా తోచింది మున్సీగారికి. గుర్రం నాలుగు కాళ్ళెత్తి ఒక్కదూకుదూకింది. అవతలి కొళ్ళి చేరింది. కాని దాని కాళ్లువెళ్ళి గోతిలోపడ్డాయి. దభేల్ మని పడిపోయింది. మున్సీజీ కూడ పడిపోయాడు. మళ్ళీ లేవనేలేదు. ఉన్నన్నాళ్లూ నవ్వుతూ త్రేలుతూ హాయిగా జీవితం గడిపాడు. పతివియోగ దుఃఖం అనుభవించేందుకు నిర్మలకూడ ఎన్నాళ్ళో జీవించలేదు. చక్రధరుడు మళ్ళీవివాహంచేసుకుంటే బాగుండునన్న ఆవిడఅభిలాష అలాగే ఉండిపోయింది.

రాణీ మనోరమ ఇప్పుడు నూతనభవనంలో ఉంటోంది ఆమె లెక్కలేనన్ని పక్షులను పెంచుతోంది. వాటితోనే ఆమె కాలంగడుపుతున్నది. పక్షుల కలకలారావంలో తనమనోవ్యధను ముంచివేయాలనుకుంటున్నది.

చక్రధరుడు ఇంటిదగ్గర ఎక్కువరోజులు ఉండలేదు. తలిదండ్రులు గతించిన తర్వాత ఆఇల్లు ఇల్లుగానేలేదు. అందు చేత మళ్ళీ దక్షిణాధిశకు ప్రయాణంకట్టాడు. ఇప్పు డతనికి సేవాకార్యకలాపాలే కాదు, పక్షులంటే అమితప్రేమ ఏర్పడింది. వింతవింతపక్షుల నన్వేషించడంఅతనిదైనిక కార్యక్రమాలలో ఒక టయిపోయింది. అతనిభక్తులు చక్రధరునికి పక్షులయందుకలిగిన ప్రేమనుచూచి ఆయన్ను సంతోషపెట్టానికి పిక-శుక-శారి కాది వివిధ పక్షులను పట్టుకొని తెచ్చి సమర్పించుతూండే వాళ్ళు. ఈ పక్షులన్నిటికీ వేర్వేరు పేర్లుపెట్టి రకరకాల తిళ్లు ఏర్పాటుచేయబడినవి. వాటికి మాటలు నేర్పటానికీ, మేపటా నికీ వేళలు నిర్ణీతమైనాయి.

సంధ్యాసమయం. మనోరమ ఉద్యానవనంలో పచారు చేస్తోంది. హఠాత్తుగా నీళ్ళతొట్టిదగ్గర అతిమనోహరమైన పంజ రం ఒకటి కన్పించింది.అందులో కొండగోరువంక ఒకటి వుంది. రాణి కెంతో ఆశ్చర్యంవేసింది. 'ఈ పంజరం ఎక్కడనుంచి వచ్చిం దబ్బా!' అనుకున్నది. ఆమెదగ్గర కొండజాతి పక్షు లెన్నో వున్నాయి. వాటన్నిటినీ చాలా ధనమిచ్చి కొన్నది. కాని ఇంత అందమైన పిట్ట ఒక్కటీ లేదు. పసుపుపచ్చరంగు; నెత్తిమీద ఎర్రటిమచ్చ, ముక్కు సొగసు చెప్పనవసరమే లేదు. చూస్తే ముద్దుపెట్టుకోవాలనిపించుతోంది. మనోరమ సమీ పించగానే 'నోరా! నన్ను మరచిపోయావా! నేను నీ వెను కటి సేవకుడనే అన్నది' గోరువంక.

మనోరమవిస్మయానికి మేర లేకపోయింది. ఆమెకు కొంచెం భయం కలిగింది కూడాను. దీనికి నా పే రెవరు నేర్పారు ? అస లిది ఎవరిపక్షి ? ఎక్కణ్ణుంచి వచ్చింది ? ఎలా వచ్చింది ! దీనికి యజమాని యెవరో ఒకరు వుండివుంటాడు. అతను వస్తూవుండవచ్చు. సరే, అతనెవరో చూద్దాం'' అనుకున్నది.

మనోరమ చాలాసేపు అక్కడే నిలబడి ఆ మనిషి కోసం నిరీక్షించింది. కాని ఎంతసేపటిక్కీ ఎవ్వరూ రాకుండటంచూచి తోటమాలిని పిలిచి ఆ పంజరం తెచ్చిన మనిషి యెవరని అడిగింది.

''సరిగ్గా చూడలే దమ్మగారూ! ఎవరోగాని ముత్తానికి పెద్దమనిషిలాగేఉన్నాడు. చాలసేపు నన్ను ఎస్టేటుసంగతులు అడిగాడు. ఇంకాపక్షుల్ని తీసుకొస్తానని చెప్పి, పంజరంఇక్కడ పెట్టివెళ్ళాడు. కాని రాలేదమ్మా.''అనిచెప్పాడు తోటమాలి.

రాణి:—ఇవ్వాళ మళ్ళీ వస్తాడా?

తోటమాలి:—ఔనం డమ్మగారూ! అలాగే చెప్పిపోయాడు.

రాణి:—వస్తే, నాకు కబురుచెయ్యి.

తోటమాలి:—చిత్తం, అలాగే అమ్మగారూ!

రాణి:—ఎలాఉంటాడు! రూపమెలా ఉంటుందో చెప్పగలవ్వా?

తోటమాలి:—పెద్దపెద్దకళ్ళు. పొడుగా ఉంటా డమ్మా. ఒక్కొక్కటే మెరుస్తున్న జుట్టు.

"వస్తేమటుకు నన్ను తప్పకుండా పిలువు" అన్నది రాణి అమితాసక్తితో.

రాణీ మనోరమ పంజరం తీసికొని వెళ్ళిపోయింది. తెల్లవార్లూ ఆమె ధ్యాస ఆ గోరువంకమీదనే ఉంది. దానిమాటలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి.

నాలుగుగంటలకు వెళ్ళి పైగదిలో కూర్చుని, ఆ మనిషి వస్తాడేమోనని ఎదురుచూస్తోంది. అక్కడికి తోటమాలి ఇల్లు స్పష్టంగా కనిపించుతోంది. చాలాసేపు చూస్తూ కూర్చుంది. చివరకు చీకటికూడా పడసాగింది. రాణి దీర్ఘంగా ఒకనిట్టూర్పు విడిచింది. 'బహుశా ఇకరాడు!' అనుకున్నది.

ఇంతలో ఒకతను రెండుచేతుల్లో రెండు పంజరాలు తీసుకుని తోటలోకి ప్రవేశించటం దృగ్గోచరమైంది. మనోరమ హృదయం పట్టరాని సంతోషంచే కుప్పిగంతులు వేయసాగింది. తోటమాలి తన్ను పిలవటానికి వెంటనే వస్తాడనుకున్నది మనోరమ. కాని వాడు రానేలేదు. ఆమనిషి ఆ పంజరా లక్కడపెట్టి తిరిగి వెళ్లిపోయాడు. మనోరమ ఇక నక్కడ కూర్చొనిఉండ లేకపోయింది. అయ్యో! ఆయన వెళ్ళిపోతున్నారే! ఆమె అక్కడే నేలమీద కూలబడి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

అంతలో తోటమాలి వచ్చాడు. "అమ్మగారూ! ఆ మనిషి వచ్చి మరో రెండుపంజరాలు ఉంచిపోయాడు. మళ్ళీ

ఎప్పుడైనా మరికొన్ని పిట్టలను తీసుకొస్తానని చెప్పి వెళ్ళాడమ్మగారూ!" అన్నాడు.

"ఐతే, నువ్వు అప్పుడేవచ్చి ఎందుకు చెప్పలేదు?" అని మనోరమ గద్దించి అడిగింది.

తోటమాలి ఆ పంజరములను ఆమెఎదుట పెడుతూ "అమ్మగారూ! నేను వెంటనే బయలుదేరి రాబోయాను. కాని ఆ మనిషి వెళ్ళవద్దని వారించాడు. 'ఇప్పుడే అమ్మగారిని పిల్వటం దేనికిలే? మళ్ళీ ఎప్పుడైనా ఇంకా కొన్నిపిట్టలను తీసుకువచ్చి, నేనే స్వయంగా కలుసుకుంటాలే' అన్నాడు అమ్మగారూ!" అని చెప్పాడు.

రాణీ మనోరమ ఇంకేమీ మాట్లాడలేదు. పంజరంలో ఉన్న ఆ రెండు పిట్టలను సజలనేత్రాలతో చూస్తోంది.

సమాప్తం

# ఉత్తమ కథాసంపుటములు

| | | |
|---|---|---|
| పాపం ! | భరద్వాజ | రు 1 00 |
| నర(క)లోకం | ,, | 1 00 |
| త్రినేత్రుడు | ,, | 1 00 |
| జాలిగుండె | ,, | 1 00 |
| దావానలం | ,, | 1 00 |
| మమకారం | ,, | 1 00 |
| భాగేశ్వరి | ,, | 1 00 |
| అనూరాధ | ,, | 1 00 |
| కన్నకడుపు | ,, | 1 00 |
| అర్ధాంగి | ,, | 1 00 |
| జయంతి | ,, | 1 00 |
| అపశ్రుతులు | ,, | 1 00 |
| పద్మవ్యూహం | ,, | 1 00 |
| చిత్రగృహం | ,, | 1 00 |
| కల్పన | ,, | 1 00 |
| ఉన్నది ఊహించేది | ,, | 1 00 |

స్త్రీ-పురుష జీవితాల్లోని వివిధ సమస్యలను, హెచ్చు-తగ్గుల సమాజంలోని కుళ్ళును కళ్ళకు కట్టినట్టు, హృదయానికి హత్తుకొనేటట్టు, జిజ్ఞాస రేకెత్తించేటట్లు అద్భుత రచనాశిల్పంతో చిత్రింపబడిన ఈ కథాసాహిత్యం తప్పక చదవండి.

# విశ్వవిఖ్యాత నవలలు

| | | |
|---|---|---|
| నవజీవనము | టాల్‌స్టాయ్ | రు. 6 0 0 |
| అన్నాకెరినినా | ,, | 6 0 0 |
| అనుమానం | ,, | 2 0 0 |
| సంసారసుఖం | ,, | 1 8 0 |
| భయస్థుడు | గోర్కీ | 4 0 0 |
| అమ్మ | ,, | 3 0 0 |
| ముగ్గురు మిత్రులు | ,, | 5 0 0 |
| యమకూపం | అలెగ్జాండర్ కుప్రిన్ | 4 0 0 |
| ఇనప పాదాలు | జాక్ లండన్ | 4 0 0 |
| డోరియన్‌గ్రే | ఆస్కార్ వైల్డ్ | 3 0 0 |
| నానా | ఎమిలిజోలా | 2 8 0 |
| థెరెసా | ,, | 2 8 0 |
| బీజలక్ష్మి | పెరల్ బక్ | 2 8 0 |
| పేకమేడలు | టర్జినీవ్ | 2 8 0 |
| ఆమెజీవితం | మపాసా | 3 0 0 |
| మానవులు | మపాసా | 3 0 0 |
| బానిసపిల్ల | బాల్జాక్ | 2 0 0 |
| వాయుగుండం | క్రిష్ణచంద్ర | 4 0 0 |
| విరంజన్ | రవీంద్రనాథమైత్ర | 2 0 0 |
| స్వేచ్ఛాపథము | హోవార్డ్‌ఫాస్ట్ | 5 0 0 |

ఆదర్శగ్రంథమండలి, విజయవాడ-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B174 |
| పుస్తకం పేరు | మనోరమ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 325 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |